# సాహితీ సౌగంధి

(ఇతరుల పుస్తకాలకు రాసిన ముందుమాటలు, సమీక్షల మాలిక)

డా॥ దార్ల వెంకటేశ్వరరావు

ప్రచురణ :

మంజుశ్రీ ప్రచురణలు

2016

SAHITI SOUGANDHI (Essays of Pre-faces, Reviews)
Darla Venkateswara Rao

First Edition : August, 2016

Copies : 500
Price : 125/-

Books available at :
Visalaandhra, Navodaya,
Prajasakti Book House, Hyderabad
and Leading Book Stalls
www.kinige.org,
www.avkf.org
www.vrdarla.blogspot.com

ISBN : 978-81-908963-3-7

For Communication :
B 202, Sai Cluster Apartment,
Sivajinagar Colony
Near Lingampally Railway Station
Opp: Bharat Petrol Bunk, Seri Lingampally,
Hyderabad -500 019.
Ph: 09989628049,
E mail: vrdarla@gmail.com

Published by :
Manjusree Publications
Hyderabad

Cover Design: Suman Rao, Sri Laxmi Graphics, Hyderabad.

Printed at :
Charita Printers
Hyderabad

# ప్రస్తావన

సాధారణంగా మనం ఎవరికైనా ముందుమాట గానీ, అభిప్రాయం గానీ రాయాలంటే చాలా ఆలోచిస్తాం. ఆ కవి, ఆ రచయిత మనకు తెలిసిన వాళ్ళయితేనే వాళ్ళ గురించి మన అభిప్రాయాన్ని వ్యక్తీకరిస్తుంటాం. అది ఒకరకంగా ఆ వ్యక్తి గురించి పాఠకులకు మనం ఇచ్చే యోగ్యతాపత్రంలాంటిది. ఆ రచన గురించి మనం వ్యక్తీకరించే అంశాలు కూడా విశ్లేషణతోనో, మూల్యాంకనగానో కాకుండా దాని మూలతత్త్వాన్ని సూచించేదిగా ఉంటుంది. మరికొన్నిసార్లు ప్రశంసగానూ, అభినందన పూర్వకంగానూ ఉండొచ్చు. ఆ రచనను ఎలా అవగాహన చేసుకోవాలో సూచించేదిశగా కూడా ఉండొచ్చు. రచన ఆత్మను పట్టుకోవడానికి మార్గంవేసే ముందుమాటలూ, అభిప్రాయాలూ ఉండొచ్చు.కవుల, పరిశోధకుల వ్యక్తిత్వాలు కూడా ముందుమాటల్ని బట్టి గుర్తించే అవకాశం కలుగుతుంది.

నాకు తెలిసిన కవులు, కథకుల రచనలను చదివినప్పుడో, వాళ్ళు నాలుగు మాటలు రాయమన్నప్పుడో చాలా ఇష్టంగా రాసిన అభిప్రాయాలివి. కేవలం ప్రశంసలుగానో, రాయాలని మొక్కుబడిగానో రాసినవికావివి. దీనిలో నా దగ్గర పరిశోధన చేసిన విద్యార్థుల పరిశోధనలున్నాయి; మరికొంతమంది తమ పరిశోధనలను నాతో చర్చించి ప్రచురించుకున్న పరిశోధనలున్నాయి. తమ కవిత్వాన్ని చదివి, వినిపించినప్పుడు జరిగిన చర్చల్లో కొన్ని అంశాలు నచ్చి తమ పుస్తకానికి అభిప్రాయాన్ని రాయించుకున్న వాళ్ళున్నారు. అన్నింటికంటే మించి భావజాలాన్ని ఇష్టపడి రాయించుకున్న ముందుమాటలున్నాయి. వీటితో పాటు నాకిష్టమైన ఒక పుస్తకాన్ని చదివినప్పుడు దాన్ని సమీక్షగా రాసిన రెండు, మూడు వ్యాసాల్ని కూడా దీనిలో చేర్చాను.

కవిత్వం, కథ, పరిశోధన, వ్యాసం మొదలైన ప్రక్రియలకు రాసిన ఈ ముందుమాటలు, అభిప్రాయాలు అనువర్తితసాహిత్య విమర్శకు దోహదపడే కొన్ని అంశాలు ఉన్నాయని, వాటిని ఒక పుస్తకంగా ప్రచురించమని ప్రోత్సహించిన వాళ్ళున్నారు. దీనిలోని వ్యాసాలు విద్యార్థులకు, పాఠకులకు ఏ మాత్రం ఉపయోగపడినా ఈ పుస్తక ప్రయోజనం నెరవేరినట్లే భావిస్తాను.

*-డా॥దార్ల వెంకటేశ్వరరావు*

# కృతజ్ఞతలు

నా చేత ప్రేమతో తమ పుస్తకాలకు ముందుమాటలు, అభిప్రాయాలు రాయించుకున్న కవులు, రచయితలు, పరిశోధకులకు పేరు పేరునా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. వీటిని మరలా నా పుస్తకంలో ప్రచురించుకోవడానికి అనుమతించినందుకూ కూడా ధన్యవాదాలు. వివిధ సందర్భాల్లో ఒక కవి లేదా రచయిత గురించి ఏదైనా ఒక ప్రత్యేక సందర్భంలో వ్యాసం రాయాల్సి వచ్చి ఉంటుంది. దాన్ని రాసి పత్రికలకు పంపినప్పుడు ప్రచురించిన పత్రికాధిపతులకు నమస్సులు తెలియజేస్తున్నాను. వీటినన్నింటినీ ఒక పుస్తకంగా ప్రచురించమని ప్రోత్సహించిన మా తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య తుమ్మల రామకృష్ణగారికి నా కైమోడ్పులు. తన దగ్గర జరిగిన పరిశోధన విద్యార్థులకు కూడా నా అభిప్రాయాన్ని రాయించిన సహృదయశీలి,నన్నెంతగానో ప్రోత్సహించే ఆచార్య జి.అరుణకుమారి గారికి నా నమస్సులు. ఈ పుస్తకానికి *'సాహితీ సౌగంధ'* అనే పేరును సూచించిన మా సహఅధ్యాపకుడు డా॥పిల్లలమర్రి రాములుగారికి నా ధన్యవాదాలు.

పుస్తకాన్ని ప్రచురించిన మంజుశ్రీ ప్రచురణల అధినేత డా॥ఎం. మంజుశ్రీకి ప్రత్యేక కృతజ్ఞతలు. ముఖ్యంగా ఈ పుస్తకాన్ని ప్రచురించడంలో నాకెంతగానో సహకరించిన మా మిత్రుడు, మా తెలుగుశాఖలో అధ్యాపకుడు డా॥మల్లెగోడ గంగాప్రసాద్ గారికి నా కృతజ్ఞతలు. డిటిపిలో సహకరించిన దార్ల మురళీ మనోహర్(బి.టెక్)కీ, నాకు చేదోడు వాదోడుగా నిలిచే నా పరిశోధక విద్యార్థులు దార సుమన్, బడిగె ఉమేశ్, ఎం.చంద్రమౌళిలకు, ప్రూఫ్ రీడింగ్ చేసిన డా॥జి.ప్రకాశరావుగారికి, లేఔట్ చేసిచ్చిన మాధవి గ్రాఫిక్స్ రామకృష్ణగారికి కవర్ డిజైన్ చేసిన సుమన్ రావు (శ్రీలక్ష్మీగ్రాఫిక్స్) గారికి, ప్రింటింగ్ చేసిన చరిత ప్రింటర్స్ వారికి, ప్రింటింగ్ త్వరగా రావడానికి సహకరించిన చరిత ప్రింటర్స్ భాగ్యలక్ష్మిగారికి నా కృతజ్ఞతలు

*-డా॥దార్ల వెంకటేశ్వరరావు*

# విషయసూచిక

# రసావిష్కార
# సామాజిక దర్శన కవిత్వం

*"ఆటవెలది మనసు నలరించు చుండు*
*పాటవోలె నద్ది పరుగుదీయు*
*నీతిసూక్తులకు నిండైన పద్యంబు*
*మల్లవరపు మాట మల్లెమూట"*

అంటూ మృదువైన శబ్దాలతో, పదునైన భావాల్ని మధురమైన కవిత్వంగా అందిస్తున్న కవి మల్లవరపు రాజేశ్వరరావుగారు. తెలుగు సాహిత్య చరిత్రలో ఇప్పటికే తనకంటూ ఒకస్థానాన్ని పదిలపర్చుకున్న ఈయన పద్యకవిగా ఎంతగానో ప్రసిద్ధులు. పద్యాన్ని రాయడంతోపాటు దాన్ని భావ, రాగయుక్తంగా ఆలపించడంలో కూడా తనదైన ఒక ప్రత్యేక ముద్రను సొంతం చేసుకున్న కవి. మల్లవరపు జాన్ కవిగారి వారసత్వాన్ని పుణికిపుచ్చుకొని పోతనలోని మాధుర్యాన్ని, కరుణశ్రీలోని మృదుత్వాన్ని, వేమనలోని వస్త్వలంకారాలతో సత్యాన్ని సామాన్యులకు కూడా అందించగల నేర్పునీ, జాషువాలోని సామాజిక స్పందనల్నీ ఏకోన్ముఖంగా మనకి అందించగల కళానైపుణ్యమీయన కవిత్వంలో కనిపిస్తుంది. ఈయన కుమారులు ప్రభాకరరావు, సుధాకరరావులు కూడా బలమైన వ్యక్తీకరణతో వచన కవిత్వాన్ని దీప్తిమంతం చేస్తున్నారు. అందుకనే కవిత్వ విద్యను తన వారసులకు కూడా అందించి సాహిత్యంలో "మల్లవరపు కవులు" అనే ఒక అధ్యాయానికి కావాల్సినంత కృషిని చేశారని అనగలుగుతున్నాను.

రాజేశ్వరరావుగారు వృత్తిరీత్యా తెలుగు పండితులుగా పనిచేశారు. కానీ, కవిగా బాలల కోసం బాలగేయాలు, నాటికలు వంటి వివిధ ప్రక్రియల్లో రచనలు చేసి వారిలో

సాహిత్యాభిలాషను, నైతికవిలువల్ని పెంపొందించే ప్రయత్నం చేశారు. ఈయన రాసిన అనేక ఖండకావ్యాల నిండా 'కంద'గల కవిత్వం, సమకాలీన వస్తువు, దాన్ని కవిత్వం చేయగలిగిన నేర్పు కనిపిస్తుంది. మనం ప్రస్తుతం చదువుతున్న "మల్లవరపు శతకం" కూడా ఆ కోవలోనే ఒక సామాజిక బాధ్యతగల కవిగానే ఈయన కలం నుండి వెలువడింది. శతక ప్రక్రియా రచనలో కవికి వస్తుస్వీకరణలో స్వేచ్ఛ ఉంటుంది. ఆ వస్తువుని మూడు పాదాల్లోనే చెప్పమనే నిబంధనల సంకెళ్ళు కూడా ఉంటాయి. ఒకపాదం మకుటం కావడం ఒకవిధంగా నాల్గోపాదం గురించి ఆలోచించవలసిన అవసరం లేకపోయినా, ఆ మకుటంలో చెప్పిన భావాన్ని పై మూడు పాదాలు అర్థవంతం చేస్తున్నట్లున్నప్పుడే శతకరచనలో కవిత్వం అలరిస్తుంది. వీటితో పాటు తాను ఎన్నుకునే ఛందస్సు, భాష, తీసుకొనే ఉపమానాలు కవిత్వ లక్ష్యాన్ని చెప్పకనే చెప్తుంటాయి.

నీతిని బోధించే శతకాల్లో సుమతీశతకం నేటికీ అగ్రస్థానంలోనే నిలుస్తుంది. దీనిలోనూ కొన్ని పద్యాలు కొన్ని కులాల్ని కించపరిచేలా ఉన్నాయి. వాటిని గమనించిన పండితులు తమ శక్తిసామర్థ్యాలతో పరిష్కరణలు చేశారు. అయినప్పటికీ వాటిని మూలంలో కూడా బహుశా ఆ పద్యాలు అలాగే ఉన్నాయనుకుని చదివేవాళ్ళున్నారు. దీనితో పాటు కుమార, కుమారీ శతకాలు వచ్చినా వీటి లక్ష్యం, పరిధి నీతిశతకానికున్నంత విస్తృతమైంది కాదు. తర్వాత భక్తి, అధిక్షేప, హాస్య శతకాలెన్ని వచ్చినా వేమనపద్యాలుకున్నంత ప్రాచుర్యం వేటికీ దక్కలేదనిపిస్తుంది. వేమనపద్యాలు వేలాదిగా లభిస్తున్నాయి. ఇవన్నీ నిజంగా వేమనే చెప్పి ఉంటాడా? అనీ కొంతమంది పరిశోధకులు అనుమానాల్ని వ్యక్తం చేశారు. సమాజంలో జరుగుతున్న పెడధోరణుల్ని ఆకర్షణీయంగా చెప్పడానికీ, చెప్పిన దానికి ప్రామాణికత్వాన్ని కలిగించడానికీ వేమన మకుటాన్ని ఉపయోగించుకొని పద్యాలు రాసినవాళ్ళున్నారు. తాము చెప్తే వింటారనుకున్నప్పుడు కొంతమంది సమకాలీన విషయాల్ని తాము సృష్టించుకున్న మకుటాలతోనే శతకాలను రాసినవాళ్ళున్నారు. అందువల్ల శతకానికి ఆత్మీయతాముద్ర అనే లక్షణం కూడా వచ్చి చేరింది. మల్లవరపు రాజేశ్వరరావుగారు తన ఆత్మీయతా ముద్రతోనే సమకాలీన సామాజిక విషయాల్ని రసవంతంగా వర్ణించారు.

తల్లిదండ్రులు, గురువులు, కవులు, సామాజిక సంస్కరణవాదులు, దేశభక్తులు, దార్శనికులతో పాటు, కుల,మత,వర్ణాది విషయాల్ని ఈశతకంలో వర్ణించారు కవి. పండితపామరజనరంజకంగా చెప్పాలకున్నప్పుడు చెప్పేవిధానం కూడా ముఖ్యమే. నీతిని చెప్పేటప్పుడు సాధారణంగా ఆటవెలది, తేటగీతి పద్యాల్లో వర్ణిస్తుంటారు కవులు. ఏ విషయాన్ని ఏ వృత్తంలో వర్ణిస్తే ఔచిత్యంగా ఉంటుందో లాక్షణికులు చెప్పారు.

క్షేమేంద్రుడు తన 'సువృత్తతిలకమ్'లో ఈ లక్షణాల్ని ఎంతో వివరంగా చర్చించాడు. లాక్షణికులు చెప్పినవి పాటించేవాళ్ళు కొంతమందైతే, వాటిని పాటిస్తూనే మరికొన్ని ప్రయోగాలు చేసేవాళ్ళు మరికొంతమంది. వీటినేమీ పట్టించుకోకుండా తాము పట్టిన కుందేలుకి మూడేకాళ్ళనే పద్ధతిలో రాసుకుంటూ పోయేవాళ్ళూ ఉన్నారు. వీళ్ళలో పూర్వకవుల, లాక్షణికుల సంప్రదాయాల్ని పాటిస్తూనే నూతన ప్రయోగాలు చేసేవాళ్ళ వల్ల కవిత్వం కొత్తపుంతలు తొక్కగలుగుతుంది. రాజేశ్వరరావుగారి 'మల్లవరపు శతకం' ఈవిభాగంలోకే చేరుతుందనిపిస్తుంది. నీతిని, అధిక్షేపాన్ని వర్ణించేందుకు ఆటవెలది, కందపద్యాలు చాలా అనువుగా ఉంటాయి. కవి ఆటవెలదిని ఎన్నుకున్నారు. ఇది పూర్వలాక్షణిక సంప్రదాయానుసరణ. భాషాశైలిలో కొన్ని ప్రయోగాలున్నాయి. ఇది ఆధునిక కవిత్వవికాసానికి, ప్రయోగానికి చెందిన మార్గం.

*"ఆటవెలది నాట్యమాడించు నేర్పరి*
*అలతి పదములందు అంత్య ప్రాస*
*మధురభావములకు మల్లెమాలయె సాటి*
*మల్లవరపు మాట మల్లెమూట"*

*"లలితపదములన్ని లాలిత్యముగ గూర్చి*
*నడకసోయగములు నాట్యమాడ*
*జగతికంకితంబు'జంధ్యాల' పద్యాలు*
*మల్లవరపు మాట మల్లెమూట "*

అని సహజకవిగా పేర్గాంచిన 'మల్లెమాల' కవిత్వాన్నీ, 'కరుణశ్రీ' పేరుతో ప్రఖ్యాతిగాంచిన జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి కవిత్వాన్ని ప్రస్తావించారు రాజేశ్వరరావుగారు. మరోచోట పోతన, జాషువా కవిత్వంలోని మాధుర్యాన్నీ గుర్తుచేసుకున్నారు. ఇవన్నీ ఛందస్సు, వృత్తాల ఎంపికతోపాటు, భావసౌకుమార్యాన్నీ, లాక్షణికుల సూత్రాల్నీ తన పూర్వీకులనుండి అనుసరించిన సంప్రదాయక లక్షణాలుగా భావించే అంశాలు. గతమంతా కొట్టిపారేయలేమనే సూచనకు నిదర్శనాలు. ఇన్స్పెక్టరయ్యలు, రిజరువేషనులు, హస్తిపురపురేడు, కాంటరాక్టరు, జాష్వ మొదలైన పదాలు ఛందస్సుకోసం కొన్ని, సహజత్వం కోసం మరికొన్నింటినీ ప్రయోగించారుకవి. ఈ శతకంలో ప్రతిపద్యమూ మధురమైన భావాన్ని అందిస్తుంది. స్పందనతో పాటు సందేశాన్నీ ఇస్తుంది. సమకాలీనతను గుర్తిస్తూనే భవిష్యత్తుకి మార్గాన్ని వేస్తుంది. గతవైభవాన్ని స్మరిస్తూనే మంచిని స్వీకరించమంటుంది.

*"ఒంటిమీద గుడ్డ నుండనీయరు నటీ*
*మణుల నటన భంగిమలను గాంచ*
*సిగ్గునెఱుగనట్టి చిన్నారులైనారు*
*మల్లవరపు మాట మల్లెమూట"*

అనడంలో కవి తన చక్కని అధిక్షేపంతో పాఠకుణ్ణి ఆనందింపజేస్తూనే, ఆలోచించమంటారు. సినిమాల్లో ఒకప్పటి క్యాబరేడాన్స్ నుండి రకరకాల పాత్రలవరకూ అనీ నేటి సినీ హీరోయిన్సే పోషించేతీరుని ఛమత్కారంగా మనముందుంచారు కవి.

*''మతములన్నియు జనుల హితమునే కూర్చును*
*సతము వాని నమ్మి సాగువారి*
*బ్రతుకులందు శాంతి భావాలు వెలుగొందు*
*మల్లవరపు మాట మల్లెమూట'*

అని రాశారు కవి. ఈ సందర్భంలో కొంతమంది పాఠకులకు గురజాడ వారు ప్రవచించిన *"మతములన్నియు మాసిపోవును/జ్ఞానమొక్కటి నిలిచివెలుగును"* అనేది గుర్తుకొస్తుంది. మతం అంటే ఒక జీవనవిధానం. ప్రతి మానవుడు ఏదొక జీవనవిధానానికి లోబడే బతుకుతుంటాడు. కానీ, అది మౌఢ్యం కానంతవరకు, ఇతరులకు ఇబ్బందిని కలిగించనంతవరకు ఆ మనిషి ఏ 'మతాన్ని' ఆచరించినా ఫర్వాలేదు. అప్పుడు మతం మానవాళిని జాగృతం చేసే దిశానిర్దేశమవుతుందని భావిస్తున్నారనిపిస్తుంది. ఈ దృష్టితో చూసినప్పుడు హేతువాదిగా జీవించడం కూడా ఒక జీవనవిధానమే. మన జీవనవిధానం ఇతరులకు బాధకలిగించనంతవరకూ అది హితమునే కోరుతుంది. మన జీవనవిధానం ఇతరులకు హాని కలిగించకుండా ఉండటంతో పాటు, ఇతరుల జీవనవిధానం మనకీ ఆటంకంగా మారనంతవరకూ ఎవరికెలాంటి ఇబ్బందీ ఉండదు. మనం స్వేచ్ఛగా, సంతోషంగా, సుఖంగా ఉండాలనుకోవడం ఎంతముఖ్యమో, ఇవన్నీ ఇతరులకు నష్టదాయకంగా, కష్టదాయకంగా మారుతున్నప్పుడు 'శాంతి'ప్రశ్నార్థకమవుతుంది. యుద్ధానంతరశాంతికంటే, యుద్ధమేలేని శాంతిగొప్పదికదా!

శతకమంతా నేనే వివరించుకుంటూ పోతే పాఠకుడేమి చదువుతాడు. శతకమంతా చదివిన తర్వాత కవిగారే తల్లి గొప్పతనాన్నివర్ణిస్తూ చెప్పిన పద్యంతో దీన్ని ముగించాలనిపిస్తుంది. కవిత్వమొక తీరని దాహమన్నాడు శ్రీశ్రీ. సమాజంలో జీవిస్తున్న బాధ్యతాయుతమైన కవిగానీ, కళాకారుడు గానీ తన చుట్టూ జరుగుతున్నవాటికి

స్పందించడంలో 'కళాత్మకత' ఉంటుంది. అది బయటకొచ్చేవరకు 'పురిటినొప్పులు' భరించాల్సిందేనన్నట్లుంటుంది. కొన్నిసార్లు 'గుండెగొంతులో కొట్లాడుతూనే ఉంటుంది. నిలబడనీయదు. అందరిలో ఉన్నా ఒంటిరిని చేస్తుంది. ఒంటరిగా ఉన్న సమూహాన్నీ చేస్తుంది. అది బయటకొచ్చినతర్వాత కవి గొప్ప రిలీఫ్ పొందుతాడు. తన 'సృష్టిని' తనివితీరా చూసుకొని మురిసిపోతాడు. ఇక్కడ కవి పిల్లల్ని కనే ముందు తల్లిపడే కష్టంలాంటిదాన్నే అనుభవిస్తాడు. కవి మల్లవరపు రాజేశ్వరరావుగారు అటువంటి 'తల్లి'గురించెలా వర్ణించారో చూడండి. చెప్పకనే తల్లినీ, తల్లిలాంటి కవి 'తీయనిబాధ'నీ అద్భుతంగా మనకందించారు.

*"కనెడివేళ తల్లి కష్టంబు పడునెంతొ*
*కాన్పులైన పిదప కలత మరచు*
*హత్తుకొనును బిడ్డ పొత్తిళ్ళలో నుంచి*
*మల్లవరపు మాట మల్లెమూట'*

ఈ శతకం మల్లవరపు రాజేశ్వరరావుగారిలోని కవిత్వకళను, సామాజిక సమస్యల్ని రసావిష్కరణ చేయగల నైపుణ్యాన్ని, వారి భావుకతనీ పట్టిచూపుతుంది. ఆయన కలం నుండి ఒక సంపూర్ణ కావ్యం కోసం పాఠకుడు ఎదురుచూసేలా చేస్తుంది.

*(మల్లవరపు శతకము, మల్లవరపు రాజేశ్వరరావు,*
*జూనుడి ప్రచురణలు, ఒంగోలు, డిసెంబరు 2013)*

★★★

# విమర్శకిదొక
# ప్రజాస్వామిక పంథా!

సమకాలీన సాహిత్య విమర్శ వివిధ రూపాల్లో వ్యక్తమవుతోంది. అయితే, విశ్వవిద్యాలయాల నుండి వస్తున్న విమర్శ అత్యధిక శాతం అకడమిక్‌గా ఉంటే, సాధారణంగా విశ్వవిద్యాలయేతర వ్యక్తుల నుండి వచ్చే విమర్శ నాన్ అకడమిక్‌గా ఉంటుంది. 'అకడమిక్' అనేదొకానొక దశలో 'తిట్టు' పదంగా కూడా విశ్వవిద్యాలయేతర 'సాహితీవేత్తల' నుండి వచ్చింది! దీనిపై చర్చను కాసేపు పక్కన పెట్టి, ప్రస్తుతం ప్రజాస్వామిక పంథాలో చర్చిస్తూ వస్తున్న *'సామూహికం'* గ్రంథంలోని వ్యాసాల్ని చదివి చాలా సంతోషించాను. చర్చలో పాల్గొన్న సభ్యులు తమ తమ అభిప్రాయాల్ని నిర్భయంగా చెప్పారనిపించింది. చెప్పిన అభిప్రాయాల్ని మనముందుకిలా తీసుకొస్తున్నారు. అందుకు వీరిని ముందుగా అభినందిస్తున్నాను.

*'సామూహికం'* (2015) రాకముందు కవితావార్షిక, కథావార్షిక సిరీస్‌లో కూడా ఇటువంటి విమర్శ వచ్చినా ఆ చర్చలో ఎవరి అభిప్రాయాల్ని వారివిగా స్పష్టంగా చూడగలిగే అవకాశం కనిపించింది. ఇక్కడ దాన్ని ఇంచుమించుగా తప్పించారు. చర్చలో పాల్గొన్న వాళ్ళ పేర్లను ప్రకటించారు. కానీ, ఎవరి అభిప్రాయం ఏమిటనేది స్పష్టంగా చెప్పలేదు. ఆ మధ్య ఇలాంటి ప్రయత్నం కవిత్వంలో కూడా జరిగింది. తెలుగు సాహిత్యంలో ప్రయోగాల్ని చేసే సీతారాం, అస్పర్ తదితర కవులు కలిసి 'కవిత్వం' పుస్తకాన్ని ఇలాగే ప్రచురించారు. కానీ ఆ కవితాఖండికల్ని ఎవరు దేన్ని రాసారో పాఠకుల్నే గుర్తించుకోమన్నారు. పరిశీలిస్తే కవిత్వాన్ని కొంత గుర్తించగలిగే అవకాశం ఉంది. కానీ ఇక్కడ సాహిత్య విమర్శలో ఆ అవకాశం తక్కువ. విమర్శను ప్రజాస్వామీకరించడానికి

దోహదపడే అంశంగా కూడా భావించవచ్చు. ఇలాగే ఆ మధ్య సాహిత్య విమర్శ గురించి ఒక చర్చ జరిగింది. అసలు – తెలుగులో కవులు, రచయితలు సాహిత్య విమర్శను సహించలేకపోతున్నారనీ, అందువల్ల జరుగుతున్నదంతా ఏకపక్ష అభిప్రాయప్రకటనలే వస్తున్నాయని అన్నారు. అందుకేనేమో ఒక కవి, తాత్త్వికుడు విమర్శను 'ప్రశంస'గానే గుర్తించాలని, అలాగే ప్రచురించాడు కూడా. ఇలాంటి పరిణామాలన్నీ తెలుగు సాహిత్య విమర్శ వికాసంలో కనిపిస్తున్న ఈ దశలో మళ్ళీ ఈ రకమైన పుస్తకం రావడం ఆహ్వానించదగిన పరిణామంగానే భావిస్తున్నాను.

కథలు, నవలలు, అనువాద కథలను 'చర్చ'లోకి తీసుకొచ్చే ప్రయత్నం చేశారు. చర్చల్ని గాలికొదిలేయకుండా వాటిని లిఖితరూపంలోకి తీసుకురావడం సామాన్యమైన విషయం కాదు. ఈ ప్రయత్నాన్ని అందరూ అభినందించాలి. పైగా సామాజిక వాస్తవికతకు దగ్గరగా ఉండే వచన సాహిత్య ప్రక్రియ కాల్పనిక సాహిత్యం. దీనిలో కథానిక, నవల, అనువాద నవలలను తీసుకున్నారు. కేవలం మన తెలుగు సమాజమే కాకుండా భారతీయ సమాజాన్ని అవగాహన చేసుకోవడానికి అనువాద నవల కూడా దోహదపడుతుంది. ఇతర భాషాసాహిత్యాల్ని చదవాలనే ప్రేరణను కూడా కలిగిస్తుంది.

ఈ విమర్శ గ్రంథాన్ని నాన్ అకాడెమిక్ తీసుకొస్తున్నారని అనుకున్నప్పటికీ కొన్ని అకాడెమిక్ సూత్రాల్ని పాటించారు. అన్ని రచనలు కాల్పనిక సాహిత్యం అనే ప్రక్రియకు చెందడం దీనిలో కనిపించే మొదటి సూత్రం.చర్చకు బాగా అనుగుణంగా ఉండే వాటిలో కథానిక, నవలా సాహిత్యాల్లో 'నవల, కథానికలను ప్రస్తుతానికి తీసుకున్నారు. ప్రతి నవల, కథల కథాసారాన్నీ ముందుగా వివరించడం రెండవసూత్రం. చర్చను కేవలం ఒకవైపుగానే పోకుండా నిజంగా 'గుణదోషాల్ని చర్చకు పెట్టడం' మూడో సూత్రం. వస్తు, శిల్పాల్ని చర్చించినా ఆ శిల్పం వస్తువుని రచయిత సామాజిక సమస్యను వ్యక్తీకరించడానికి ఎలా ఉపయోగించుకున్నాడనే కోణంలోనే జరిగింది. ఇది నేను గమనించిన నాల్గో సూత్రం. ఏదైనా ఒక విషయాన్ని వివరించేటప్పుడు వస్తువు, శిల్పం, పాత్రచిత్రణ, సంస్కృతి అంటే ఏమిటో ఎవరేమన్నారనే నిర్వచనాల్నీ, లక్షణాల్నీ ఏకరువు పెట్టకుండా వాటిని అంతర్భాగంగా చర్చలో నడిపించడం ఈ చర్చలో నేను గమనించిన ఐదో సూత్రం. ఇక ముందే చెప్పినట్లు అభిప్రాయాల్ని వ్యక్తిగతంగా కాకుండా తామంతా అంగీకరించినవనుకున్న అభిప్రాయాల్ని 'సామూహికం'గా చెప్పే ప్రయత్నం ఆరో సూత్రం. అయితే దాసరి అమరేంద్ర కథలను మాత్రం ఈ సూత్రానికి కట్టుబడి చర్చాసారాంశాన్ని రాయలేదు. విడివిడి అభిప్రాయాల్ని కూడా పేర్కొన్నారు. అయినప్పటికీ చర్చ సారాంశాన్ని

మాత్రం 'సామూహికం' చేశారు. అందువల్ల ఈ చివరి సూత్రం ప్రకారమే దీనికి 'సామూహికం' అనే పేరు పెట్టారనుకుంటున్నాను. ఇదే ఈ పుస్తకానికిబలమూ, బలహీనతా కూడా! సామాన్య కథలు గురించి చర్చిస్తూ "*దొంగల సంత' కథా ప్రక్రియకు ఎక్కువ, నవలా ప్రక్రియకు తక్కువగా వుంది. అంటే ఓ నవలికలా భావించవచ్చు*" అన్నారు. ఇది సామాన్య కథలను చర్చకు పెట్టడమే. తెలుగు కాల్పనిక సాహిత్యంలో వస్తున్న స్కెచ్, గల్పిక, చిన్న కథ, కథానిక, నవలిక, నవల వంటి ప్రక్రియల్ని అకడెమిక్ గా చర్చించాల్సిందే. శ్రీపాద కథలు నిడివినే చూస్తే అవన్నీ నవలికలు అవుతాయి. దాని నిర్మాణాన్ని బట్టి చూస్తే ఒక సంఘటన లేదా ఒక జీవితశకలం చుట్టూ నడిచిన తీరు కథానికగా కనిపిస్తుంది. చలం 'ఓ పువ్వు పూసింది' కథానిక రూపంలో ఉన్న కవితాత్మక వచనం. కొలకలూరి ఇనాక్ గారి 'ఊరబావి' కూడా నిడివిలో నవలికలా ఉన్నా, దాని నిర్మాణం రీత్యా కథానికే. కానీ, కేశవరెడ్డి రాసినవి నవలికలా? నవలలా? అతడు అడవిని జయించాడు నవలికా లక్షణాల్నీ, మునెమ్మ నవలా లక్షణాల్నీ సంతరించుకున్న రచనలు. ఇలాంటి వాటిని అకడెమిక్ గా చర్చించకపోతే భవిష్యత్ తరాలు శాస్త్రీయతను విస్మరించే ప్రమాదం ఉంది. విమర్శలెన్ని వచ్చినా వాటిని విశ్వవిద్యాలయాలు కాపాడాల్సిందే.

'కొత్తగూడెం పోరగానికో లవ్ లెటర్' కథ గురించి జరిగిన చర్చలోని సారాంశాన్ని రాస్తూ "*లేఖారచన అన్నది ఒక కొత్త ప్రయోగం*" అన్నారు. కాల్పనిక సాహిత్యంలో ఈ నిర్మాణం ఇంతకు ముందు రాలేదా? చర్చలో పాల్గొన్న మిగతా సభ్యులెలా దీనికి అంగీకరించారో నాకు అర్థం కాలేదు. సామాన్య కథలను సరైన రీతిలో చర్చకు పెట్టలేదు. వస్తువు కంటే రూపం గురించిన చర్చ ఎక్కువగా చేశారు. కానీ, సామాన్య ఒక శక్తివంతమైన రచయిత్రి. ప్రపంచీకరణ నేపథ్యంలో స్త్రీవాదాన్నీ, దళితవాదాన్నీ మిళితం చేస్తూ మార్క్సిస్టు కోణంతో సమస్య పరిష్కారాన్ని ఆలోచించే స్వభావం ఆమె కథల్లో చాలా బలంగా కనిపిస్తుంది. ఈ దిశగా ఈ పుస్తకంలో జరగాల్సినంత చర్చ జరగలేదు. అంపశయ్య నవీన్ రాసిన 'కాలరేఖలు' నవల చదివితే తెలంగాణా పోరాటంలోని వివిధ దశలు అవగాహనకొస్తాయి. అయినా దీన్ని తెలంగాణ ప్రాతినిధ్య నవలగానో, సాయుధ పోరాట నవలగానో చూడకూడదన్నారు. తన అనుభవం ద్వారా తెలంగాణాలో జరిగిన చారిత్రకాంశాలను చక్కగా వివరించినా, శిల్పపరమైన లోపాలున్నాయని చాలా ధైర్యంగానే రాశారు. సత్యవతి గారు రాసిన 'మెలకువ' కథల్లోని అంశాలను కూడా చాలా చర్చకు పెట్టారు. స్త్రీ తన జీవితంలో ఎదుర్కొనే అనేకాంశాల్ని రచయిత్రి కథల్లో వర్ణించిన తీరు స్త్రీ చైతన్యానికి దోహదపడుతుందన్నారు. లైంగిక వివక్షతో పాటు, ఆర్థిక సమస్యలు

కూడా స్త్రీ మనస్తత్వాన్నెలా కుంగదీయాలని చూస్తాయో, అలాంటప్పుడు వాటినెలా ఎదుర్కోవాలో సత్యవతి గారి కథల్లో వర్ణించిన తీరుతెన్నుల్ని బాగా చర్చించారు. ఈ కథా చర్చలో విమర్శకంటే ప్రశంసే ఎక్కువగా కనిపిస్తోంది. ఉప్పల లక్ష్మణరావు గారి 'తల్లిభూదేవి' నవలానువాదాన్ని చర్చకు స్వీకరించారు. రెండవ ప్రపంచయుద్ధకాలంలో గ్రామీణ వ్యవసాయ కుటుంబం చుట్టూ ఈ కథ జరుగుతుంది. సమస్యలతో పోరాడే స్త్రీలు తొల్గెనాయ్ పాత్రను జీర్ణించుకోవాల్సిన అవసరం ఉంది. జీవితమెంత సంఘర్షణమయమో తెలియాలంటే ఈ నవల చదివి తీరాలన్నట్లు చర్చ కొనసాగింది. గోర్కీ రాసిన 'అమ్మ' నవలకొచ్చిన పేరు దీనికి రావాల్సి ఉన్నా అంత పేరు రాలేదని చర్చలో పేర్కొన్నారు.

అక్కినేని కుటుంబరావు గారి 'కార్మిక గీతం' నవల కార్మిక చైతన్యానికి దోహదపడే రచనగా పేర్కొన్నారు. అయినా దీనిలో నవలకుండాల్సిన లక్షణాలు లేవనే చర్చ కూడా చేశారు. కొడవటిగంటి కుటుంబరావు గారి ' వారసత్వం' నవలా చర్చలో సుమారు 20 మంది పాల్గొన్నారట. అక్రమసంబంధాల ద్వారానైనా తమ వారసుల్ని పొంది తమ ఆస్తిపాస్తుల్ని కాపాడుకునేవారి వైనాన్ని, రకరకాల కోణాల్నీ ఈ నవల చూపిస్తుంది. నల్లూరి రుక్మిణి 'ఒంద్రుమట్టి' నవల కోస్తా, తెలంగాణా ప్రాంత రైతు జీవితాల్లోని వివిధ కోణాల్ని చిత్రించింది. 1920 నుండి 1985 వరకు జరిగిన వివిధ చారిత్రకాంశాల్ని ఈ నవలల్లో చిత్రించే ప్రయత్నం చేశారు. నవలల్లో కృత్రిమ మాండలిక భాషను ప్రయోగించారనేది ఒక విమర్శ. సమాజంలో మధ్యతరగతి, భూస్వామ్యవర్గాలెలా ఏర్పడ్డాయో అవగాహన చేసుకోవడానికీ నవల ఉపయోగపడుతుంది. దాసరి అమరేంద్రగారి 'ఆత్మీయం' కథల్లో యాత్రావిశేషాలుగా కొనసాగిన కథనశైలిని పరిచయం చేశారు. కొన్ని కథల్ని రచయిత ఆత్మకథలుగా కూడా వ్యాఖ్యానించారు. కొత్తగా కథలు రాయాలనుకునేవాళ్ళకీ కథలు సహకరిస్తాయనేది చర్చా సారాంశంగా కనిపిస్తుంది. ఈ చర్చలో రచయిత దాసరి అమరేంద్ర గారు కూడా పాల్గొన్నారట. తనలోనూ లోపాలుండే అవకాశం ఉందనీ, వాటిని కూడా తెలుసుకోవాలనుకుంటున్నానని రచయిత ప్రకటించినా ఆ పని ఈ చర్చలో పెద్దగా నెరవేరలేదు. అందుకేనేమో ఈ కథల విషయంలో మాత్రం ఎవరి అభిప్రాయాల్ని వారివిగా ప్రచురించే ప్రయత్నం చేశారు.

జయకాంతన్ గారి 'ఒక మనిషి-ఒక ఇల్లు-ఒక ప్రపంచం' నవలను చర్చకు పెట్టారు. జయకాంతన్ ఒక తమిళ రచయిత. ఈయన రచనలు తెలుగులోకి కూడా అనువాదం అయ్యాయి. ఈ అనువాదంలో అచ్చుతప్పులు పాఠకుల్ని చాలా ఇబ్బందులకు గురిచేశాయన్నారు. కుటుంబసంబంధాలు పిల్లలపై ఎలా ఉంటాయనేది ఈ నవల చదివితే

తెలుస్తుంది. కుటుంబంలో వివిధ అంతరువుల వల్ల వచ్చే సంఘర్షణలు, ఆకర్షణ, మోహం వల్ల కలిగే అనర్థాలు దీనిలో సహజంగా చిత్రించిన తీరుని చక్కగా చర్చకు పెట్టారు.

నందిగం కృష్ణారావు గారి 'మరణానంతరజీవితం' నవలను చర్చకు పెట్టారు. సమకాలీన జీవితంలో న్యాయం, చట్టం, పోలీసులు, ఆసుపత్రులు వంటివి మనుషుల్ని ఎలా పీల్చి పిప్పి చేస్తున్నాయో ఈ నవల మన కళ్ళముందుంచుతుంది. సమాజంలో తమకు తెలియకుండానే మానవులెలా అంతర్నాటకంలో పాత్రధారులైపోతున్నారో స్పష్టమవుతుంది. మరలా మరో రావిశాస్త్రిలా రచయిత నందిగం కృష్ణారావు పాఠకులకు అనిపిస్తాడు. ఒక మనిషి చనిపోతే ఆ తర్వాత జరిగే పరిణామాలెలా ఉంటాయో కళ్ళకు కట్టినట్లు చూపుతుందీ నవల. అన్నీ వ్యాపారంగా మార్చుకున్న మానవుడు చావుని కూడా వ్యాపారంగా ఎలా మార్చేశాడో నవలలో చెప్తూనే, మానవీయ సంబంధాలను విధ్వంసానికి గురిచేస్తున్న ఆర్థిక సంబంధాలను అర్థం చేసుకొని మెలగాలంటాడు. వాస్తవాల్ని ఫాంటసీగా రచయిత రూపొందించే ప్రయత్నం చేశారనేదీ చర్చలో ఒక అంశం.

కళ్యాణ్‌రావుగారి 'అంటరానివసంతం'నవలపై ఇంతవరకు ఒకరిద్దరు తప్ప మిగతావాళ్ళంతా ప్రశంసాత్మకంగానే విమర్శించారు. కానీ దీనిలో నిజాయితీతో కూడిన విమర్శ వచ్చింది. "*ఎల్లన్న పదాలు గ్రంథస్థం కాకపోవడానికి ప్రధాన కారణం అవిద్య తప్ప రచయిత చెప్పినట్లుగా అగ్రకులస్థులు ఉద్దేశ్యపూర్వకంగా చేసిన తప్పిదం కాదు*" అని ఒక ప్రకటన చేశారీ చర్చలో.

నిజానికి ఎల్లన్న పదాలే కాదు, వేమన, వీరబ్రహ్మేంద్రస్వామి, తెలంగాణలో గొప్ప తత్త్వవేత్త దున్న ఇద్దాసు వంటి వారి సాహిత్యం మనం పోగొట్టుకున్నాం. విదేశీయుల కృషి వల్ల వేమన కొంత దొరికినా మిగతావాళ్ళ సాహిత్యం నిర్లక్ష్యానికి గురైంది. దీనిలో భావజాలపరమైన కుట్ర ఉంది. ఇటువంటి కుట్రను బహిర్గతం చేసిన నవల 'అంటరానివసంతం' దీన్ని విమర్శకులు గుర్తించాలి. ఒక ప్రత్యామ్నాయ సంస్కృతిని స్థిరీకరించి, దాన్ని చరిత్రకారులు విస్మరించిన తీరుని వివిధ పాత్రల ద్వారా రచయిత ఎండగట్టాడు. '*'కళాదోపిడీని ఇంత స్పష్టంగా చెప్పటం ఈ నవల ప్రత్యేకత*' అని చర్చలో వ్యక్తంచేశారు. ఈ విషయాన్ని చర్చలో మరింతగా చర్చించాల్సి ఉంది. *అంటరానివసంతం* గురించి జరిగిన చర్చ ప్రజాస్వామికంగా అనిపిస్తున్నా దీనిలో అత్యధికమైన అభిప్రాయాలు సమాజాన్ని లోతుగా పరిశీలించలేదనిపిస్తుంది. అయితే దళిత ఉద్యమంలో జరిగిన చాలా సంఘటనల్ని విస్మరించినట్లుందనే విమర్శలో లోతైన పరిశీలన ఉంది. అలాగే మార్క్సిస్టులు కూడా దళిత వ్యతిరేకులు కారనే దిశగా నవల నడిచిందనడం కూడా చర్చలో నవలను

చక్కగా అంచనా వేసినట్లయ్యింది. దండోరా ఉద్యమాన్ని నవలా చిత్రణలో విస్మరించిన తీరుతెన్నుల్ని కూడా చక్కగా చర్చించారు. అయితే చిత్రమేమిటంటే *“ఈ నవలలో అసలు మాలల ప్రస్తావనే లేదు ”* అని ఒక చోట పేర్కొన్నారు. దీన్ని మళ్ళీ ఒకసారి సాహితీవేత్తలు చర్చించాల్సిందే.

మొత్తం మీద ‘సామూహికం’ వ్యాసాల్ని చదివినప్పుడు నేను ఒక విశ్వవిద్యాలయ అధ్యాపకుడిగా దీనిలో కొన్ని మెథడలాజికల్ ప్రోబ్లెమ్స్‌ని జీర్ణించుకోలేకపోయినా, సాహిత్య విమర్శను ప్రజాస్వామీకరించే ఈ ప్రయత్నాన్ని మాత్రం హృదయ పూర్వకంగానే ఆహ్వానిస్తున్నాను.

5 సెప్టెంబర్ 2015

*(సామూహికం (సాహితీ వ్యాస సంకలనం),*
*సంపాదకుడు: డా॥ మల్లెగోడ గంగా ప్రసాద్,*
*వారధి పబ్లికేషన్స్, హైదరాబాద్, 2015)*

★★★

# ప్రతిధ్వనించిన ప్రపంచీకరణ నిరసన

'ప్రతి ఋతువు నన్నెక్కిరిస్తోంది' పేరుతో మిత్రుడు ఉదుముల ఈరన్నగారు ఒక కవితాసంపుటిని ప్రచురిస్తూ నా అభిప్రాయాన్ని రాసి పంపించమన్నాడు. దీనిలో 25 కవితలున్నాయి. ప్రతి కవితా ఏదో ఒక సామాజిక సమస్యను స్పృశిస్తూనే ఉంది. సాధారణంగా కవి తన చుట్టూ జరుగుతున్న సంఘటనల్ని తనదైన దృష్టితో పరిశీలిస్తాడు. కవి సామాజిక చైతన్య శీలం కలిగినవాడైతే సమాజ సమస్యలు ఆ ప్రతిస్పందనల్లో కనిపిస్తాయి. కవి సామాజిక సమస్యలకు దూరంగా జీవిస్తున్నవాడైతే సాధారణంగా ఆ కవి తీసుకునే వస్తువులన్నీ అంతర్ముఖత్వానికి చెందినవై ఉంటాయి. వాటిలో భావవాద ఛాయలు ఎక్కువై, భౌతిక వాస్తవికతకు దూరంగా జరిగి పోతుంటాడు. చెప్పేదేదైనా కళాత్మకంగా ఉండాలంటూ సౌందర్యవాదాన్ని సమర్థిస్తుంటాడు. ఉదుముల ఈరన్నగారు సామాజిక వాస్తవికతను తన కవితల్లో ప్రతిఫలింపజేశాడు. తాను పుట్టి పెరిగిన కులం, ప్రాంతం తనకిచ్చిన జీవిత వాస్తవం నుండి సమాజాన్ని పరిశీలించడంలో జీవితానుభవ కవిత్వం వ్యక్తమయేలా జాగ్రత్తపడ్డాడు. ఈ కవిత్వంలో భావచిత్రాలు, ప్రతీకలు, ధ్వని వంటి ఆలంకారిక ధోరణుల ప్రదర్శన లేదు. కవిత్వమంతా జీవితంలాగా, జీవితమంతా కవిత్వంలాగ కొనసాగింది.

సమకాలీన జీవితాన్ని పరిశీలిస్తే పుట్టిన కులం కొంత మందికి గౌరవాన్నిస్తే, మరి కొందరికి అవమానాల్ని, ఆకల్ని ఇస్తోంది. తాను పుట్టిన కులాన్ని దాచుకోలేదు. మాదిగ అని చెప్పుకుంటూనే *"నాకులం పురిటి వాసన / నన్నెంటాడుతూనే ఉంది"* (తప్పెట శబ్ధ తరంగాలు) అంటూనే తానీ కులంలో పుట్టడం వల్ల అన్ని కులాల్ని

నిందించాలనే స్వభావం కవికి లేకపోవడం కవులకుండాల్సిన విశాల దృష్టిని ప్రదర్శించేలా ఉంది. పునాదిలోని ఆర్థిక విషయాలే ఉపరితలంలోని అన్ని అంశాల్ని ప్రభావితం చేస్తాయని చెప్తున్న మేధావులు కూడా కులాన్ని వదల్లేకపోతున్నారు. వ్యక్తిగత ఆస్తులుండకూడదని చెప్పే సిద్ధాంతకర్తలే మేడల మీద మేడలు కట్టుకుంటున్నారు. *''ఉపరితలం నుండి / మొదలైన మార్పులు /పునాదిని పెకలించవచ్చు/పునాది పగల కొట్టిన /ఉపరితలం/ ఉవ్వెత్తున ఎగసి పడుతుంది"* (జీవన వేదం) కాబట్టి సిద్ధాంతాలు చెప్పడం ఎంత ముఖ్యమో, అగ్రకులాలు దాన్ని ఆచరించి చూపడం కూడా అత్యంత ముఖ్యమనేది ధ్వనిపంపజేస్తున్నాడు కవి. ఒక కులం మరొకులంపై దాడులు చేయడమనేది లక్షింపేట సంఘటన నిరూపించింది. ఈ కవి నాగప్పగారి సుందర్ రాజు కవిత్వాన్ని, సాహిత్యాన్ని అభిమానిస్తాడు.

స్థానిక సమస్యల్ని కవిత్వీకరించాడు. ఈ కవితా సంపుటి శీర్షికలో వాచ్యంగా చూసినప్పుడు ఋతువులు మాత్రమే కనిపిస్తాయి. కానీ, అన్ని కాలాల్లోను, అన్నిచోట్లా మోసపోతున్న మానవుడిని దీనిలో స్ఫురింపజేశాడు కవి. అందుకే దీనిలోని కవితా వస్తువు విశ్వవ్యాప్తమయ్యింది. కవి కేవలం తన కులంతో ఆగిపోలేదు. సామాజిక రుగ్మతలపై పోరాడేవాళ్లందరినీ కులాతీతంగా తనవర్గంగానే ఆత్మీకరించుకున్నాడు. ఇప్పుడు అందరి సమస్య ప్రపంచీకరణగా గుర్తించాడు. *"తిండి గింజెలు పండే /సారవంతమైన సాగు భూమి/ సెజ్‌ల మయమౌతున్నా.../వ్యవసాయ రైతు/సేద్యానికి చారెడు భూమిలేక/ వలసల బాట పడుతున్నా.../ రియల్ ఎస్టేట్ భూదందా/బంగారు భూమిని / బజారులో పెడుతున్నా /కంచాలను సిద్ధం చేసుకోండి /వడ్డిస్తా నంటోంది రాజ్యం" (సదాసిద్ధమే)* ప్రపంచీకరణ వల్ల వస్తున్న విపత్తులను ఎన్నింటినో ఈ కవిత్వంలో వర్ణించాడు కవి. వాతావరణం నుండి ఆర్థిక పరిస్థితుల వరకు అనేక విషయాలపై స్పందించాడు. మావోయిస్టులను లొంగిపొమ్మని చెప్పినంత సులువుగా వారిని జీవన స్రవంతిలోకి తీసుకోని ద్వంద్వ నీతిని ఎండగడుతున్నాడు. వర్గీకరణను సమర్థిస్తున్నాడు. మొత్తం మీద మానవుణ్ని– అదీ పీడితుడైన మానవుడి పక్షాన నిలబడి వాదిస్తున్నాడు కవి. అందుకే ఈ కవిత్వం చదవదగిందని అందరినీ ఆహ్వానిస్తున్నాను. చక్కని కవిత్వాన్ని రాసిన ఉడుముల ఈరన్నగార్ని అభినందిస్తున్నాను. ఈయన కలం నుండి మరిన్ని కవితలు వెలువడాలని ఆకాంక్షిస్తున్నాను.

*(ప్రతి ఋతువు నన్నెక్కిరిస్తోంది' (కవితాసంపుటి)*
*ఉడుముల ఈరన్న, ప్రచురణ:?)*

★★★

# స్వేచ్ఛతో వెలువడిన అచ్ఛమైన కవిత్వం

రసమయి సాహితీ సమితి ప్రచురిస్తున్న ఈ కవితా సంకలనంలో స్వచ్ఛమైన కవిత్వం ఉంది. స్వేచ్ఛగా ప్రవహించిన అభివ్యక్తి ఉంది. మానవత్వాన్ని బతికించే మహాశక్తిగా ఎదగాలనే మానవుని అన్వేషణ ఉంది.ప్రకృతికీ, మానవుడికీ మధ్య అవినాభావ సంబంధమనేది నిరంతరం తిరిగే చక్రం లాంటిది. ప్రకృతిని జయించాలని మానవుడు నిరంతరం ప్రయత్నిస్తూనే ఉంటాడు. అది భావ, భౌతిక మార్గాల్లో జరిగే సంఘర్షణగా కనిపిస్తుంది. అలాంటి మానవుని మహాకాంక్షను చలపాక ప్రకాష్ అందంగా అభివ్యక్తీకరించారు. కొందరు కష్టపడుతుంటారు. దాని వల్ల వచ్చే ఫలితాల్ని మరికొందరు హరించడం దోపిడీకి నిదర్శనం. యువకవి దోసపాటి నాగేశ్వరరావు పీడితుల పక్షం వైపు నిలబడి ఒక లాయర్‌లా వర్ణిస్తూ, సామాన్యుల్లో సైతం విద్యుత్తుని ప్రవహింప చేసే చైతన్యంతో ఉరికేటట్లు చక్కని శైలిలో

*"ఎన్నాళ్ళిలా బతికేస్తారు*

*ఎన్నేళ్ళని సహిస్తా'*రంటూ అసమానతలు లేని మరో ప్రపంచం కోసం కలగంటున్నారు. అది అభ్యుదయాన్ని ఆకాంక్షించే వాళ్ళందరి కలగా కూడా చెప్పొచ్చు. ఉక్కిరిబిక్కిరి జీవితాలుగా మారిపోయినా, అనివార్యంగా ఊళ్ళన్నీ పట్టణాలు, నగరాలుగా మారిపోతున్న వైనాన్ని "*కలుషిత కాసారంలో చేపల్లా మనుష్యులు'*గా నూతలపాటి వెంకటశర్మ అభివర్ణిస్తున్నారు. అభివృద్ధో దానిపేరుతో జరుగుతున్న దోపిడో అర్థం కాకుండా పోయిన ప్రపంచీకరణ గురించి *"ఆలోచించే శక్తిని కూడా కోల్పోవడం"* అని అనడంలో కింది, మధ్యతరగతి వర్గాల వాళ్ళ మాటల్నే కాదు, అధికారంలో ఉన్నప్పటికీ నెత్తిమీద రుద్దబడుతున్న " విధానాల"ను కూడా నిరసిస్తున్నాడు. ప్రభుత్వాలు అనివార్యంగా

ప్రపంచదేశాలతో చేసుకున్న, చేసుకోవాల్సిన ఒప్పందాల ఫలితంగా అమలు చేయవలసిన ఆర్థికసంస్కరణల దుస్థితినీ వివరిస్తుందీ కవిత. కవిత్వం మనిషినీ, మనసునీ సంస్కరిస్తుంది. కవయిత్రి డా॥ఎమ్.బి.డి.శ్యామల రాసిన *"నాలో...లోలో..!"* కవితలో మనిషి నిష్కళంకంగా మారే సాధనంగా అభివ్యక్తీకరించడంలో చక్కటి అనుభూతి సౌందర్యం వ్యక్తమయ్యింది.

*"నాపుడమి తల్లి నేడు దీనురాలై*

*రాజకీయ రాబందుల రెక్కల కింద*

*పెట్టు బడీదారుల విషకౌగిట్లో అల్లాడుతోంది.....*

*బహుళజాతి బూచినుండి*

*ఆర్థిక మండళ్ళ నుండి*

*నాపుడమితల్లికి విముక్తి కావాలి"* అని దోసపాటి నాగేశ్వరరావు అనడంలో భూమిని కోల్పోతున్నవారి వేదన వినిపిస్తుంది. *"పల్లె ఇప్పుడు/ పగిలిన పాలకుండ"* గా మారిపోవడాన్ని తట్టుకోలేకపోతున్న కవులున్నారు. ఒకప్పుడనే కాదు, ఎప్పుడూ రైతు దేశానికి వెన్నెముక వంటి వాడే. కానీ మారుతున్న పరిస్థితులు రైతుల్ని సహితం వలసలు వెళ్ళిపోయేలా చేస్తున్నాయి. దీన్ని పురిమళ్ళ సునంద కవిత్వీకరించిన తీరు బాగుంది. *"కన్నీటి చెమ్మకు/ తలెత్తిన మొలకలు"* అనడంలో రైతుల దీనావస్థను కళ్ళకు కట్టినట్లు వర్ణించారు.

అనుకరణతో గాని, అనుసరణతో గాని ఎలా రాసినా అది సామాజిక ప్రయోజనాన్ని ఉద్దేశిస్తే ఉత్తమ ప్రయత్నమే అవుతుంది. అజ్మీరు వీరభద్రయ్య తెలుగు రైతు గురించి రాసిన పాట "జైతెలుగు తల్లీ" పాటను గుర్తుచేసేలా ఉంది. దీనిలో రైతు వేదనను అద్భుతంగా వర్ణించగలిగారు. ఈయనే మనకవులు, తాత్వికుల భావాలను అవగాహన చేసుకుని భావితరాలు ఎలా ముందుకెళ్ళాలో చక్కని సందేశాత్మకమైన మరో కవితను రాశారు. చరిత్ర ఎప్పుడూ ఒకేలా ఉండదు. అణచివేత ఎల్లకాలం కొనసాగదు. అనేక ఉద్యమాల ఫలితంగా నేడన్ని వర్గాల, వర్ణాల వాళ్ళూ అవసరమైతే ప్రతిఘటన చైతన్యంతో ముందుకొస్తున్నారు. దీన్ని గద్దపాటి శ్రీనివాసు "ఇప్పుడు అక్షరాలు మొలుస్తున్నై" అంటున్నారు.

కాలుష్యం తీవ్రమైతే వచ్చే నష్టాల్ని చెప్పే పర్యావరణ స్పృహ కవుల్లో బాగా పెరుగుతుంది. జి.లెనిన్ శ్రీనివాస్ దీన్ని వర్ణిస్తూ జీవన గతులు శృతి తప్పేలా చేస్తున్న కాలుష్యం పట్ల జాగురూకులై ఉండాలంటున్నారు. కాలుష్యాన్ని, కరువునీ ముడిపెట్టి

జి.వెంకటరమణ కూడా కవిత రాశారు. మాతృభాషపై ఉండాల్సిన మమకారాన్ని కె.శంకర్‌రెడ్డి వర్ణిస్తూ మాతృభాషలో మధురిమలెన్నో ఉన్నాయంటున్నారు. మాతృభాషను పరిరక్షించుకోవాలనే ఆరాటం కవయిత్రి ఉసురుమర్తి నిర్మలకుమారి కవితలో అనుబంధాల పరిమళాలు గుభాళించాయి. ప్రతి కవీ రాసే వస్తువులు కొన్ని ఉన్నాయి. సాధారణంగా తొలిసారి కవిత్వం రాసే వారు అమ్మ, నాన్న మొదలైన అనురాగబంధాల్ని అక్షరీకరిస్తుంటారు. ఆపని కారిచర్ల వేంకట పైడి మోహనరావు రాసిన కవితలో కనిపిస్తుంది. ఆధునికత పేరుతో మనవనుకునేవన్నీ మరిచిపోతున్నారనే ఆవేదన ఎన్.బి.కామేశ్వరి కవితలో కనిపిస్తుంది. ఇప్పటికే ప్రసిద్ధురాలైన కవయిత్రి జ్వలిత నిరంతర వర్తమాన తత్త్వాన్ని పవర్‌ఫుల్‌గా రాశారు. ఉగాదీ, దీపావళి సందర్భంగా రాసే కవితల్లో సాధారణంగా సమస్యల్ని ఏకరవుపెట్టడం కనిపిస్తుంటుంది. కానీ, కె.ఎల్.ఎన్. మూర్తి కొత్తపంథాలో రాశారు పోతగాని రాసిన చెదిరిపోని ఉషస్సులు కవిత కూడా బాగుంది.

*"గిరిపుత్రులైనా, గంగపుత్రులైనా*

*చివరకు గర్భస్థ శిశువైనా మినహాయింపులేదు*

*అందరూ నిర్బంధ నిర్వాసితులే"* అనడంలో సమకాలీన ప్రతిఘటన చైతన్యం అభివ్యక్తమవుతుంది. ఈ కవి కొంచెం సాధన చేస్తే ఉత్తమ కవిత్వం రాయగలడనిపిస్తుంది. భవిష్యత్తులో ఉత్తమ కవుల జాబితాలో చేరగలడనిపిస్తుంది. మనం కొన్నింటిని చూస్తూ కూడా మనకెందుకులే అనుకుంటుంటాం. అలా చూస్తూ ఏమాత్రం పట్టించుకోని వాటిలో జంతుబలులు, విగ్రహాల స్థాపన, దేవాలయాల నిర్మాణం, దేవాలయాలపై పెద్దగా ధ్వని చేయడం.... ఇలా చెప్పుకోవాల్సినవి చాలా ఉన్నాయి. రోడ్డుకడ్డంగా ఉండేకట్టడాల పట్ల ప్రజలు చైతన్యవంతం కావాల్సి ఉంది. కొండు బ్రహ్మం రాసిన "విగ్రహం" కవిత అలాంటి వాటి గురించి ఆలోచించమంటున్న చక్కని దృశ్యాత్మక కవిత. విగ్రహాన్ని ఆధారం చేసుకుని మానవీయకోణాల్ని మనకు స్ఫురింపజేయడం దీనిలోని ప్రత్యేకత. దీనిలో చాలా మంది కులనిర్మూలన జరగాలనే ఆకాంక్షిస్తూ కవిత్వం రాశారు. విజయకుమార్ కవితలో అదే కనిపిస్తుంది. కొంతమందికి కులం ఎప్పుడూ కులం గురించే ఏమి రాస్తారని అనుకుంటుంటారు. కులం, మతం, భాష, వేషం వంటివన్నీ మనల్ని నిత్యం వెంటాడుతూ, మన అస్తిత్వాన్ని ప్రశ్నిస్తుంటాయి.అలాంటప్పుడు వాటి గురించి రాయడం నిత్యనూతనమే అవుతుంది. ప్రజాస్వామ్యం పేరుతో జరుగుతున్న దోపిడీని వ్యతిరేకించాలని సింహాద్రి వెంకటేశ్వరరావు పిలుపునిస్తున్నారు. పాలకులు ప్రజల మనోభిప్రాయాల్ని నిత్యం

గమనించకపోతే ఏదో ఒక రోజు తిరుగుబాటు తప్పదంటున్న సాయిలిఖిత కవిత చిన్నదైనా బాగుంది. కాలం విలువను గుర్తించమంటున్నాడు బత్తుల బ్రహ్మయ్య. ఆయనే జెండా వందనంలో నిజమైన సమైక్యత వెల్లువిరుస్తుందని భావిస్తున్నారు. సమతా, మమతల జాంబవపాలన రావాలనే ఆకాంక్షను వ్యక్తంచేస్తున్నాడు జిల్లా నరేష్.

ఇల్లు కట్టేవాడికి ఇల్లూ, బట్టనేసేవాడికి బట్టా కరువన్నట్లు, రోడ్డు వేసేవాళ్ళు ఆ రోడ్డుపై నడిచే అవకాశం లేకపోవడం విషాదకరమే కదా. శ్రమైకజీవన సౌందర్యాన్ని గమనించమంటూనే ఆకలి కేకల్ని వర్ణించి భవిష్యత్తు పట్ల ఆశావహదృక్పథాన్ని కలిగిస్తున్న చక్కని కవిత " ఆమే ఓ సైన్యం" ఇప్పటికే ప్రసిద్ధుడైన కవి సరికొండ నరసింహరాజు మంచి కవిత రాశారు. ఈయనే రాసిన " అమ్ముల పొదిలో యాభై ఆరు అస్త్రాలు" కవిత తెలుగుభాషలోని అనేక అక్షరాలు కనుమరుగైపోవడాన్ని ఆలోచించమంటుంది. భాష సరళీకృతం కావాలంటే కొన్ని అక్షరాలు తగ్గినా ఫర్వాలేదు.

మనిషిని నిజంగా నడిపించేది ఆత్మవిశ్వాసం. అది నిత్య సంఘర్షణ నుండి వస్తుంది. తనేమిటో తెలుసుకునే చైతన్యం నుండి వచ్చే సంఘర్షణ ప్రగతికి మూలమౌతుంది. సౌగంధియశస్విని " *లేలేత అడుగున్నేను"* అనడంలో అదే కనిపిస్తుంది. మంచి కవిత. ఇంచుమించు అటువంటి చైతన్యమే నారపోగు ఉదయ్ కిరణ్ కవిత్వంలో వ్యక్తమైంది. కవిత్వమైనా, కళైనా దానికో ప్రయోజనముండాలంటున్నాడు కవి. అది కృత్రిమంగా కాకుండా స్వచ్ఛంగా, స్వేచ్ఛగా ఉరికిరావాలని ఆశించడంలో నిజమైన జీవితానుభవం కవిత్వం కావాలని కోరుకుంటున్నట్లు స్పష్టమవుతుంది. ఐనాల రాజీవ్ రాసిన "అక్షరం ఆయుధమవ్వాలి" కవితలో కూడా సంఘర్షణనే వర్ణించారు. కవి శ్రామికుల పక్షాన్నే ఉంటాడని నిరూపించేలా పూసపాటి వేదాద్రి రాస్తున్నారు. కన్నెగంటి వెంకటయ్య రాసిన మరోపవర్‌ఫుల్ కవితలో అద్భుతమైన భావన, అభివ్యక్తులున్నాయి.

*" నీచానికి చిహ్నంగా మహనీయుల మెడల్లో*

*నన్ను వేలాడ దీసినప్పుడు*

*నీ పాదాలకింద నాగునెందుకు కాలేదనిపిస్తుంది"* అనడం ఆ బాధను అనుభవించేవారికెంతో ఊరటనిస్తుంది. తెలుగు కవిత్వ చరిత్రలోనే ఇది గొప్ప అభివ్యక్తిగా మారుతుంది./*" రాత్రి కొమ్మలకు /వెన్నెల పూలలా వికసించిన భావాలు /పగలు కొమ్మ మీంచి రాలి పడిపోతాయి /రాత్రివేళ నేను నేనుగానే ఉంటాను/పగటివేళ నేను కాని నేనుగా ఉంటాను"* అంటున్న శివలెంక రాజేశ్వరి కవిత్వంలో గొప్ప ఉద్విగ్నత పెల్లుబుకింది.

చక్కటి భావచిత్రంతో కవిత శోభిల్లింది. మానవుడు తన ప్రవర్తనలో ఉండే ద్వైదీభావనను వీడగలిగినప్పుడు మహోన్నతమైన మానవుడిగా గాని, మానవాతీతుడుగా గాని మారగలుగుతాడు. సమాజం విరుద్ధభావాల సమ్మేళనంతో కనిపిస్తుండడం వల్ల తన ఆలోచనల్నీ వాటికనుగుణంగానే రూపొందించుకుంటూ ''లౌకికం''గా బతికేయాలనుకుంటాడు. కానీ, తనలో తానేదో అసంతృప్తికి గురవుతుంటాడు. దీన్ని కవిత్వీకరించడంలో కవయిత్రి శిల్పనైపుణ్యాన్ని కొనియాడకుండా ఉండలేం.

*"పెదవులు ప్రేమతత్త్వం చిలుకుతున్నా*

*అంతరాల ఆకృతులు వికృతంగా తొంగి చూస్తున్న* "స్థితిలో నిజంగా కలుసుకున్న మాట్లాడుకుంటున్న 'ప్రతి ఇద్దరి మధ్యా అభద్రతా మేఘాలు' కమ్ముకోవడం ఎంత విషాదకరం!

కొంతమంది తాము చేసేది "పవిత్ర"మైన త్యాగంగా అభివర్ణించుకుంటూ చేస్తున్న విధ్వంసం అమాయకులైన వారెందరినో భయభ్రాంతులకు గురిచేస్తుంది. శారీరక, మానసిక వేదనలకు కారణమౌతుంది. నిజానికి మనం బోధనలకీ, ఆ పవిత్ర గ్రంథాల్లో దాగున్న 'సత్యాన్ని' బోధించడంలోనే లోపాలున్నాయో, వాస్తవమే అలాగుందో తెలుసుకోలేని అజ్ఞానాంథకారంలో బతకవలసిన పనిలేదు. శాస్త్ర సాంకేతిక రంగాల్లో వచ్చిన మార్పులు విజ్ఞానాన్ని అందుబాటులోకి తెచ్చాయి. అయినా అసలే"ముందో గ్రహించకుండా

*"మృగాన్ని తనలో పొదుకున్న మనిషి*

*విద్వేష, విస్ఫోటనాలే భాషగా మారి"* అనేక మంది ఆలోచల్ని తమ దుర్వ్యాఖ్యానంతో మందుపాతర్లగా మారుస్తున్న భయంకర వాస్తవాన్ని వై. హెచ్.కె. మోహనరావు

*" హింసా, విధ్వంసాలే " పవిత్ర"మైతే*

*నేను శాంతికి నిలయమైన అపవిత్రతనే కోరుకుంటాను"* అని రాసిన కవితాభివ్యక్తులు శాంతికోసం తపిస్తున్న వాళ్ళకి గొప్ప ఆహ్లాదాన్నిస్తాయి. కవితలో ఎక్కడా వాచ్యత కనిపించకుండా, మతమౌఢ్యాన్ని చక్కగా ఖండించడంలో చక్కని నైపుణ్యం వెల్లడవుతుంది. కొండ్రెడ్డి వెంకటేశ్వరరెడ్డి మనుష్యుల్లో నిష్కల్మషత్వాన్ని ఆకాంక్షిస్తున్నారు.

*"అమావాస్యను తాగినరాత్రి*

*చీకట్లను చిక్కపరచుకుంటున్నట్లు"* మారిపోతున్న జీవితంలో కొత్తవెలుగులు అవినీతి, ఆశ్రితపక్షపాతం పోగొట్టుకోవడం ద్వారానే సాధ్యమంటున్నారు.

నిరంతరం ప్రవహిస్తున్న మద్యం ఎందరి జీవితాల్లోనో చీకట్లను నింపేస్తుంది. దీన్ని అడ్డుకోవడానికి ఎన్ని ఉద్యమాలు చేసినా, వాటిని గుర్తించకపోవడంలో గల మహిళల ఆవేదనను డా॥విమలారామన్ కవిత్వీకరించారు. వైదేహి పదునైన కవిత్వం రాయగలిగే అవకాశం ఉందని ఆ కవి రాసిన "ఆర్తి" ని చదివితే తెలుస్తుంది. కులం, వర్గం రెండూ ఏకమై పోరాటపంథాను సాగించకపోతే జరిగే నష్టమెలా ఉంటుందో ఈ కవిత చదివితే తెలుస్తుంది. వర్గ వాదులు కులాన్ని గుర్తించకపోవడం వల్ల నిజమైన శత్రువులెవరో తెలుసు కోలేకపోతున్నారు.

జీవితంలో అత్యంత విషాదకరమైంది ఒంటరితనం. ఒకప్పుడు ఉమ్మడి కుటుంబవ్యవస్థలో చిన్న చిన్న సమస్యలొచ్చినా వెంటనే వాటిని సరిదిద్దే పెద్దరికం ఉండేది. ఇప్పుడు అనివార్యంగా ఉమ్మడి కుటుంబాలు నాశనమైపోతున్నాయి. దీన్ని అమ్మబడి 'రత్న మహర్షి' *''ఉమ్మడి కుటుంబాలను వెన్నెల సందడి"* గా అభివర్ణించారు. అపార్ట్‌మెంట్స్‌ని అగ్గిపెట్టెల మేడలనడం బాగుంది. ఆధునిక సాహిత్యంలో అంబేద్కర్ ప్రభావాన్ని విస్మరించి చూడలేం. సామాజిక చైతన్యమున్న కవి రాసే కవిత్వంలో దీన్ని మరింతగా చూడొచ్చు. ఐనాల సైదులు అమ్మలోనే అంబేద్కరున్నాడంటారు

*"ఐదు పదులు దాటినా*

*అలుపెరుగని మా అమ్మను చూపినప్పుడలా*

*వెలుగు దారుల్ని చూపిన*

*అంబేద్కర్ సూర్యుడు నామదిలో మెదిలి*

*అనేకానేక జ్ఞాపకాలతో నిండిపోతాను"* అంటాడు కవి. ఆ అనేకానేక అనడంలోనే కవిత్వం ఉంది. తరతరాల దళిత వేదన ఉంది. గ్లోబలైజేషన్ వల్ల ఊళ్ళన్నీ మాయమైపోవడాన్ని జీర్ణించుకోలేని కవులు పదునైన కవిత్వాన్ని రాస్తున్నారు. ఊళ్ళు నాశనం కావడమంటే మమతానుబంధాలు నాశనం కావడమే! మమతానుబంధాలు నాశనమైన తర్వాత మన గమ్యం ఎటువైపు పోతుందో ఆలోచించుకోమని హెచ్చరిస్తున్నారు కవులు. ఎవరికి వారే గడియారం ముళ్ళై తమ చుట్టూ తామే తిరగడం తప్ప మానవుల మధ్య లోపిస్తున్న సంబంధాల వికృత రుపాలుగా ఆధునిక జీవితం మారిపోవడాన్నీ

జీర్ణించుకోలేక పోతున్నారీ కవులు. మనం ఆధునికంలో జీవిస్తూ శాస్త్ర విజ్ఞానాన్ని అందుకుంటూ ఎంత ముందుకు వెలుతున్నా, అది విశాలత్వం వైపు వెళుతున్నామా, ఇరుకు ప్రపంచం వైపు వెళ్ళిపోతున్నామా? అనేది తేల్చుకోలేనిస్థితిలో కూడా కొట్టుమిట్టాడుతున్నామనే భావాల్ని కూడా వ్యక్తం చేశారీ కవులు. అయితే ఎంతో విజ్ఞానం సాధించామనీ, ఆధునిక జీవనాన్ని జీవిస్తున్నామని అనుకునే వాళ్ళలో కనిపించని స్వచ్ఛత గ్రామీణ ప్రజల్లో కనిపించడం ఆశ్చర్యకరం కాదా అనేదీ ఈ కవులు ప్రశ్నించి, స్వచ్ఛత ఎక్కడున్నా స్వీకరిస్తూ ముందుకు పోవాలంటున్నారు. ఆధునికత అనేది మానవసంబంధాలను మరింత పటిష్ఠం చేసేదిశగా ఉండాలి తప్ప, మనుష్యుల్ని మరింత దూరం చేసేటట్లు ఉండకూడదంటున్నారు కవులు. ఈ కవితా సంకలనంలో కవులందరికీ సమకాలీన సమస్యల పట్ల ఆవేదన ఉంది, ఆలోచన ఉంది. దాన్ని కవిత్వీకరించాలనే తపనుంది. దాన్ని చాలా మంది సమర్ధవంతంగానే నిర్వహించగలిగారు. ఒక సమాజంలో భిన్న మనస్తత్వాలు, భిన్న భావజాలాల వాళ్ళున్నా అందరూ కలిసి మెలిసి జీవిస్తున్నట్టే ఉంటుంది. అయినా, వారి మధ్య చాలా అంశాల పట్ల ఏకీ భావన ఉండదు. కానీ కొన్ని విషయాల పట్ల ఐక్యభావం ఉంటుంది. అలాగే ఈ కవితా సంకలనంలో కూడా తమ తమ భావాల్ని వ్యక్తీకరించడంలో ఎలాంటి భయసంకోచాలకు లోనుకాకుండా, స్వేచ్ఛగా తమ భావాలను అభివ్యక్తీకరించగలిగారు. చాలా మంది వస్తువుని బలమైన దాన్ని ఎన్నుకున్నా, దాన్ని బలంగా అభివక్తీకరించలేకపోయారు. "సాధనమున పనులు సమకూరు ధరలోన" అని కదా మనవాళ్ళన్న మాట. దాన్ని సాధనతో ప్రయత్నించి మరింత మంచి కవిత్వాన్ని రాస్తారని ఆశిద్దాం. దీనిలో భావజాలం కంటే, అనుభవానికి ప్రాధాన్యాన్నిచ్చిన కవిత్వం బాగా పండిందనుకోవచ్చు. అలాంటి విసంఖ్యాపరంగా తక్కువగానే ఉన్నాయి. ఆ స్థాయిలో రాయగలిగే శక్తిని అందరూ అందుకోవాలని ఆకాంక్షిస్తూ... అనేక భావజాలాలతో నిండిన కవిత్వాన్ని ఒకే గ్రంథంగా ప్రచురిస్తున్న *రసమయి సాహితీ సమితి* వారిని అభినందిస్తున్నాను.

*(మార్పుకోసం, ప్రధాన సంపాదకుడు: దోసపాటి నాగేశ్వరరావు,*
*రసమయి సాహితీ సమితి, జగ్గయ్యపేట, డిసెంబర్, 2010)*

★★★

# కొత్త దివిటీలకు స్వాగతం

ఈ పుస్తకం తెరవాలంటే ధైర్యం కావాలి; ఈ పుస్తకంలోని అక్షరాల్ని ముట్టుకోవాలంటే, ముందుగా తరతరాల చరిత్రకంటిన మురికిని కడిగేసుకోవాలి; ఈ పుస్తకాన్ని నిజంగా చూడాలనుకుంటే ముసుగులు తీసేయాలి; ఈ పుస్తకం చదవాలంటే స్వచ్ఛమైన మాదిగ జీవితం తెలియాలి; ఈపుస్తకం అర్థం కావాలంటే తొలిసైంటిస్టులు అయిన మాదిగల కళాతత్త్వం తెలియాలి; ఈ పుస్తకంలో వేదనల్ని వినాలంటే కాస్తంత సహృదయత కూడా కావాలి...

ఇవన్నీ మీకుంటే,ఈ పుస్తకాన్ని తెరవండి. తెలుగు సాహిత్య చరిత్రలో ఒక కొత్త అధ్యాయాన్ని చేరుస్తున్న పుస్తకమిది. ఒకవైపు ఎర్రజెండాల రెపరెపల్ని, వాటిని మోస్తూ నేలకొరిగిన వీరుల్ని స్మరించుకొని... స్మరించుకొని... అశ్రుగీతాల్ని ఆలపించుకొని... ఆలపించుకొని, మరొకవైపు విశ్వశ్రేయస్సంటూ యజ్ఞ యాగాదులు చేసే కుయక్తుల్ని బహిర్గత పరుస్తూ తమదైన స్వీయ అస్తిత్వాన్ని ఆలపిస్తున్న *'పంచమస్వరం' ఇది.* తమకెలాంటి ముసుగులవసరం లేదంటూ కవులు నిప్పుల్లా పలికిస్తున్న కవిత్వమిది.

తెలుగు సాహిత్యంలో తమదైన స్థానం కోసం ప్రయత్నించే కవులు, ముఖ్యంగా విప్లవరాజకీయాలకు కేంద్రంగా ఉన్న పట్టణంలో అనివార్యంగా ఆ భావజాలాన్ని ఒంటపట్టించుకుని లేదా ఒంటపట్టించేలా చేసే ప్రాంతం నుండి తొలిసారిగా తునకల రుచి ఘుమఘుమల్ని వెదజల్లున్న కవిత్వం కావడంతో, ఆ వాసన గిట్టని వాళ్ళంతా దీన్ని కవిత్వం కాదనడానికిప్పటికే కలాల్ని నూరుకొన్నవాళ్ళుండొచ్చు. దీనిలో దళితుడికీ, అదీ మాదిగోడికి ఉన్న మొండిధైర్యం ఈ కవిత్వం నిండా పలికింది. దేవతలంతా తినడానికే పుట్టినా, కామధేనువుని కదపలేకపోయినా, దాన్ని ముక్కముక్కలు చేసి, వంటకూడా చేయగల సమర్థులైన శ్రమవీరుల కవిత్వమిది. అందుకే ఈ కవిత్వం ముక్కలెక్కడైనా కిందపడితే,

వాటిని చూసిన దేవతాగణం ఉండొచ్చు. ఇప్పుడు వండేదెవరికో, వండుతున్నదెవరో, వడ్డించాల్సిందెవరికో తెలిసి కవిత్వం వండగలిగిన కవులు వీళ్ళు. దేశంఅభివృద్ధి చెందుతుందనడానికి సామాన్య ప్రజలందరికీ కనిపించే వాటిలో రోడ్లు, భవనాలు, ఫ్యాక్టరీలు మొదలైనవాటిని చూపించొచ్చు. ఇంకాస్త దీర్ఘకాల అభివృద్ధి చేస్తున్నామని చెప్పాలంటే భారీ నీటిపారుదల ప్రాజెక్టులను కూడా చూపించొచ్చు. ఇవన్నీ ఒకరకమైన అభివృద్ధిలో భాగంగానే కనిపిస్తున్నా, వాటిని అందుకోగలిగే వాళ్ళెవరనేదీ మనందరం వేసుకోవాల్సిన ప్రశ్న రోడ్లు, భవనాలు, ప్రాజెక్టులు మొదలైనవన్నీ నిర్మిస్తున్నప్పుడల్లా పేదవాళ్ళకు ఎగిరొచ్చే అభివృద్ధి ఫలాలు ఉండకపోగా, కనీసవసతులకు ముందుగా ఈ వర్గాలే దూరంగా విసిరేయబడతాయి. పెద్దపెద్ద షాపులు వచ్చి చిన్న చిన్న పనులు చేసుకొని జీవించేవాళ్ళంతా పట్టణాలు, నగరాల నుండి దూరంగా విసిరేయబడ్డారు. ఈ మధ్య కాలంలో మరో ట్రెండ్ కనిపిస్తోంది. ఇటువంటి చిన్న చిన్న పనులు చేసి బతికేవాళ్ళని కూడా పెద్ద కంపెనీలు పిలిచి, కూలీలుగా మార్చేసి వీళ్ళ వృత్తినైపుణ్యాన్ని వాడుకుంటూ, వీళ్ళ శ్రమను కూడా దోచుకుంటున్నారు. ఇలా పట్టణ, నగరీకరణల వల్ల వృత్తి పనివాళ్ళు దోపిడీకి గురవుతున్న వైనాల్ని స్ఫురింపజేస్తూనే, ఆ దోపిడీకి ముందుగా గురౌతున్న మాదిగల్ని తలచుకుంటూ కవి *"విస్తరణలో మా వాళ్ళు"* ఎక్కుడున్నారని ప్రశ్నిస్తున్నాడు. ప్రస్తుత రిజర్వేషన్స్ పట్ల దళితమేధావుల్లో భిన్నాభిప్రాయాలు వ్యక్తమౌతున్నాయి. *'పూనా ' ఒడంబడిక*లో దళితులకు జరిగిన ద్రోహం తర్వాత కనీసం రిజర్వేషన్స్ అయినా కావాలని డా॥ అంబేద్కర్ వాదించారు. దానికి నాటి పాలకవర్గాలు కొన్ని నిబంధనలతో అంగీకరించారు. అయితే, ఆ రిజర్వేషన్స్ దళితుల్ని రెండు రకాలైన ఆలోచనల వైపు వెళ్ళేటట్లు చేస్తున్నాయి. తాత్కాలికంగా ఆ రిజర్వేషన్స్‌తో అభివృద్ధిలోకి రావాలనీ, వాటిని ఉపయోగించుకోవాలనీ ఒకవైపు ఆలోచనలు సాగుతుంటే, మరో వైపు రిజర్వేషన్స్ దళిత చెంచాగిరీని తయారుచేస్తున్నాయి. ఈ చెంచాగిరీ కోసమే రిజర్వేషన్స్ అడగకుండానే పాలకవర్గాలు వాటిని పెంచేస్థాయికి వచ్చేశాయి. దీనివల్ల కొన్ని తాత్కాలిక ప్రయోజనాలు నెరవేరుతున్నా, దళితుల ఆలోచనావిధానం విస్తరించడం లేదనే వాదనలున్నాయి. తమకెలాగూ రిజర్వేషన్స్ ఉంటాయి. అందువల్ల ఏదొక అవకాశాన్ని వినియోగించుకోవచ్చనే డిపెండెంట్ మెంటాలిటీని రిజర్వేషన్స్ పెంచుతున్నాయి. దానితో ప్రత్నామ్నాయాల వైపు ఆలోచనలు కొనసాగించేవాళ్లు తక్కువైపోతున్నారు. ఉన్న అవకాశాల్ని కూడా అప్పటికి అభివృద్ధి చెందిన స్వీయకులాలే అనుభవిస్తున్నాయి. అందువల్ల రిజర్వేషన్ వ్యవస్థలోనే మార్పురావాలి. అది బహుజనవాదం చెప్పే ఐడెంటిటీ అండ్ ఎలియన్స్ నినాదాన్ని

అమలు పరిచేలా ఉండాలని చెప్పేదే *'తలవంచని సూర్యుళ్ళమై"* అనే కవిత. అలాంటి ఆశయంతోనే...

*"చూపుడువేలు నీడన*
*నల్లని దేహాల్ని*
*విల్లుగామలిచి విజయగీతాల్ని*
*ఆలపిద్దాం తలవంచని సూర్యుళ్ళమై*
*కలిసికొట్లాడుదాం*
*రేపటి రాజ్యాధికారం కోసం"* ప్రయత్నిద్దామంటున్నాడు. అయితే,

రేపు రాజ్యాధికారం వచ్చిన తర్వాత మనమే అన్నింటిలోను ఉంటాం. కనుక, వాటికోసం కాకుండా రాజ్యాధికారమే లక్ష్యంగా పయనిద్దామనే నినాదం ఇప్పటికింకా రిజర్వేషన్ ఫలాలెలా ఉంటాయో తెలియని తరాల్ని ఆకర్షించలేవు. అందుకనే అవసరమైతే ఒకసారి రిజర్వేషన్ పొందిన వాళ్ళు మళ్ళీ రిజర్వేషన్ పొందకుండా, వాటిని ఇంతవరకు పొందని వాళ్ళకిస్తే, అప్పుడు నిజమైన దళితుల అభివృద్ధి, నిజమైన దళిత చైతన్యం వస్తుందేమో. ఒకసారి ఎమ్మెల్యేగానో, ఎం.పీ. గానో, మంత్రిగానో ఎన్నికైన తర్వాత వాళ్ళ పిల్లలు కూడా రిజర్వేషన్స్ పొందాలనుకోవడం ఎంతవరకూ సమంజసం? అలాగే రిజర్వేషన్స్ వల్ల ఉన్నతోద్యోగాల్లో ఉన్న వాళ్ళ పిల్లలు కూడా రిజర్వేషన్స్‌కే ఆరాటపడుతుంటే, పల్లెల్లో ఉన్న వాళ్ళు, అసలు రిజర్వేషన్ ఫలాల దరిదాపులకే రాని వాళ్ళ సంగతేంటి? దీనిలో భాగమే మాదిగలకు రిజర్వేషన్స్‌లో సమానభాగం కావాలనే డిమాండుతో సాగుతున్న ఉద్యమం. అనాది మానవులు ప్రకృతికి భయపడి వాటికి రకరకాల పేర్లు పెట్టి పూజించుకున్నారు. తెలివైన వాళ్ళు దాన్ని ఆచార, సంప్రదాయంగా మార్చేసి దోపిడీకి దాన్నొక మార్గంగా ఎంచుకున్నారు. అలా ఆచరించే వాటిలో చాలా వాటికి ఎలాంటి శాస్త్రీయతా లేదు. వాటిలో భాగమే యజ్ఞయాగాదులు. అవి నేటికీ ఆ వర్గాలు కొనసాగించడంలో ఒకరకమైన దోపిడీతో పాటు, అశాస్త్రీయతను పెంచుతునే ఉన్నారు. యజ్ఞయాగాదుల్ని చేసేవాళ్ళు, వాటిని చేయించేవాళ్ళు పైకి చెప్పేదొకటి, ఆశించేది మరొకటి. అదింకా కొనసాగుతుందనడానికి నేటికీ జరుగుతున్న రుద్రయాగాలు, అతిరాత్రాలే నిదర్శనాలు. వాటివెనుకున్న ఆంతర్యాన్ని గమనించమని ప్రజల్ని శాస్త్రీయతవైపుకి నడిపిస్తూ...

*"పాపపరిహారం కోసం*

*యజ్ఞ యాగాలు, హెూమాలు*
*అతిరాత్రాలు మొదలయ్యాయి*
*హవిస్సు ఆవిరౌతుంది*
*ఎర్రని నెత్తురు గూడెంలో పారుతోంది*
*ఒక్కరూ మిగల్లేదు*
*అంతా శ్మశాన నిశ్శబ్దం"*

*అని చెప్పే కవిత్వం ఈ పుస్తకంలో ఉంది. అయితే చైతన్యవంతమైన మాదిగలు ఏనాటికైనా తిరగబడతారనే ఆశావాదంతో...*

*"మీ రక్తదాహానికి తెగిపడిన*
*చేతులిప్పుడు పిడికిళ్ళు బిగిస్తున్నాయ్*
*పీకేసిన కనుగుడ్లు*
*నిప్పుల కొలుములయ్యాయ్"*

అంటున్నారీ కవులు. అస్పృశ్యకులాలుగా ఉన్నవాళ్ళని దగ్గరకు చేర్చుకొని కొంతప్రేమను పంచినా, అందరితో కలిసేలా చేసినా తర్వాత తర్వాత కాలంలో ముస్లిం, క్రైస్తవాల్లోను కులాధిపత్యం పెరిగిపోయిందని చెప్తూ...

*"పిడికెడు అక్షరాల కోసం*
*ముత్తయ్యలు 'మత్తయి'లై*
*మల్లమ్మలు 'మరియమ్మ'లైనా*
*చాతుర్వర్ణగాయం*
*ఇప్పటికీ నా ముఖంపై/స్ఫోటకంలా.......*
*వెంటాడుతూనే ఉంది"*

అక్కడ కూడా తమని అవమానించే సంస్కృతే కనిపిస్తుంటే ఏం చేయాలి? అంతా వంచన అని బాధపడి ఊరుకోవాలా? ప్రత్నామ్నాయాన్ని ఎన్నుకోవాలా? అదే ఆలోచన ఈ యువకవుల్లో కనిపిస్తుంది. అందుకనే

*''అంటరాని తనానికి*
*ఆఖరి ఘడియలివేనని*
*దింతక నకనక దింతక నకనక దింతక నకనక దిం*
*దింతక నకనక దింతక నకనక దింతక నకనక దిమ్మని*
*మ్రోగుతోంది మా సంకల డప్పు*

*కులాల గబ్బు వదలగొట్ట*
*జనక జనక జనక జజ్జనక నకనకా*
*జజ్జనక జజ్జనక నకానకా జనక జజ్జనకా*
*నకానకా, జనకంటూ*
*తరిమి తరిమి తరిమి తరిమి తరిమి తరిమి*
*ఉరికిస్తాం, ఉతికేస్తాం, ఊరేగిస్తాం*
*మా చెప్పు దెబ్బలివండహెూ యంటు*
*చిందేస్తాం, దరువేస్తాం*
*దరువేస్తూ చిందేస్తాం'*

అని ప్రకటిస్తూ, నృత్యగీతికల్ని ఆలపిస్తున్నారు. ఈ ఆలాపనలోని అనంతవేదనని అర్థం చేసుకోండి. ఇన్నాళ్ళూ ఎవరో ఒకరి ఆలోచనలకి కార్యకర్తలవ్వడమే తప్ప, నాయకత్వం లేకపోయిన స్థితిని మాదిగలు గుర్తించమంటున్నారు. వినయం, బానిసత్వంగా మారిపోతున్న పరిణామాన్ని అవగాహన చేసుకొని ఆత్మగౌరవంతో ముందుకెళ్ళాలని ప్రబోధిస్తూ...

*"జండాలు.......*
*మీ...... జెండాలు*
*ఎహే...*
*ఇగ కాడి బడేసుడే*
*బతిమిలాటల కాలంగాదు*
*బడితెలందుకునే కాలం వచ్చిందని*

పిలుపునిస్తున్నారీ కవులు. ఈ కవుల ఆలోచనలో స్పష్టత ఉంది. తమకి తరతరాలుగా జరిగిన అన్యాయాన్ని గుర్తించే శక్తి ఉంది. దాన్ని మార్చుకోవడమెలాగో చెప్పగలిగే భవిష్యద్దర్శనముంది. తమ నిజమైన సంస్కృతిని గుర్తించి, ఆరోపిత సంస్కృతిని విడనాడి ఆత్మగౌరవంతో బతకడమెలాగో మాదిగ, మిగతా అంటరానికులాల్ని చైతన్యపరిచే దివిటీలతో ముందుకొచ్చారు. వీళ్ళని హృదయపూర్వకంగా ఆహ్వానిద్దాం. మానవత్వాన్ని పరిమళించేశక్తినిద్దాం.

*(పంచమస్వరం, మాదిగ కవితాసంకలనం,*
*సంపాదకులు: ఐనాల సైదులు, గద్దపాటి శ్రీనివాసు, కోంద్రు,*
*దోసపాటి, జిల్లేపల్లి, ఖమ్మం, 2012)*

★★★

# అంతర్జాల పరిశోధనకు ప్రేరణనిచ్చే పరిశోధన

తెలుగువాళ్లకి కూడా కంప్యూటర్ కావాలా? అని ఒకప్పుడు అడిగేవారు. తెలుగు సపోర్ట్ చేయని కంప్యూటర్ లేదిప్పుడు. ఒకప్పుడు మాలాంటి ఔత్సాహికులు కంప్యూటర్ లో తెలుగు టైపు చేయాలని ప్రయత్నిస్తుంటే అక్షరాలు బాక్సుల్లా వచ్చేవి. అంతకు ముందు పిడిఎఫ్‌లో మాత్రమే చూడగలిగేవాళ్ళం. క్రమేపీ కంప్యూటర్‌లో తెలుగు వాడకం ఒక ఉద్యమంలా ముందుకి వచ్చింది. దీనివల్ల మైక్రోసాఫ్ట్ వంటి సంస్థలు డిఫాల్టుగా తెలుగు ఫాంటుని కూడా అందిస్తుంది. దీని వల్ల ఇంటర్నెట్‌లో తెలుగు వాడకం బాగాపెరిగింది. ఇమేజెస్ నుండి, పిడిఎఫ్ ల స్థాయి కూడా దాటిపోయి యూనికోడ్ ఫాంటులో హాయిగా తెలుగులోనే కావలసినంత సైజులో పెట్టుకొని చదువుకోవడానికి వీలుగా ఇంటర్నెట్‌లో తెలుగు భాష అందుబాటులోకి వచ్చింది. ఒకప్పుడు ఆంగ్లం తెలిసిన వాళ్లు మాత్రమే ఉపయోగించుకోగలిగిన ఇంటర్నెట్ సౌకర్యం ప్రాంతీయభాషల వారికి కూడా రావడంతో ఇది భిన్న భావాల సంగమంగా మారిపోయింది. అదిప్పుడు... బ్లాగు, ఈ పత్రికల వరకు చేరి గొప్ప సాహిత్యాన్ని కూడా అందించే, అందుకునే వాహికగా మారింది. వీటి పూర్వాపరాల్ని, మంచి చెడుల్ని శాస్త్రీయంగా పరిశీలిస్తూ పుట్ల హేమలతగారు '*వెబ్ లో తెలుగు సాహిత్యం–తీరుతెన్నులు*" పేరుతో పరిశోధన చేసి ఆమె "డా॥పుట్ల హేమలత" అయ్యారు. అంతటితో ఆ సిద్ధాంత గ్రంథాన్ని విశ్వవిద్యాలయం గ్రంథాలయంలోనే వదిలేయకుండా మనముందుకి తీసుకొస్తున్నారు. *"వెబ్ లిటరేచర్ గురించి పరిశోధన చేశాను. వెబ్ లోనే చదువుకోండి"* అనేయకుండా దాన్ని పుస్తకంగా కూడా తీసుకొస్తున్నందుకు ముందుగా వీరిని అభినందించాలి. సమకాలీన అంశాల్ని తీసుకొని పరిశోధన చేసి పండితుల్ని మెప్పించడమే పరిశోధకులకు ఒక సాహసమైతే, దీనికంటే ఇంకొంచెం ముందుకెళ్ళి ఇంటర్నెట్‌లో లభ్యమవుతున్న తెలుగు భాషా సాహిత్యాల స్థితిగతుల్ని వివరిస్తూ "వెబ్ లిటరేచర్"పై పరిశోధన

చేయడం మరింత సాహసోపేతమైన పని. ఇంటర్నెట్‌లో కొన్నాళ్ళున్న కవిత, వ్యాసం, పత్రికలు మరికొన్నాళ్లకు అవి ఉంటాయో లేదో చెప్పలేం. ఒకవేళ ఉన్నా వాటిలో ఎన్ని మార్పులు, చేర్పులు జరిగాయో చెప్పడం కూడా అంత సులభమేమీ కాదు. బ్లాగుల్లోను, ఆన్ లైన్ జర్నల్స్‌లోను అవసరమైతే కంటెంట్‌ని మార్పు చేసి ప్రచురించే అవకాశం ఉంది. అయినప్పటికీ కొన్ని పత్రికలు యథాతథస్థితిని కొనసాగించేవి కూడా ఉన్నాయి. అందువల్ల ఇటువంటి వాటిపై పరిశోధన చేసేవాళ్లు తమ పరిశోధన కాలంలో దొరికిన పత్రికలు, బ్లాగులను ఆఫ్ లైన్‌లో సేవ్ చేసుకోవడమో, పిడిఎఫ్ తీసుకొని జాగ్రత్త చేసుకోవడమో మరికొన్ని సార్లు ప్రింటు తీసుకోవడమో జరుగుతూ ఉంటుంది. తమ పరిశోధన పూర్తయిన తర్వాతనో, మధ్యలోనో వాటినో సారి ఎందుకైనా మంచిదనో, ఏదైనా రిఫరెన్సు కోసమో పరిశీలిస్తే ఇలాంటి మార్పులు కనిపించే అవకాశం ఉంది. అలాంటప్పుడు ఆ అంశంపై పరిశోధన చేసేవాళ్లు తమ సైద్ధాంతిక ప్రతిపాదనను సమన్వయించినదానికి వ్యతిరేకమైన పరిస్థితికూడా కలగొచ్చు. వెబ్ లిటరేచర్‌పై పరిశోధన చేసేవాళ్లు ఇలాంటి చాలా సమస్యలు ఎదుర్కోవలసి వస్తుంది.

ఇదంతా ప్రస్తావించడమెందుకంటే పరిశోధకురాలు హేమలతగారు చేసిన పరిశోధనను ఆ కాలాన్ని, ఆ సమస్యల్ని దృష్టిలో పెట్టుకునే మనం కొన్ని నిర్ణయాలకు రావాలని చెప్పడానికే! పరిశోధకురాలు పరిశోధన మొదలు పెట్టి పూర్తిచేసే సమయానికే యూనికోడ్‌ని వివిధ పత్రికలు వాడకంలోకి తీసుకురావడంలో చాలా మార్పులు వచ్చాయి. పద్మ కన్వర్టర్‌ని యాడ్ ఆన్‌గా పెట్టుకొని యూనికోడ్‌గా కొన్నాళ్లు కొన్ని పత్రికలను యూనికోడ్ లో చదువుకున్నారు- ఆన్ లైన్ పాఠకులు. తర్వాత కాలంలో ఈనాడు వంటి ఒకటి రెండు తప్ప అత్యధిక పత్రికలు డైరెక్ట్ గా యూనికోడ్‌లో చదువుకునే అవకాశాన్ని కలిగిస్తున్నాయి. ఈ విషయంలో పరిశోధకురాలు నిశితమైన పరిశీలన చేశారు.

వెబ్ లిటరేచర్‌ని మూడు ప్రధానమైన విభాగాలుగా చూడాల్సి ఉంటుందను కుంటున్నాను. ఒకటి- తెలుగు భాష కనిపించడానికి సాంకేతిక పరిజ్ఞానాన్ని వినియోగించుకుంటున్న విధానం. రెండు- లభ్యమవుతున్న ముద్రిత సాహిత్యానికీ; వెబ్ లిటరేచర్ కీ మధ్యగల భేదసాదృశ్యాలు, భావజాల వ్యాప్తి. మూడు- తెలుగు భాష, సాహిత్యాలను అందిస్తున్న పత్రికలు, బ్లాగుల వర్గీకరణతో పాటు, దేశీయ-అంతర్జాతీయంగా వస్తున్న పత్రికల తీరుతెన్నులు. పరిశోధకురాలు ఈ మూడు పార్శ్వాల్ని తన పరిశోధన గ్రంథంలో పట్టుకునే ప్రయత్నం చేశారు. మొదటి రెండు అధ్యాయాలతో పాటు, ఐదు, ఆరో అధ్యాయాల్లో కూడా సాంకేతిక పరిజ్ఞానాన్ని గురించి వివరించారు. మూడో అధ్యాయంలో పత్రికల

వర్గీకరణను, నాల్గో అధ్యాయంలో భావజాల వ్యాప్తి, బ్లాగులు, పత్రికల స్థితిగతులను విశ్లేషించారు. కొన్ని పత్రికలు, బ్లాగుల్లో రాసే పద్యాలు, కవిత్వమని రాసే వాటిలో చాలా వాటిలో 'కవిత్వం' కనిపించడంలేదని స్పష్టంగానే చెప్పారు. వెబ్ లిటరేచర్‌లో 'ఈమాట' మాసపత్రికకు ఒక ప్రత్యేకస్థానం ఉంది. అది తెలుగు సాహిత్యాన్ని అందించే ప్రయత్నంలో అక్షరాలుగానే కాకుండా దాన్ని ఆడియోరూపంలో కూడా కొన్నింటిని అందించే ప్రయత్నాన్ని చేస్తుంది. దీన్ని ఒక ప్రయోగంగా పరిశోధకురాలు పేర్కొన్నారు. సమకాలీన సాహిత్యానికి 'ఈమాట' చెప్పుకోదగినంత ప్రాధాన్యాన్నివ్వట్లేదు. కానీ సమకాలీన రూపంలో వచ్చే కవిత్వాన్ని, వ్యాసాల్ని అందిస్తుంది. భావజాలం పట్ల ముఖ్యంగా దళిత, స్త్రీవాద, ప్రాంతీయ వాద సాహిత్యాల పట్ల చాలా జాగ్రత్తగా వ్యవహరిస్తుంది. దీన్ని చెప్పి ఉంటే ఇంకా బాగుండేది. ఆన్‌లైన్ పత్రికల్లో తమ తమ వాదాల్ని ప్రచారం చేసుకోవడానికీ, వాదించుకోవడానికీ ఎంతగానో అవకాశం ఉంది. *'ప్రాణహిత'; 'సోయి'* వంటి పత్రికలు తెలంగాణ అస్తిత్వాన్ని ప్రచారం చేసే ప్రయత్నాన్ని విస్తృతంగా చేశాయి. 'ప్రజాకళ' అభ్యుదయ, విప్లవభావాలను ప్రచారం చేసింది. దీనితోపాటు దళితసాహిత్యాన్ని కూడా ప్రోత్సహించింది. ఇటువంటి వాటిని ప్రత్యేక విభాగంగా విశ్లేషించకపోయినా వాటి ప్రస్తావన చేశారు.

అంతర్జాలంలో వాడుతున్న పదజాలాన్ని సేకరించి, దాన్ని విశ్లేషించడం బాగుంది. కొన్ని పదాల అనువాదం మరీ కృతకంగా ఉందని కూడా వివరించారు. కేవలం అంతర్జాలంలో గల బ్లాగులు, వెబ్ సైట్స్ ని పేర్కొనడమో, పరిచయం చేయడం వరకే పరిమితం కాకుండా చేసిన ఈ విశ్లేషణ పరిశోధకురాలి పరిశీలనా దృష్టి, అన్వేషణాతత్త్వం స్పష్టం చేస్తుంది. బ్లాగుని "ఊసులుగూడు" అనుకుంటే బాగుంటుందని ఒకరంటే, అంతర్జాలదైనందిని అని మరొకరు సూచించారు. కానీ, బ్లాగులు రాసేవాళ్లని "బ్లాగరు" అని వ్యవహరిస్తున్నారు. కాబట్టి రోడ్, బస్ వంటి అన్యభాషాపదజాలాన్ని అజంతం చేసుకొని సొంతం చేసుకోవడమే సరైందనే వాళ్లూ ఉన్నారు. ఇలా ఇంటర్నెట్ వాడుతున్నవాళ్లు ప్రయోగించే పదజాలాన్ని పరిశోధకురాలు జాగ్రత్తగా పరిశీలించారు. ఈ పరిశోధన చేస్తున్న నాటికి యూనికోడ్ ఇంతగా ప్రాచుర్యంలోకి రాలేదు. అయినా పదజాలాన్ని అన్వేషించడంలో చాలా కష్టపడి సేకరించారని సిద్ధాంతగ్రంథాన్ని చూస్తే తెలుస్తుంది.

ఈ సిద్ధాంత గ్రంథాన్ని చదివితే తెలుగు సాహిత్యం, భాష ఇంత విస్తృతంగా ఇంటర్నెట్‌లో లభ్యమవుతుందా అనే ఆశ్చర్యానికి గురవుతాం. పరిశోధన పరిధులను గుర్తించకపోతే అంతర్జాలంలో లభించే తమ పత్రికల్ని లోతుగా విశ్లేషించలేకపోయారనే అవకాశం కూడా ఉంది. ఒక్క బ్లాగు లేదా ఒక్క పత్రికపైనే ఒక్కొక్క పిహెచ్.డి., చేయగలిగే

అవకాశంఉంది. ఒక బ్లాగు లేదా ఒక పత్రిక తీసుకొని ఇంటర్నెట్‌లో ప్రయోగిస్తున్న భాష, భావజాలం, సమకాలీన సమస్యలు, సమకాలీన సాహిత్య వస్తువులు, వాటిని నిర్వహించేవారి లక్ష్యాలను పరిశోధన చేయవచ్చు. అటువంటి పరిశోధనలకు ఈ పరిశోధన మార్గదర్శకంగా నిలిచే ప్రేరణనిస్తుంది.

పరిశోధకురాలు డా॥పుట్ల హేమలతగారు స్వయంగా ఒక ఇ-పత్రిక (*విహంగ*) ను 11-1-2011వ తేదీ నుండీ నిర్వహిస్తున్నారు. తెలుగు ఈ పత్రికల్లో ఐఎస్ఎస్ఎన్ నెంబరు గల *విహంగ* మాసపత్రిక మే, 2015 నుండి వారపత్రికగా మారింది. ఇది మహిళల కోసం నిర్వహిస్తున్న పత్రిక అయినప్పటికీ ఒక శీర్షిక ద్వారా పురుషులకు కూడా అవకాశం కలిగించారు. ఈ పత్రికను పరిశోధకురాలు హేమలతగారే నిర్వహిస్తున్నారు. దీనిలో ప్రచురించే కంటెంట్ ఇంతకుముందెక్కడా ప్రచురితం కానిదే అందించడానికి ప్రయత్నిస్తున్నారు. అయితే దీన్ని ఇంకా పరిపూర్ణంగా చేయాల్సిన అవసరం ఉంది.

చిన్నపిల్లలు, యువత, మహిళల కోసం కూడా ప్రత్యేకమైన సాహిత్యం వెలువడుతుందనే విషయం ఈ పరిశోధన ద్వారా ప్రపంచానికి అందుతుంది. ఈ పరిశోధన చదివిన వారు అంతర్జాలంలో వస్తున్న తెలుగు భాష, సాహిత్యాలపై పరిశోధన చేయడానికి ప్రేరణ పొందుతారు. అలా తెలుగు సాహిత్యంలో ఒక ప్రేరణాత్మకమైన పరిశోధన చేసిన డా॥పుట్ల హేమలతగార్ని అభినందిస్తూ... విశ్వవిద్యాలయాల్లో జరిగిన తెలుగు పరిశోధనను ఎప్పటికప్పుడు అందిస్తూ నిరంతరం పరిశోధన చేస్తున్న ఆచార్య వెలుదండ నిత్యానందరావుగారిలాగే వెబ్ లిటరేచర్‌లో జరిగిన తెలుగు పరిశోధనలను ఎప్పటికప్పుడు అందించే కృషిని నిరంతరం కొన సాగించాల్సిందిగా కోరుతున్నాను. అప్పుడు విశ్వవిద్యాలయాల్లో తెలుగు పరిశోధన అనగానే ఆయన పేరు గుర్తొచ్చినట్లే, వెబ్ లిటరేచర్ అనగానే హేమలతగారి పేరు కూడా గుర్తొస్తుందని విశ్వసిస్తున్నాను.

*(అంతర్జాలంలో తెలుగు సాహిత్యం, పిహెచ్.డి., పరిశోధన గ్రంథం, డా॥ పుట్ల హేమలత, మానస అండ్ మనోజ్ఞ ప్రచురణలు, ఆగస్టు, 2015)*

★★★

# సమైక్య జీవన భాషా, సాహిత్య ప్రతిఫలనం

మిత్రుడు రాంబాబు నా దగ్గర పిహెచ్.డి.పరిశోధన చేస్తున్నాడు. అంతకు ముందు చేసిన ఎం.ఫిల్., పరిశోధన వ్యాసాన్నిప్పుడు ప్రచురిస్తూ, నన్ను కూడా అభిప్రాయం రాయమన్నాడు. నా దగ్గర పరిశోధన చేస్తున్నందువల్ల రెండు మాటలు రాయమన్నా డనుకుంటున్నాను. నేడు విశ్వవిద్యాలయాల్లో గిరిజన భాషా సాహిత్యాల గురించి పరిశోధన చేయాలంటే రెండు సమస్యలు ఎదురవుతున్నాయి. గిరిజనుల గురించి లిఖితరూపంలో సాహిత్యం తక్కువగా ఉంది. దాన్నీ అత్యధిక శాతం మంది గిరిజనేతరులే రాశారు. దీన్ని పరిశోధన చేసేటప్పుడు గిరిజన జీవితం, సహజత్వం, వారి సంస్కృతి ప్రతిఫలించిందా, లేదా? అనేది ఒక సమస్యగా తీసుకుంటున్నారు. లిఖిత సాహిత్యరూపంలో గిరిజన జీవితాల్ని రచయితలు సాహిత్యీకరించినా, ఆ భాషా సాహిత్యాల్ని పరిశోధన చేయడానికి ప్రయత్నించినప్పుడు పునరుక్తిలా కనిపిస్తుంది.

అలిఖిత సాహిత్యాన్ని పరిశోధించాలంటే, క్షేత్రపరిశీలన ద్వారా సేకరించిన విషయాల పట్ల విశ్వసనీయత ప్రశ్నార్థకమవుతుందనే వాదన ఉంది. అన్ని విశ్వవిద్యాలయాల్లోని గిరిజన భాషా, సాహిత్యాలపై జరుగుతున్న పరిశోధనల్ని ఒక చోటకు చేర్చడం లేదా సారాంశాల్నైనా ప్రచురించడం ద్వారా ఈ సమస్యను చాలా వరకూ అధిగమించవచ్చు. అప్పుడు గిరిజన భాషా సాహిత్యాలపై మరింత పరిశోధన చేయడానికి మార్గం సుగమమవుతుంది. రాంబాబు ఎం.ఫిల్., లో భాష పైనా, అదీ అలిఖిత, లిఖిత సాహిత్యాలపై పరిశోధించినా, పిహెచ్.డీ., మాత్రం లిఖిత సాహిత్యంపైనే చేయడానికి శాస్త్రీయమైన ఈ ఆలోచనే కారణం. ఈ పుస్తకంలో బంజారా-తెలుగు భాషా సాహిత్యాల్లో

కనిపించే కొన్ని జాతీయాలను తులనాత్మకంగా పరిశీలించాడు. ఒకదానికింకా లిఖిత భాషగా గుర్తింపు లేదు. మరొక భాషకేమో లిఖిత భాషగా సుమారు పదిహేను వందల సంవత్సరాల చరిత్ర ఉంది. లిఖిత భాషలో కనిపించే వివిధాంశాల్ని పరిశోధన చేసేటప్పుడు ఒక సౌలభ్యముంది. వివిధ పాఠాంతరాలున్నా, వాటిని ఆధారసహితంగా చూపించవచ్చు. లిఖితభాషగా గుర్తింపు పొందని భాషా, సాహిత్య విశేషాల్ని పరిశోధన చేసినప్పుడు పరిశోధకులు చెప్పిందే ప్రధాన ఆకరం అవుతుంది. వీటిలోని శాస్త్రీయతను పరిశీలించాలంటే, ఒకే అంశాన్ని పరిశోధించిన వివిధ పరిశోధనల్ని గమనించవలసి ఉంటుంది. అలా వివిధ ప్రాంతాల్లో ప్రయోగంలో ఉన్న జాతీయాలను రాంబాబు పరిశీలించాడు. ఈ పరిశోధనకు రెండు పద్ధతుల్ని ఉపయోగించుకున్నాడు. పూర్వపరిశోధనల్లో కనిపించే అంశాల్ని ఆధారంగా స్వీకరించడం మొదటి పద్ధతి. క్షేత్రపరిశీలన ద్వారా వ్యవహర్తల నుండి కొన్ని జాతీయాలను సేకరించడం రెండవ పద్ధతి. ఈ రెండు పద్ధతుల్ని పాటించడం వల్ల పరిశోధనకు శాస్త్రీయత సమకూరే అవకాశం ఉంది. ఆ ప్రయత్నం చేసిన రాంబాబుని అభినందిస్తున్నాను. ఈ పరిశోధనలో కనిపించే అనేక జాతీయాలను గిరిజనులు మాట్లాడుకునే భాషలో తప్ప, భావంలో పెద్ద వ్యత్యాసం లేకుండా కలిసిమెలిసి జీవించే తత్త్వం కనిపిస్తుంది. కొన్ని మాటల విషయంలో ఆదాన ప్రదానాలు బంజారా– తెలుగు భాషా సాహిత్యాల్లో కలిసిపోయి, అవి ఆంధ్రులంతా, భారతీయులంతా, మానవులంతా ఒకటనే సమైక్య జీవన ప్రతిఫలనాన్ని స్ఫురించేలా ఉన్నాయి. భాషలు వేరైనా, మానవుల సంవేదనలు ఒకేలా ఉంటాయనే చక్కని సమన్వయసూత్రాన్ని ఈ పరిశోధనలో సమన్వయించాడు. అయినా, వారి వారి భాషలు వారికి ఉండడం వల్ల ఒక ఆత్మగౌరవం, ఆత్మవిశ్వాసం ఏర్పడతాయని పరిశోధకుడు భావించడం యావత్తు గిరిజన జాతికీ ఆ భావం ప్రాతినిధ్యం వహిస్తుందనచ్చు. ఈ పరిశోధనతో పాటు మిత్రుడు రాంబాబు భవిష్యత్తులో కూడా మరింత ఉత్తమ పరిశోధనకు కృషి చేసి, జీవితంలో ఉన్నతమైన స్థితికి చేరాలని, జాతి చైతన్యానికి తోడ్పడాలని ఆశిస్తున్నాను.

*(బంజారా – తెలుగు జాతీయాలు : తులనాత్మక పరిశీలన,*
*నూనావత్ రాంబాబు, ఎం.ఫిల్., పరిశోధన వ్యాసం,*
*చాందినీ సాహితీ పబ్లికేషన్స్, విజయవాడ. 2011)*

★★★

# మానవ స్వభావ ప్రతీకాత్మక దృశ్యం 'తెల్ల కాకులు'

సాధారణంగా ఒక కవితను గాని, కథను గాని తొలిసారి చదివినప్పుడు అదేదో తెలిసినట్లే అనిపిస్తుంది. ఆ మాత్రం చెప్పడానికే 'దాన్ని' రాసారా? అనిపించి మళ్ళీ చదివితే ఇంకా తెలుసుకోవాల్సినదేదో ఉన్నట్లనిపిస్తుంది. కొన్ని రచనల్ని తొలిసారి చదివినా, విన్నా అందులో ఉన్నదేంటో అర్థంకాదు. అందుకని మళ్ళీ చదవాలనిపిస్తుంది. మరికొన్ని ఒకసారి చదవడానికి కూడా చిరాకనిపిస్తాయి. వీటన్నింటిలోను 'చదివించే' లేదా 'వినాలనిపించేది' వాటిలో ఉన్న వస్తువైనా కావచ్చు; వాటిని మనకందించే 'నిర్మాణం' కావచ్చు. వీటినే వస్తు, శిల్పాలని మన సాహితీవేత్తలంటుంటారు. శిల్పగతాంశాల్ని కవిత్వంలో అభిధ, లక్షణ, వ్యంజనాది పేర్లతో పిలుస్తుంటారు. సామాన్య సాహిత్య వ్యవహారంలో 'వ్యంగ్యం'; 'ధ్వని' అని పిలుస్తుంటారు. ఆధునిక కవిత్వంలో ప్రతీక, భావచిత్రం వంటి పారిభాషిక పదజాలంతో కవిత్వాన్ని అర్థం చేసుకోవడానికి మరిన్ని మార్గాల్ని చూపించారు. Short Story అనే పారిభాషిక పదం కథ, కథానికలనే పేర్లతో ఆధునిక సాహిత్యంలో ప్రవేశించింది. ప్రాచీన కావ్యాల్లో 'కథ' కవిత్వంలో అంతర్భాగమైతే ఆధునిక సృజన సాహిత్యంలో 'కథ' సత్యావిష్కరణకు ప్రాణభూతంగా మారింది. సత్యాన్ని పాఠకుడికి అందించడంలో రచయిత ప్రాపంచిక దృక్పథంతో ముడిపడి ముందుకు నడుస్తుంది. కాబట్టే పాఠకుడికి వస్తువునందించడానికి శిల్పాన్ని ఉపయోగించుకుంటాడు. ఆధునిక స ృజన సాహిత్యంలో శిల్పం వివిధ ప్రయోగాల రూపంలో పాఠకుడికి కనిపిస్తున్నా, ఆ నిర్మాణం ద్వారా పాఠకుడికి అందాల్సింది వస్తువు సంవేదనే. అలాంటి రచనలు ఎక్కువ మంది పాఠకులకు వెంటనే మింగుడుపడవు. అందుకనే ఆధునిక రచనల్లో కథలు వచనంలోనే

ఉన్నా వాటిని నిఘంటువుల సహాయంతో చదివి అవగాహన చేసుకోలేం. వివిధ సమాజాలు, ఆ సామాజిక సంక్లిష్టతలు, భిన్న సామాజిక వైరుధ్యాల వంటివెన్నో పరిచయం కావాలి. ఇలాంటప్పుడే పాఠకుడు–రచయితల మధ్య స్థాయీ భేదాల సమస్య కూడా వస్తుంది. జీవితాన్ని, సాహిత్య తీరుతెన్నుల్ని అవగాహన చేసుకున్న కథారచయిత వస్తువుని రకరకాల కథనరీతుల్లో అందిస్తుంటాడు. ఉత్తమ, ప్రథమ పురుషలతో పాటు, లేఖా కథనం, ఫ్లాష్ బ్యాక్ వంటి కథనాలతో పాటు అంతరంగకథనం, చైతన్యస్రవంతి, మార్మికశిల్పం వంటివాటిని కూడా ఉపయోగించుకోవచ్చు. వీటికి భాష, శాస్త్ర సాంకేతికాది అంశాలతో కూడిన సమకాలీన సమాజశైలినీ వాడుకోవచ్చు.

ఆధునిక కవిత్వాన్ని అర్థం చేసుకోవాలంటే ఆధునిక సమాజాన్ని అర్థం చేసుకోవాలన్నాడు శ్రీశ్రీ. దీనితో పాటు మరో సందర్భంలో మహాకావ్యానికి క్రైటీరియా సైజూ బరువూ కాదనీ, నిన్నటి మహాకావ్యం పద్దెనిమిది పర్వాలైతే నేటి మహాకావ్యం పద్దెనిమిది పేజీలే అని కూడా శ్రీశ్రీ అన్నాడు. ఇది కవిత్వానికే కాదు; కథలకు కూడా వర్తిస్తుందని కథా సాహిత్యాన్ని గమనించినవాళ్ళకనిపిస్తుంది. పాలగుమ్మి పద్మరాజు *'గాలివాన';* చలం *'ఓపువ్వుపూసింది';* రావిశాస్త్రి *'పిపీలకం';* చాసో *'ఎంపు';* మధురాంతకం రాజారామ్ *'స్వస్థలం';* పెద్దిబొట్ల సుబ్బరామయ్య *'నీళ్ళు';* పతంజలి *'చూపున్నపాట';* కేతు విశ్వనాథరెడ్డి *'విరూపం';* అబ్బూరి ఛాయాదేవి *'బోన్సాయ్ బతుకులు';* తుమ్మేటి రఘోత్తమరెడ్డి *'పనిపిల్ల';* కొలకలూరి ఇనాక్ *'కుల వృత్తి';* వి.చంద్రశేఖరరావు *'చిట్టచివరి రేడియో నాటకం';* మహ్మద్ ఖదీర్ బాబు *'పెండెం సోడాసెంటర్';* వివినమూర్తి *'నేరం';* కాసుల ప్రతాపరెడ్డి *'ఎల్లమ్మ'* మొదలైన కథలు ఆధునిక కథాసాహిత్య స్థాయిని పెంచాయి. వీటిని ఒక్కసారి చదివేసి పక్కనపెట్టేయలేం. ఆ కథలు పాఠకుల్ని వెంటాడుతుంటాయి. అలాంటి కథ ఒకటి ఈ మధ్యనే చదివాను. దాని పేరు 'తెల్లకాకులు' దాన్ని తుమ్మల రామకృష్ణ రాశారు. కథాశీర్షికే ఆలోచనాత్మకంగా ఉంది. భారతదేశంలో నల్లకాకులు గురించి విన్నాం. అక్కడక్కడా తెల్లకాకులున్నాయనే వార్తలూ వచ్చాయి. కానీ ఇక్కడ 'కాకులు' గురించి చెప్తున్నాడా రచయిత? అట్టమీద 'కలం' బొమ్మ వేశారు.

ఈ 'తెల్లకాకులు' కథను మొదలు పెడితే ఆపకుండా ఏకబిగిని చదివేస్తాం. పూర్తిగా చదివేవరకూ ఆపాలనిపించదు. అలా కవితాత్మకంగా సాగిపోయిందా శైలి. కథను చదువుతున్నామా? కవిత్వం చదువుతున్నామా? అనిపిస్తుంది. ఆధునిక మహాకావ్యంలో కథానాయకుడు పాత్రగా కనిపించదు. వస్తు సంవిధానంలోనే నాయకుడుంటాడు. ఈ కథలో నాయకుడున్నాడు. అతడి పేరు మూర్తి. కథ ఫ్లాష్ బ్యాక్ టెక్నిక్ తో ప్రారంభమవుతుంది.

*'ఏవేవో ఆలోచనలు... సలుపుతున్న గాయాలు...*

*రకరకాల జ్ఞాపకాలు....*

*మూర్తి ఇంటి ముందుకొచ్చి నిలబడ్డాడు.*

*దృష్టి గార్డెన్ వైపు మళ్ళింది.*

*రెండు రోజులుగా నీళ్ళు పెట్టినట్లు లేదు." (పుట: 1)*

*"... మీకు గార్డెనింగ్ అంటే ఇష్టమా" అంది.*

*తనకి ఇష్టం"* అన్నాను" (పుట:2)

ఇలా కొనసాగిపోతుంది కథ. కథలో Narrator మనకి అనేక జీవన దృశ్యాల్ని చూపిస్తున్నట్లు ఉంటుంది. కథ ముందుకీ వెనక్కీ సాగుతుంది. అలా కొనసాగించడానికి చైతన్యస్రవంతి పద్ధతిని ఉపయోగించుకున్నారు రచయిత. రచయిత మనస్తత్వంతో పాటు వివిధ పాత్రల రూపంలో మానవుల మనస్తత్వాలను, వివిధ స్వభావాల్ని స్పష్టాస్పష్టంగా వ్యక్తీకరించడానికి ఈ కథన పద్ధతి చాలా బాగుంటుంది. ఈ పద్ధతిలో కొనసాగిన ఇతివృత్తాన్ని పట్టుకోవాలంటే మనోవిశ్లేషణ పద్ధతి అవసరమవుతుంది. పాత్రల మనస్తత్వాన్ని, పాత్రలను వర్ణించిన తీరు తెన్నులను బట్టి పరిశీలిస్తే ప్రతీకాత్మకాలుగా కూడా కనిపిస్తున్నాయి. అప్పుడు "మూర్తి" ఒక వ్యక్తికి సంబంధించిన స్వభావంకాదనీ, అదొక ప్రతీకాత్మక పాత్రగాను స్పష్టమవుతుంది.

*'గార్డెన్' వైపు మూర్తికి దృష్టి మళ్ళడం...*

*నీళ్ళుపోయడం... '*

ఇక్కడ 'గార్డెన్' ఓ జీవితానికి, మూర్తి మరో జీవితానికి సంకేతాలుగా స్వీకరించే అవకాశం ఉంది. 'జీవిత వనం' మాడిపోకూడదు. అది నిత్య వసంతంగా శోభిల్లాలి. ఒక జీవితం వాడిపోతుంటే మరో జీవితం దాన్ని గమనించీ, గమనించనట్లుండకూడదు. పరస్పరసహకారమే జీవన రహస్యం.

'గార్డెన్' కి నీరు పోయాల్సినవ్యక్తి లేకపోతే 'గార్డెన్' ఎండిపోవాల్సిందేనా. జీవనం కూడా అంతే. అది ఆగిపోకూడదు. ఒక సజీవస్రవంతిగా ప్రవహించాలి. అందుకే 'మూర్తి' ఆ జీవనాన్ని చిగురించే 'గార్డెనింగ్'లో నిమగ్నమయ్యాడు. ఒక జీవితం ఒకరికోసమే ఆగిపోదు. కానీ, ఒకరికొకరి సహకారం అవసరమవుతుంది. ఒకవేళ తాత్కాలికంగా ఆ సహాయ సహకారం ఆగిపోయినా, మరొక దాన్ని భర్తీ చేస్తారు. 'భర్తీ' చేయడమనేది అంతకుముందు ఉన్నంతస్థాయిలో ఉండకపోవచ్చు; అంతకు మించికూడా ఉండొచ్చు.

జీవితం మోడువారిపోకూడదనేది గుర్తించమనే సందేశం 'మూర్తి' వర్ణనల్లో కనిపిస్తుంది. అందుకే 'మూర్తి' ఒక వ్యక్తి అని చెప్పలేం. అనేకమంది వ్యక్తుల, అనేక స్వభావాల, అనేక జీవితానుభవాలకు, అనేక సంఘర్షణలకు ప్రతిఫలనంగా 'మూర్తి' పైకి ఒక 'Person'గా కనిపిస్తాడు. కానీ 'మూర్తి'లోపల Personalities ప్రతిఫలిస్తుంటాయి. అందుకనే మన విమర్శకులు చెప్పిన కథా లక్షణాల్లో Round Characters, Flat Characters వంటివాటిని 'మూర్తి' పాత్రకు అన్వయించగలమా అనేది సందేహాస్పదంగానే నిలుస్తుంది. కథ అంతా 'మూర్తి' కేంద్రంగానే నడిచింది. అందువల్ల 'మూర్తి' Round Character అవుతున్నట్లని పిస్తుంది. కానీ, మళ్ళీ 'మూర్తి' ఒక పాత్ర కాదనిపిస్తుంది. అప్పుడు ఈ సమన్వయం సరిపోతుందా అనే సందేహం కూడా వెంటాడుతుంది. సాహిత్యానికి ఇటువంటి లక్షణం ఉండడం వల్లనే ప్రయోగశాలలో వచ్చినటువంటి ఫలితాంశాలు సాహిత్యవిశ్లేషణల్లో కుదరవని విమర్శకులు చెప్తుంటారు. పాఠకుని స్థాయిని బట్టి ఆ విశ్లేషణ, దాన్ని బట్టి ఫలితాంశాలు వస్తుంటాయి.

''*ఓల్డ్ స్పోర్ట్స్ షెడ్ పడిపోవడానికి సిద్ధంగా ఉంది.*
*చిన్న.. చిన్న.. తుంపర్లు*
*ఫుట్ బాల్ గ్రౌండ్ కళకళలాడుతోంది.*"(పుట:5)

ఇక్కడ వర్ణించిన ఆటస్థలం వాచ్యమేనా. అయితే " పడిపోయే ఓల్డ్ స్పోర్ట్స్ షెడ్" గురించే రచయిత పట్టించుకోవాల్సిన అవసరమేంటి? ఇక్కడ సంప్రదాయం, ఆధునిక సమాజాల్లోని సంఘర్షణలనేమైనా స్ఫురింపజేస్తున్నారా? అనేక ఆటలు ఆడుకుంటున్న వాళ్ళున్నా 'ఫుట్ బాల్' ఆటని మాత్రమే నొక్కి చెప్పడంలోని రచయిత కంఠస్వరం (Tone) ఎలా అర్థం చేసుకోవాలి? జీవన సంఘర్షణలను, ఆ సంఘర్షణల్లోని ఆనందం, విషాదాలను చెప్తున్నారా? మానవుడు 'బాల్ ' తనకి అనుకూలంగా పడినప్పుడు ఆనందంతో కేరింతలు సహజం. పడనప్పుడు దాన్ని కోల్పోకతప్పదు. కొత్త భావాలు తుంపర్లుగా ప్రారంభమవుతాయి. అవి కొంతమంది వద్దన్నా ధారాపాతంగా కురవడం తప్పదు. ప్రకృతితో మానవుడి సంఘర్షణలాంటిదే సంప్రదాయం, ప్రాచీనతలతో ఆధునికతల సంఘర్షణకూడా. మానవుడు జీవించినంతకాలమే జీవితం. మరణానంతర జీవితాన్ని చూసేదెవరు? దాన్ని ఎవరెలా వ్యాఖ్యానిస్తారో తెలిసేదెలా? తెలియడం సాధ్యమా? జీవితం ఒక ప్రవాహం. అది పాత స్థానంలో కొత్తది వచ్చి చేరినట్లే ఉంటుందేమో. ఈ కథని రచయిత రాసేటప్పుడు కొన్ని భాగాల్ని విన్నాను. నా స్పందనను తెలుసుకోవాలని వినిపించేవారో, పాఠకుని స్థాయిని గుర్తించాలనుకునేవారో నాకు తెలీదు. కానీ ఆ కథని అచ్చులోకి వచ్చిన తర్వాత చాలా

సార్లు చదివాను. నాకు పూర్తిగా అర్థమయ్యిందని చెప్పలేను. అర్థం కాని గజిబిజి, మార్మికత, చైతన్యస్రవంతి, అస్తిత్వవాద సంఘర్షణలు వంటివన్నీ ఆ కథలో ఉన్నాయనిపిస్తుంది. కొన్ని సార్లు ఆ కథలో దేన్ని చెప్పాలనుకుంటున్నారనీ, దానిలో ఆ ఏనుగులు, ఆ నెమళ్ళు, ఆ పాములు మొదలైనవన్నీ పెట్టడం ద్వారా చెప్పవలసిందేమిటని కూడా రచయితను అడిగిన సందర్భాలున్నాయి. "*రచయిత ఒక రచనను రాయడం వరకే అతడి పని. తర్వాత దాన్ని పాఠకుడెలా అర్థం చేసుకుంటాడనేది అతనిష్టం. నా పనిపూర్తయి పోయింది. తర్వాత పని పాఠకులదే*" అని ఒక చిరునవ్వునే నాకు సమాధానంగా ఇస్తుండేవారు. ఆ కథలో ఉన్నదేమిటో, దేనికోసం రాసారో, ఆ ప్రతీకలు లేమిటనేదీ ఆయన వివరించే ప్రయత్నం చేసేవారుకాదు.

"*మొన్న నాలుగు ఏనుగు చచ్చిపోయినాయి*
*నిన్న ఆరు నెమళ్ళు చచ్చిపోయినాయి*
*ఈ రోజు ఏడు పాములు చచ్చిపోయినాయి*" (పుట:16)

ఇక్కడ నాలుగు, ఆరు, ఏడు సంఖ్యలు వేటినో సంకేతిస్తున్నాయి. 'చచ్చిపోయినాయి' అనే పునరుక్తి కూడా దేన్నో గుర్తించమంటుంది. ఆ నాలుగూ వేదాలా? ఆ ఆరూ అరిషడ్వర్గాలా? ఆ ఏడూ దివారాత్రులా? మరి వీటిని 'చచ్చిపోయినాయి' అని పునరుక్తిలో చెప్పడంలోని అంతరార్థం? ఈ కథలో, కావ్యంలాంటి కథలో 'ఏడు'ని సంకేతిస్తూ చేసిన వర్ణనలు మరికొన్ని చోట్ల కన్పిస్తాయి.

"*మూర్తి జీవితంలో ఏడేళ్లు... ఏడు యుగాల్లా గడిచిపోయాయి.*
*వెనక్కి తిరిగి చూసుకుంటే...*
*నిద్రలేని రాత్రులు.. నిద్రరాని రాత్రులు...*
*మత్తులో జోగిన రాత్రలు...మళ్ళీ మళ్ళీ గుర్తుచేసుకుని..*
*గుర్తుచేసుకుని చేసుకుని...*
*ఏడ్చి ఏడ్చి ఇంకిపోయిన కళ్ళు... ఎర్రబడ్డ కళ్ళు...*
*జీవితం ఇలాగే ఉంటుంది." (పుట: 3)*

ఇక్కడ 'ఏడు' ఏడడుగుల బంధాన్ని సూచించే దాంపత్యం విచ్ఛిన్నమైతే కలిగే సంఘర్షణను వర్ణించారు.

'జీవితం ఇలాగే ఉంటుంది' అనే కీలకం దాన్ని సూచిస్తుంది. మరి 'ఏడు పాములు' దేన్ని సూచిస్తున్నాయి? పరమపదసోపానంలో పాములెక్కువా? నిచ్చెనెలెక్కువా?

ఒకచోట పరమపదసోపానంలోని 'పాము'ని తన వర్ణనకు ఉపయోగించుకున్నారు. నిచ్చెన దొరికితే సంతోషం. పామునోట్లో పడితే మళ్ళీ కిందికొచ్చేస్తాం. ఒకటి సంతోషం. మరొకటి విషాదం. పామునోట్లో పడకూడదనుకుంటాం. నిచ్చెన్లే దొరకాలనుకుంటాం. పదమూడు పాములుంటాయి. నిచ్చెనలు మాత్రం పదిమాత్రమే ఉంటాయి. అలాగే నిచ్చెన దొరికినా దొరక్కపోయినా, పెద్దపాము నోట్లో మాత్రం పడకూడదనుకుంటాం. దీన్ని ఇక్కడ వర్ణిస్తూ...

*"పల్లకీ ఎక్కడ సప్తపద సోపానం*

*పాము నోట్లో పడితే బతకడం కష్టం" (పుట: 21)*

*మరోచోట " ఏడు జన్మలు.. పద్నాలుగు లోకాలు...*

*నమ్మేవాడుంటే ఎన్నయినా చెపుతారు" (పుట*: 17)

అన్నారు రచయిత. కథ చివరిలో కూడా సంఖ్యావర్ణన ద్వారా జీవితాన్ని ప్రతీకాత్మకం చేశారు. 'ఏడు' సంఖ్య చాలా విశేషాల్ని తెలుపుతుంది. వ్యసనాల గురించి చెప్పేటప్పుడు 'సప్తవ్యసనాలు' అంటారు. జూదం, స్త్రీలోలత్వం, మద్యం, వేట, వాక్పారుష్యం, అనవసరమైన వ్యయం, దండపారుష్యం, కళాకేళిలో తేలియాడటం (కవిత్వరచన ఒక వ్యసనమవ్వటం) వంటివన్నీ సప్తవ్యసనాలు. లోకాలు ఏడు (భూలోకం, భువర్లోకం, సువర్లోకం, మహర్లోకం, జనలోకం, తపోలోకం, సత్యలోకం), సప్తసముద్రాలు, సప్తపర్వతాలు, ఇలా ఈ కథలో సంఖ్యల్ని కూడా రకరకాల కోణాలనుండి పరిశీలించి కథకు అన్వయించు కోవాల్సిన అవసరం ఉందనుకుంటున్నాను.

*"నగరం నడిబొడ్డులో నలుగురు*

*కాదు కాదు.. ఆరుగురు*

*కాదు ఒక్కడే.. ఒక్కడు" అని ముగించారు.(పుట: 24)*

గురజాడ 'పూర్ణమ్మ'ను వర్ణిస్తూ నలుగురు నడిచే దారి గురించి గొప్పగా చెప్పారు. లోకం పోకడ, మంచి చెడులను చర్చించేసమాజం గురించి ఆయన అక్కడ చెప్పారు. నాలుగు, నలుగురు అనే సంఖ్యావాచకాలకు రకరకాల వివరణలు చెప్తారు. నాలుగు మంచి మాటలు, నలుగురూ కలిసిమెలిసి ఉండాలని చెప్పే సమైక్యశక్తికీ నిదర్శనాలుగా దాన్ని నిదర్శనంగా చెప్తారు. దీన్నే వర్ణవ్యవస్థకు కూడా ప్రతీకగా కూడా భావిస్తారు. కొంతమంది 'నాలుగు' సంఖ్యని అవస్థా చతుష్టయంలో బాల్యం, కౌమారం, యవ్వనం, వార్ధక్యంగా చెప్తారు.

'ఆరుగురు'లోని 'ఆరు' అరిషడ్వర్గాలైన కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలను జయించగలిగినప్పుడు 'మనిషి' ఒక్కడే మిగులుతాడు. వాడే మానవుడు. మానవుడే రకరకాలుగా ప్రవర్తిస్తుంటాడు. అన్నింటికీ 'మానవుడే' కారకుడు. మానవుని ఆలోచనలే కారణం. ఈ కథ భౌతిక వాస్తవికతను, మానవజీవన సత్యాన్ని విశదీకరించేదే అనడానికి కూడా కథాంతర్గతాంశాలు నిదర్శనాలుగా కనిపిస్తున్నాయి.

*'.. .భోగి..రోగి.. మళ్ళీ పుట్టడం ఉండదు.*
*ఈ ప్రేమ.. ఈ అనురాగం.. ఈ ఆప్యాయత...*
*ఈ పగ.. ఈ ద్వేషం.. ఈ ఈర్ష్య.. ఈ ఆకలి.. ఈ యవ్వనం...*
*ఈ కామం.. ఏమీ ఉండవు. అంతా మాయ మాటలు...*
*పాపం..పుణ్యం.. న్యాయం.. ధర్మం..*
*అంతా సృష్టి...*
*కులం.. మతం.. జాతి అంతా కల్పనే"* (పుట: 17)

ఈ వాక్యాల్లో తత్త్వం ఉంది. ఆ తత్వం వాస్తవికతను నిరూపించేలా ఉంది. ఆత్మ, పరమాత్మల వాదోపవాదాల్లా లేదు. ఆ వాదోపవాదాలు చేసుకుంటున్న మానవ సంఘర్షణను కూడా వర్ణించారొకచోట. కీర్కు గార్డ్ అస్తిత్వం, రూసో మానవత్వం, మార్క్స్ మార్పు, ఫ్రాయిడ్ అంతరంగం వంటివన్నీ చెప్పి 'శంకరయ్య అంతా నేనేనంటాడు' అనే ఆధ్యాత్మిక వాదాల్ని ప్రస్తావించారు. ఇవన్నీ రకరకాల ఆలోచనలనీ, వాటి నుండి రకరకాల సిద్ధాంతాలు పుట్టుకొచ్చాయనీ వివరిస్తారు. అవన్నీ మానవుల ఆలోచనల సంఘర్షణల ఫలితమేనని మానవుడ్నే కేంద్రం చేయడం, మానవ జీవితాన్ని ముఖ్యమని చెప్పడం ప్రధానంగా కనిపిస్తుంది. ఈ కథలో సమకాలీన విద్యా వ్యవస్థ మీద, పరిశోధనలు, పరిశోధకుల మీద కూడా విసుర్లున్నాయి.

*'గది ముందు ఒకటే కోలాహలం..*
*ఒకరు కాదు ఇద్దరు కాదు పదిమంది.*
*ప్యాచ్ వర్క్‌లు...*
*అల్లికలు.. కుట్లు.. కత్తిరింపులు.. అతికింపులు...*
*ఎత్తిపోతలు..*
*గుండుసూది మొన ఇరిగిపోయింది.*
*తెగిపోయింది. ఏం ఫరవాలేదు.*

*రంగు రంగుల అట్టలు వేసేద్దాం.*
*ఎవడు చూశాడు? ఎవడు చదివాడు?*
*అంతా బావుంది.*
*గట్టిగా సిఫారసు చేసేద్దాం...*
*ఎద్దు ఈనింది గాట్లో కట్టెయ్...*
*నంది, పందీ, ఒకటే..." (పుట: 17,18)*

ఈ మధ్య కాలంలో విశ్వవిద్యాలయాల్లో పదోన్నతుల కోసం పుస్తకాలు చూపించడానికి రాత్రికి రాత్రే సంకలనాలు తీసుకొస్తున్నారు. అవి కూడా 'నిజం'గా ప్రచురిస్తుంటే సంతోషించవచ్చు. కేవలం పదోన్నతుల కోసమే ఇంటర్వ్యూలో చూపించడానికే ఒకటో రెండు పుస్తకాలు జెరాక్సు చేయించి వాటిని తమ ప్రచురణలుగా చూపిస్తున్నారు. ఆ ఇంటర్వ్యూ తర్వాత ఆ పుస్తకాలు ఎక్కడా కనిపించవు. వాటికీ, నిజంగా పుస్తకాలు రాసిన వాటికీ ఒకటే విలువగా బోర్డు మెంబర్లు పరిగణనలోకి తీసుకుంటున్న దాఖలాలు ఉన్నాయి. వాటిని ఆ బోర్డులో ఉండే సభ్యులే చెప్పి ప్రోత్సహిస్తుంటే ఎలా ఉంటుంది? కంచే చేను మేస్తే ఎలా ఉంటుందో చేను ఎవరికి చెప్పుకోవాలి? ఉత్తమవిద్యాబోధన, ఉత్తమ విలువలు బోధించాల్సిన బోధకులే ఇలాంటి అక్రమదారుల్లో ప్రతిభావంతులుగా పదోన్నతుల్లో ప్రవేశిస్తుంటే మనం నైతిక విలువల గురించేమి మాట్లాడాలి? ఇలాంటివాటినెన్నింటినో వర్ణించిన దృశ్యాలు ఈ కథలో కనిపిస్తాయి. వస్తువులకు, జంతువులకు మానవస్వభావాన్ని ఆరోపించే వ్యక్తిత్వారోపణ (Personification) చేసిన వర్ణనలు కూడా ఈ కథలో ఉన్నాయి. "*సభానంతర సభ జోరుగా ఉంటుంది.*

*మహారంజుగా ఉంటుంది.*
*....   ....*
*నల్లపిల్లులు.. ముసలిసన్యాసులు...*
*బారిగద్దలు.. ముసలి నక్కలు...*
*ఒక్కొక్కరే పోగైపోతున్నారు.*
*కరచాలనాలు....*
*... ...*
*హోస్ట్ ఆలస్యమెందుకన్నాడు.*
*ఒకటో గుండ్రం.. రెండో గుండ్రం..*
*మూడో గుండ్రం..."* (పుట: 22)

ప్రపంచం ఒక నాటకరంగం వంటిది. జీవితం... నిజజీవితం... జీవితం నాటకమవ్వడం... ఇలాంటివన్నీ జీవితమొక అంతర్నాటకం. దాన్ని ఒక మందు విందు జరిగిన సన్నివేశాన్ని పెట్టి దానిద్వారా వర్ణించారు రచయిత. BlackCat, Old monk వంటి బ్రాండులన్నీ మానవీకరణ చెందారిక్కడ. First Round, Second Round, Third Round తెలుగు అనువాదంలో కొత్తదనాన్నిచ్చాయి. కథని జాగ్రత్తగా అన్వయించుకుంటే కొన్ని కీలకాలు కూడా కథాంతర్భాగంగానే కనిపెట్టొచ్చు. కానీ దాన్ని పాఠకులంతా కనిపెట్టగలరా అనేదొక సందేహమే.

*"ఖాదర్ ఊర్లో లేడు*
*పెరుమాల్ ఉన్నా రాడు.*
*ఏసురత్నం ఎక్కడికి వెళ్తాడో ...*" (పుట: 19)

ఇక్కడ ఖాదర్, పెరుమాల్, ఏసురత్నం అనేవి వ్యక్తుల పేర్లేనా? భిన్నమతాలకు వాళ్ళు ప్రాతినిధ్యం వహిస్తున్నారా? దీనికి కీలకం మరోచోట దొరుకుతుంది.

*" రాముడు... కృష్ణుడు... అల్లా.. యేసు.. ఏం పాపం చేశారో*
*... రంగులు మార్చుకుంటున్నారు. విగ్గులు మార్చుకుంటున్నారు.*
*మళ్ళీ ఇంకో నాటకం ఆడాలంట" (పుట: 22)*

ఇక్కడ గమనిస్తే మొదట్లో వర్ణించిన పేర్లు కేవలం వ్యక్తుల పేర్లు కాదని స్పష్టమవుతుంది. అవి వివిధ మతాలకు ప్రాతినిధ్యం వహిస్తాయనీ గ్రహించగలుగుతారు.

మద్యపానం చేసేవారికి బాగా తెలిసే BlackCat, Old monk అని సామాన్యులకు అర్థంకాని భాషలో మద్యపాన ప్రియులు మాట్లాడుకున్నట్లే మీడియా ప్రసారం చేసే వాటిలోని మాయాజాలాన్ని కూడా మనముందుంచారు. సినిమాలు, సీరియల్స్ తీరుతెన్నుల్ని ఎండగట్టారు. కులం, ప్రాంతం పేరుతో జరుగుతున్న ఉద్యమ స్వరూప స్వభావాల్ని కళ్ళకు సూచించారు. మహా మహా రచయితలు, కవులనుకుంటున్నవాళ్ళ మానవీయ సంబంధాల్ని తూర్పారబట్టారు. జానెడు పొట్టకు సరిపోయే అన్నం కోసం కొంతమంది నిత్యం యుద్ధం చేస్తుంటే, మరికొంతమంది దేవాలయాల్లోను, దాని మాళిగల్లోను దాచుకున్న ధనధాన్యాల గురించి వివరించి, వర్గవ్యత్యాసాల స్వభావాన్ని గుర్తుచేశారు. ఇలా ఎన్నెన్నింటినో మార్మికవాస్తవికతతోను, చైతన్యస్రవంతి పద్ధతిలోనూ వివరించారు.

మనదేశంలో తెల్లకాకులు అనేవి చాలా అరుదు. లేదా లేవనే చెప్పవచ్చు. ఇతరదేశాల్లో తెల్లకాకులు కూడా ఉన్నాయి. కానీ, ఇక్కడ 'తెల్లకాకులు' అనేది రూఢ్యర్థం

కాదు. అంటే లోకంలో రూఢిగా ఉన్న 'తెల్లని కాకులు' అని అర్థం కాదు. ఇటువంటి అర్థాన్ని కావ్యపరిభాషలో 'యోగరూఢ్యర్థం' అంటారు. లోకంలో (అత్యధికంగా) కాకులు తెల్లగా ఉండవు. సహజత్వంతో కాకుండా అసహజంగా ఉండే ఒకానొక పక్షిని సూచిస్తుంది. ఇక్కడ పక్షి కూడా పక్షి కాదు–ఒక సంకేతితార్థాన్ని సూచిస్తుంది. అవాస్తవాన్ని వాస్తవంగా భ్రమింపజేసేస్థితిని తెలుపుతుంది. మరో కోణంలో ప్రపంచీకరణనేపథ్యంతో చూస్తే ఒప్పందాలవెనుక దాగిన సమాజ కుట్ర ప్రతిఫలిస్తుంది. తెలివైన వాళ్ళ కుహనా తెలివితేటల ప్రదర్శన తీరుతెన్నుల్ని సూచిస్తుంది. ముఖ్యంగా ఈ రెండింటినీ గుర్తించగలిగితేనే ఈ కథలో గల 'కథ'ను కొంతైనా పట్టుకోగలమనిపిస్తుంది. కథను అర్థం కానివ్వకుండా గజిబిజి కూడా చేశారనిపిస్తుంది. కావాలనే కొన్ని చోట్ల అలా చేసిన వర్ణనలున్నాయి.

ఈ కథ చదువుతుంటే ఇవన్నీ నాకు కలిగిన అభిప్రాయాలు. ఇవన్నీ రచయిత ఉద్దేశించారో లేదో కూడా నాకు మళ్ళీ అనుమానమే. ఈ కథను తీసుకొని మీరూ చదవండి. మీకూ ఈ కథలోని గందరగోళం మీకూ బోధపడుతుందేమో ప్రయత్నించండి. బోధపడితే నాకూ చెప్పండి. నాకూ మీకూ కలిగిన సందేశం, సందేహం ఒక దారిలో పయనిస్తే నేనూ సంతోషిస్తాను. కానీ, ఈ సందేశం, సందేహాలతో మూల రచయిత సంతోషిస్తాడని మాత్రం మనం పొంగిపోవాల్సిన పనిలేదేమో.

14-10-2014

*(తెల్లకాకులు, (కథ),*

*తుమ్మల రామకృష్ణ, చంద్రకళ పబ్లికేషన్స్,*

★★★

# బహుజన రాజ్యాధికారం-తాత్వికత

ప్రముఖకవి, విమర్శకుడు, ఉద్యమకారుడు డా॥కదిరె కృష్ణ రాసిన వ్యాసాల పుస్తకమిది. ఆ వ్యాసాలన్నీ ఒక పుస్తకంగా చూస్తే 'బహుజనుల' ఆకాంక్షలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. సమాజానికీ సాహిత్యానికీ ఎడతెగని సంబంధం ఉందని మరోసారి నిరూపిస్తూ ఈ పుస్తకాన్ని తీసుకొస్తున్నాడు. ఒకవైపు ప్రాచీన సాహిత్యంలో బహుజనుల్ని ఆత్మగౌరవం లేని వాళ్లుగా చిత్రించిన వర్ణనల్ని సోదాహరణంగా నిరూపిస్తూనే మరో వైపు బహుజనుల కోసం తమ జీవితాల్నే త్యాగం చేసిన మహానుభావుల్ని, వారి తాత్త్విక ధోరణిని సాహిత్యంతో సమన్వయిస్తూ బహుజనులకు ఒక చక్కని మార్గాన్ని సూచిస్తున్నాడు. దీనిలో సామాజిక వ్యాసాలు ఎక్కువగా ఉన్నా అవన్నీ సామాజిక మార్పుని ఆశించిన దార్శనికుల తాత్త్విక భావాల్ని సమకాలీన రాజకీయాంశాలతో విశ్లేషించాడు డా॥ కదిరె కృష్ణ. నేడు కావాల్సింది కూడా అదే. ఇప్పటికే డా॥కదిరె కృష్ణ 'బలపం' కవిత్వం ద్వారా తన బలమైన భావుకత్వాన్ని తెలుగుసాహిత్యానికి రుచి చూపించాడు.

ప్రముఖ కథారచయిత, పరిశోధకుడు ఆచార్య కొలకలూరి ఇనాక్ గారి పద్య కావ్యం *'ఆదిఆంధ్రుడు'* పై డా॥కదిరె కృష్ణ రాసిన పుస్తకం సాహితీవేత్తల మన్ననల్ని పొందింది. ఈయన పరిశోధన కూడా బహుజనులకు సంబంధించిందే కావడం ఒక విశేషం. అన్నింటికీ మించి డా॥కదిరె కృష్ణ మంచి వక్త. తన వాక్చాతుర్యంతో సభను రంజింపచేయడమే కాకుండా ప్రతి ప్రసంగంలోను కొత్త ఆలోచనాధారను కురిపిస్తాడు. సాధారణంగా సమకాలీన సమస్యల పట్ల అవగాహన ఉండటం ఒకటైతే, దాన్ని సరైన మార్గంలో మరలా సామాన్యులకు కూడా అందించగలగడం మరొకఎత్తు. దీన్ని ఈయన సమర్థవంతంగా నిర్వహిస్తున్నాడు. అందుకే ఈయన వ్యాసాలకు సంపాదకుడుగా

ఉండడం నాకు లభించిన గౌరవంగా భావిస్తున్నాను. పీడన రకరకాలుగా ఉంటుంది. మతం, కులం, జెండర్, ప్రాంతం మొదలైన వాటిలో ఏ రూపంలోనైనా ఈ పీడన బహిర్గతం కావచ్చు. అలా ప్రాంతీయ పీడనలో భాగంగా చూస్తే తెలంగాణ ప్రాంతం రకరకాల పీడనల్ని ఎదుర్కొంది. పీడనల్లో మళ్ళీ అంతర్భాగంగా జరిగిన పీడనల్లో తెలంగాణ ప్రాంతంలోని బహుజనులు మరింత పీడనలకు గురయ్యారు. అందువల్ల ఆ బహుజనుల్లో నుండే పీడనను ఎదుర్కొనే బలమైన గొంతులు వచ్చాయి. అలా వచ్చిన గొంతే గ్యార యాదయ్య. అతడ్ని తెలంగాణ సాంస్కృతికోద్యమ స్వాప్నికుడిగా అభివర్ణించడం ఎంతో ఔచిత్యంగా కనిపిస్తుంది. భౌగోళిక తెలంగాణా మాత్రమే కాకుండా సామాజిక తెలంగాణా రావాలనే ఆకాంక్ష  ఉద్యమకారుడైన డా॥ కదిరె కృష్ణలో కనిపిస్తుంది. బహుజన నాయకత్వం తెలంగాణా రాష్ట్రసాధనలో మమేకమైన బహుజనులు, నేడు అధికారానికి దూరంగా నెట్టబడడాన్ని గుర్తించాలంటున్నాడు. ఆనాడు బహుజనులు పోరాటంలో భాగస్వాములైన సంగతిని విస్మరించొద్దని హెచ్చరిస్తున్నాడు.

మనుస్మృతిని నేటికీ ప్రత్యక్షంగాను, పరోక్షంగాను అమలు చేస్తున్న వైనాన్ని బట్టబయలు చేసి, దాన్ని దహనం చేయడం ఒక నిరంతర ప్రక్రియగా చేయాల్సిన అవసరమే దాని ప్రాసంగికతను తెలుపుతుందని ప్రకటిస్తున్నాడు. నేడు అట్టహాసంగా జరుపుకుంటున్న సాహిత్య సభల్లోనే కాదు, పంచ మహాకావ్యాల విషయంలో కూడా కులాధిక్యతను ప్రదర్శించిన కావ్యాల్ని చక్కగా విశ్లేషించాడు. పంచమహాకావ్యాల నిర్ణయంలో రచయిత డా॥కదిరె కృష్ణకు కొన్ని నిశ్చితమైన అభిప్రాయాలున్నాయి. అవి పంచమహాకావ్యాలని సాహితీవేత్తలు చాలామంది చెప్పని వాటిని కూడా చేర్చి తన ప్రత్యేక చూపుని ప్రదర్శించాడు. అవన్నీ చర్చలోకి రావాలని ఆకాంక్షిస్తున్నాడు. కొత్త ఆలోచనల్ని కలిగించాలనుకుంటున్నాడు. జాషువా, ఆచార్య కొలకలూరి ఇనాక్‌ల గురించి ప్రత్యేకమైన వ్యాసాల్ని రాసిన ఈ రచయిత, అస్తిత్వసాహిత్యాన్ని, దాని నేపథ్యాన్నీ, పరిణామగతుల్నీ చెప్తూ ఆ సాహిత్యం ద్వారా ప్రజల్ని చైతన్య పరుస్తున్నవారిని చక్కగా అంచనా వేస్తున్నాడు.

ఇప్పటికే ఆచార్య కొలకలూరి ఇనాక్ గారు వర్ణించిన 'ఆది ఆంధ్రుడు' కావ్యంపై డా॥ కదిరె కృష్ణ రాసిన ఒక పరిశోధన వ్యాసం చిన్న పుస్తకంగా ప్రచురించాడు. అది వేలాది కాపీలను వివిధ సభల్లో పంచుతున్నారు. మాదిగల్లో గల గొప్ప సాంస్కృతిక వారసత్వాన్ని ఆచార్య కొలకలూరి ఇనాక్ గారు ఎలా వర్ణించారో ఆ చిన్న విమర్శపుస్తకంలో డా॥కదిరె కృష్ణ చక్కగా విశ్లేషించాడు. ఆంధ్రప్రదేశ్ అధికార ముద్రలో ఉండే పూర్ణకలశాన్ని

రూపొందించిన గొప్పకళాకారుడు 'విధుక'. అతడు రాజావాసిరెడ్డి వెంకటాద్రినాయుడి సంస్థానంలో సేనాపతిగా ఉండేవాడు. అతని పూర్వీకుడే 'విధుక' ఆంధ్రుల సంస్కృతి గురించి చెప్పేవారు తప్పనిసరిగా చెప్పాల్సిన పేరైనప్పటికీ ఇవన్నీ విస్మరిస్తున్న వైనాల్ని ఈ చిన్న పుస్తకంలో హేతుబద్ధంగా విశ్లేషించాడు. అలా మాదిగల సాంస్కృతిక వారసత్వాన్ని కొనసాగించడంలో, దాన్ని గుర్తింపజేయడంలో 'ఆదిఆంధ్రుడు'పై రాసిన విమర్శ పుస్తకం విశిష్టమైంది.

తొలి భారతీయ ఉపాధ్యాయురాలైన సావిత్రీబాయిపూలేని బహుజనులంతా ఆదర్శంగా తీసుకోవాలంటున్నాడు. స్త్రీ విద్యే నిజమైన మూఢనమ్మకాల్ని పారద్రోలగలిగి, హేతుతత్వాన్నీ, శాస్త్రీయతను పెంపొందిస్తుందని ప్రబోధిస్తున్నాడు. మహాత్మా జ్యోతీబాపూలే, డా॥ బి.ఆర్.అంబేద్కర్, పెరియార్ రామస్వామి నాయకర్ వంటి వారి భావజాలాన్ని నిరంతరం అధ్యయనం చేసినా కొత్తకొత్త అంశాలెలా బహిర్గతమవుతాయో ఈయన వీరిపై రాసిన వ్యాసాల్ని చదివితే తెలుస్తుంది. ఈ వ్యాసాలు బహుజన రాజ్యాధికార భావనను మరింత దీప్తివంతం చేస్తుందని నమ్ముతూ మిమ్మల్ని అందరినీ చదవమని ఆహ్వానిస్తున్నాను. రచయిత డా॥ కదిరె కృష్ణను అభినందిస్తున్నాను.

★★★

# పీడితకుల,అణగారిన వర్గాల చైతన్య దీప్తి

హిందీ నుండి తెలుగులోకి వచ్చిన అనువాదాల్ని గమనించేవారికి డా॥ జి.వి.రత్నాకర్ పేరు పరిచయమయ్యే ఉంటుంది. దళిత సాహిత్యాన్ని అధ్యయనం చేస్తున్న వారికీ కవిగా, పరిశోధకుడిగా, విమర్శకుడిగా డా॥జి.వి.రత్నాకర్ పేరు తెలియకుండా ఉండదు. డా॥ జి.వి.రత్నాకర్ అద్భుతమైన భావుకత కలిగిన కవి. ఈయన రాసిన మట్టిపలక, అట్లేటిఅల కవితా సంపుటాలు కవిగా జి.వి.రత్నాకర్‌కి తెలుగు సాహిత్యంలో ఒక సుస్థిరమైన స్థానాన్ని సంపాదించి పెట్టాయి. ఈయన రాసిన కవితలు ఆంగ్ల, హిందీ, ఉర్దూ, మరాఠీ భాషల్లోకి కూడా అనువాదమయ్యాయి. వృత్తి రీత్యా హిందీ అధ్యాపకుడైనా మాతృభాష తెలుగు కావడంతో తెలుగు పలుకుబడిని పలికించడంలో దిట్ట. ఈయన కవిత్వంలో ప్రకాశం జిల్లా అట్టడుగు ప్రజల గుండెఘోష మట్టి పరిమళాల్ని వెదజల్లేలా కనిపిస్తుంది. సృజనకారుడిగా కవిత్వంలో భాషని ప్రయోగించడానికి కవికి స్వేచ్ఛ ఉంటుంది. కానీ, పరిశోధన, విమర్శ వ్యాసాల్ని రాసేటప్పుడు శైలి పట్ల జాగ్రత్త వహించాలి. ఇది తెలిసిన పరిశోధకుడు డా॥జి.వి.రత్నాకర్. అందుకే కవిత్వ భాషకీ, విమర్శ భాషకీ మధ్య వ్యత్యాసాన్ని పాటిస్తాడు. ఈయన రాసిన కవిత్వాన్నీ, వ్యాసాల్నీ ఎంతో ఆసక్తిగా చదువుతాను. రాసేదానికీ, ఆచరణకీ సమన్వయాన్ని చూపే వ్యక్తిత్వాన్ని డా॥జి.వి.రత్నాకర్ లో గమనించాను. అందుకే ఈయన రచనలంటే నాకిష్టం. అట్టడుగు వర్గాల వాళ్ళు తమ తమ ప్రత్యేక అస్తిత్వాన్ని కాపాడుకుంటూనే ఈ వర్గాలన్నీ కలిసి పనిచేయాలనే ఆకాంక్షిస్తుంటాడు. అందుకు కావాల్సిన తాత్త్వికధారను ప్రసరించే రచనలను హిందీ నుండి తెలుగులోకి కూడా అనువదించి ప్రచురిస్తుంటాడు. వీటన్నింటినీ గమనించే డా॥ జి.వి.రత్నాకర్ ఒక సామాజిక సాహిత్య ఉద్యమకారుడు అనగలుగుతున్నాను.

సమాజంలో కనిపించే సమస్యల పరిష్కారాలు సాహిత్యం ద్వారా కూడా పరిష్కారం కావాలంటే దార్శనికుల ఆలోచనలు విస్తరిల్లాలి. దీనిలో భాగంగానే "డా॥ అంబేద్కర్ జీవన ప్రస్థానం" గ్రంథాన్ని కూడా చూడాలి. ఇంతకు ముందే "అంబేద్కర్ దినచర్య" పేరుతో ఒక చిన్న పుస్తకాన్ని ప్రచురించాడు. అది విశేషంగా ప్రజల ఆదరణ పొందింది. ఇప్పుడు రాస్తున్న ఈ గ్రంథం కూడా అంబేద్కర్ జీవిత ఘట్టాలను మన కళ్ళముందుంచేదే. అయితే దీనిలో అరుదైన డా॥ అంబేద్కర్ ఛాయా చిత్రాలు, దానికి సంబంధించిన ఘట్టాలు వివరణాత్మకంగా, స్ఫూర్తిమంతంగా ఉన్నాయి. అంబేద్కర్ జీవితాన్నీ, ఆయన హిందూమతంపై చేసిన సైద్ధాంతిక ప్రత్యామ్నాయ సిద్ధాంతాన్నీ సరళంగా అందించాడు. అంబేద్కర్ రచనలన్నీ చదివితే వచ్చే చైతన్యం ఈ గ్రంథాన్ని చదివితే మనం పొందగలుగుతాం.

అంబేద్కర్ గురించి ఏ ప్రక్రియలో రాసినా దళితుని జీవితం ధన్యమైనట్లే. చైతన్యవంతమైన దళితుడెవరైనా తన జీవితంలో డా॥ బి. ఆర్. అంబేద్కర్ గురించి కవిత్వమో, కథో, నవలో, వ్యాసమో రాయకపోతే ఆశ్చర్యపోవాలి. అంతగా దళితులపై డా॥ అంబేద్కర్ ప్రభావం కనిపిస్తుంది. ఈ మధ్య కాలంలో అయితే, పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారు డా॥అంబేద్కర్ రచనలన్నీ ఇంటర్నెట్‌లో ఈ బుక్స్‌గా అందుబాటులోకి తీసుకొచ్చారు. వాటిని ఉచితంగా డౌన్‌లోడ్ చేసుకోవడానికీ అవకాశం కల్పించారు. వాటిని ఆండ్రాయిడ్ మొబైల్స్‌లో ఎంతోమంది డౌన్‌లోడ్ చేసి పెట్టుకుంటున్నారు. అంబేద్కర్ గురించి సమగ్రంగా తెలుసుకోవాలనుకునేవారికి ఎంతగానో ఉపయోగపడుతున్నాయి. ఇక, డా॥రత్నాకర్ రాసిన పుస్తకం విషయానికివస్తే, అంబేద్కర్ సాధించిన ముఖ్యమైన వాటిని పొందుపరిచిన తీరు చాలా సంతోషాన్ని కలిగిస్తుంది.

1920 మార్చి 21 న జరిగిన ఒక సమావేశంలో అంబేద్కర్ మాట్లాడుతూ తన ధన, మాన ప్రాణాల్ని అంటరానివారుగా పరిగణింపబడుతున్న వారికోసం త్యాగం చేస్తానని ప్రకటించాడు. అంటరానివాళ్ళుగా సమాజంలో ముద్ర వేయబడుతున్నవాళ్లంతా ఆత్మగౌరవంతో జీవించాలంటే చదువుకోవాలనీ, చనిపోయిన జంతువుల మాంసాన్ని తినకూడదనీ ప్రబోధించాడు. ఇది దళితుల ఆత్మగౌరవానికి ప్రథమ మెట్టు. దీన్ని అంబేద్కర్ తన చదువుతో నిరూపించి దళితులందరికీ ఆదర్శనీయుడైయ్యాడు.

సమాజాన్నే విభిన్న కులాలుగా విభజించి పాలించే ఆధిపత్య సంస్కృతిని అణగారిన, అంటరానికులాలు కూడా పాటించకుండా కలిసిమెలిసి ఐక్యతతో సాధించుకోవాలని నిరూపిస్తూ మహర్లలోని ఉపకులాలన్నింటినీ ఏకంచేసి సహపంక్తి

భోజనం చేయడం ద్వారా ఐక్యపోరాటాల్ని సూచించాడు అంబేద్కర్. ఇది దళితుల ఆత్మగౌరవానికి, అధికారమార్గానికీ రెండోమెట్టు. దళితులంతా తమ హక్కుల్ని శాంతియుతంగా సాధించుకోవడానికి ఐక్యమై ఒక సంఘంగా ఏర్పడాలనీ, దాని ద్వారా తమ సమస్యల్ని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేయాలి. దాన్ని పట్టించుకోకపోతే నిరసన తెలియజేయాలనేది ఆయన స్థాపించిన *'బహిష్కృత హితకారిణీసభ', 'సమాజ్ సమతా సైనిక్‌దళ్'* (1927), భారతీయ రిపబ్లికన్ పార్టీ వంటివన్నీ తెలియజేస్తున్నాయి. వీటి ద్వారానే దళితులు రాజ్యాధికారాన్ని సాధించుకోవచ్చుననేది కూడా డా॥అంబేద్కర్ దార్శనికత. దీనికి పీడిత కులాలు, వర్గాల సమైక్యత, వారి అభివృద్ధికోసం ఆచరణాత్మకంగా కృషి చేశాడు. దీనిలో భాగంగానే స్త్రీల హక్కుల గురించి చట్టాలు చేయించాడు. మైనారిటీవర్గాల వైపు నిలబడి పోరాడాడు. వీరికి కావలసిన తాత్త్వికధారను తన పుస్తకాల ద్వారా అందించాడు. నిరంతరం అధ్యయనశీలి అయిన డా॥ అంబేద్కర్ చదివిన దాన్ని ప్రసంగాల ద్వారా వినిపించాడు. పుస్తకాలు రాశాడు. వ్యక్తిగతమైన అభివృద్ధికోసం కాకుండా యావత్ పీడిత ప్రజలకు తన పాండిత్యాన్ని వినియోగించన ధన్యజీవి డా॥అంబేద్కర్. ఆయన జీవితం, ఉద్యమాలు, రచనలు, ఉత్తరాలు, ప్రసంగాలు, సమకాలీన సమాజంలో ఆయన స్థానాన్నీ కొండని అద్దంలో చూపించినట్లుగా ఈ గ్రంథాన్ని సరళమైన భాషలో అందించాడు డా॥జి.వి.రత్నాకర్. ఇది ప్రతి పీడితకులానికీ, అణచివేతకు గురయ్యే ప్రతి వర్గానికీ చైతన్యదీప్తిగా ఉపయోగపడుతుంది. ఇంతమంచి గ్రంథాన్ని రాసిన డా॥జి.వి.రత్నాకర్‌ని అభినందిస్తున్నాను.

*("డా॥అంబేద్కర్ జీవన ప్రస్థానం"*
*రచన: డా॥ జి.వి.రత్నాకర్)*

★★★

# సమకాలీన సమాజ దర్శనం

కవులు కూడా సామాన్యుల్లాగే కనిపించినా వారిలో అసామాన్యమైన సృజనాత్మక ప్రపంచం ఉంటుంది. రససిద్ధాంతంలో శాంతరసం అన్ని రసాల్ని తనలో ఇముడ్చుకున్నట్లు, జీవితాన్నంతటినీ ఒడిసిపట్టుకున్నట్లు చాలా మంది కవులు కనిపిస్తుంటారు. కవి జముళ్ళముడి (జముళ్ళముడి ప్రకాశం)గారు అటువంటి ఉత్తమ కవుల్లో ఒకరు. ఇప్పటికే ఆయన *'నాకలం; నీలిమొగ్గలు (2008), మగువ (2008), నల్లపిల్లలకోడి, నల్లుల మంచం (2010); ఎద్దుతలలు (2011)* కవితాసంపుటులతో పాటు *కట్ డ్రాయర్ కవి సమ్మేళనం (2011)* పేరుతో ఒక హాస్య నాటకాన్ని రాశారు. ఇంకా అముద్రితంగా మరికొన్ని రచనలున్నాయి. ఇప్పుడు '*పుణ్యక్షేత్రాల సాక్షిగా ఏప్రియల్ ఫూల్స్"* పేరుతో కవితాసంపుటిని ప్రచురిస్తున్నారు. దీనిలో 40 కవితలున్నాయి.

కవి జముళ్ళముడిగారి కవిత్వంలో గానీ, నాటకంలో గాని పరిశీలిస్తే సమాజంలో జరుగుతున్న అవాంఛనీయ ధోరణుల పట్ల తన నిరసన గళం వినిపిస్తున్నా, దాన్నెక్కడా వాచ్యం చెయ్యకుండా చక్కని అధిక్షేపాన్నీ, వ్యంగ్యాన్ని ప్రదర్శించడం గమనించవచ్చు.ఆ కవిత చదువుకున్నంతసేపూ ఇంతేనా అనిపిస్తూనే తర్వాత అది మనల్ని వెంటాడుతుంది. ఆ కవితల్ని కవి జముళ్ళమూడి గళం నుండి వింటే ఆ పలుకుబడిలో విరుపులు మనల్ని మళ్ళీ మళ్ళీ వినాలనిపించేలా చేస్తాయి. సాధారణంగా శ్లోకాల్నీ, పద్యాల్నీ కంఠస్థం పట్టి వాటిని వివిధ సందర్భాల్లో  వింటుంటాం. వచనకవిత్వాన్ని చాలా కొద్దిమంది మాత్రమే కంఠస్థం చేయగలుగుతారు. జముళ్ళమూడి కవిగారు శ్లోకాల్నీ, పద్యాల్నీ, వచనకవితల్నీ, నాటకంలోని సంభాషణల్నీ అలవోకగా చెప్పేస్తుంటారు. కవిగారు స్వతహాగా క్రైస్తవజీవితం నుండి వచ్చినవారు. ఆ ప్రేమను మూటకట్టుకొచ్చి దాన్నందరికీ కవిత్వంగా పంచుతున్నారనిపిస్తుంది. నిజమైన ప్రేమ మనల్ని సంస్కరించుకొనేటట్లు కూడా చేస్తుంది. అది వీరి కవిత్వంలో ఉంది.

*"కుట్ర కుతంత్ర భావాలు*
*గోడలు కూలిపోవాలి*
*క్రీస్తు సిలువలో ప్రేమను*
*తెలిసి నిలవాలి"*

అవసరమైనంతమేరకు క్రైస్తవంలో కూడా సంస్కరణల్ని ఆశించారు. నేటికీ కొన్ని పుణ్యక్షేత్రాల దగ్గర కులాల పేరుతో అన్నదానాల్ని జరుపుతున్నారు. కులాల్ని బట్టే నివాసాన్ని కేటాయిస్తున్నారు. దైవదర్శనం దగ్గర నుండి ప్రసాదం వరకు దేవుళ్ళ సాక్షిగానే అవినీతి, అన్యాయాలు జరిగిపోతున్నాయి. ఒకవైపు శాస్త్రవిజ్ఞానం విస్తరిస్తున్నా, మరొకవైపు ఈ రకమైన ధోరణులు మరింతగా దృఢపడడం వల్ల ఇలాంటి కవిత్వం రాకతప్పదని ఈ కవితల్ని చదివిన వారికి అనిపిస్తుంది.

*" అన్ని సౌభాగ్యసిరులు అనుభవిస్తూ*
*విద్యావేత్తలయ్యేంతవరకు ఇటజీవిస్తూ*
*అప్పులు చేసి చదివించిన అమ్మ, అయ్యను*
*ఆవలివారిగా చూస్తూ, ఆయా దేశాలు చేరి*
*లగ్జరీలు అనుభవిస్తూ కన్నవారికి గుండెపోటుతెస్తూ*
*దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్*
*అంటేసరిపోతుందా?" (గురజాడ అడుగుజాడలో)*

ఈ కవితా ఖండికను చూస్తే దేశభక్తిపేరు చెప్పుకుంటూ దేశసంపదను కొల్లగొట్టే బ్రెయిన్ డ్రెయిన్ గురించి ఆలోచించమంటున్నాడు కవి. ఇంకా ఈ కవితా సంపుటిలో 'తెలుగుభాష' వైభవాన్నీ, భారతీయుల త్యాగాలను కీర్తించిన కవితలున్నాయి. 'అమ్మేశారు అమ్మను నాన్నను' కవితలో తల్లిదండ్రుల పట్ల పిల్లల ప్రవృత్తుల్లో వస్తున్న మార్పుల్ని వర్ణిస్తే, 'అశ్లీలంలో యువత' కవితలో నేటి యువత చెడుమార్గాలను వర్ణించారు కవి. 'నూత్నవత్సరాన'లో కొత్త సంవత్సరానికి పలికే స్వాగతంలో కవి ఆకాంక్షలు వెల్లడవుతాయి. సమకాలీన సమాజాన్ని కవి దర్శించి ప్రదర్శించిన దార్శనికతకు నిదర్శనమీ కవిత్వం. కవిగార్కి నాహృదయపూర్వక నమస్సులు తెలుపుతూ… ఈ కవిత్వాన్ని అందర్నీ చదవమని కోరుతున్నాను.

*(పుణ్యక్షేత్రాల సాక్షిగా ఏప్రియల్ ఫూల్ (కవితాసంపుటి),*
*జముళ్ళముడి, చినుకు పబ్లికేషన్స్, 2013)*

★★★

# ఆలోచనాత్మక భావాలు

డా॥ విస్తాలి శంకరరావు మంచి వక్త, అధ్యాపకుడు. ప్రతి ఉపన్యాసాన్ని రసవత్తరంగా కొనసాగించగల ఉత్తమ ఉపన్యాసకుడు. ఉంటున్నది ఆంధ్రేతర ప్రాంతమైన తమిళనాడులో అయినప్పటికీ, ఆంధ్రప్రదేశ్ లోని అన్ని ప్రముఖ విశ్వవిద్యాలయాలు, కళాశాలల్లోను ముఖ్య అతిథిగానో, ముఖ్యవక్తగానో, పరిశోధనా పత్ర సమర్పకుడిగానో తెలుగువాళ్ళను కలుస్తూనే ఉన్నాడు. ఇప్పుడు ఈ *'మెరీనా'* పుస్తకం ద్వారా ఒక ఉత్తమ విమర్శకుడు మనముందుకి రాబోతున్నాడు. దీనిలో ఉన్న పదమూడు వ్యాసాల్లో ఒకటే జానపదకళలకు సంబంధించింది. మిగతావన్నీ ఆధునిక సాహిత్యానికి చెందినవే.

గురజాడ, రాయప్రోలు, శంకరంబాడి సుందరాచారి, జాషువా, శ్రీశ్రీ, కె.జి.సత్యమూర్తి, కొలకలూరి ఇనాక్, రవీంద్రనాథ్ టాగోర్ మొదలైన సాహితీవేత్తల వ్యక్తిత్వం, సాహిత్యాలను విశ్లేషించాడు. ఒక సంఘసంస్కర్తను పరిచయం చేశాడు. ఆవేశానికి పోకుండా ప్రతి వ్యాసంలోను ఆలోచనను విస్తరించేలా విస్తాలి శంకరరావు ఉత్తమ విమర్శను అందించాడు.

గురజాడ రాసిన ప్రతిరచనలోను ఒక సామాజిక ప్రయోజనం ఉందని వ్యాఖ్యానించాడు. ఆయన స్పృశించిన సమస్యలు నేటికీ పరిష్కారం కాకపోవడం వల్లనే ఆ సాహిత్యం నిత్యనూతనంగా కనిపిస్తుందనే అభిప్రాయం డా॥విస్తాలి శంకరరావు మేధోగత ఆలోచనకు నిదర్శనంగా నిలుస్తుంది. గురజాడ కథల సారాంశాలను కూడా చక్కగా పరిచయం చేయడం వల్ల పాఠకులకు ఆ కథల్లోని మౌలికాంశాల పట్ల చక్కని అవగాహన కలుగుతుంది, కథలన్నీ చదవాలనే ఉత్సుకత కూడా పెరుగుతుంది.

జాషువా రచనల్లోని ప్రత్యేకతలను వివరిస్తూ ఆయన ముద్ర ప్రతి రచనలోను స్పష్టంగా కనిపిస్తుందనే నిశితపరిశీలన బాగుంది. అలాగే ఫిరదౌసి ఖండకావ్యంలో జాషువా

ప్రదర్శించిన శిల్ప విషయాలను గుర్తించాలన్నాడు. ఈ కావ్యంలో జాషువా కేవలం కవిగానే కాకుండా, కళామర్మజ్ఞుడిగా కనిపిస్తాడు. గ్రంథకర్త ఈ విషయాలను చక్కగా సమన్వయించాడు.

శ్రీశ్రీ *'చరమరాత్రి'* కథల్ని వ్యాఖ్యానిస్తూ వాటిని శ్రీశ్రీ ఆలోచనా దృక్పథానికి ప్రతిబింబాలుగా అభివర్ణించాడు. కథల్లో పౌరాణిక పాత్రలుగానీ, పేర్లుగానీ కనిపించినా వాటి జీవితం మాత్రం సమకాలికమే అనే పరిశీలన శ్రీశ్రీని మరింత ఉన్నతీకరించేలా ఉంది. రఘుపతి వెంకటరత్నం నాయుడిగారి వ్యక్తిత్వం అంత ఔన్నత్యభరితంగా రూపొందడానికి బౌద్ధం, క్రైస్తవంలోని దయాగుణంతో పాటు గురువుల ప్రభావమే ప్రధాన కారణమని విశ్లేషించాడు.

శంకరంబాడి సుందరాచారి రచనలను పరిచయం చేస్తూ రాసిన వ్యాసం చాలామందికి కొత్తవిషయాల్ని అందించింది. ఆయన రాసిన *బుద్ధగీత (1954), అగ్నిపరీక్ష, అపవాదు, బలిదానం, నాస్వామి* మొదలైన ఖండకావ్యాలు, రవీంద్రనాథ్ టాగోర్ *'గీతాంజలి'* తెలుగు అనువాదం (1961), *సుందరభారతం, సుందరరామాయణం* వంటివాటినన్నీ కొండను అద్దంలో చూపినట్లు పాఠకులకు చూపించగలిగాడు. మాతెలుగు తల్లికి మల్లెపూదండ గేయాన్ని సమర్పించిన కవిని అభివర్ణిస్తూ తెలుగుజాతి ఉన్నంతవరకు ఆయన కీర్తి ఉంటుందన్నాడు.

ఆచార్య కొలకలూరి ఇనాక్ వందలాది రచనలు చేశారు. ఆయన జీవితరేఖల్ని రాస్తేనే పెద్ద వ్యాసం అవుతుంది. అటువంటిది ఆయన రచనలను, వాటిలోని ముఖ్యాంశాలను రుచిచూపిస్తూ రాసిన వ్యాసం చాలా బాగుంది. ఈయన జీవితం, రచనలు, కృషి సమకాలీన, భవిష్యత్తు తరాలకు ఆదర్శనీయమనే మాట చాలా విలువైంది.

భావకవిత్వంపై రవీంద్రుని ప్రభావాన్ని చాలా సంయమనంతో సమన్వయించాడు. రాయప్రోలు, దేవులపల్లిలపై రవీంద్రుని ప్రభావాన్ని, చలం–ప్రేమ్‌చంద్ సాహిత్యదృక్పథాలను అంచనా వేయడంలో డా॥విస్తాలి శంకరరావు ఒక ఉత్తమ విమర్శకుడిగా కనిపిస్తాడు. తమిళనాడులో కొత్తతెలుగు పదాల వాడుక గురించి రాసిన వ్యాసంలో ఒక భాషాపరిశోధకుడుగా శంకరరావు కనిపిస్తాడు.

కె.జి.సత్యమూర్తి నుండి శివసాగర్ గాను, శివసాగర్ నుండి కె.జి.సత్యమూర్తిగా పరిణామ గతులను విశ్లేషించడానికి సమకాలీన విప్లవ, దళిత, బహుజన సాహిత్యం,

రాజకీయాల అవగాహన చాలా అవసరం. అది ఈ వ్యాసంలో కనిపిస్తుంది. దళిత కథాసాహిత్యాన్ని విశ్లేషించిన వ్యాసంలో శంకర్ రావు ఒక పరిశోధక విమర్శకుడిగా కనిపిస్తాడు. తాను ఈ పుస్తకానికి 'మెరీనా' అని పేరు పెట్టిన ఆత్మీయత తమిళనాడులో తెలుగుభాష గురించిరాసిన వ్యాసంలో చక్కగా ప్రతిఫలిస్తుంది. ఈ పుస్తకంలోని వ్యాసాలను చదివిన వాళ్ళకు వీరి మూలరచనలను చదవాలనుకునే ఉత్సుకత కలుగుతుంది. అలా కలిగించగలగటం ఉత్తమ విమర్శ లక్షణం. ఆ లక్షణం ఈ పుస్తకంలో ఉందని ఈ వ్యాసాలు చదివితే మీకే అనిపిస్తుంది.

ఉపన్యాసాల్లో మాట్లాడడమే తప్ప వాటిని వ్యాసంగా రాయని వాళ్ళెంతోమంది ఉన్నారు. అలా కాకుండా వాటిని చక్కని వ్యాసాలుగా కూడా మనముందుంచుతున్న డా॥విస్తాలి శంకరరావుగార్ని అభినందిస్తూ, ఈ వ్యాసాల్ని చదవమని పాఠకుల్ని ఆహ్వానిస్తున్నాను.

*(మెరీనా సాహితీ వ్యాసాల సంపుటి,*
*డా॥ విస్తాలి శంకరరావు, జనని ప్రచురణ, చెన్నై 2012)*

★★★

# కవిత్వమై పండిన జీవితం!

సాధారణంగా ప్రతి వ్యక్తీ వృత్తి రీత్యా తన విధుల్లో తలమునకలౌతున్నా, నిజమైన ఆనందాన్ని పంచుకునే ప్రవృత్తిని కూడా ఏదొకదాన్ని ఎన్నుకుంటాడు. మొదటిది నియతమైతే, రెండవది అనియతం.నియతి విధి విధానాల్ని కోరుకుంటుంటే, అనియతి విశాల ప్రపంచాన్ని వాంఛిస్తుంది.రావినూతల ప్రేమకిషోర్ వృత్తిరీత్యా విద్యాశాఖలో పరిపాలనా సంబంధమైన విధుల్ని నిర్వహిస్తున్నారు. తను పుట్టి పెరిగిన కుటుంబం, ఉద్యోగ జీవితం అంతా అక్షరాలతో ముడిపడి ఉన్నదే. అయితే, యాదృచ్ఛికంగా తన వృత్తికి దగ్గరగా ఉండే ప్రవృత్తినే ఈయన ఎన్నుకొన్నారు. ఈయన కవిత్వం, కథలు, నాటకాలు రాయడమే కాదు, దర్శకత్వం కూడా వహించారు.వచన, దీర్ఘ కవిత్వంతో పాటు మినీకవిత్వ ప్రక్రియల్లో రచనలు చేస్తున్నారు. ఈయన రాసిన నాటకాలు, నాటికలు సామాజిక రుగ్మతను పోగొట్టడానికి ఉపయోగపడే చక్కని ఔషధాలవంటివి. ఒక బాధ్యత గల సాహితీవేత్తలా కృషి చేస్తున్నారు. ప్రేమకిషోర్ రాసిన కొన్ని కవితలను '*నలుగురమవుదాం*' పేరుతో కవితా సంపుటిగా ప్రచురిస్తున్నారు. ఈ సంపుటికి పెట్టిన పేరుతోనే దీనిలో ఒక కవిత ఉంది. ఇది ఎస్సీ వర్గీకరణను సమర్థించే దృష్టితో రాసింది. నిజానికి ప్రేమకిషోర్‌ది ఎస్సీ వర్గీకరణ వాదాన్ని కవిత్వంలో వినిపిస్తున్న ఒక బలమైన గొంతు. ఉద్యమం ప్రారంభమైన నాటి నుండీ నేటి వరకూ ఆ పరిణామక్రమాన్ని సందర్భానుసారంగా కవిత్వీకరిస్తూనే ఉన్నారు. ఈ సంపుటిలో చాలా కవితలు రిజర్వేషన్స్ అందరూ సమాన ప్రాతినిధ్యంతో అందుకోవాలని వాదించేవే. ప్రత్యేక తెలంగాణాను సమర్థించే కవితలో కూడా ఈ వాదన కన్పిస్తుంది. అయినంత మాత్రం చేత ఈ కవిని కేవలం ఒక ఉద్యమకవిగా ముద్రవేసేయడానికి వీల్లేదు. మన చుట్టూ జరిగే వివిధ సంఘటనల పట్ల ప్రతికవీ స్పందించినట్లే ఈ కవీ స్పందించారు. తన చుట్టూ కనిపించే

మనుష్యులలోని మమతానురాగాల్ని కవిత్వమై పలకరించారు.

నీళ్లకోసం యుద్ధం చేసే పేద వాళ్ళని చూసి చలించిపోయారు.

*"ఇక్కడ గొంతులే కాదు*

*గుండెలూ పిడుచకట్టుకు పోతున్న దాహార్తదృశ్యం'*గా దాన్ని వర్ణించారు. తన వర్ణనతో ఆ విషయాన్ని కళ్ళకు కట్టినట్లు చేయడం కంటే కవికి కావాల్సిందేమిటి?

ఆఫీసుల్లో ఉద్యోగినుల పట్ల కొంతమంది ప్రవర్తనా వైఖరిని, దానివల్ల పొందే మానసికక్షోభనీ లేఖాత్మక కవిత్వ నిర్మాణ పద్ధతిలో ఓతల్లిదండ్రులకు రాస్తున్న ఉత్తరంగా వర్ణించారు.

*"మీ ఉత్తరం చేరింది*

*మీ ఊసొచ్చిన ప్రతిసారీ*

*కళ్ళల్లో జలపాతం...*

*కలవని రైలుపట్టాల్లా "* ఉంటున్నామనే వాస్తవాన్ని, ఒక అనివార్య సందర్భాన్నీ చెప్తూనే *"ఈ నాగుల కోనలో"జాగ్రత్తగానే మసలుతున్నా...*

నా *గురించి దిగులోద్దు"* అనే ధైర్యాన్నీ ప్రకటిస్తున్న ఆధునిక యువతి ఉద్యోగజీవితాన్ని మనముందుంచుతున్నారు. దీనిలో 'నాగులకోన' అనేది ఔచిత్యంతో కూడిన కొత్త అభివ్యక్తి.ఒక వీరుడు మరణిస్తే, ఆతని ఆశయాల్ని కొనసాగిస్తామంటూ వాగ్దానం చేయడానికంటే, ఎవరికైనా ఇంకేమి కావాలి? '

*'ప్చ్... పిచ్చిరాజ్యం.*
*నాయకుడు లేని ఉద్యమమని భ్రమిస్తోంది*
*నీ స్ఫూర్తిలో ఉద్యమమెన్నడూ విశ్రమించలేదు*
*నీ కనుపాపల్లో ఉద్యమం ఊపందుకుంది"అయ్యా!*
*నన్ను చంపేస్తున్నాడు/కాపాడండి... కాపాడండి...'*
*పొడవాటి పట్టాకత్తితో శత్రువు*
*పబ్లిగ్గా నరకజూస్తుంటే*
*పరుగులు తీస్తున్న ప్రాణభీతి*
*జనారణ్య రోదనయ్యింది"*
*"అమ్...మ్మా...!?*
*నీవు విదిల్చిన*

*కత్తికొనకి క్షతగాత్రుణ్ణయ్యా"*

ఇలాంటి కవితలు చదువుతుంటే పాఠకుడు అభినయాత్మకమైన అనుభూతికి లోనవుతాడు. ఇది నాటకీయతలో కనిపించే ఒక లక్షణం. దీన్ని చాలా చోట్ల సమర్థవంతంగా ఉపయోగించుకోవడం కనిపిస్తుంది. కేవలం వస్తువుని మాత్రమే దృష్టిలో పెట్టుకోకుండా, దాన్ని కవిత్వం చేసే మార్గాన్నీ అన్వేషించారని తెలుస్తుంది.

కుల, మత విద్వేషాల సమాజంలో, వాటికి అతీతంగా మానవీయతను పంచిన మాష్టార్ని స్మరించుకున్నారు. చిన్నప్పుడే కోల్పోయిన తల్లి జ్ఞాపకాల్ని వర్ణించిన కవితలో మాతృత్వం కోసం తపించే వారి హృదయపు లోతులు తెలుసుకోవాలంటే ప్రేమకిషోర్ కవిత్వం స్పర్శించి తీరాలి. తన ప్రతిభాపాటవాల్ని తన తండ్రి ఎదుట ప్రదర్శించాలనుకున్నా, ఎప్పటికీ తీరని ఆ కోరికను, వేదనామయ విషాదాన్ని వర్ణించిన కవిత ఈ సంపుటికే హైలెట్.

*"నాన్నా!*
*ఎప్పటికైనా నా స్క్రిప్ట్‌ని*
*నీ డైరక్షన్‌లో ప్రదర్శించాలని ఎదురుచూస్తూ వున్నా*
*స్క్రిప్ట్ సిద్ధంగావుంది*
*ప్లీజ్- నాకోసం డైరక్ట్ చేయవూ!"*

దీనిలో జీవితం ఒక నాటకంగా ముగిసిపోయిన సంఘటనను ఎప్పటికీ మరిచిపోని దృశ్యకవితా రూపంగా వర్ణించారు. ఇలాంటి నాటకీయ కవితా నిర్మాణాన్నే మరో కవితలో ...

*"అమ్...మ్మా...!?*
*నీవు విదిల్చిన కత్తికొనకి క్షతగాత్రుణ్ణయ్యా-*
*అంతమాత్రాన నీవు గెలిచినట్టు కాదు*
*నీవు విసిరిన విషపునవ్వుకు అపహాస్యం పాలయ్యా-*
*అంతమాత్రాన నేను ఓడినట్టూ కాదు*
*ఈ హక్కుల పోరాటంలో సఫలమయ్యేది నేనే..."*

అని వర్ణించడంలో చక్కని ప్రణాళిక కనిపిస్తుంది. తమ న్యాయపోరాటం సఫలమవుతుందనే ఆశాభావం కనిపిస్తుంది. కేవలం ఒక ఉద్యమానికే కాకుండా, నిత్యం

సమస్యలతో సతమతమవుతున్న మానవుడు తన అస్తిత్వాన్ని నిలుపుకోవడానికి నిరంతరం ఎవరోఒకరితో యుద్ధం చేయకతప్పదు. అన్నిసార్లు తానే విజయాన్ని సాధిస్తాడనీ భావించలేం. నైతిక విలువల్ని పాటిస్తూ, న్యాయమైన పోరాటాన్నే చేస్తున్నా, కేవలం విజయం కోసమే కుయుక్తుల్ని పన్నే వాళ్ళ దగ్గర, నీతినియమాల్ని లక్ష్యపెట్టకుండా, అవకాశవాద స్వభావంతో విజయపథాన్ని మాత్రమే వాంఛించే వాళ్ళదగ్గర నిజాయితీ పరులకూ కొన్నిసార్లు ఓటమి తప్పదు. అలాంటప్పుడు ఇలాంటి కవితాపాదాలు పాఠకులకు ఎంతగానో ఊరటనీ, ఆశనీ కలిగిస్తాయి. అందుకే ఈ కవి కేవలం ఏదో ఒక ఉద్యమానికి మాత్రమే పరిమితమైన కవిత్వం రాయలేదు.

*'ముఖంమీది నవ్వు రాలినంత మాత్రాన*
*ఆత్మవిశ్వాసం రాలిపోతుందా...!?*
*నన్నెంతగా అపహాస్యం జేసినా*
*ఆశల ఉచ్ఛ్వాసం ఆగిపోతుందా?*
*నీవెన్ని గాయాల్ని చేసినా*
*గుండె నిబ్బరం సడలనివాణ్ణి*
*నలుగురమయ్యేంత వరకూ*
*రణ నినాదమై నిలబడ్డవాణ్ణి*
*కొనవూపిరిని కత్తికొనకి అద్దయినా*
*బ్రతుకుకోసం పోరుతాను*
*నా శిరస్సును నెత్తుటిబరిలో రాల్చయినా*
*రేపటికోసం నిలుస్తాను ”*

ఇలాంటివి ఒక ఉద్యమానికో, ఒక వ్యక్తికో మాత్రమే పరిమితమైన స్పందనలు కాదు. అవి విశ్వమానవ హృదయతంత్రుల్ని మీటగల శక్తివంతమైన భావనలు.

*“బాల్యంలో కన్నతండ్రి*
*ఆడపిల్లవు... నీకేంతెల్సు...?' అన్నాడు*
*పెళ్ళయ్యాక కట్టుకున్నోడు*
*తెలియకుండా మాట్లాడకు...' అన్నాడు*
*ఇప్పుడేమో కడుపున పుట్టినవాళ్ళు*

*'మమ్మీ! ఏం తెల్సని మాట్లాడతావ్?' అంటున్నారు. బ్రతుకంతా ఆడదానికి తెలియని తనమే...!?"* ఈ కవితా ఖండిక చదివిన తర్వాత ఒక స్త్రీ సమస్యను సమర్థవంతంగా అభివ్యక్తీకరించే కవి ఆత్మీయతను చూడాలా? ఆనుభవాన్ని గుర్తించాలా? సహానుభూతిగానే పరిగణించాలా? కవిత్వాన్ని చేయడమెలాగో తెలిసిన కవిత్వప్రతిభగానే చూడాలా? వంటి ప్రశ్నలు అస్తిత్వ ఉద్యమాలకున్న మరోకోణాన్ని చర్చలోకి తీసుకొస్తాయి. అస్తిత్వ ఉద్యమాలు వచ్చిన తర్వాత ఎవరి సమస్యలు వాళ్ళే రాసుకోవాలనుకోవడంలో "అనుభవానికి " ప్రాధాన్యం పెరిగిన మాట నిజమే. అయినా, సానుభూతి పరులు దూరం కావడానికే ఎక్కువ ప్రయత్నాలు జరిగినట్లనిపిస్తుంది. ఔట్ సైడరా? ఇన్ సైడరా? అని నిలదీసినప్పుడు లోపించిన నిజాయితీ సమాధానాలు కూడా అస్తిత్వ ఉద్యమాల్ని పక్కదోవపట్టించడానికి దోహదపడతాయి. తెలుగులో స్త్రీవాద, దళిత, ప్రాంతీయ సాహిత్య ఉద్యమాల పట్ల గల మౌనానికిదొక కారణంగా భావించాలి. ప్రేమకిశోర్ తన జీవితానికి సంబంధించిన వస్తువుల్ని కవిత్వం చేసినప్పుడు ఇన్‌సైడర్‌గాను, స్త్రీ సమస్యల పట్ల రాసినప్పుడు ఔట్‌సైడర్‌గా ఉన్నా, ఇన్‌సైడర్‌లా ఫీలై కవిత్వం రాశారు. అలాగని స్త్రీలే ఆ సమస్యలపై కవిత్వం రాస్తే, కవి దానికే అధిక ప్రాధాన్యాన్నీ ఇవ్వొచ్చేమో! అలాగైతే, ఈ కవి అస్తిత్వ సాహిత్యోద్యమ రెండవ తలుపుని కూడా తెరుస్తున్నట్లే భావించవచ్చు.

తెలుగు సాహిత్యంలో శ్రీనాథుని కాలం నుండీ ఏదో ఒక రూపంలో స్మృతికవిత్వం ఉన్నా, అభ్యుదయ కవిత్వం నాటికి "వీరగాథాస్మరణ' మనే లక్షణంగా మారింది. సామాజిక సమస్యల కోసం ప్రాణత్యాగం చేసిన వారిని కీర్తిస్తూ, వారి నుండి వర్తమాన భవిష్యత్ తరాలు స్ఫూర్తిని పొందడం ప్రారంభమైంది. అది నేటి అన్ని సాహిత్య ధోరణుల్లోకి ప్రవేశించింది. కామ్రేడ్ సుధాకర్ ప్రసాద్, మాదిగసాహిత్య వేదిక వ్యవస్థాపకుడు నాగప్పగారి సుందర్‌రాజులు చనిపోయినప్పుడు వారి గురించి ప్రేమకిషోర్ రాసిన కవితల్లో ఈ లక్షణం కనిపిస్తుంది.కొన్ని తిరిగిరానివి ఉంటాయి. అయినా వాటి గురించి కవులు పదే పదే స్మృతిగీతాల్ని రాస్తుంటారు. అవి చదువుకున్న పాఠకులు అలాంటి సందర్భాల్ని గుర్తుచేసుకొని భవిష్యత్ ప్రేరణకు తక్షణ కర్తవ్యానికి ప్రేరణనిస్తాయి.

*"కవిత్వం పండాలంటే*
*జీవితాన్ని పిండాల్సిందేనని చెప్పిన అప్పా!*
*రా..నీ పందిరంగడి ప్రేమలేఖఆరునొక్క శృతిలో*
*మళ్ళొకసారందుకో దప్పుశబ్దం లేని*
*ఆ నీలికేకల్ని ఎండగట్టేందుకు*

*నీ కలాన్నొకసారి అందివ్వవూ!*
*అవునూ! నిన్ను దేశద్రోహన్న*
*ఆ జంధ్యంగాడి వైనాన్ని వివరించవూ!"*

దీనిలో సుందర్‌రాజు జీవితం, ఆ జీవితంతో ముడిపడిన విషయాల్ని కవిత్వీకరించిన తీరుని రెండు అంశాల్ని వివరించే ప్రయత్నంచేస్తాను. *నీలికేక* పేరుతో కత్తిపద్మారావు ఒక కవితాసంపుటి వేశారు. నిన్నమొన్నటి వరకూ ఆయన, ఆయనతో పాటు చాలా మంది కవులు దండోరా ఉద్యమం గురించి తప్ప, ఇతర అనేక విషయాలపై కవిత్వం రాశారు. వాళ్ళందర్నీ "నీలికేకలు"గా ప్రతీకాత్మకం చేసి, సమకాలీన వాస్తవికతను విస్మరించిన వాళ్ళని నిరసిస్తూ కవిత్వం రాయగలిగే ప్రేరణనివ్వాలనేది కవి భావన అనుకుంటున్నాను. అలాగే *"దేశద్రోహన్న ఆ జంధ్యం గాడి వైనం"* అనేది సెంట్రల్ యూనివర్సిటీలో పరిశోధనకు సీటివ్వకుండా నిరాకరించడమే కాకుండా, అవమానించిన ఒక ప్రొఫెసర్ అహంకారాన్నీ, ఆ సందర్భంగా సుందర్‌రాజు ఉద్యమం చేసి, సీటు సాధించుకుని, ఆ ప్రొఫెసర్ చేత క్షమాపణలు చెప్పించిన విజయగాథను గుర్తుచేస్తున్నారు కవి.

ఇలా ఒక కవితలో అనేక సంఘటనల్ని, సంఘటనల్ని ఆధారంగా చేసుకున్న జీవనచైతన్యాన్నీ కవి తన ప్రతిభతో అభివ్యక్తీకరించారు. ఆప్తులైన వారు మరణించినప్పుడు, వారిని స్మరించుకునేది స్మృతి. అంటే గడిచిపోయిన సంఘటనల్ని మరలా గుర్తుచేసుకోవడం. వర్తమాన గమనాన్ని అవగాహన చేసుకుని రాసేది 'బుద్ధి' అంటారు. ఈ రెండింటి కార్యకారణాలతో రాబోయే వాటిని ఊహించడం 'ప్రజ్ఞ' అవుతుంది. దీన్నే భవిష్యద్దర్శనం అంటారు. ఒక ప్రవక్తకుండే లక్షణమిది. కవిని కూడా ప్రవక్తగానే భావించడానికి కారణం, ఆ కవిత్వంలో ఉండే దార్శనికత ఒక కారణం. వీటన్నింటి కలయికనే 'ప్రతిభ' అని పిలుస్తారు. ప్రేమకిషోర్ ప్రతిభావంతుడైన కవి అని ఈకవితల్ని చదివితే తెలుస్తుంది.

రాష్ట్రంలో మూడు ఉద్యమాలు తీవ్రస్థాయిలో కొనసాగుతున్నాయి. దేశవ్యాప్తంగా విస్తరించి, రాష్ట్రంలోనూ బలంపుంజుకుని సామాజిక విప్లవాన్ని ఆశిస్తున్న మావోయిస్టు ఉద్యమం ఒకటి.

రెండవది, ప్రాంతీయ అసమానతల్ని, దోపిడీని నిరసిస్తూ సుమారు అర్థశతాబ్దం పాటు కొనసాగుతూ తీవ్రరూపం దాల్చిన తెలంగాణా రాష్ట్ర ప్రత్యేకఉద్యమం.

మూడవది, సుమారు రెండు దశాబ్దాలుగా కొనసాగుతున్న ఎస్సీ వర్గీకరణ ఉద్యమం.

బాధ్యత గల కవి సమకాలీన ఉద్యమాల పట్ల తన స్పందనను తెలపాలి. గోడమీద పిల్లిలా ఉండకూడదు. ప్రేమకిషోర్ ఈ మూడు ఉద్యమాలకూ మద్దతు ప్రకటిస్తూ కవిత్వం రాశారు. అక్షరాలు గాఢమైన భావశకలాలై బయటకు రావడానికి కవి నిద్రలేని రాత్రులెన్నో గడుపుతాడు. అది కవికున్న లక్షణం. కవిత్వం బయటకు రావడానికి కవిపడే ఆరాటాన్ని ప్రసవవేదనతో పోలుస్తుంటారు. మరి కొంతమంది గుండె గొంతుల్లోకి వచ్చి కూడా బయటికి రాని స్థితితో వర్ణించారు. ప్రేమకిషోర్ కవిత్వం రాయడానికి పొందిన వ్యక్తావ్యక్త భావనను...

*"నా గుండె గవాక్షాల్లోనే కాదు*
*మూసిన నా కనురెప్పలపై కూడా*
*అక్షరాలు కవాతు చేస్తుంటాయ్"*

అని అభివ్యక్తీకరించారు. కవికున్న ప్రధాన లక్షణం స్పందించటం. కవి తనచుట్టూ జరిగేవాటిని చూస్తూ నిష్క్రియత్వంతో ఉండలేడు. కొన్నింటి పట్ల తను ప్రత్యక్షంగా పోరాడలేకపోయినా, ఆ సంఘటనల పట్ల సంఘర్షణను అక్షరీకరిస్తుంటాడు. అవసరం, సాధ్యాసాధ్యాలు, సామర్థ్యాల్ని అనుసరించి ఆ సమస్యల పరిష్కారాల పట్ల కార్యాచరణ ఉంటుంది. కవిగా తాను రాసినవన్నీ తన జీవితానుభవాలే అనుకోలేం. కొన్ని సహానుభూతితో వెలువడతాయి. మరికొన్ని అనుభవంతో బయటకొస్తాయి. రెండింటినీ పాఠకుడు అనుభవించగలిగేలా చేయడమే కవి పనితనం. దీన్ని సమర్థవంతంగా నిర్వహిస్తున్న ప్రేమకిషోర్‌ని కవిత్వాభిమానులంతా అభినందిస్తారు. వీరిలో నేనూ ఒకడిని!!

*(నలుగురుమవుదాం(కవితాసంపుటి),*
*రావినూతల ప్రేమకిషోర్, సాదృశ్య పబ్లికేషన్స్,*
*హైదరాబాద్, 2011)*

★★★

# క్రైస్తవ పునరుజ్జీవన కవిత్వం!

*"సామాజిక సంఘర్షణల్లోనూ*
*సామాన్య మానవుడి సాధక బాధకాల్లోనూ*
*దేవుడెక్కడా లేడనీ*
*నిజానికి అతడెప్పుడో మరణించాడనీ*
*"నవసమాజ నిర్మాతలందరూ'*
*దేవుణ్ణి సమాధి చేస్తోంటే*
*పునరుత్థానమై పోటెత్తిన శక్తి*
*మళ్ళీ మీలోకి ఎలా ప్రవహించాలి?"* –

ఇది తాళ్ళూరి ప్రసాద్ గారి *"నేనూ జయిస్తాను'* 'కవితా సంపుటి లోని ఒక కవితా ఖండిక. దీన్నెలా అర్థం చేసుకోవాలి? నిత్య సంఘర్షణలో జీవిస్తున్న మానవుడికి ఆధునిక సమాజంలో దైవం పట్ల వ్యక్తమవుతున్న భావాలకు ఈ కవితాఖండిక చక్కని నిదర్శనం అని సరిపెట్టేసుకుందామా? లేక ఆ కవిత్వం సాహిత్య ప్రమాణాలతో చూసినప్పుడు ఏ విభాగంలో చేర్చాలి? దీన్ని ఆధునిక వచన కవిత్వం అందామా? ప్రాచీన భావాలతో నిండిన కవిత్వం అందామా? రూపం ఒకటి. వస్తువు మరొకటి. రూపానికీ వస్తువుకీ సంబంధం ఉందా? కవిత్వం ఛందోబద్ధంగానో, వచన రూపంలోనో ఉన్నంత మాత్రం చేత దాన్ని ప్రాచీన, ఆధునిక కవిత్వంగా గుర్తించడం సాధ్యమేనా?

ఒక రచనను చదివిన తర్వాత అది ప్రాచీనమో, ఆధునికమో గుర్తించడానికి అది వెలువడిన కాలం, దానిలో తీసుకున్న వస్తువు, అది వ్యక్తమైన నిర్మాణం వంటి అంశాల్ని సర్వసాధారణంగా పరిగణనలోకి తీసుకోవడం జరుగుతుంది. విధిని, మానవాతీత

శక్తులను నమ్మడంతో పాటు స్వర్గ, నరకాలపై అచంచలమైన విశ్వాసాన్ని వ్యక్తం చేయడం ప్రాచీన లేదా సాంప్రదాయిక సాహిత్యంలో కనిపించే ఒక ప్రధాన లక్షణం. మనిషి స్పందనల్ని, అనుభూతుల్ని, వారి ప్రతి చర్యల్ని హేతువాద దృష్టితో పరిశీలించడం ఆధునిక సాహిత్యంలో కనిపించే ఒక ప్రధానమైన అనుశీలన పద్ధతి.

ఆదిమానవుడి నుండి ఆధునిక మానవుడి వరకూ కొనసాగుతున్న ఆన్వేషణల్లో దైవం ఒకటి. ఈ చరాచర ప్రాణిసృష్టి అంతటినీ నడిపించేదెవరు? అసలు ఈ సృష్టి ఎలా జరిగింది? సృష్టిలోని అసమానతలకు కారణాలేంటి వంటి ప్రశ్నలెన్నో మానవుడికి కలగడం సహజం. అయితే అవన్నీ మానవుడికి కష్టనష్టాలొచ్చినప్పుడు లేదా సుఖ సంతోషాలలో మునిగి తేలుతున్నప్పుడు వచ్చే ఆలోచనలు! పురాణాలు, బైబిలు, ఇతర మతగ్రంథాలు బోధిస్తున్నట్లు వీటన్నింటికీ దైవశక్తే కారణమా? శాస్త్రీయమైన ఆలోచనలని చెప్తున్న జీవపరిణామమే కారణమా?

ఏమో... ఇది అంత సులభంగా తేల్చేసే విషయం కాదు. సృష్టి కొనసాగు తున్నంతవరకూ ఈ ప్రశ్నలు కలుగుతూనే ఉంటాయి. వాటికి అప్పటికప్పుడు ఏవో కొన్ని సమాధానాలు వస్తుంటాయి. అవి సంతృప్తి కలిగించవచ్చు లేదా కలిగించకపోవచ్చు. ఈలోగా కొన్ని తరాలు మారిపోతుంటాయి. దైవం ఉందని నమ్ముతూనేఆదైవాన్నే తృణీకరించే పనులు చేస్తూ తమ అవసరాలకు అనుగుణంగా ప్రవర్తించే ద్వైదీభావ మనస్తత్వాన్ని ప్రశ్నించే తరాలకు ప్రాతినిధ్యం వహించే కవిత్వాన్ని తాళ్ళూరి ప్రసాద్ ఈ కవితా సంపుటి నిండా పండించాడు. ఈ సంపుటిలోని కొన్నికవితల్ని చదువుతుంటే బైబిలు లోని సామెతలు, అపోస్తులుల కార్యాలు, ప్రేమగీతంవంటి గ్రంథాలు చదువుతున్నట్లుంటుంది.

"క్రైస్తవం" ఒక మతంగా ప్రాచుర్యంలోకి వచ్చిన తర్వాత చర్చి స్వరూప స్వభావాలు మారిపోతున్నాయి. భారత దేశం వంటి కులనిర్మిత సమాజంలో అనివార్యంగానే వివిధ సమూహాలుగా విడిపోవడం ఆశ్చర్యపోవాల్సిన పనిలేదేమో. కాకపోతే క్రీస్తు బోధనల్లో కనిపించే ప్రేమ, సహోదరత్వం వంటివన్నీ క్రైస్తవ సమాజంలోనూ ఫాదర్స్‌లోనూ, ఆ చర్చి సభ్యుల్లోనూ ఆందోళన కనిపిస్తున్నా, తాళ్ళూరి ప్రసాద్ లాంటి కవులైతే దాన్ని కవిత్వంగా అందిస్తారు. అందుకనే "మిత్రులారా తిరిగిరండి'అని తప్పిపోతున్న సహోదరుల్ని పిలుస్తున్నాడు. చెప్పేదానికీ ఆచరణకీ పొంతన లేనప్పుడు కూడా "విశ్వాసం' సడలి బయటకి పోతుంటారు. మళ్ళీ ఎప్పటికైనా తప్పిపోయిన గొర్రెను దగ్గరకు చేర్చుకొన్న

బైబిలులో తండ్రి కుమారుడికి గొప్ప విందుచేయడానికి సిద్ధపడిన వాడిలా కవి ఆహ్వానిస్తున్నాడు.

*"ఆకాశమంత ప్రేమ*
*అమాంతం కౌగిలించుకున్నప్పుడు*
*పశ్చాత్తాపంతో కదిలిపోయి*
*మోకాళ్ళమీద కన్నీళ్ళమై ప్రవహించాం*
*గుర్తుందా? "*

అని గత మధుర స్మృతుల్ని గుర్తుచేస్తున్నాడు కవి. ఈ కవితా సంపుటిలో "*నాలుక చేసే గాయాలు'* కవిత సుభాషితం లాంటిది. ఎవరైనా చిన్నపిల్లల్ని కొట్టినప్పుడు, కొట్టిన వాళ్ళ కోపం చల్లారిపోయిన తర్వాత ఆ పిల్లవాడు వెళ్ళి తననెందుకు కొట్టారొ, అలా విసిగించడానికి కారణమైతే తనను క్షమించమని అడిగితే ఆ కొట్టిన వాడి హృదయం పశ్చాత్తాపంతో ఎలా విలవిలలాడిపోతుందో అలాంటి అనుభవాన్ని ఈ కవిత కలిగిస్తుంది. "*నాలో నిద్ర లేచిన సాక్షి" కవితతో పాటూ* "నాపేరు పేతురు మాది కోడూరు "ఈ కవితా సంపుటిలోనే అత్యుత్తమ కవితల్లో ఒకటి.

*"నిలువెత్తు విశ్వాసంలా నువ్వు*
*నీళ్ళమీద ఎదురుగా నిలబడినా*
*కాసింతసేపు కూడా కంటి నిండా*
*నిన్ను నింపుకోలేక*
*గాలివెక్కిరింపులకు భయపడి*
*ఘనీభవించిన సందేహాన్నై*
*అపురూపమైన ఓ అనుభవాన్ని*
*అర్థాంతరంగా ముగించి*
*అవిశ్వాసపు అలలక్రింద మునిగిపోతుంటాను!"*

బైబిలులో పేతురు ఒక ప్రధానమైన భక్తుడైనా, అతని మానసిక స్థితి పాలకుల భయానికి లోనై ప్రవర్తించింది. ఎన్ని అడ్డంకులు వచ్చినా విశ్వాసాన్ని ఎలా ప్రోదిచేసుకోవాలో, తమ వ్యక్తిత్వాన్ని ఎలా కాపాడుకోవాలో తెలియడానికే అన్నీ తెలిసిన క్రీస్తు కూడా ఆ రూపంలో బంధింపబడ్డాడని బోధపడుతుంది. ఆ తర్వాత పేతురులో వచ్చేది పశ్చాత్తాపం! కవితలో పేతురు యథాతథంగా తీసుకున్నా నేటికీ క్రీస్తు పట్ల

విశ్వాసుల్లో కొనసాగే అవిశ్వాసానికి ప్రతీక. కోడూరు  నూతన పదసృష్టి చేసి వాడిన ప్రతీక.

చర్చిల్లో జరుగుతున్న కొన్ని విషయాలపట్ల కూడ కవిలో అసంతృప్తి కనిపిస్తుంది. గ్రూపులుగా విడిపోవడం, తమ విశ్వాసాన్ని ఆచరణలో చూపకపోవడం, దాన్ని బురదలోనో, రాతి నేల మీదో, ముళ్ళపొదల్లోనో పడిన విత్తనాల్లాగో, కుంచం కింద పెట్టిన దీపాల్లాగో చేస్తున్నప్పుడు తీవ్రంగా వ్యధ చెందుతాడు.

*"ఆదివారం చర్చీల్లో*
*ముందువరుస కుర్చీల్లో*
*డంబాలుపోయిన ఆడంబరం కూడా*
*ఆఫీసు గుమస్తాల ముందు*
*అప్రయత్నంగా లొంగిపోతుంది" (అవినీతి జెండాలు)*

అని అప్పుడు చెప్పిన సాక్ష్యానికి విలువేముంటుందనే ఆవేదన కనిపిస్తుంది. చర్చిల్లో, వివిధ చోట్ల జరిగే  ప్రార్థనా కూటముల్లో ఫాదర్ వాక్యాన్ని బోధిస్తుంటే క్రీస్తు పట్ల, ఆయన బోధనల పట్ల గౌరవం, వినాలనే ఆసక్తితో పాటు హృదయం ద్రవీభూతమవుతుంది. ఉపన్యాసం ఒక కళ. ఆ కళని వశీకరించుకోగలిగిన వాళ్ళు దేనిగురించైనా, ఏమి మాట్లాడినా ఆకర్షణీయంగానే ఉండవచ్చు. అలా కాకుండా వక్రీకరణలతోనూ బైబిలు ప్రసంగాలు చేసే వాళ్ళున్నారు.

*'పాడిందే పాటగా*
*పాసిన ప్రసంగాలు తప్ప*
*ప్రవక్తలా ప్రవహించే*
*పసిడి గొంతులేవి?"*

అని కొంతమంది విసుగెత్తించే ప్రసంగాలను ప్రశ్నించాలనుకుంటాడు కవి. బైబిలు వాక్యాల్లో అంతశక్తి ఉన్నా, దాన్ని అంతే శక్తి వంతంగా అందించలేకపోవడం అనే లోపం అనేది కవి భావన. అందుకనే ' '*నవసమాజ నిర్మాత*'లందరూ దేవుణ్ణి సమాధి చేస్తున్నారని ఆవేదన పడుతున్నాడు కవి.

మరలా దేవుడు నిజంగా సమాధినుండి బయటకు రావాలంటే ఉడుకు రక్తం నడుంబిగించాల్సిన అవసరం ఉందంటూ సాంస్కృతిక పునరుజ్జీవనానికి పిలుపు నిస్తున్నాడు కవి. అందుకనే కలాలకు పదును పెట్టవలసిన అవసరం ఉందంటున్నాడు. లేకపోతే వచ్చే నష్టాన్ని కూడా కవిత్వంలోనే చెప్తూ ...

*''నువ్వు రాయాలి తమ్మీ!*
*మూడు గోద్రాలు ఆరు అయోధ్యలుగా'*

మత హింస జరుగుతున్న వర్తమాన చరిత్రను చూపుతూనే

"ఏ సత్యమూ లేని చోట అసత్యమే
*గొప్పసత్యంగా చెలామణి అవుతుంటే*
............
*సత్యానికి పట్టాభిషేకం జరగాలంటే*
*నువ్వు కలం ఝుళిపించాల్సిందే"*

అని అంటున్న కవి తాళ్ళూరి ప్రసాద్ మానవత్వాన్ని పరిమళింపజేసే మహోన్నత ఆశయంతో కవిత్వం రాస్తున్నాడు. మొదట్లో దీన్ని ప్రారంభిస్తూ ప్రాచీనమా? ఆధునికమా? అనే ప్రశ్నించుకున్నాం. ఈ విభజనల కంటే అప్పుడూ ఇప్పుడూ ఉండేది ప్రేమ తత్త్వమేనని ఎలుగెత్తి చాటిన కవిత్వంగా దీన్ని చెప్పుకోవచ్చు. ఇంకా లోతుగా చెప్పుకోవాలంటే క్రైస్తవ మైనారిటీ వాసనలు కనిపిస్తున్న నవ్యసంప్రదాయ పునరుజ్జీవన కవిత్వంగా పేర్కొనవచ్చు. ఈ కవితా సంపుటిలో గల ఇరవై అయిదు కవితల్లోనూ అంత: సూత్రం ఒకటే. అది క్రీస్తు బోధించిన ప్రేమతత్త్వాన్ని చాటడం.

శిల్పపరంగా చూసినప్పుడు *నాపేరు పేతురు మాది కోడూరు, నాకింకా జీవించాలనుంది, దు:ఖపడువారు ధన్యులు, నేనూ జయిస్తాను* కవితల్లో పాద నియతిని పాటించాడు కవి. అనుభూతి, ఆర్ద్రత, ఆరాటం ముప్పేటలా కలిపి మంచి కవిత్వాన్ని రాసిన తాళ్ళూరి ప్రసాద్‌ని అభినందిస్తున్నాను.

*(నేనూ జయిస్తాను, కవితా సంపుటి,*
*తాళ్ళూరి ప్రసాద్, 2012)*

★★★

# గ్రామీణ జానపదుల సౌందర్యం

సహృదయులు డా॥బూర్గుల కేశవులు గారిది మాట మీద నిలబడే విశిష్టవ్యక్తిత్వం. యుజిసి పునశ్చరణ తరగతుల్లో పాల్గొని, ఉస్మానియా విశ్వవిద్యాలయం అతిథి గృహంలో భోజనం చేసేటప్పుడు ఆయనకు నన్ను నాటి తెలుగు శాఖాధ్యక్షురాలు ఆచార్య కుసుమారెడ్డి గారు పరిచయం చేశారు. మాటల సందర్భంలో ఆయన డా॥ బోయి భీమన్న గారిపై ఒక జాతీయ సదస్సు నిర్వహిస్తున్నట్లు, దానికి నన్ను కూడా పిలుస్తానని అన్నారు.

పిలుస్తామని మాటవరసకన్నా, అందరినీ పిలవలేమని దానికి అనేక సాంకేతిక అడ్డంకులేర్పడుతుంటాయని నేనూ ఇటీవలే అనుభవపూర్వకంగా తెలుసుకున్నాను. కానీ, డా॥కేశవులు గారు అనుకున్నది సాధించడానికి అకుంఠిత దీక్షవహిస్తారని ఈ కొద్ది పరిచయంలోనే అనేక సందర్భాల్లో గమనించాను.

సాధారణంగా చాలా విశ్వవిద్యాలయాల్లో నేషనల్ సెమినార్స్ నిర్వహిస్తుంటారు. కనీసం పక్కడిపార్ట్‌మెంటుకి కూడా తెలియకుండా అవి జరిగిపోతుంటాయి. కానీ, తెలుగు శాఖల్లో ఒక జాతీయ సదస్సు జరిగిందంటే ఒక పండుగ వాతావరణమే కనిపిస్తుంటుంది. అలాంటి నిజమైన పండుగలా ఆయన డా॥బోయి భీమన్న సాహిత్యంపై సెమినార్ నిర్వహించారు. ఆ సందర్భంగా ఏర్పాటుచేసిన భోజనాలు 'నభూతో నభవిష్యతి' అంటే అతిశయోక్తి కాదేమో! నాటి సదస్సు పత్రాలను ఎంతో ఓపికతో అనేక సార్లు ఫోన్స్ చేసి సేకరించి "బోయిభీమన్న సాహిత్యం– జాతీయ ద ృక్పథం' పేరుతో అందంగా పుస్తక రూపంలోకి తెచ్చారు. అందరి పత్రాలను ముందు ప్రచురించి తన పత్రాన్ని మాత్రం చివరిలో ప్రచురించుకున్న నిగర్వి. ఆయన పుస్తకాన్ని ప్రచురించేటప్పుడు నా వ్యాసం కూడా అందులో ఉండటం వల్ల ఆయనతో అనేక సార్లు ముచ్చటించే అవకాశం కలిగింది. ఆయన మాటల్లో నాకు ఆడంబరానికంటే ఆత్మీయతే అధికంగా కనిపించింది. అలా ఏర్పడిన

పరిచయంతోనే డా॥బూర్గుల కేశవులు గారు రాసిన *"మహబూబునగరు జిల్లా మోట పాటలు"* గ్రంథానికి నన్ను ముందుమాట రాయమన్నారు. నేను ఆశ్చర్యపోయాను. ముందుమాట అనేది బరువైన పదం. పైగా"ఆచార్యులు" అనేకమంది ఉండగా నన్ను రాయమనడంలో మీ ఆంతర్యమేమిటో నాకు అర్థం కావట్లేదన్నాను. పైగా *"ఈమధ్యనే విశ్వవిద్యాలయంలో ప్రవేశించిన వాణ్ణి. నాకంత అనుభవమేమి ఉంటుందండీ"* అని కూడా అన్నాను. *"అనుభవంతో కాదు ఆత్మీయతతో రాయండి. పాండిత్యంతో కాదు పరవశించి రాయండి"* అన్నారు. నిజమే పల్లె సౌందర్యాన్ని పాండిత్యంతో కంటే పారవశ్యంతోనే చూడాలనిపించింది. ఆ దృష్టితోనే దీన్ని రాస్తున్నాను.

ఇది 1989లో డా॥బూర్గుల కేశవులు గారు ఎం.ఫిల్., పట్టాకోసం ఉస్మానియా విశ్వవిద్యాలయానికి సమర్పించిన పరిశోధన గ్రంథం. ఇది ఆచార్య యెల్దండ రఘుమారెడ్డిగారి పర్యవేక్షణలో జరిగిన పరిశోధన. పుస్తకాన్ని చదివిన తర్వాత పరిశోధకుడు విశేషమైన కృషి చేశారనిపించింది. సాధారణంగా జానపదసాహిత్యంలో క్షేత్రపర్యటన ఉంటుంది. మోటపాటలపై జరిగే పరిశోధన కనుక, అప్పటికే లభించినంత మేర లిఖిత సాహిత్యంతో పాటు అత్యధిక శాతం మౌఖిక సాహిత్యాన్ని సేకరించవలసి ఉంటుంది. పాటల సేకరణలో అనేక కష్టనష్టాలకు గురికావల్సిందే!

అవసరమైన దాన్ని సేకరించడానికి అనవసరమైన దాన్ని కూడా అనివార్యంగా సేకరించక తప్పదు. ఇంటికొచ్చి దాన్ని మళ్ళీ జాగ్రత్తగా విశ్లేషించుకొంటూ అవసరమైన దాన్నే స్వీకరించాల్సి ఉంటుంది. ఈ కష్టనష్టాలన్నీ జానపద సాహిత్యంలో తొలితరం పరిశోధకులకు అధిక శ్రమనే కలిగించి ఉంటాయి. ఆ శ్రమని డా॥కేశవులు గారు కూడా పడాల్సి వచ్చింది. ఆ వివరాలన్నీ ఈ గ్రంథం మూడవ అధ్యాయంలో తెలిపారు. పల్లెటూళ్ళలో పరిశోధకులను ఆదరించేవాళ్ళూ, పాటలు పాడటానికి డబ్బులడిగేవాళ్ళతో ఎదురైన అనుభవాలను కృతజ్ఞతాపూర్వకంగా పేర్లతో సహా వివరించారు. క్షేత్ర పర్యటన అనుభవాలతో నదులు ప్రవహించే ప్రాంతాల్లో కాలువలు ఉండటం వల్ల అక్కడా, అలాగే దట్టమైన అటవీ ప్రాంతాల్లోనూ మోటకొట్టే వాళ్ళు చాలా అరుదనీ కనుగొన్నారు. మోట తయారీలో వడ్డెర కులస్థుల పాత్ర ఉన్నా, దాన్ని కొట్టేవాళ్ళలో మాత్రం మాదిగలు, మాలలే అధికమని గుర్తించారు.

వ్యవసాయానికి నీటి వనరులు చాలా ముఖ్యం. ఆ వనరుల్ని బావుల ద్వారా పొలంలోకి తోడుకొనేందుకు రైతులు పాటించే రకరకాల పద్ధతుల్లో మోటకొట్టడం ఒకటి. మోట కొడుతూ స్త్రీ పురుషులు పాడుకొనే పాటల్నే మోట పాటలని అంటారు. ఈ మోట

పాటల్లో కనిపించే వివిధ సాంస్కృతిక అంశాలను సోదాహరణంగా విశ్లేషించారు. మూడు ప్రధానమైన అధ్యాయాలుగా కొనసాగిన ఈ పరిశోధన గ్రంథంలో పూర్వ పరిశోధనల ఉటంకింపులకంటే పరిశోధకుడిగా తాను సేకరించిన పాటల విశ్లేషణే ముఖ్యంగా కనిపిస్తుంది.

మహబూబ్ నగర్ జిల్లా స్వరూప స్వభావాల్ని అవసరమైనంత మేరకే వివరించి, ఆ భౌగోళిక పరిసరాలు ఈ ప్రాంత ప్రజలపై కలిగించిన ప్రభావాన్ని విస్మరించకుండా మోట పాటల్ని సోదాహరణంగా పరిశోధకుడు విశ్లేషించడం అభినందనీయం. పరిశోధకుడు నిరంతరం తన పరిధిని గుర్తెరిగిన తీరు పరిశోధకులకు ఆదర్శనీయం! మహబూబ్ నగర్ జిల్లాకి పాలమూరు జిల్లా అనే పేరుంది. నేటికీ చాలా మంది పాలమూరు జిల్లాగానే దాన్ని పిలుస్తుంటారు. ఆ జిల్లాలోని వివిధ ప్రాంతాలను కలిపి "మండలం' అని పిలవడం కూడా అక్కడక్కడా వినిపిస్తుంది. ఈ పరిశోధనలో కూడా పాలమూరు జిల్లా అనీ, పాలమూరు మండలం అనీ అక్కడక్కడా పేర్కొనడం గమనించవచ్చు. అయితే, రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలను విభజించి చూపడంలో తనదైన ముద్రవేసుకొనే ప్రయత్నం కనిపిస్తుంది.

మోట పాటల్లో కనిపించే బాణీలను, భాషను విశ్లేషిస్తూ పరిశోధకుడు "*తెలంగాణాలో ప్రతి జిల్లాలోనూ మోట విధానం ఉంది. భాషలో యాస ఉన్నా, భావంలో బాణీలో తేడా లేదు. తెలంగాణా జిల్లాలు నైజాం పరిపాలనలో ఉండటం వల్ల నాటి పాలకుల ప్రభావం మోట పాటల్లో కూడా కనిపిస్తుంది*"అని వ్యాఖ్యానించారు. దీని ద్వారా రాష్ట్రాన్ని, దానిలో భౌగోళిక వ్యత్యాసాలను బట్టి కళింగాంధ్ర, మధ్యాంధ్ర, తెలంగాణ, రాయలసీమ ప్రాంతాలుగా మన భాషాశాస్త్రవేత్తలు చేసిన విభజన ప్రకారం కూడా పరిశోధకుడు ఈ పాటల్ని విశ్లేషించే ప్రయత్నం చేశారని తెలుస్తుంది. అలావిభిన్న ప్రాంతాల్ని తులనాత్మకంగా చూసినప్పుడు మాత్రమే ఏదైనా ఒక ప్రాంతం లేదా ఒక జిల్లాలో కనిపించే ప్రత్యేకతల్ని శాస్త్రీయంగా గుర్తించగలుగుతాం. మోట పాటల చారిత్రక పరిణామాన్ని పేర్కొంటూ ఆధునిక శాస్త్ర, సాంకేతిక రంగాలలో సాధించిన వైజ్ఞానిక ప్రగతి వల్ల మోట కొట్టే స్థానంలో బోరులు రావడం జరిగిందని, నాటి అవసరాలు మోటకొట్టే అవసరాన్ని కలిగించడం వల్ల పల్లె ప్రజల సహజ కవిత్వం పాటల రూపంలో నిలబడిందంటారు పరిశోధకుడు.

మోట పాటల్లో లయానుగుణంగా కనిపించే మాత్రా ఛందస్సుని వివరించారు. గురజాడ అప్పారావు తన ముత్యాల సరాలు మోట పాటల్లోని మాత్రాఛందస్సుని అతనికి

అనుగుణంగా మార్చుకున్నాడని పరిశోధకుడు ఒక ప్రతిపాదన చేస్తున్నారు. దీన్ని లోతుగా పరిశీలించవలసి ఉంది.

మోటపాటల్లో మోటు సరసం ఎక్కువగా కనిపిస్తుంది. వృత్తిని బట్టి జానపదుల మనస్తత్వం వ్యక్తమవుతుందని పరిశోధకుడి విశ్లేషణ. ఆ మోటు సరసమే వారి సంభాషణల్లోనూ, పాటల్లోనూ ప్రతిఫలిస్తుందని సోదాహరణంగా వివరిస్తున్నారు. ఈ పాటల్లో కనిపించే రాయలేని మాటల్ని కూడా పరిశోధకుడు లిఖితరూపంలో అందించారు. అది బూతులాగే అనిపిస్తుంది. బూతు గురించి మాట్లాడేవాళ్ళు కొన్ని సమయ, సందర్భాల్లో గుర్తుంచుకోవాలని ఇప్పటికే దిగంబర, దళిత, స్త్రీవాద సాహిత్య చర్చల్లో సాహితీవేత్తలు భిన్నాభిప్రాయాల్ని వ్యక్తం చేశారు. నిజానికి 'బూతు' అనేది అప్రయత్నంగా వెలువడేది కాదు. అది ఉద్దేశపూర్వకంగా వెలువరిస్తుంటారు. జానపదులు తమ నిత్యజీవితంలో అప్రయత్నంగానే "కొన్ని" మాటల్ని వాడేస్తుంటారు. వాటిని అదే కుటుంబంలో ఉన్న చదువుకున్న వాళ్ళకి బూతులుగా కనిపిస్తాయి. మిగిలిన వాళ్ళకు అవి బూతులుగా కనిపించవు. అవి సర్వసాధారణంగా మాట్లాడుకునే మాటలే అన్నట్లు ఉంటాయి. సంస్కృతంలో ప్రయోగించిన కొన్ని పదాలను తెలుగులో అదే అర్థంలో ప్రయోగించలేం. ఈ పరిశోధనలో అలాంటి ప్రయోగాలు కనిపిస్తున్నాయి! దీన్ని పల్లె సహజ సౌందర్యంగా భావించాలేమో!మొత్తం మీద ఈ పరిశోధనలో మోట పాటల్లోని సాంస్కృ తిక జీవనాన్ని అనేక పార్శ్వాల్లో విశ్లేషించిన డా॥బూర్గుల కేశవులుగారు అభినందనీయులు!

*("మహబూబునగరు జిల్లా మోట పాటలు",*
*ఎం.ఫిల్., పరిశోధన గ్రంథం, డా॥బూర్గుల కేశవులు,*
*2010, శ్రీ ఉదయ్ ప్రింటర్స్, హైదరాబాదు)*

★★★

# పీడిత వర్గచైతన్య కిరణాలు

9 మార్చి 1997:హైదరాబాదులో ప్రెస్ క్లబ్‌లో ఒక సాహితీ సభ జరుగుతోంది. కొత్తపల్లి రవిబాబు, దివికుమార్, శ్రీహరి, లక్ష్మి గార్లు తదితరులందరితో కలివిడిగా తిరుగుతున్న ఒకాయనపై నా దృష్టి కేంద్రీకృతమవుతోంది. ఆయన చేతిలో చాలా పుస్తకాలున్నాయి. ఆయన చెక్కు మీద సంతకం పెట్టినట్లు రాస్తూ వాటిని చాలా మందికిస్తున్నారు. ఇంతలో ఆయన్ని నాకు శ్రీహరిగారనుకుంటాను పరిచయం చేశారు. ఆయన నన్ను నవ్వుతూ పరిచయం చేసుకున్నారు.చేతిలో ఉన్న పుస్తకంపై ఓ సంతకం పెట్టి నాకూ ఒకటి ఇచ్చారు. ఆ పుస్తకం పేరు *"జిజ్ఞాస తరంగాలు"*. రచయిత పేరు వి.కామేశ్వరరావు. పుస్తకం రాసింది తానేనని పరిచయం చేసుకున్నారు. పుస్తకాన్ని కాసేపు అటూ ఇటూ తిప్పి చూశాను. లోనేముందో అనే "జిజ్ఞాస" తోను చూశాను. అది వ్యాసాల పుస్తకం. అవీ సుదీర్ఘమైన వ్యాసాలు కాదు. వెంటనే చదవాలనిపించే శీర్శికలతో ఉన్న వ్యాసాలు. హైపోథీసిస్, థీసిస్‌లతో బుర్ర వేడెక్కి పోయేవీ కాదన్నట్లనిపించాయి.

అప్పుడప్పుడే బాల్యాన్ని విడిచి యౌవ్వనంలో అడుగుపెట్టిన వయసు కాబట్టేమో ఆ వ్యాసాలు నాకు బాగా నచ్చాయి. అక్కడక్కడా ఖాళీ స్థలంలో డా.బి.ఆర్. అంబేద్కర్, బుద్ధుడు, భగత్‌సింగ్, సుత్తీ, కొడవలి, మేడే పోరాట దృశ్యాలు... ఇలా ఆ పుస్తకాన్ని చాలా ఆకర్షణీయంగా ప్రచురించారు. వీటన్నింటికంటే పుస్తకానికి అట్ట వెనుక వేసిన చిత్రం మరింత సందేశాత్మకంగా ఉందనిపించింది. అది ఒక కార్మికుడు ఉలితో చెక్కుకుంటున్నశిల్పం. తన నడుం పై భాగం మాత్రమే కనిపిస్తుంది. మిగతా భాగమంతా రాళ్ళుతో కప్పేసి ఉంటుంది. సర్వత్రాబంధించబడినట్లుంది. ఆ చిత్రం నాకు చాలా గమ్మత్తుగా అనిపించినా, దానిలో గొప్ప ప్రతీకాత్మక సందేశం ఉందని కూడా అనిపించింది. ఇంటికొచ్చిన వెంటనే ఆ వ్యాసాలు చదివేసి, నా పర్శనల్ లైబ్రరీలో భద్రంగా పెట్టేశాను.

? డిసెంబరు, 2009:యాదృచ్ఛికంగా కామేశ్వరరావు గారిని శ్రీహరి, లక్ష్మి గార్ల ద్వారానే మళ్ళీ కలిశాను. ఇంటర్నెట్‌లో నా సొంత బ్లాగు చూసి, వెబ్ సైట్ పెట్టేలోగా, వాళ్ళు చేసే సామాజిక కార్యక్రమాల్ని తాత్కాలికంగా ఓ బ్లాగులో పెట్టే ఆలోచనతో నాదగ్గరకొచ్చారు. కామేశ్వరరావు గారింటి దగ్గర నెట్ కనెక్షన్ ఉండటం వల్ల ఆయన ఇంటికి వెళ్దామన్నారు. అలా ఈసారి ఆయన ఇంటిలోనే కలిశాను. ఆయన ఇంటిలో నన్ను రెండంశాలు బాగా ఆకర్షించాయి.

మొదటిది– ఆయనకున్న లైబ్రరీ!

రెండోది– ఆయనింటిలో కనిపించే బుద్ధుడి చిత్రపటం!!

ఆయన ఒక రైల్వే ఎంప్లాయని, అప్పుడప్పుడూ సమాజంలో జరిగే అన్యాయాల్ని, అక్రమాల్ని చూసి మనసు వికలమైనప్పుడు తనకు కలిగిన స్పందనను పత్రికల్లో ఉత్తరాలు, చిన్న చిన్న వ్యాసాలుగా రాస్తుంటానని పరిచయం చేసుకున్నది గుర్తొచ్చింది. ఆయన ఆ పుస్తకాన్ని పున: ప్రచురించాలనుకుంటున్నానని, అభిప్రాయం రాసిమ్మన్నారు. ఆ పుస్తకం ఉందా? లేక పోతే తన దగ్గరున్న కాపీ ఇస్తానన్నారు. నా దగ్గర ఉందని చెప్పాను.

కామేశ్వర రావుగారు ఒక రోజు మా ఇంటికొచ్చారు. చేతిలో *రైల్‌శక్తి* మాసపత్రిక రెండు పాత సంచికలు తీసుకొచ్చారు. అవి 2000 ఏప్రిల్ – మే నెల సంచికల్ని కలిపి ప్రత్యేక సంచికగా వేసింది ఒకటి. డిసెంబర్ 2000 జనవరి 2001 మరో సంచిక. ఆ పత్రికకు కామేశ్వరరావు గారు సంపాదకులని అప్పుడే తెలిసింది. రెండు పత్రికల ముఖ చిత్రాలు కార్మిక చైతన్యాన్ని ఉద్దీప్తం చేసేలా ఉన్నాయి.

*రైల్ శక్తి* పత్రికలో మార్క్సిస్టు భావాలతో పాటు డా॥ బి.ఆర్.అంబేద్కర్ భావాలను వారి ఫోటోలను ప్రచురించారు. కార్మికులకు సంబంధించిన ఇరువురి భావాలను అందించే ప్రయత్నం చేశారు. పత్రికలో సంపాదకీయాలు కార్మికులకు సంబంధించిన చారిత్రక విషయాలను అందిస్తూనే, సమకాలీన సమస్యలతో ముడిపెట్టి దిశా నిర్దేశం చేసేలా ఉన్నాయి. ఒక పత్రికలో పెరుగుతున్న ధరల పట్టికను వేశారు. వాటినిప్పుడు చూస్తే పెరుగుతున్న ధరల తీరు తెన్నులకు ఆశ్చర్యం కలగక మానదు. 1980లో వంటగ్యాస్ 58.45 రూపాయలు ఉండగా అది 2000వ సంవత్సరం వచ్చేసరికి 216.35 రూపాయలైయ్యింది. అలాగే 1986 చక్కెర ధర 4.80 రూపాయలు ఉండగా 2000వ సంవత్సరం వచ్చేసరికి 13.00 రూపాయలైంది. వాటిని నేటి ధరలతో పోల్చుకుంటే ఆశ్చర్యం కాకుండా వుంటుందా? కార్మికులకు కావలసిన చక్కని విషయాలను అందిస్తూ ఆ పత్రికను

నడిపారు. ఇంతకీ అసలు విషయం ఏమిటంటే, *"జిజ్ఞాస తరంగాలు"* గురించి రాయమంటే ఏవేవో రాస్తున్నానేమో కదూ! రైలు ప్రమాదాల గురించి రకరకాల హైపోథీసిస్సులు చేసే వారు అనుభవంతో చెప్పే మాటల గురించి ఆలోచిస్తే బాగుంటుందని కామేశ్వరరావు గారు రాసిన ఒక వ్యాసాన్ని బట్టి తెలుస్తుంది. ట్రాక్‌లపై నిరంతర నిఘా ఉంచి ప్రమాదాలను నివారించడానికి నియమించబడిన ట్రాక్‌మెన్‌లతో పై అధికారులు ఇళ్ళల్లో పని చేయించుకుంటు, వారి విధులను సక్రమంగా నిర్వహించనివ్వడం లేదని, దాని వల్ల ప్రమాదాలతో పాటు, ప్రయాణికులపై భారాన్ని కూడా మోపుతున్నారని వివరిస్తున్నారు. ఇటువంటి పనులు చాలా సంస్థల్లో జరుగుతున్నా చూసీ చూడనట్లు వదిలేయడం వల్ల అనేక అనర్థాలు కలుగుతున్నాయి. వీరి వ్యాసాల్లో ఉరిశిక్ష గురించి భిన్నాభిప్రాయాలున్నట్లు అనిపిస్తుంది. రాసేటప్పుడున్న ఎమోషన్స్ ని పరిగణనలోకి తీసుకుని పరిశీలిస్తే, ఉరిశిక్ష ఒక అమానుషమైన శిక్ష అని అంత కఠినమైన శిక్షలను కొన్ని సందర్భాల్లో ఉండటం తప్పు కాదేమో అనే అభిప్రాయానికి అది ఒక స్పందనగా చూడాలి. అందుకనే దళితులు, పీడితులు, స్త్రీలపై జరుగుతున్న హత్యాచారాలు, అత్యాచారాలను ప్రభుత్వం నియంత్రించలేనప్పుడు,వాళ్ళకి ఆయుధాలివ్వాలని అడగడంలో న్యాయం ఉందంటున్నారు.

అంబేద్కర్ గురించి కామేశ్వరరావు గారు వ్యక్తం చేసిన అభిప్రాయాలను చూస్తే, ఈయన్ని అంబేద్కరిస్టు అనుకుంటారు. కానీ, అన్ని వ్యాసాలును పరిశీలిస్తే కుల, మత నిర్మూలన జరగాలనే ఆకాంక్ష కనిపిస్తుంది. అంతిమంగా వర్గపోరాటం తప్పదనే నిర్ణయం ప్రకటిస్తున్నారని అవగాహన కలుగుతుంది. బాల్యం పట్ల రచయిత ప్రతిపాదించిన విషయాలు పరిశీలించాల్సిన అవసరం ఎంతో ఉంది. చక్కని శైలిలో రాసిన ఈ వ్యాసాలు సామాజిక చైతన్యానికి గొప్ప ప్రేరణనిస్తాయనే నేను నమ్ముతున్నాను. పుస్తక రచయిత కామేశ్వరరావు గారికి నా శుభాకాంక్షలు.

*(జిజ్ఞాస తరంగాలు, వ్యాసాల సంపుటి,*
*వేల్పూరి కామేశ్వరరావు, సృజన ప్రచురణ హైదరాబాద్, 2010)*

★★★

# ప్రాంతీయ చైతన్య కవిత్వం

మిత్రుడు ఆల్సి నాగేశ్వరరావు నా దగ్గర ఎం.ఫిల్., చేశాడు. ఎం.ఏ. నుండీ సమకాలీన సాహిత్యం పట్ల ఆసక్తిని ప్రదర్శించే నాగేశ్వరరావు సాహిత్యంలో సామాజిక ఉద్యమాల ప్రతిఫలనకు సంబంధించిన పరిశోధన చేయాలనుకునేవాడు. ప్రస్తుతం రాష్ట్రవ్యాప్తంగా "ప్రాంతీయవాదం" పట్ల చర్చ జరుగుతోంది. దీన్ని సాహితీవేత్తలు ఎలా చూస్తున్నారని పరిశీలించాలనుకున్నాడు. సమకాలీన సమాజాన్ని సాహిత్యం ఎంతవరకు ప్రతిఫలిస్తుందో గమనించే ప్రయత్నం చేస్తానన్నాడు. అతని అభిరుచికి అనుగుణంగా *"కోస్తాంధ్ర కవిత్వంలో ప్రాంతీయ చైతన్యం"* అనే శీర్షికతో తన పరిశోధన కొనసాగించాడు. దీన్నంతా పరిశీలించాలంటే తనకున్న పరిశోధన కాలం సరిపోదని గుర్తించి, 2000 నుండి 2010 వరకు వచ్చిన కవిత్వాన్ని, దానిలో మళ్ళీ ప్రాతినిధ్యం వహించగలవనుకున్న వాటిని మాత్రమే స్వీకరించాడు. పరిశోధన చేస్తున్నప్పుడు ఎం.ఫిల్.,కి పదేండ్ల కవిత్వాన్ని తీసుకోనవసరం లేదని, ఒక కవిని లేదా ఒక బృహత్తర కవితాసంకలనాన్ని లేదా కవితాసంపుటిని తీసుకున్నా దాన్ని లోతుగా పరిశీలించడానికి సరిపోతుందని భావించాడు. అయితే, అప్పటికే ఒకయేడాదిలో ఆరు నెలలు కోర్సు వర్కుకీ, మరో ఆరునెలల్లో దీన్నీ పూర్తిచేసే క్రమంలో కేవలం ఆరునెలలు మాత్రమే సమయం ఉందనీ, శీర్షిక రిజస్టరైపోవడం వల్ల పదేండ్లలో వచ్చిన ప్రాంతీయ ముద్ర బలంగా కనిపించే కవితాసంకలనం / సంపుటిల్ని మాత్రమే స్వీకరించవలసి వచ్చింది. ఈ పరిమితుల్ని గమనించినప్పుడు నాగేశ్వరరావు చాలా కృషి చేశాడని చెప్పకతప్పదు. తాను తీసుకున్న కవితల సారాంశ విశ్లేషణతోనే సరిపెట్టేయకుండా సైద్ధాంతిక మూలాల్ని తడిమే ప్రయత్నం చేశాడు.

మొదటి అధ్యాయం *"కోస్తాంధ్ర ప్రాచీన సాహిత్యం – చరిత్ర"*లో కోస్తాంధ్ర భౌగోళిక స్వరూప, స్వభావాలతో పాటు, పాలకుల్ని, ఆయా కాలాల్లో వచ్చిన సాహిత్యాన్ని,

పండగల్ని వివరించి, రాబోయే అధ్యాయాలకు చక్కని నేపథ్యాన్ని సమకూర్చాడు. రెండో అధ్యాయంలో *"కోస్తాంధ్ర సాహిత్యంలో ప్రాంతీయ చైతన్య నేపథ్యాన్ని"* వివరించాడు. అస్తిత్వ ఉద్యమ చైతన్యంలో భాగంగా కోస్తా ప్రాంతంలో ప్రాంతీయ చైతన్యం కనిపిస్తుందని పరిశోధకుడు వివరించాడు. మూడవ అధ్యాయం *'కోస్తాంధ్రలో ప్రాంతీయ చైతన్యం–భావనలు"* లో సిద్ధాంతాన్ని వివరిస్తూనే, ఈ ప్రాంతంలో వచ్చిన వచన కవిత్వాన్ని సోదాహరణంగా వివరించాడు. సాంస్కృతిక ప్రాంతీయ చైతన్యం ఈ ప్రాంతంలో కనిపిస్తుందని పరిశోధకుడు విశ్లేషించాడు.

ప్రాంతీయచైతన్యాన్ని సైద్ధాంతికంగా వివరించిన ఈ అధ్యాయం పరిశోధకుడి అధ్యయనాన్ని వివరిస్తుంది. "ఏదైనా ప్రాంతంలోని ఉన్న సమస్యల పట్ల ఆ ప్రాంతానికి చెందిన వారు వాటి పట్ల స్పృహకలిగి ఉండటం ప్రాంతీయచైతన్యం అనొచ్చు" అంటూనే, పూర్వ పరిశోధకుల అభిప్రాయాల్ని కూడా స్వీకరించాడు.

*"తన చుట్టూ ఉన్న ప్రపంచవస్తుగత వాస్తవికతను ప్రతిబింబించే ఉన్నత రూపమే చైతన్యం. ఆ చైతన్యం కవి ప్రాంతానికి సంబంధించినదైతే దాన్ని ప్రాంతీయ చైతన్యం అంటారు"* అని సుంకిరెడ్డి నారాయణరెడ్డి అభిప్రాయపడ్డారు.

"ఒక ప్రాంతంలో సామాజిక, ఆర్థిక, రాజకీయ అభివృద్ధిలో అసమానతలతో వెనుకబాటుతనంతో ఉన్నప్పుడు వివక్షకు గురవుతున్నప్పుడు పుట్టేదే ప్రాంతీయ చైతన్యం" అని చలపాక ప్రకాశ్ అన్నారు.

"మానవుని సమష్టి జీవన విధానంలో ఒక్కొక్క ప్రాంతానికి ఒక్కొక్క విలక్షణమైన సాంస్కృతికమార్గం స్థిరపడుతుంది. భాష, కుటుంబం, వృత్తులు పరస్పర అనుబంధాలు ఒకతీరులో కొనసాగుతూ ఉంటై. విభిన్న లక్షణాలూ ఉంటై. వీటిని గుర్తించడమే ప్రాంతీయచైతన్యాన్ని గుర్తించడం. ఒక ప్రాంతానికీ మరొక ప్రాంతానికీ మధ్య జరిగే దోపిడీ సంఘర్షణల్ని కూడా ప్రాంతీయ చైతన్యంగా గుర్తించాలి" అని అద్దేపల్లి రామమోహన్‌రావు వివరించారు.

వీటన్నింటినీ పరిశోధకుడు సేకరించిన అభిప్రాయాలు. వాటిని తన సిద్ధాంతగ్రంథంలో పెట్టాడు. ప్రాంతీయచైతన్యంపై పరిశోధన చేసిన డా॥దార్ల రవికుమార్ సిద్ధాంతగ్రంథం"ఆధునిక తెలుగు కథల్లో ప్రాంతీయచైతన్యం"నుండి ప్రాంతీయచైతన్య భావనలను తీసుకున్నాడు. దాన్ని దాచకుండా చక్కగా తనపరిశోధనలో పేర్కొనడం పరిశోధకుని నిజాయితీని తెలుపుతుంది. నాల్గవ అధ్యాయం *"కోస్తాంధ్రలో వెలువడిన*

*కవిత్వం– ప్రాంతీయ చైతన్యం'*లో 2000 నుండి 2010 వరకు కోస్తాంధ్ర ప్రాంతంలో వచ్చిన తెలుగు వచన కవిత్వంలో కనిపించే ప్రాంతీయ చైతన్యాన్ని విశ్లేషించాడు. ఐదవ అధ్యాయం '*'కోస్తాంధ్రలో ప్రాంతీయ చైతన్య కవిత్వం – వస్తు, శిల్ప సమన్వయం"*లో సామాజిక చైతన్యం కోసం రాసే కవిత్వం సరళమైన పదజాలంతో వ్యక్తమైందని పేర్కొన్నాడు. భౌగోళిక సరిహద్దుల్ని నిర్ణయించుకోవడమే ప్రాంతీయ చైతన్యం కానక్కర్లేదనీ, తమ ప్రాంత సాంస్కృతిక వారసత్వాన్ని కాపాడుకొనే దిశగా కూడా ప్రాంతీయ చైతన్యం ఉంటుందనీ, దానికి అనుగుణంగానే శిల్పం రూపొందిందని సమన్వయించాడు.

ప్రపంచీకరణ వల్ల సమాజంలో ఎదురౌతున్న ఆర్థిక అసమానతలు అన్ని ప్రాంతాల మానవుల్నీ అనుమానించుకొనేలా చేశాయనీ, దీనికి అగ్రరాజ్యాల ఆధిపత్యమే కారణమనీ, ఈ పరిస్థితుల్ని వివరిస్తూ కవులు కూడా తమ వంతు బాధ్యత నెరవేర్చడానికి ప్రయత్నించడంలో భాగంగానే కోస్తాంధ్ర కవుల చైతన్యాన్ని చూడాలని సమన్వయించాడు. ఈ అంశంపై వివిధ కవుల్ని కలిసి సమాచారాన్ని సేకరించడమే కాకుండా, క్షేత్రపర్యటన చేసి కవులు, విమర్శకుల ఇంటర్వ్యూలను అనుబంధంలో పెట్టాడు. ఒక డాక్టరేట్ డిగ్రీకి కావలసిన నేపథ్యాన్నీ, కృషినీ ఈ పుస్తకంలో పరిశోధకుడు పొందుపరిచాడు. దీనిలో కొన్ని స్టేట్‌మెంట్స్ ఉన్నాయి. మరికొన్ని చర్చనీయాంశాలున్నాయి. కాలం, తీసుకొన్న అంశం, కాల పరిమితుల దృష్ట్యా పరిశోధకుని కృషిని అభినందించాల్సిందే.

విశ్వవిద్యాలయాల్లో డిగ్రీల కోసం సమర్పించే పరిశోధనల్ని ప్రచురించు కోవడానికి భయపడే ఈ కాలంలో, ఇంత చిన్న వయసులోనే తన ఎం.ఫిల్., పరిశోధనను గ్రంథరూపంలోకి తీసుకొస్తున్న మిత్రుడు నాగేశ్వరరావుకి నా శుభాకాంక్షలు తెలియ జేస్తున్నాను. అలాగే ముందు ముందు ఈ రంగంలో తన కృషిని కొనసాగించాల్సిందిగా సూచిస్తున్నాను.

*(కోస్తాంధ్ర కవిత్వంలో ప్రాంతీయ చైతన్యం (2000–2010),*
*ఎం.ఫిల్., పరిశోధన గ్రంథం, ఆల్లి నాగేశ్వరరావు,*
*రమ్యభారతి సాహిత్య త్రైమాసిక పత్రిక ప్రచురణలు,*
*విజయవాడ. డిసెంబరు, 2012)*

★★★

# అభినందనలు

మిత్రుడు డా॥ఈతకోట ఈశ్వరరావు హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీ తెలుగుశాఖలో ఎం.ఏ., చేశాడు. వినయం, కష్టపడేతత్వం, నేర్చుకోవాలనే తపన ఉన్నవాడు. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంలో ఎం.ఫిల్., చేసి అక్కడే డాక్టరేట్ కూడా పొందాడు. తాను ఎం.ఫిల్., చేసిన *"బోయి భీమన్న, గిరీష్ కర్నాడ్ నాటకాలు: పౌరాణిక దృక్పథం"* గ్రంథాన్ని ప్రచురిస్తూ అభినందన వాక్యాలు రాయమన్నాడు. ఈ పరిశోధనకు ఆచార్య కె.సంజీవరావు (శిఖామణి)గారు పర్యవేక్షకులుగా వ్యవహరించారు. బోయి భీమన్న (1911–2005) గారు రాసిన 'రాగవాశిష్ఠం(1959) నాటకంపై నేను గతంలో రాసిన నా వ్యాసం గుర్తొచ్చింది. భీమన్నగారు 'ఆదికవి వాల్మీకి'(1970) తోపాటు 2000 వ సంవత్సరంలో ప్రచురితమైన 'వేదవ్యాసుడు' నాటకాలన్నీ పౌరాణికేతివృత్తంతో వచ్చినవే. భీమన్నగారు 'దళిత పదాన్ని ప్రయోగించడానికంటే హరిజనులనే పదాన్ని ప్రయోగించడానికే మొగ్గుచూపించేవారు. 'హరిజనులు ఆర్యులే' అనేది ఆయన సిద్ధాంతం. ఈ తాత్త్విక ధోరణే ఆయన రాసిన పౌరాణిక నాటకాల్లో కనిపిస్తుంది. కానీ, నాటకాన్నీ రసవంతం చేయడమనే విద్య ఆయనకు బాగా తెలుసు. భీమన్న గారి పౌరాణిక నాటకాలతో పాటు *'పాలేరు'* (1938) వంటి ప్రసిద్ధనాటికలు, నాటకాల్ని కూడా ఈ గ్రంథంలో పరిశోధకుడు పరిచయం చేయడం బాగుంది.

కన్నడ సాహిత్యంలో పౌరాణికేతివృత్తాల్ని తీసుకొని ప్రయోగాత్మకంగా నాటకాలు రాసిన గిరీశ్ కర్నాడ్ *'యయాతి'* (1961),*'హయవదన'*(1971), ఏకాంకిక *'మానిషాద*(1964), *నాగమండలం* (1988 ), *అగ్ని మత్తు మళె* (1995) మొదలైన పౌరాణిక నాటకాలతో పాటు *తుగ్లక్* (1964 ), *బలి* (1980 ), *తలదండం* (1990)

వంటి ప్రయోగాత్మక నాటకాలను కూడా పరిచయం చేశాడు. గిరీష్ కర్నాడ్ *'ఒడకలు బింబ'*(2006) పేరుతో రాసిన నాటకం హిందీలో *'బికరేబింబ్'* గా వచ్చింది. గొప్ప ప్రయోగాత్మక నాటకం. దీన్ని హైదరాబాదు సెంట్రల్ యూనివర్సిటీలో ప్రదర్శించినప్పుడు నేను చూశాను.

పరిశోధకుడు, భీమన్న-గిరీష్ కర్నాడ్ పౌరాణిక నాటకాల్లోని ముఖ్యాంశాల్ని ఐదో అధ్యాయంలో విశ్లేషించాడు. తీసుకున్న ఇతివృత్తం పౌరాణికమైనా సమకాలీన సమాజాన్ని ఆ యా పాత్రల ద్వారా పలికించడం రచయితల్లో ఉండే సామాజిక స్పృహకు నిదర్శనమనే ప్రతిపాదన చేశాడు. ఇరువురు నాటకకర్తలూ ప్రఖ్యాతమైన ఇతివృత్తాల్ని తీసుకొని రసవంతంగా నాటకాల్ని రాస్తే, వాటిని తులనాత్మకంగా విశ్లేషించి మూల రచనలను చదవాలనే కుతూహలాన్ని కలిగించేలా ఈ పరిశోధన చేశాడు. మూల రచనను పాఠకుడి చేత చదివించేలా ప్రేరేపించడమే నిజమైన పరిశోధన వల్ల కలిగే ఫలితాంశం.

ఇంత మంచి పరిశోధన చేసిన మా మిత్రుడు డా. ఈతకోట ఈశ్వరరావుని మనసారా అభినందిస్తున్నాను. కేవలం ఎం.ఫిల్., పట్టా పొందడంతోనే తన పరిశోధన పూర్తయిపోయిందనుకోకుండా ఇరువురి రచనలను మరింత లోతుగా విశ్లేషించేదిశగా పరిశోధన కొనసాగిస్తే బాగుంటుంది. అలాంటి పరిశోధన చేయగల శక్తి సామర్థ్యాలు పరిశోధకుడిలో ఉన్నాయని నిరూపించే గ్రంథంగా దీన్ని అభివర్ణించవచ్చనిపిస్తుంది. పరిశోధకుణ్ణి,చక్కని పరిశోధన చేయించిన పర్యవేక్షకుడు ఆచార్య కె.సంజీవరావు (శిఖామణి)గార్నీ హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

*('బోయి భీమన్న, గిరీష్ కర్నాడ్ నాటకాలు: పౌరాణిక దృక్పథం, ఎం.ఫిల్., పరిశోధన వ్యాసం, డా॥ ఈతకోట ఈశ్వరరావు, 2015)*

★★★

# నిష్కళంక మానవుని అన్వేషణ

తెలుగు కవిత్వం అనేక రూపాల్లో వస్తుంది. వీటిలో "రుబాయీ" ఒకటి. ఇది అరబ్బీ, పారశీక సాహిత్య ప్రభావంతో తెలుగు కవిత్వంలోకి ప్రవేశించింది. "రుబాయీ" అంటే అరబ్బీలో నాలుగవ భాగమని అర్థం. 'రుబాయీ' అనగానే ప్రసిద్ధ కవి ఉమర్ ఖయ్యామ్ (1040–1131) గుర్తుకొస్తారు. ఆయనే దీని పితామహుడు. ఈ రూపంలో తొలిసారిగా తెలుగులో దాశరథి రాశారు. '*'ఆలోచనాలోచనాలు', "ధ్వజమెత్తిన ప్రజ", "నేత్రపద్యం'*'మొదలైన వీరి పుస్తకాల్లో రుబాయీలు ఉన్నాయి. వీరి తర్వాత డా॥సి.నారాయణ రెడ్డి, తిరుమల శ్రీనివాసాచార్య తదితరులు రుబాయీలు రాసిన వారిలో ప్రఖ్యాతులు. ఈ మధ్య కాలంలో మళ్ళీ వీటిని రాస్తున్న వారిలో డా॥ఎండ్లూరి సుధాకర్ తర్వాత మెట్టా నాగేశ్వరరావు కనిపిస్తున్నారు.

ఆధునిక కవులు లక్షణాల కంటే గాఢమైన స్పందనకే ప్రాముఖ్యాన్నిస్తుంటారు. అయినా మినీ కవిత్వం లేదా లఘుకవితల్లో లక్షణాలు కూడా ముఖ్యమనే పరిస్థితీ కనిపిస్తున్నా, వాటిని నూటికి నూరు శాతం పాటిస్తున్నవాళ్ళు అరుదుగానే ఉన్నారు. రుబాయీలలో నాలుగు పాదాలు ఉంటాయి. 1,2,4 పాదాల్లో అంత్య ప్రాస ఉండి, నాలుగవ పాదంలో కవిపేరు వచ్చేలా రాస్తారు. పాదాల్ని మిశ్రాలని, రెండు పాదాలు కలిస్తే షేర్ అనీ, రెండు షేర్లు ఉన్న దాన్ని రుబాయీ అని పిలుస్తుంటారు. నాలుగవ పాదంలో కొంతమంది కవులు తమ నామముద్రను వచ్చేటట్లు వర్ణిస్తుంటారు. దీన్ని 'తఖుల్లస్' అంటారని లక్షణాలు చెప్పిన వాళ్ళున్నారు. మెట్టావారు మాత్రం మూడోపాదంలోఈ లక్షణాన్ని అనుసరించారు.

ఈ లక్షణాలకంటే, మాత్రాఛందస్సు ఉంటే చాలనీ, పఠనాసక్తీ, శ్రవణాసక్తీ కలిగేటట్లు, సామాజిక వస్తువుల్ని తీసుకొని రాసేవాళ్ళున్నారు. మెట్టా వారు చాలా

రుబాయిల్ని మాత్రాఛందస్సు, అంత్యప్రాసలతో వర్ణించారు. ఆ లాక్షణిక చర్చకు నేను వెళ్ళడం లేదు.

మెట్టా నాగేశ్వరరావు గారు రాసిన "రుబాయిలు" అప్పుడప్పుడూ వివిధ పత్రికల్లో చదువుతుండే వాణ్ణి. కలిసినప్పుడల్లా వాటి గురించి మాట్లాడుకునేవాళ్ళం. వ్యాసాలు, వచన కవితల కంటే రుబాయిలే ఎక్కువగా రాస్తున్నారేమో అనిపించింది. ఆ మాట నిజమని ఆయన ప్రచురిస్తున్న రుబాయిల్ని చూస్తే తెలిసింది. ఆయన రాసినవన్నీ పుస్తకంగా వేయడంలేదు. వాటిలో కొన్నింటినే ఇప్పుడు ఇలా మనముందుకి తీసుకొస్తున్నారు. అభిప్రాయం రాయమన్నారు. ఆత్మీయంగా స్పర్శిస్తానన్నాను. తన జీవితంలో ఎదురైన అనేక అటుపోట్లనీ, అనుభవాల్నీ అక్షరీకరించారు. అమ్మ గురించెన్ని సార్లు చెప్పినా, ఎన్ని రూపాల్లో చెప్పినా కొత్తదనమే. అమ్మ గురించే చెప్తున్నా, గుండెల్ని కదిలించేలా... *"కథలెన్నయినా చెప్పుగానీ/వెతలెన్నయినా విప్పుగానీ/అమ్మని అదిలిస్తానంటే మెట్టా/కారణాలెన్నయినా తప్పుబాణీ"* అని ఒక రుబాయిలో రాశారు. చిన్నచిన్న పదాల్లోనే కొండంత భావాల్ని పలికించాడు కవి.

*' కత్తితో పొడిచిన దానికన్నా/ సుత్తితో మోదేసిన దానికన్నా/మాటపోటు తీవ్రమైంది మెట్టా/ దురుసుమాట దుర్వర్తనరా చిన్నా"* ఇలా రుబాయిలన్నింటినీ సమీక్షించుకొంటూపోతే పెద్ద గ్రంథమే అవుతుంది. అది దీనిపై భవిష్యత్తులో పరిశోధన చేసేవాళ్ళు చేస్తారు. మెట్టా వారు రాసిన ఈ రుబాయిలు జీవితాన్నెంతగానో వడబోసిన అనుభవశీలి చెప్తున్నట్లుంటాయి. కొన్ని నీతుల్ని బోధిస్తుంటే, మరికొన్ని షాక్‌కొట్టినట్లుంటాయి. ఇంకొన్ని కొటేషన్లుగా ప్రజలనోళ్ళలో నానుతాయన్నట్లుంటాయి. వీటిని చదువుతున్న పాఠకులకు తమ జీవితాల్లోని ఒడిదుడుకులే ఈ కవి కలంలో కొచ్చాయనిపిస్తాయి.

కవి చైతన్యవంతుడైతే సమకాలీన సమాజాన్నీ, తన జాతి అస్తిత్వాన్నీ మరిచిపోడు. ఈ చైతన్యం ఈ కవిలో స్పష్టంగానే కనిపిస్తుంది. *'కపట వేషధారణ*ని సహించలేని స్వభావం ఈ కవిత్వంలో ప్రతిఫలిస్తుంది. కల్మషరహితమైన మానవుణ్ణి ఆహ్వానిస్తుంది. ఈ కవిత్వం మనువాదభావజాలాన్ని బలంగానే తిరస్కరిస్తూ ఆత్మగౌరవాన్ని నిలబెట్టుకోమనే దృక్పథాన్ని అలవర్చుకోమంటుంది. నిష్కళంక మానవుని కోసం జరిగే కవి అన్వేషణను పాఠకులందరిలోను కలిగిస్తున్న కవి మిత్రుడు మెట్టా నాగేశ్వరరావుగార్ని అభినందిస్తున్నాను.

*(మెట్టామాణిక్యాలు(రుబాయిలు), మెట్టానాగేశ్వరరావు,*
*మెట్టా ప్రచురణలు, బయ్యనగూడెం, 2011)*

★★★

# ఆత్మగౌరవ ప్రతిబింబం!

*"జ్ఞాపకాలు నన్నెంటాడుతున్నాయని*
*చెప్పాలనుకుంటానా*
*అస్సలవి ఉంటేగా!!"*

సైదులు చక్కని అభివ్యక్తి గల కవిత్వం రాస్తుంటాడని చెప్పడానికి ఇదొక చిన్న ఉదాహరణ మాత్రమే! సాధారణంగా కవులు జ్ఞాపకాల గురించి రాస్తుంటారు. కానీ, ఈ కవి ఇంకొంచెం ముందుకెళ్ళి జ్ఞాపకాలను కూడా నాశనం చేసే ఒక భయానకమైన వ్యవస్థ వికృత రూపాన్ని కవిత్వీకరిస్తున్నాడు. సాధారణంగా ఏదైనా సంఘటన జరిగితే చాలా సున్నిత హృదయులు మాత్రమే స్పందిస్తుంటారు. ఆ స్పందనని చాలా మంది వ్యక్తీకరించినా కవి స్థల, కాలాలకు అతీతంగా ఉండే గొప్ప అనుభవాన్ని కలిగిస్తాడు. అలాంటి శక్తి మా మిత్రుడు, కవి సైదులు ఐనాల లో ఉంది. తాను అప్పుడప్పుడూ రాసిన కవితలన్నింటినీ మనకీ పుస్తక రూపంలో రుచి చూపిస్తున్నాడు. కాశ్మీర్ లో జరుగుతున్న మారణ కాండను గురించి రాస్తూ *' బతుకిప్పుడు/రెండు దేశాల మధ్య/ సరిహద్దు రేఖ "* అయ్యిందంటాడు. మనం దేశభక్తి గురించి చిన్నప్పటి నుండీ పాఠాల్ని చదువుకుంటున్నాం. అయినా నేటికీ దేశమంటే మట్టి మాత్రమే కాదు, మనుషులని గట్టిగా చెప్పుకోలేని స్థితిలో ఉన్నాం. దానిక్కారణం మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన పరిస్థితి చాలా ఆందోళనా పూరితమైంది. మతం మనల్ని భారతీయులుగాను, పాకీస్తానీయులుగానూ చీల్చేసింది. దాని ఆనవాళ్ళింకా కాశ్మీర్‌లో కనపడుతున్నాయి. అందుకే దేశభక్తి నేటికీ కవిత్వంలో వస్తువుగానే ఉంది. అయితే దేశభక్తిని కొంతమంది స్వార్థానికి ఉపయోగించుకుంటున్న ధోరణిని ఈ కవి బలంగా తిరస్కరించడంలోనే ఆధునికత కొట్టొచ్చినట్లు కనిపిస్తుంది. దీన్ని దేశభక్తి, దానిపేరుతో జరుగుతున్న మతహింస పట్ల నిరసన విభాగంగా చేర్చవచ్చు.

సమాజంలో అవినీతి,దాన్ని పెంచి పోషించే వారిపట్ల తీవ్ర నిరసనను వ్యక్తం చేసిన కవితలున్నాయి. వీటన్నింటి కంటే ముఖ్యంగా ప్రపంచాన్ని శాసించాలని ప్రయత్నించే అమెరికా విధానాల పట్ల స్పందించాల్సిన రీతిలోనే స్పందించాడు.

*"అమ్మా... అమ్మా... అటు చూడు*
*పెద్ద బూచోడొస్తున్నాడే!*
*వాడా బాబూ*
*వాణ్ణి చూశావా?! కలల్లో కొస్తాడు*
*కంట్లో కారమై కాల్చుకొని తిని*
*పచ్చి రక్తం తాగుతాడు నాయనా'*

అని అమెరికా ఆధిపత్య విధానాల్ని సంభాషణాత్మక శిల్పంలో వర్ణించాడు. ఇక్కడ *"పెద్ద బూచోడు'* అనేది నూతన పదకల్పన. అంటే నియోలాగిజమ్. ప్రపంచ దేశాలన్నింటినీ భయపెట్టే అమెరికా అధినేతగా పోలుస్తున్నాడు. మూర్ఖపు రాజుని ఎవరూ ప్రశ్నించలేని నిస్సహాయ స్థితిలో బట్టల్లేకుండా అత్యంత సన్నని బట్టలు కట్టుకుని ఊరేగుతున్నట్లు భ్రమించే చక్రవర్తి ప్రవర్తనను స్ఫురింపజేసేలా చక్కని శిల్పాన్ని ఎన్నుకున్నాడు. అమెరికా విధానాలే ప్రపంచీకరణ విధానంగా చెలామణీ అవుతుంది. అందు వల్ల చాలా సందర్భాల్లో ప్రపంచీకరణ అంటే అమెరికా విధానాలు, అమెరికా విధానాలంటే ప్రపంచీకరణగా చెప్పుకునే పరిస్థితులున్నాయి. అందుకే అమెరికా ఆధిపత్య విధానాల్ని వ్యతిరేకిస్తున్నాడు కవి. దీన్ని అమెరికా ఆధిపత్యాన్ని వ్యతిరేకించకపోతే జరిగే నష్టాన్ని తెలియజేసే విభాగంగా వింగడించవచ్చు. షెడ్యూల్డు కులాల్లో గల ఉపకులాలకు అందరికీ సమన్యాయాన్ని కోరుతూ సుమారు దశాబ్దకాలం పైగా సాగుతున్న ఉద్యమాన్ని నీరు కార్చే ప్రయత్నం చేస్తున్న వాళ్ళని నిలదీసి అడుగుతున్న కవితలు ఇందులో చాలా బాగున్నాయి. రిజర్వేషన్ల వల్ల అందరికీ న్యాయం జరగాలి. రిజర్వేషన్ వల్ల లబ్ది పొందిన వాళ్ళే మళ్ళీ మళ్ళీ దాని ఫలాల్ని అనుభవించడం వల్ల, అదే వర్గం వారికి ఆ వర్గం వాళ్ళే అన్యాయం చేసినట్లవుతుంది. అది రాజ్యాంగ స్ఫూర్తికే విరుద్ధం. దీని వల్ల ప్రమాదం కూడ వచ్చే అవకాశం కనిపిస్తుంది. రిజర్వేషన్ పొందుతున్న వర్గం పట్ల రిజర్వేషన్ వల్ల నష్టపోతున్నవాళ్ళకు యావత్తు రిజర్వేషన్ల పట్లనే వ్యతిరేకత వస్తుంది. మరోవైపు ద్వేషం గూడు కట్టుకుంటుంది. దీన్ని మేధావులు గుర్తించి రిజర్వేషన్లలో కూడా సంస్కరణలను తీసుకురావాలి. అందుకోసమే ఎస్సీ వర్గీకరణ ఉద్యమం జరుగుతుంది. వర్గీకరణను సమర్థించడం, వర్గీకరణను వ్యతిరేకించే వారినుండి ఉద్యమాన్ని కాపాడుకోవడానికి

కవులు, రచయితలు, కళాకారులు తమ వంతు కృషి చేయాలి. దీనిలో భాగంగానే సైదులు ఈ పుస్తకంలో చాలా బలమైన గొంతుతో వర్గీకరణ ఆవశ్యకతను వర్ణించాడు.

*'మీ ఎత్తుల జిత్తుల్లో*
*మా వాటా ఎగిరిపాయే*
*ఇక్కడ మాత్రం*
*ఏం న్యాయం మిగిలింది?"*

అని వర్గీకరణను వ్యతిరేకించే వర్గాన్ని మాత్రమే అడగడం కేవలం కాదు. యావత్తు న్యాయ, శాసన వ్యవస్థల్నీ నిలదీస్తున్నాడు. అందుకనే " *కలిసి కష్టాల్ని పంచుకోవడమే/ నిజమైన ఐక్యత"* అవుతుందని వర్గీకరణ ఉద్యమ నినాదాన్ని కవిత్వమై పలికించాడు. దీన్ని ఎస్సీ వర్గీకరణ ఉద్యమ సమర్థన,న్యాయాన్ని కాపాడమనే అభ్యర్థన కోణంతో వర్గీకరించవచ్చు. వీటన్నింటికంటే తాను పుట్టి పెరిగిన తెలంగాణ గురించి వర్ణించిన అనేక దృశ్యాలు ప్రతి పాఠకుణ్ణి అర్థం చేస్తాయి. తెలంగాణ పలుకుబడిలో సజీవమైన భాషలో వ్యక్తీరించిన కవితలన్నీ నేటివిటీని మనముందుంచుతాయి.
*వత్తావా మా ఊరికి /దగా పడ్డ తెలంగాణ పల్లెయిది!*

*చిక్కని చీకట్లను కప్పుకొని/ చిగురిస్తున్న మొగ్గల్ని చూస్తూ/ఆకు పచ్చని మొక్కల్లో/హరితాన్ని జుర్రుకొని/హిమోగ్లోబిన్ని ఇంజక్ట్ చేసి/ఎర్రని గులాబీల్ని మొలిపించే /దృశ్యాల్ని చూయిత్తా"* ఇలాంటి కవితలన్నింటినీ తెలంగాణ పలుకుబడి, విషాద దృశ్య సంగమంగా అభివర్ణించవచ్చు. కవికి అనుభూతి అత్యంత ప్రధానం. అది తల్లి, చెల్లి, తాత, ముత్తాత, తండ్రులను, పుట్టి పెరిగిన నేలను, ప్రియురాలినీ,చదువుకున్న విద్యాలయాల్ని, గురువుల్ని ... ఇలాంటి వాటిని వర్ణించేటప్పుడు వ్యక్తమవుతుంది. అది సైదులు కవిత్వం నిండా ప్రవహించింది. ప్రపంచీకరణ నేపథ్యంలో ఊళ్ళు, పట్టణాలు, నగరాల రూపురేఖల్లో ఎన్నో మార్పులొచ్చాయి. వాటిని వర్ణించేటప్పుడు నాలుగు తరాల తన వంశం ఎలా విధ్వంసానికి గురైందో ఎంతో ఆర్ద్రంగా వర్ణించాడు.

*" విస్తరించిన నల్లరోడ్డు*
*నా పై వికృతంగా చూస్తుంది!*
*అంతెత్తుకెదిగిన ఫ్లైఓవర్*
*నా బిత్తర ముఖం చూసి*
*వికటాట్టహాసంగా నవ్వుతోంది*

*ఎటుచూసినా కన్పించని*
*ఆ నల్గురి దృశ్యాల కోసం*
*ఎంత వెతికాయో నాకళ్ళు!"*

రోడ్డు మీద చెప్పులు కుట్టుకునే వాళ్ళలో తన తాత ముత్తాతల్ని చూడ్డం గొప్ప సౌందర్యానికి నిదర్శనం! వీటితో పాటు "*ముసలి ఎద్దు*", "*మరోచరిత్ర లిఖించేంత వరకూ*" "*ఉపాధ్యాయుని ఉత్తరం*' వంటివి ఆత్మీయత పండిన కవితలు. ఇవన్నీ ఆత్మీయ స్పందనల వెల్లువలుగా స్పష్టమవుతున్నాయి.

ఇలా సమకాలీనతను ఒడిసిపట్టుకుని చిక్కని కవిత్వాన్ని రాస్తున్న యువతరం కవుల్లో ఈ కవిది బలమైన గొంతని ఈ కొన్ని కవితా ఖండికలు చూసినా తెలిసిపోతుంది. ఆధునిక కవిత్వం, అదీ వచన కవిత్వం ప్రధానంగా మూడు ధోరణుల్లో ప్రవహిస్తుంది. మొదటిది నిజమైన ఆధునికత్వాన్ని కొనసాగిస్తూ, మానవాతీత శక్తుల కంటే, మానవీయ శక్తులకే అధిక ప్రాధాన్యాన్నిచ్చే దిశగా శాస్త్రీయ దృష్టిని ప్రసరించే మార్గాన్ని కొనసాగించడం. దీనిలో మానవుడు పరాయీకరణకు గురవుతున్న అనేకకోణాల వర్ణనతో పాటు, అవాంఛనీయ ధోరణులను నిరసించడం కనిపిస్తుంది. రెండవది సంప్రదాయాన్ని అవిచ్ఛిన్నంగా మరోరూపాన్ని ఆశ్రయించుకుని వచన కవిత్వంలో ప్రవేశించడం. మూడోది వైయక్తిక అనుభూతులకు ప్రాధాన్యాన్నిచ్చే ప్రయోగవాద ధోరణులు. అలాగని ప్రతి ప్రయోగమూ నిరసించదగినదని కాదు. ప్రయోగం సమాజ ప్రయోజనం కోసం ఉద్దేశించిందైతే అది ఆహ్వానించదగిందే అవుతుంది. ఇలా సమకాలీన వచన కవిత్వాన్ని వింగడించుకుంటే సైదులు కవిత్వం మొదటి ధోరణికి చెందినదవుతుంది.

మొత్తం మీద వస్తు వైవిధ్యాన్నీ, శిల్ప చమత్కారాలలో సమతూకం పాటించి పాఠకుల ముందుకి వస్తున్న మా సైదులు ఐనాల అందరి కవిగా ఆకర్షించగలుగుతాడనే నమ్మకం కలుగుతుంది. ఇంతమంచి కవిత్వం రాస్తున్నందుకు నా మిత్రుణ్ణి మనసారా ఆలింగనం చేసుకుంటున్నాను.

*(వత్తావా మావూరికి'(కవితాసంపుటి),*
*సైదులు ఐనాల, 2015)*

★★★

# ఆవేదన అక్షరమైతే...
# అది హరీష్ కవిత్వం!

సమాజంలో జరుగుతున్న అనేక సంఘటనల పట్ల మిత్రుడు హరీష్ కుమార్ స్పందిస్తుంటాడు. మా విద్యార్థిగా ఈ యువకవిని అత్యంత దగ్గరగా పరిశీలించగలిగే అవకాశం కూడా కలిగింది. తరగతిగదుల్లో పాఠాలు విన్న తర్వాత చర్చల్లో కూడా పాల్గొనేవాడు. అతని ఆలోచనల్లో వాడి, వేడి ఉండేది. రచయితలు చాలామంది అన్ని సమస్యల మీదా రాస్తున్నారు కాని,మా అంధుల గురించెవరూ సరిగ్గా రాయట్లేదన్నాడు."సరిగ్గా" అనడంలో వికలాంగుల్ని సరిగ్గా అర్థం చేసుకోకుండా రాస్తున్నారనీ, వాళ్ళ మానసిక, భౌతిక స్పందనల్ని సమర్థవంతంగా సృజనీకరించలేకపోతున్నారనే భావాలే వ్యక్తమయ్యాయి.

*'మీ అనుభవాల్ని, అనుభూతుల్ని మీలాంటి వాళ్ళే రాస్తే బాగుంటుంది. అందుకు నువ్వే ఎందుకు ప్రయత్నించకూడదు?'* అని ఒకసారి అతనితో అన్నాను.

అప్పుడు హరీష్‌కుమార్ మౌనంగానే ఉండిపోయాడు. ఒక ఆరునెలల తర్వాత లూయిబ్రెయిల్ గురించి ఒక వ్యాసాన్ని రాసిపట్టుకొచ్చాడు. అది వచనంలోనే ఉన్నా, వర్ణనలెక్కువగా కనిపించాయి. కొన్ని వాక్యాలు చదివి వినిపించి నువ్వు కవిత్వం రాయగలవు... ప్రయత్నించమన్నాను. ఇవిగో ఇన్ని కవితలురాశాడు. మీ ప్రేరణ, ప్రోత్సాహంతోనే వీటిని రాసుకున్నానన్నాడు. మీ అభిప్రాయం తెల్పమన్నాడు. కవితల్ని చదివితే హరీష్‌కుమార్‌లో ఆవేదన అక్షరరూపం పొందింది. కొన్ని చోట్ల అగ్నిపర్వతాలు బద్దలైనట్లు, మరికొన్ని చోట్ల అగ్నిపుష్పాలు వికసించినట్లు, ఇంకొన్ని చోట్ల అమృతం చిలికినట్లు, అమృతం ఒలికినట్లు కవిత్వమై బయటకొచ్చాడు. ఇంతచిన్నవయసులో

ఇంతలోతైన భావుకతనెలా సాధించగలిగాడని ఆశ్చర్యపోయాను. అతని ఆవేదనతో మమేకమైయ్యాను. మీరు కూడా ఈ కవిత్వాన్ని చదివితే అంధుల జీవితాల్ని కొత్తవెలుగులో చూడగలుగుతారు. దేవుడికంటే, స్పర్శకు రూపమిచ్చిన తల్లిని, లూయీ బ్రెయిలీని నిత్యం స్మరించుకుంటాడు. వికలాంగుడినని పుట్టిన వెంటనే చంపేయకుండా పెంచిన తల్లిని ఎలాంటి మాటల్తో అభివర్ణించినా తక్కువేనంటాడు. నేను వికలాంగుణ్ణేనంటూ రాసిన కవిత కేవలం శరీరంలోని ఒక అవయవలోపం గురించి మాత్రమే కాదు, మిగతా లోపాలున్నవాళ్ళెలా మానసికక్షోభను అనుభవిస్తారో కూడా అభివర్ణించాడు.

రకరకాల అంగవైకల్యాలతో బతుకుని జయిస్తున్న వారు ప్రత్యేక పాఠశాలల్లోను చదువుకుంటారు. వాళ్ళంతా కలిసిమెలిసి ఆనందంగా సుఖదు:ఖాల్ని పంచుకొంటూ హాస్టల్స్‌లోను జీవిస్తుంటారు. ఇలాంటి అనుభవమంతా ఈ కవిత్వం నిండా కనిపిస్తుంది. ఆ విధంగా వికలాంగుల గురించి ఇందులో ఉన్న అనుభవం స్వీయానుభవానికి సహానుభవం కూడా తోడయ్యింది. ఇతరుల సుఖదు:ఖాల్ని పాఠకుడు లేదా శ్రోత తనదిగా భావించగలిగేటట్లు చేయగలిగితే ఆ కవి సక్సెస్ అయినట్లే. అదే నిజమైన స్పందనను కలిగిస్తుంది. నిజమైన సహృదయుణ్ణి పట్టుకోగలుగుతుంది. నిజమైన అనుభవా న్నిస్తుంది. అది హరీస్‌కుమార్ సాధించే ప్రయత్నం చేశాడు.

అక్కడక్కడా మణిప్రవాళశైలి ఉంది. భవిష్యత్తులో రాయబోయే కవిత్వంలో వస్తువుని కవిత్వం చేయడంతో పాటు, కవిత్వం చేయడంలో భాషాసామర్థ్యాన్నీ గుర్తించగలుగుతాడు. అదిప్పుడిప్పుడే తూకం రాళ్ళేసి తూచే ప్రయత్నం చేయడం అంతసమంజసం కాదనుకుంటాను. అందుకే ఆ ప్రయత్నం చేయట్లేదు. హరీష్ వచనకవిత్వాన్ని , అదీ తన కవిత్వాన్ని సభల్లో చక్కగా 'చూడకుండా' ఆకర్షణీయంగా వినిపిస్తుంటాడు. ఆ చదివేతీరు బాగుంటుంది. పద్యాన్ని చెప్పగలిగినంత సులభంగా వచనకవిత్వాన్ని కంఠస్థం పట్టి వినిపించడం కష్టం. కానీ, హరీష్‌మాత్రం సులువుగా గుర్తుపెట్టుకుంటాడు. దాన్ని యథాతథంగా వినిపిస్తుంటాడు. రాయడమే కాకుండా, రాసినదాన్ని వినిపించగలిగితే ఆ కవిత్వం మరింత శక్తివంతంగా ప్రపంచానికి చేరుతుంది. ఆ రెండింటిలోను శక్తిసామర్థ్యాల్ని ప్రదర్శిస్తున్న మిత్రుడు హరీష్‌కుమార్‌ని అభినందిస్తూ, భవిష్యత్తులో మరింత మంచికవిత్వం రాయాలని ఆకాంక్షిస్తున్నాను.

*(నేనైతే వికలాంగున్నే, కవితా సంపుటి, చిక్క హరీష్ కుమార్,*
*అనిరుద్ ప్రింటర్స్, హైదరాబాద్, మార్చి, 2013)*

★★★

# జీవితం ఓ వసంతమని చెప్పిన కవిత్వం!

రెక్కలు మినీకవితా పితామహుడు యం.కె.సుగమ్‌బాబు గారు నాకు ఓరోజు ఫోను చేసి "మల్లవరపు చిన్నయ్య గారు '*'ఆమని" పేరుతో రెక్కలు కవితాసంపుటిని వేయాలనుకుంటున్నారు. ఆ ప్రతిని మీకు పంపిస్తున్నాను. చదివి మీ అనుభూతిని తెలప*"మన్నారు. అంతకు ముందే సుగమ్‌బాబుగారు తెలుగులో రాసినవీ, ఆంగ్లంలోకి అనువాదమైనవీ కొన్ని చదివాను. వీటితో పాటు ఈ కవితా రూపానికి ప్రసిద్ధవిమర్శకులు డా॥అద్దేపల్లి రామ మోహనరావుగారు చేస్తున్న చక్కని లాక్షణిక సమన్వయాన్నీ గమనిస్తుంటే, చిన్నయ్యగారు రాసిన రెక్కల్లోనూ అంతటి చిక్కదనం ఉందనిపించింది. లోకోక్తుల్ని కూడా రెక్కల్లో ఎంతచక్కగా ఇమడ్చగలుగుతున్నారనిపించినా, అక్కడితోటే ఆగిపోకుండా లోతుగా ఆలోచించమనే లక్షణమేదో మిళితం చేస్తున్నారనిపించింది. రెక్కలు కవితలో పై నాలుగు పాదాల ద్వారా లోకోక్తినిగానీ, జీవితాన్నిగానీ దేన్ని వర్ణిస్తున్నా, కింది రెండు పాదాలే కవి తత్త్వాలై పాఠకుణ్ణి కదిలిస్తుంటాయి. బహుశా ఇదే రెక్కలకున్న బలమనుకుంటున్నాను. దీన్ని మల్లవరపు చిన్నయ్యగారు చాలా వరకూ సాధించగలిగారు."ఆమని" చదివిన తర్వాత '*కవిచెప్పేవన్నీ మనకి తెలిసినవే కదా*' అనీ అనిపిస్తుంది. ఇవి మనజీవితంలో ఎక్కడో ఒకచోట తటస్థించినవే అయ్యుంటాయ్. అలా అనిపించగలిగిన వాటితోనే జీవితసత్యాల్ని చెప్పడం కవి ప్రతిభకు నిదర్శనం.

*"వస్తూ పోతూ*
*పోతూ వస్తూ*
*ఒకరినొకరు*

*కలుస్తూ-*
*కలయికలే*

*శ్వాసలు!"* నేడు కావాల్సిందిదే! నిత్యం కలుస్తూ, మాట్లాడుతూ ఉండే వాళ్ళు, వాళ్ళు మనరక్తసంబంధమైనా, కాకపోయినా వాళ్ళతోనే మనకష్టసుఖాల్ని పంచుకోగలుగుతాం. ఇలాంటి అనుబంధాలకే ఈ కవి అధికప్రాధాన్యాన్నిచ్చారీ "ఆమని" నిండా! జీవితానికి వసంతాల్ని పూయించడమే కదా కవిధ్యేయం! ఈ కవిత్వం నిండా అదే కనిపించింది నాకు! మరొకటి చూద్దాం!

*"మబ్బుల్లో*
*ఇళ్ళు*
*వాననీళ్ళై*
*జారిపోతాయ్-*
*నిలకడైంది*

*నేల!"* పైనున్న నాలుగుపాదాల్లో ఒక అందమైన భావచిత్రం స్ఫురిస్తుంది. చిత్రకారుడికైతే అందమైన బొమ్మను గీయానిపిస్తుంది. మబ్బు స్థిరంగా ఉండదు. అది దాని లక్షణం. ఎటు గాలేస్తే, అటు వెళ్ళిపోతుంది. అక్కడ లేదా దానిమీదెవరైనా ఇళ్ళు కట్టుకుంటారా? వాస్తవిక ప్రపంచంలో జీవించాలంటున్నారు. సత్యం మాత్రమే నిలుస్తుంది. అశాస్త్రీయత నిలవదు. ఊహల్లో విహరించడం కంటే, తన శక్తిసామర్థ్యాల్ని గుర్తెరిగి విజయం వైపు పయనించమని ప్రబోధిస్తున్నారు. అదృష్టం, దురదృష్టమంటూ పనిచేయకుండా ఫలితాన్ని ఆశించడం తగదనే జీవితసత్యం దీనిలో ఉంది. ఇలాంటి తాత్త్వికసత్యాలేన్నో "ఆమని" నిండా ఉన్నాయి. ఇప్పటికే ఈ కవి కొన్ని పుస్తకాల్ని రాసి, రాష్ట్రస్థాయిలో ఇటీవలే కృష్ణశాస్త్రి పురస్కారాన్ని అందుకున్నారు. ఈ కవితా సంపుటి నిండా జీవితం ఉంది. అంతకంటే జీవితంలో నేర్చుకోవాల్సిన పాఠాలున్నాయి. ఇంకా మరింత మంచి కవిత్వం రాయాలని ఆకాంక్షిస్తూ, ఇంతచక్కని, చిక్కని కవిత్వం రాసిన చిన్నయ్యగార్ని అభినందిస్తూ, వారికి నాశుభాకాంక్షలు తెలియజేస్తున్నాను.

*(మల్లవరపు చిన్నయ్య,*
*"ఆమని" కవితా సంపుటి)*

★★★

# చైతన్యవంతమైన పరిశోధన

సెంట్రల్ యూనివర్శిటీలో నేను డాక్టరేట్ చేస్తున్నప్పుడు మా డిపార్టుమెంటులోనే శ్రీమతి పద్మావతిబాయి ఎం.ఫిల్., పరిశోధన చేరారు. మేమిద్దరం ఒకే గైడ్ దగ్గర పరిశోధన చేసేవాళ్ళం. ఆ విధంగా అప్పుడప్పుడూ కలుస్తూ పరిశోధన గురించి చర్చించుకొనేవాళ్ళం.ఆ మాటల సందర్భంలోనే ఆమె గురించి అనేక విషయాలను గ్రహించగలిగే అవకాశం కలిగింది.

అప్పటికే వివాహమై, పిల్లలు ఉన్నా చదువుపట్ల ఆమెకు గల ఆసక్తి వల్ల ఎం.ఫిల్., వరకూ రాగలిగారనుకున్నాను. సర్వసాధారణంగా ప్రతి పురుషుని విజయం వెనుకా ఒక స్త్రీ ప్రోత్సాహం ఉంటుందని అంటూ ఉంటారు. కానీ, పద్మావతిబాయి గారి ఉన్నత విద్య, ఆమె లెక్చరర్‌గా చేరేవరకూ ఆమెకు వెనుక నిలబడి ఎంతో ఆత్మవిశ్వాసం కలిగించిన వ్యక్తి ఆమె భర్త వడ్య పంతులు నాయక్. వీరికి చాలా చిన్నవయసులోనే వివాహం అయిపోయినా, నేటికీ కొత్తవిషయాలను తెలుసుకోవాలనే జిజ్ఞాసతో ఉంటారు. ఉన్నత విద్యను అభ్యసించాలనే ఆరాటం వారిరువురిలో ఎవరితో మాట్లాడినా తెలుస్తుంది. ఆ ఆసక్తి ఫలితమే నేడు శ్రీమతి పద్మావతి బాయి డా॥ కె. పద్మావతి బాయిగా స్వతంత్ర వ్యక్తిత్వంతో నిలవగలిగారు. ఓ కళాశాలలో తెలుగు లెక్చరర్‌గా ఉన్నత విద్యను బోధిస్తూ అందరిమన్ననలనూ పొందగలుగుతున్నారు.

డా॥ కె.పద్మావతిబాయిగారు *"బంజారా గేయాలు-ఒక పరిశీలన"* పేరుతో ఎం.ఫిల్., చేశారు. అందులోని ముఖ్యాంశాలను, వాటికి మరికొన్నింటిని కలిపి 'బాల్నేపల్లి తండా బంజారా గేయాలు పేరుతో పుస్తకం ప్రచురించారామె. దామరచర్ల మండలం, నల్లగొండ జిల్లాలో ఉంది. డా.కె.పద్మావతిబాయిగారు తాను పుట్టి పెరిగిన తండా గురించీ, అదీ తన జాతి ప్రజల జీవన విధానం గురించీ పరిశోధన చేయాలనుకోవడమే

గొప్పవిషయం. ఆ ప్రాంతాలన్నీ తిరిగి, వారి దగ్గర అనేక రోజుల పాటు నివసించి, మౌఖికంగా ఉన్న గేయాలను రికార్డ్ చేసి, వాటిని మరలా శ్రద్ధగా రాసి వెలుగులోకి తెచ్చినందుకే ముందుగా అభినందించాలి. అలాంటిది ఆ జీవన విధానాన్ని ప్రధాన జీవనస్రవంతిలో ఉన్న ప్రజల జీవన సంస్కృతులతో పోల్చి, మానవ అనుభూతుల్లో ఉండే సాంద్రతను గొప్పగా ఆవిష్కరించారు.

బంజారా సాహిత్యాన్ని అందరూ అవగాహన చేసుకోవడానికి వీలుగా, దాని తెలుగు అనువాదాలను కూడా రాశారు. రెండు భాషలనూ పుస్తకంలో అందించారు. అందువల్ల ఆ భాష తెలియని వాళ్ళకు కూడా ఈ పుస్తకం అవగాహన కావడానికి ఈ పద్ధతి ఎంతగానో ఉపయోగపడుతుంది. ఆ భాష తెలిసినవాళ్ళు బంజారా సాహిత్యంలోని మౌలిక అనుభూతిని కూడా ఆస్వాదించగలుగుతారు.

ఈ పుస్తకంలో బంజారాల చరిత్రను, సంస్కృతిని, వారి రోజువారీ జీవితంలో భాగమైన గేయాలనూ ఒక పద్ధతి ప్రకారం వివరించారు. బంజారాలు పాడుకొనే గేయాల్లోని పారమార్థిక అంశాలను విశ్లేషించారు. వివాహం సందర్భంగా బంజారాలు పాడుకొనే గేయాల్లో సంస్కృతిని, శ్రామికులు పని చేసే సమయంలో పాడుకొనే గేయాల్లోని సరసాన్నీ ఈ పరిశోధనలో ఎంతో పరిశీలనాత్మకంగా వివరించారు. పుస్తకం చివరిలో బంజారా–తెలుగు సంక్షిప్త పదకోశాన్నివ్వడం వల్ల అటు బంజారాలకు, ఇటు కేవలం తెలుగు మాత్రమే తెలిసిన వాళ్ళకూ ఎంతగానో ఉపయోగపడుతుంది. ఇంత మంచి పుస్తకాన్ని ప్రచురించిన డా॥కె.పద్మావతిబాయి గార్ని అభినందిస్తూ, సాహితీలోకానికి ఆమె మరిన్ని రచనలను అందించాలని ఆకాంక్షిస్తున్నాను.

*(బాల్నేపల్లి తండా బంజారా గేయాలు,*
*ఎం.ఫిల్.,పరిశోధనవ్యాసం, డా॥కె.పద్మావతిబాయి,*
*మేగ్యా తండా ప్రచురణలు, ఆగస్టు, 2010)*

★★★

# చిందుకళాకారులపై తడి ఆరని పరిశోధన

మిత్రుడు గడ్డం మోహనరావుని సెంట్రల్ యూనివర్సిటీలో పి.జి.చదువుతున్నప్పటి నుంచీ ఎం.ఫిల్., పరిశోధన చేసే వరకూ గమనిస్తూనే ఉన్నాను. విద్యార్థి దశనుండీ పరిశోధనా దృష్టి కనపరిచేవాడు. ఎం.ఏ.లో దళితసాహిత్యం ఒక కోర్సుగా కూడా చదివాడు. అప్పుడు దళిత సంస్కృతికి సంబంధించిన విషయాల్లో లోతైన చర్చనీయాంశాల్ని ప్రతిపాదించేవాడు. నిచ్చెనమెట్ల కులవ్యవస్థ సమాజ స్వరూపంలో కొన్ని కులాల సాంస్కృవిలువలను నిర్ణయించేటప్పుడు చాలామంది తమకి తెలిసిన ప్రమాణాలతో తప్పుడు తీర్పులిస్తారనేవాడు. కనీసం ఆ రంగంలో కృషిచేసినవారిని కలవకుండానో, వారి ప్రదర్శనలను చూడకుండానో తమకి తెలిసిన వాటినే ప్రమాణాలుగా తీసుకుంటారని వాదించేవాడు. చాలావరకు అతనివాదనలో నిజం ఉంది. మోహనరావు అంతబలంగా తన వాదనను వినిపించడానికి ఒక ప్రధాన కారణం ఉంది.

మోహనరావు స్వయంగా చిందుకళాకారుల కుటుంబం నుండి వచ్చిన పరిశోధకుడు. అతని నాన్నగారు చిందుభాగవతాన్ని ప్రదర్శిస్తారు. ఆ కళాకారులతో అతనికెంతో పరిచయం ఉంది. ఆ కళల్ని ప్రదర్శించేటప్పుడు తాను గమనించిన అంశాలను, అప్పటికే ఉన్న ప్రమాణాలతో గ్రంథాలతో సమన్వయిస్తూ ఎం.ఫిల్., పరిశోధన కూడా చేశాడు. ఈ మధ్య ఒక రోజు కలిసి తాను 'చిందు ఎల్లమ్మ' గురించి పుస్తకం రాస్తున్నానని ఆ ప్రణాళికను వివరించాడు. పుస్తకంలో చిందు ఎల్లమ్మ గురించి రాస్తున్నట్లున్నా, అందులో చిందుకళాకారుల జీవితస్పర్శ ఎంతగానో ఉంది. మోహనరావులో పరిశోధన తడి ఆరనందుకు సంతోషం అనిపించింది.

చిందు ఎల్లమ్మ గొప్పకళాకారిణి. నేను చేస్తున్న మాదిగల పరిశోధనలో భాగంగా

చిందుకళాకారుల గురించి చదువుతుంటే ఎల్లమ్మ లాంటి కళాకారులెంతోమంది వున్నారని మరెంతగానో ఆనందం కలుగుతోంది. మాదిగలను ఆశ్రయించుకుని జీవించే చిందుకళాకారులు గొప్ప మౌఖిక సంప్రదాయాన్ని కొనసాగిస్తున్నారు. వీరు ఇతర కులాల మాదిరిగా కాకుండా, మాదిగలకు, చిందుకళాకారులకు మధ్య చక్కని అనుబంధం పెనవేసుకొని ఉంటారు. సంప్రదాయ నృత్యకళాకారులచేత కూడా ప్రశంసలందుకున్న కళాకారిణి చిందు ఎల్లమ్మ. ఇటువంటి కళాకారుల జీవితం, వారి ప్రదర్శనారీతుల గురించి పరిశోధన చేయవలసినదెంతో ఉంది. ఈ దిశగా స్వయంగా ఆ కళాకారుల కుటుంబం నుండే వచ్చిన మోహనరావు 'చిందుఎల్లమ్మ' గురించి రాయడమంటే, వారి జీవితానుభవసారాంశాన్ని బయటకు తీసే ప్రయత్నం చేయడమే. చిందు యక్షగాన చరిత్రను వాస్తవికంగా తెలియజెప్పడమే.

కళాకారుల్ని, వారి సాహిత్యాన్ని పరిశోధించిన కొంతమంది, కింది కులస్థుల వారి కళలుగా భావించేవాటి పుట్టుకను సిద్ధాంతీకరించేటప్పుడు చాలా చులకన భావంతో వ్యాఖ్యానిస్తుండటాన్ని ఈ పరిశోధకుడు సీరియస్‌గా తీసుకున్నాడు. 'చిందుకళాకారులు' వేశ్యలుగానో, తాగుబోతులుగానో చిత్రించే ఆధిపత్య సంస్కృతిని నిలదీసి చూపుతూనే, వాటి చారిత్రక నేపథ్యాన్ని గుర్తించమంటున్నాడు. 'సింధునాగరికత'కూ 'చిందుకళాకారుల'కు గల సంబంధాన్ని వివరిస్తూ, ఈ కళాకారుల ప్రాచీనతను, పూర్వవైభవాన్నీ ఈ గ్రంథంలో పేర్కొన్నాడు. చిందుకళాకారుల గురించి లోకానికి తెలియని ఎన్నో చారిత్రక, సాంస్కృతిక సత్యాలను ఈ పరిశోధన మనకు విశదపరుస్తుంది.

చిందుకళాకారులకు సమాజంలో లభించాల్సిన గౌరవ, మర్యాదల గురించి తప్పకుండా ఈ పరిశోధన ఆలోచించేటట్లు చేస్తుందని నమ్ముతున్నాను. మోహనరావు కృషిని అభినందిస్తూ, నా శుభాకాంక్షలు తెలియజేస్తున్నాను.

*(చిందు ఎల్లమ్మ, (చిందు యక్షగానం కళా ప్రస్థావనం...),*
*గడ్డం మోహనరావు, చిందు పబ్లికేషన్స్, హాజీపూర్, మే, 2013)*

★★★

# విశ్వజనీన సంఘర్షణల ప్రతిఫలనం

ఒక వ్యక్తి ఉద్యమకారుడిగా, వక్తగా, దార్శనికుడిగా, రచయితగా, కవిగా విభిన్న పార్శ్వాలతో వెలుగొందేవాళ్ళు చాలా కొందిమంది మాత్రమే ఉంటారు. అటువంటి వారిలో పొనుగోటి కృపాకర్ మాదిగ ఒకరు. మాదిగ దండోరా ఉద్యమానికి తాత్త్వికపునాదులు వేయడంలో, దాన్ని కొనసాగించడంలోనూ ఈయన కృషి మరువలేనిది. ఒకవైపు క్షేత్రస్థాయిలో సామాన్య ప్రజల నుండి మేధావుల వరకు తన ఉద్యమంతో చైతన్యపరుస్తూనే, సాహిత్యం ద్వారా మాదిగ భావజాలాన్ని కూడా విస్తరింపజేస్తున్నారు. ఈయన సంపాదకత్వంలో వచ్చిన "కైతునకలదండెం" కవితా సంకలనం మాదిగ జీవితాల్లోని అనేక సాంస్కృతికాంశాలను ఒకేచోటపెట్టి తెలుగు సాహిత్యానికి పరిచయం చేసింది. తెలుగు సాహిత్యంలో మాదిగ సాంస్కృతిక జీవిత పార్శ్వాన్ని అనేక కోణాల నుండి చూపించి సరికొత్త ధోరణికి మార్గం వేసింది.

మాదిగ సాహిత్యానికున్న సొంతదనాన్ని, మాదిగ జీవితాల్నే కేంద్రంగా చేసుకొని వచ్చిన సాహిత్యాన్ని, దాని ద్వారా ప్రతిఫలనమైన మాదిగ తత్త్వాన్ని కృపాకర్ మాదిగ తన కవిత్వం, వ్యాసాల ద్వారా బలమైన గొంతుతో వినిపిస్తున్నారు. ఈయన రాసిన కవితలను కొన్నింటిని *"మాగూడెంలోకి రా"* పేరుతో ఒక సంపుటిగా మనముందుకి తీసుకొస్తున్నారు. ఇంచుమించు ఈ కవితలన్నీ వివిధ పత్రికల్లో ప్రచురితమైనవే. దీనిలో మాదిగజీవితాన్ని ప్రధానకేంద్రంగా తీసుకొని కవిత్వం రాసినా, స్థానీయత నుండి విశ్వజనీనతను చూపించగలిగే కవితాహృదయం కనిపిస్తుంది. సామాజిక సమస్యల్ని కళాత్మకం చేయడమనే కవితారహస్యం ఈ కవిత్వంలో ప్రతి కవితలోను ప్రతిఫలిస్తుంది. ఇవన్నీ అలవడాలంటే జీవితానుభవం, విస్తృతమైన అవగాహన, లోతైన సాహిత్య, సామాజిక పరిశీలన ఉంటే తప్ప అలవడ్డం అంత సులభం కాదు. దీన్ని సొంతం చేసుకున్నారు

కృపాకర్ మాదిగ. 'సెజ్' (Special Economic Zones) పేరుతో భూముల్ని సేకరించి పరిశ్రమల పేరుతో ధనవంతుల్ని మరింత ధనవంతులుగాను, పేదవాళ్లను మరింత పేదవాళ్ళుగాను మార్చే ప్రక్రియ ప్రపంచీకరణ ముసుగులో వచ్చిన ఒక మేధోపరమైన దోపిడీమార్గంగా చాలా చోట్ల కనిపిస్తుంది. దీన్ని స్థానికత నుండి విశ్వజనీనతకు చూడదగిన కవిత్వాంశం. సామాజిక హక్కుల కోసం, కనీసం జీవన భద్రత కోసం జరుగుతున్న పోరాటాల్లో భాగంగా మారిపోతున్న పరిస్థితుల్ని '*ప్రత్యేక చావు మండళ్ళు*" కవితలో శక్తివంతంగా వర్ణించారు కవి.

'*సీవలు పుట్టలు పెట్టినట్టు*
*తేనీగలు తుట్టెలు కట్టినట్టు*
*మేం కట్టిందే మావూరు*
*ఇప్పుడది పనిదొంగల పెత్తందార్ల*
*యాపార్ల పూజార్ల వూరయ్యింది*" అంటూ రాసిన కవితలో పైసా పైసా కూడ బెట్టుకొని సంపాదించుకున్న సెంటు భూమిని కూడా పేదవాళ్లనుండి అధికారికంగానే లాగేసుకుంటున్న వైనాన్ని సీమలు పెట్టిన పుట్టల్లో పాములు దూరినట్లు, ఒక్కొక్క పువ్వునుండి మధువుని సేకరించిన తేనెటీగల్ని చంపేసి ఆ తేనెను చేజిక్కుంచుకునే వాళ్ళతో పెత్తందార్లను పోల్చడం గొప్ప అభివ్యక్తి. ఈ పరిస్థితి తెలంగాణలోనో, ఆంధ్రప్రదేశ్ లోనో మాత్రమే కాదు, యావత్తు భారతదేశంలోను, ప్రపంచంలోని అనేక దేశాల్లో ఇదేరకమైన ప్రమాదకరమైన పరిస్థితి కనిపిస్తుంది. దీన్నే కవి స్థానికత నుండి విశ్వజనీనతను దర్శించడమంటే. అది కూడా భౌతిక వాస్తవికతలనుండి సామాజిక ప్రతిఫలనను కవిత్వీకరించడం ప్రగతిశీల కవికి మాత్రమే సాధ్యం.

ఇంచుమించు దీనికి దగ్గరగానే ఉంటూనే ప్రపంచీకరణ ప్రజాస్వామ్యంలో ప్రవేశించిన దోపిడీ తీరుతెన్నుల్ని మన కళ్ళముందుంచే కవిత '*పాదయాత్రలన్నీ దండయాత్రలే*'. '*ఒక కంట్లో వెండితెర, ఇంకొకకంట్లో బుల్లితెర*'లను మనకిచ్చి, మన ప్రమేయం లేని కార్యక్రమాల్నీ, వాళ్ళ జీవితాల్నీ వార్తాంశాలు, కథనాలుగా ప్రసారం చేసే ప్రసార, ప్రచార సాధనాలను గమనించాలంటున్నాడు కవి. మీడియా మాయాజాలాల్లో వాళ్ళిచ్చిందే వార్త. వాళ్ళు రాసిందే నిజం. 5 **W S** & H ఆధిపత్యం చెప్పినట్లు వినాల్సిందే. తమ గురించి ఉన్న గొప్పనీ లేని గొప్పనీ చెప్పుకోవడంతో ఆగదీ మీడియా. వైయక్తిక, ప్రాంతీయ విద్వేషాల్ని కూడా నిస్సిగ్గుగా ప్రసారం చేయడానికీ వెనుకాడని స్థితి కొన్ని ఛానల్స్ లో కనిపించడాన్ని ఉదాహరణగా '*'ఇగ నీ బొమ్మల పెట్టెను మూస్తావా?'*' కవితను చూడొచ్చు.

పోనీ ప్రభుత్వ ప్రచార, ప్రసార సాధనాలేమైనా పేదల, అణగారిన వర్గాల, వర్ణాల వార్తలేమైనా పట్టించుకుంటాయా అని ప్రశ్నించుకుంటే సంక్షేమ పథకాలన్నీ వీళ్ళగురించే ఉంటాయి. వాటి అమలు, వాటిలో అవినీతి లొసుగుల వంటివాటిని పట్టించుకోవు. శాటిలైట్ ఛానల్స్ వచ్చిన తర్వాత ప్రభుత్వం ఆధ్వర్యంలో నడుస్తున్న ఛానల్స్, ఆకాశవాణి ప్రసారాలు, ప్రజాపౌరసంబంధాల వాళ్ళు ప్రచారం చేసేవన్నీ గణాంకాలు, ప్రభుత్వాధినేతల ఫోటోలతోనే నిండిపోతున్నాయి. ప్రభుత్వం ఆధ్వర్యంలో వచ్చే పత్రికలు ప్రజాసమస్యల్ని, వాటి పరిష్కారాల కోసం పోరాడేవార్తాంశాల్ని ప్రచురిస్తాయనుకోవడం అత్యాశగానే కనిపిస్తోంది. అందుకనే "మీడియాజాగీర్లపై దండోరా" చేయాల్సిన అవసరం ఉందంటున్నాడు కవి. అలాగే జీవితాల్ని మార్చగలిగే శాశ్వత సంక్షేమపథకాలు కాకుండా, తాత్కాలిక ప్రయోజనాల్ని పొందుతూనే, వాటిలోను తమ ఆర్థిక ప్రయోజనాల్నీ సాధించగలిగేలా రూపొందించే పథకాల పట్ల ఓటర్లు జాగూరుకత కలిగి ఉండాల్సిన అవసరాన్ని చాటుతున్నాడు. లేకపోతే 'ప్రజాస్వామ్యం' రూపంలో మనీ, మజిల్, మీడియాల మాయాజాలాలకు బలికావాల్సిందేననే హెచ్చరిక చేస్తున్నాడు కవి. లేకపోతే అదొక 'దొమ్మీస్వామ్యం' అయిపోయి "ఆ పేద తల్లి ఐదేళ్ల ఆశల్ని" ఒక్క ఓటుతో కోల్పోవలసి వస్తుంది. మానవులు, మానవ జీవితంలో సమస్యల్లాగే ఈ కవితాసంపుటిలోని కవితల మధ్య ఒక సూత్రత ఉంటూనే ప్రత్యేక అస్తిత్వాన్ని కలిగి ఉన్నాయి. ఇది వైయక్తికత నుండి వ్యవస్థీకృత ధర్మాన్ని సాధించిన కవితాలక్షణం.

ఇంతవరకు తెలుగు సాహిత్యంలో మాదిగలకున్న అస్పృశ్యతనే అత్యధికంగా చిత్రించిన కవులున్నారు. మాదిగల జీవితాల్ని కేంద్రంగా చేసుకొని కథలు రాసినవాళ్లూ ఉన్నారు. దళితుల గురించి రాస్తున్నారంటే మాదిగల గురించి రాయడమే ప్రధానంగా జరిగేది, నేటికీ జరుగుతున్నదీ అదే. కానీ మాదిగ దండోరా ఉద్యమం, దాని ప్రభావంతో వచ్చిన సాహిత్యం వల్ల "దళిత" సాహిత్యం అస్తిత్వం ప్రశ్నార్థకమయ్యింది. కులం వల్ల సామాజికంగా, ఆర్థికంగా, సాంస్కృతికంగా, రాజకీయంగా, మానసికంగా, అన్నిరంగాల్లోనూ పీడనకు గురవుతున్న వాళ్ళను దళితులుగా గుర్తించిన సాహితీవేత్తలే పునరాలోచనలో పడ్డారు. మాదిగసాహిత్యం నుండే దళితసాహిత్యాన్ని చూడాలనే వాదన పెరిగింది. అందువల్ల దళిత సాహిత్యమంతా మాదిగ సాహిత్యంగానే చూడాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఎందుకంటే కేవలం కులం మాత్రమే ప్రధాన వివక్ష కాకుండా ప్రధానజీవన స్రవంతికి దూరంగా కొండల్లో, కోనల్లో బతుకుతున్న వారి సమస్యల్ని చిత్రించే సాహిత్యం గిరిజన సాహిత్యంగా ప్రత్యేక గుర్తింపుని పొందింది. మతం, ప్రాంతం (స్థానికత),

కులాంతరతల ముప్పేట వివక్షలకు గురవుతున్న ముస్లిములు, క్రిస్టియన్సు తమది "మైనారిటీ సాహిత్యం" అంటున్నారు. అందువల్ల ముస్లిం మైనారిటీ సాహిత్యం, క్రిస్టియన్ మైనారిటీ సాహిత్యంగా అది ప్రత్యేక అస్తిత్వాన్ని కోరుకుంటుంది. స్త్రీల సమస్యలు ప్రధాన కేంద్రంగా, కుల వివక్ష కూడా తోడయినప్పుడు స్త్రీవాదంలో ఆయా కుల స్త్రీవాదాలుగా గుర్తింపుని కోరుకుంటున్నాయి. ఇక, నిచ్చెన మెట్ల కుల వ్యవస్థలో మాదిగ, మాల, గిరిజన, ముస్లిముల తర్వాత కుల వివక్షను ఎదుర్కొంటున్నవాళ్ళు వెనుకబడిన తరగతులవారు. వీరిప్పుడు " వెనుకబడిన కులాలు" అనే గుర్తింపుతో ముందుకొస్తూ, బి.సి.సాహిత్యంగా ప్రత్యేక అస్తిత్వాన్ని కోరుకుంటున్నారు. ఈ పరిస్థితుల్లో "దళితసాహిత్యం" అనే పారిభాషిక పదం క్రమేపీ కనుమరుగయ్యేలా చేసి, దాని స్థానంలో పైన పేర్కొన్న వాళ్ళందరి సాహిత్యాన్నీ "బహుజనసాహిత్యం"గా పరిగణించాలని భావిస్తున్నారు. దీనివల్ల ఒక ప్రయోజనం ఉంది. మరొక ప్రమాదం కూడా ఉంది.

ఒకప్పుడు "దళితసాహిత్యం" పేరుతో కుల, మత, లింగవివక్షలకు గురైనవాళ్ళంతా ఒక సమైక్యశక్తిగా ముందుకొచ్చినా, అప్పుడు ఆయా కులాల వారికి ప్రత్యేక అస్తిత్వాలు లేవు. దీన్నంతటని కలిపి అస్తిత్వసాహిత్యంగా పిలిచారు. కానీ ఇప్పుడు వాళ్ళ వాళ్ళ కుల ప్రత్యేక అస్తిత్వాల్ని కాపాడుకుంటూనే, సమైక్యశక్తిగా బ్రాహ్మణీయ కులాధిపత్యాన్ని, ఆ వివక్షల్నీ ఎదిరించగలిగే బలీయమైన సాహిత్యం "బహుజన సాహిత్యం"గా మారుతుంది. దీన్నే అస్తిత్వానంతర సాహిత్యం అని పిలుస్తున్నారు. దళిత సాహిత్యం కనీస గుర్తింపుని కోరుకుని తెలుగు సాహితీ ప్రపంచంలో అస్తిత్వం కోసం ప్రయత్నించిన సాహిత్యం అయ్యింది. తర్వాత దశలో సాహిత్యంలో గుర్తింపు లభించినా, సాహిత్యం ద్వారా సాధించాల్సిన సామాజిక ప్రయోజనాలు చాలానే ఉన్నాయి. ప్రత్యామ్నాయ సంస్కృతి స్థిరీకరణతో పాటు సాహిత్యం రాజ్యాధికారానికి ప్రేరణగా నిలవాల్సిన మార్గాన్ని చూపిస్తుంది. అందువల్ల దీన్ని అస్తిత్వానంతర సాహిత్యంగా పిలుస్తున్నారు. అయితే బహుజన సాహిత్యం అనడంలో గలప్రమాదం విషయాన్ని పరిశీలిస్తే, మరలా రాయగలిగే వాళ్ళు, అంతర్గత ఆధిపత్యకులాల వాళ్ళు సమైక్యం పేరుతో మళ్ళీ తమ ఆధిపత్యాన్ని చెలాయించగలుగుతూ, కొన్ని కులాల సాహిత్యాన్నే "బహుజనసాహిత్యం"గా ప్రచారం చేస్తారనే భయం ఉంది. కానీ, కృపాకర్ మాదిగ రాసిన కవిత్వాన్నిగానీ, సాహిత్యాన్నిగానీ పరిశీలిస్తే తమ తమ అస్తిత్వాల్ని గుర్తించుకుంటూనే రాజ్యాధికారం వైపు మార్గాన్ని సూచించేలా ఉంది. దీనికి ఒక బలమైన ఉదాహరణగా నిలిచే కవితా ఖండిక *'యూదా ముద్దు'.* దీనిలో మాదిగ-మాలలది అహేశ్యతలోను, వివక్షలోను 'ఐక్యతా ఘర్షణల

సామాజిక బంధం'గా కారల్ మార్క్స్ సిద్ధాంతంలోని ఒక సూత్రాన్ని దేశీయకోణంతో అనువర్తింపజేశారు. ఈ కవితలో ఇంతవరకు మాలలకున్న అస్పృశ్యత, వివక్షలను తెలుగు సాహిత్యంలో నాకు తెలిసినంతవరకూ ఎవరూ వర్ణించలేని వారి స్థాయీ భేదాల్నీ వివరిస్తూనే, మాదిగలకు జరిగిన అన్యాయాన్ని సమర్థవంతంగా నిరూపించగలిగాడు కవి. ఈ పద్ధతిలో 'బహుజన సాహిత్యం' కొనసాగగలగాలి. దీనికి చక్కని సైద్ధాంతిక ప్రాతిపదికను సూచించిన కవితగా దీన్ని చెప్పుకోవచ్చు. ఐక్యతా సంఘర్షణలున్నా భావజాలాల విషయంలో తమ పోరాటమెవరిపైనో స్పష్టంగా చూపే కవితగా *'కులానికి ఉరి కలేకూరి'* ని అభివర్ణించవచ్చు.

తెలంగాణా ప్రాంతీయ సమస్యలు వచ్చినప్పుడు మాదిగ కవులు, సాహితీవేత్తలు ప్రత్యేక తెలంగాణ రాష్ట్రావిర్భావానికి తమవంతు మద్ధతునిచ్చారు. దీన్ని "దండోరా ధూం ధాం" కవితలో మాదిగ దండోరా అడుగుతున్న ఎస్సీ వర్గీకరణతో ముడిపెట్టి వర్ణించడంలోనే కవిగా కృపాకర్ మాదిగ మాదిగలందరి ప్రతినిధిగా మాట్లాడుతున్నట్లుంది. తెలంగాణ రాష్ట్రావిర్భావం న్యాయంగా జరిగింది. అలాగే ఎస్సీ వర్గీకరణ కూడా న్యాయపరంగా జరగాల్సి ఉంది. న్యాయం గురించి మాట్లాడే వాళ్ళు ఎస్సీ వర్గీకరణ సమస్య న్యాయం కాదని కోర్టులకెళ్ళడం వారి ద్వంద్వనీతికి నిదర్శనంగా నిలుస్తుంది. 'దళిత సమైక్యత' గురించి మాట్లాడేవాళ్ళు 'ఏదిరా సమ ఐక్యత' కవిత చదవాల్సిందే. మాదిగల ప్రత్యేక అస్తిత్వాన్నీ, న్యాయంగా రావాల్సిన హక్కుల్నీ సాంస్కృతిక పునాదుల నుండి చూపిస్తూ

*''ఏ వూళ్ళో నన్నా/*
*మా పిలగాళ్ళకి మీ పిల్లల్ని ముడేస్తారా?"*

అని మాదిగ-మాలల మధ్య వైవాహిక సంబంధాలు లేని వాస్తవాన్ని కవిత్వీకరించాడు కవి. ఇక్కడో ప్రశ్న చాలామందికి పుడుతుంది. కులాంతర వివాహాలు జరుగుతున్నాయని, మాదిగ, మాలల మధ్య పెళ్ళిళ్ళు జరుగుతున్నాయని వాదించే వాళ్ళుంటారు. అవన్నీ బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ, కమ్మ, రెడ్డి కులస్తులతో మాదిగలు, మాలలకు వివాహాలు జరిగినట్లే జరుగుతున్నాయి. ఇష్టపూర్వకంగా, వ్యవస్థీకృతంగా జరుగుతున్న వివాహాలు కాదు. ఆచార సంప్రదాయాలుగా జరుగుతున్నవంతకంటే కాదు. అలాంటివే మాదిగ, మాలల మధ్య జరుగుతున్న వివాహాలు కూడా.

*'బతుకుపాట', 'నాకవిత'* మొదలైనవన్నీ కవిత్వావిర్భావానికి కవిపడే పురిటినొప్పుల్ని మనముందుంచుతుంది. తన కవిత్వం సరదా కోసమో, ప్రయోగాల ప్రదర్శన

కోసమో కాదనీ, కవిత్వం ఒక బాధ్యతగా, కవిత్వం ఒక సామాజిక ప్రయోజనంగా భావిస్తున్న సంవేదన వీటిలో కనిపిస్తుంది. 'బతుకుపాట'లో...

*"కాసిన్ని గీతాలకోసమే కదా*
*నేను నిద్రహారాలూ మానించి*
*చీకటి దారులెంట పిచ్చిగా తిరిగింది*
*చెట్లూ, పుట్టలూ అరణ్యాలూ పట్టుకువెతికింది"*

అంటూ 'కాసిన్ని గీతాలకోసమే కదా" అనే పునరుక్తి అక్షరం కోసం, చదువుకోసం, కవిత్వమవ్వడం కోసం తరతరాలుగా ఎదురుచూసినవారి వేదనను వర్ణించిన తీరు అద్భుతం.

*వాకిలిపిట్టలు, వొంటరిపాట, సాగర సందర్శనం, అమ్మకోసం* మొదలైన కవితలన్నీ చక్కని దృశ్యాత్మక వర్ణనానుభూతులు, పదచిత్రాలతో పాఠకుల్ని అనుభూతులతో నింపేస్తాయి. నాగార్జునసాగర్ ప్రాజెక్టును చూసిన కవి *"కూలి దుక్కాల మడుగు కూలిన జీవితాల గొడుగు"* అనడంలో శ్రామికదృక్పథం స్పష్టంగా కనిపిస్తోంది. కేవలం నాగార్జునసాగర్ ప్రాజెక్టుకి మాత్రమే పరిమితమైన కవిత కాదిది. సాధారణంగా ఏ బహుళ ప్రాజెక్టు కట్టినా పేదవాళ్ళు నిలబడ్డానికి పైసాపైసా కూడబెట్టుకున్న స్థలాలే అధికారికంగా బలవంతంగా లాక్కునే ప్రయత్నాలు కనిపిస్తుంటాయి. కాకపోతే, కొన్నాళ్ళు ఆందోళనలు, పత్రికల పతాకశీర్షికలు, టీవీల్లో చర్చలు జరుగుతాయి. సారాంశంలో ప్రజాప్రయోజనాలకు వాటిని తీసుకోవడం తప్పుకాదనే డైరెక్షన్‌ని ఇస్తాయి. ఆ ప్రాజెక్టులకు కోల్పోయిన భౌతికమైన ఆస్తులతో పాటు వారికి ఆ నేలతో మానసికంగా పెనవేసుకొన్న బంధాల్ని కూడా లాగేసుకుంటారు. పర్యాటకులకు గానీ, ఆ ప్రాజెక్టుల వల్ల తొంబదితొమ్మిది శాతం లబ్ది పొందుతున్నవాళ్ళకు ఎవరికీ ఈ 'కోల్పోయిన' బంధాలు తెలియవు. వాళ్ళు కనీసం వాటిని పట్టించుకోరు. వాళ్ళు పట్టించుకొనేదల్లా రికార్డుల్లో కనిపించే శిలాఫలకాల చరిత్ర మాత్రమే. ఆప్రాజెక్టుల భౌతికప్రయోజనాలు మాత్రమే. ఆ ప్రాజెక్టుల భౌతిక సౌందర్యం మాత్రమే. ఇలాంటప్పుడే ఈ కవి ఆ ప్రాజెక్టుల్లో ఆత్మను దర్శించగలిగాడు. ఈ కవిత ద్వారా పోలవరం ప్రాజెక్టు, గంగవరం పోర్టు, కోస్తాకారిడార్, అమరావతి నగర నిర్మాణం మొదలైన ప్రాజెక్టులను స్ఫూరింపజేస్తున్నాడు కవి. ఒక భౌతిక సౌందర్యం వెనుక దాగున్న విషాదకెరటాల్ని దృశ్యమానం చేస్తున్నాడు కవి.

*"మాగూడెంలోకి రా"* అనే కవిత ఒకరు రాసిన కవితకు ప్రతిస్పందనగా వచ్చిందే అయినా, జీవితానుభవాల్ని తాత్వీకరించే భావాలీ కవితనిండా ఉన్నాయి. జ్ఞానం రకరకాలుగా ఉంటుంది. దీన్ని ప్రధానంగా మూడురకాలుగా చెప్తుంటారు. అనుభవ జ్ఞానం. జీవితానుభవాల ద్వారా వచ్చేది. రెండవది సగం జీవితానుభవాల నుండీ, ఇతర జీవితానుభవాలను తెలుసుకోవడం ద్వారా కలిగేది. మూడోది జీవితానుభవం, తార్కికత లేకుండా ఊహల నుండి జీవితాల్ని వాస్తవమని నమ్మించగలిగే మేథో జ్ఞానం. మూడోది చాలా ప్రమాదకరమైంది. మొదటిది ప్రమోదకరమైంది. రెండవది ప్రయోజనకరమైంది. కొంతమంది జీవితాల గురించి తెలియకుండా ఆ జీవితాల గురించి ఊహల్ని రాయడం, వాస్తవాల్ని విస్మరించి, దాన్ని నీచ సంస్కృతిగా అభివర్ణించడం సాహిత్యంలో నేరంలాంటిదే. అలాంటి నేరాల్ని తెలుగు సాహిత్యంలో చాలా మంది చేశారు. ఇంకాచేయాలని ప్రయత్నిస్తున్నారు. వాళ్ళను అడ్డుకట్టవేసి, వాళ్ళనీ వాస్తవాన్ని గుర్తించి రాయమని చెప్పే కవితగా దీన్ని చూడాలి. "గూడెం" ఒకప్పుడు సమాజం అన్నిరకాలుగాను విస్మరించిన జాతులు జీవించే జీవితాలకు ప్రతీక. ఆ జీవితాల్ని కళ్ళారా చూస్తే, మనసారా ఆలింగనం చేసుకుంటే ఈ కవితాసంపుటి నిండా ఉన్న ఉద్వేగాలు, త్యాగాలు, వీరత్వాలు కనిపిస్తాయి. సంస్కృతికి ఉన్న అర్థం తెలుస్తుంది. అందుకే కేవలం 'మా గూడెంలోకి రా" అనేదొక కవితకే కాకుండా సంపుటిలోని కవితలు ప్రతిధ్వనించే భావ జాలాలన్నింటికీ ప్రాతినిధ్యం వహిస్తుంది.

తినే తిండిమీదా, మాట్లాడే మాటమీదా, ఉండే స్థలం మీదా... ఇలా అన్నింటిపైనా ఆంక్షలు పెట్టే ఆధిపత్య సంస్కృతిని బలంగా తిప్పికొట్టడమే కాకుండా, అనేక పీడిత కులాల వారి అస్తిత్వగొంతుగా ఈ కవిత్వం కనిపిస్తోంది. ఆ దేవాలయాల్లోకి రానీయరు, మరొక దేవాలయాలకు పోనీయరు. ఆ మతాన్ని అనుసరించాలంటే ఆంక్షల సంకెళ్ళు భరించాలి. ఆ సంకెళ్ళు తెంచుకుని తమకున్న స్వేచ్ఛతో తమకిష్టమైన మతాన్ని అనుసరిస్తున్నారు. దాన్నీ వ్యతిరేకించడమే కాకుండా దాడుల్ని చేస్తున్న మతమౌఢ్యాన్ని ఖండిస్తున్నాడు కవి. చివరికి తామేది మాట్లాడాలో, తామేది తినాలో, తామేమి కట్టుకోవాలో, తామెలా జీవించాలో నేర్పే నియంతృత్వాన్ని నిరసిస్తున్నాడు. మానవహక్కుల్ని హరించే విషసంస్కృతిని వ్యతిరేకించే బలమైన పిడికిళ్ళుగా కనిపిస్తాయీ కవితలు.

కొన్ని శతాబ్దాల చారిత్రకానుభవాల్ని ఆత్మీకరించుకొని, సుమారు మూడు దశాబ్దాలుగా రాసిన ఆణిముత్యాల్లాంటి కవితల్లో కొన్నింటిని ఈ సంపుటిగా అందిస్తున్న ఈ కవిత్వాన్ని జీర్ణించుకోవాలంటే మనసున్న మనుషులు కావాలి. మానవత్వం పరిమళించే

మనసుకావాలి. అప్పుడే దీనిలో పరిమళించే భాషాసౌందర్యం తెలుస్తుంది. దీనిలో వర్ణించిన జీవితం తెలియాలంటే మట్టిని ముద్దాడే మనుషులు నివసించే గూడేల్లోకి రావాలి. ఈ కవిత్వం అర్థం కావాలంటే తరతరాల ఆధిపత్యం అర్థం కావాలి. ఈ కవిత్వాన్ని ఆలింగనం చేసుకోవాలంటే వ్యక్తిగా మనిషికున్న స్పందనలు తెలియాలి. వ్యక్తిగా మనిషికున్న హక్కులు తెలియాలి. వ్యక్తి వ్యవస్థగా పరిణమించిన, పరిణమించాల్సిన పరిస్థితులు అవగతం కావాలి. వ్యక్తి ఆయుధంగా మారాల్సిన అవసరం అర్థం కావాలి. సమకాలీన సమాజాన్ని చూడగలగాలి. వ్యక్తి కుటుంబంగా మారినప్పుడు తల్లిదండ్రుల ఆత్మీయతానురాగాలు ఒంటపట్టాలి. కుటుంబంలో భార్యాభర్తలు ఒకరికొకరు వాకిలిపిట్టలై ఎదురుచూడగలిగే నిరీక్షణ కావాలి. విడదీయరాని  అన్నదమ్ములు, అక్కాచెల్లెళ్ళ అనుబంధాలతో మమేకం కావాలి. గ్రామానికీ, పట్టణానికీ, నగరానికీ, దేశానికీ మధ్య గల వంతెనలు దాటాలి. స్థానికత నుండి విశ్వజనీన మానవుడిగా ఎదగగలగాలి. కృపాకర్ మాదిగను ఇంతవరకు ఒక  ఉద్యమకారుడిగా చూసిన సమాజం, సాహిత్యోద్యమకారుడిగా, కళాత్మక ప్రయోజనాన్ని నెరవేరుస్తున్న సృజనకారుడిగా హృదయానికి హత్తుకుంటుందని నాకెంతో నమ్మకముంది. ఇంత గొప్ప కవితా సంపుటి గురించి నాలుగు మాటలు రాసే అవకాశం కల్పించిన అన్న కృపాకర్ మాదిగ గార్కి నా కైమోడ్పులు.

*(పొనుగోటి కృపాకర్ మాదిగ 'మాగూడెంలోకి రా"*
*కవితాసంపుటికి రాసిన ముందుమాట)*

★★★

# వ్యవస్థీకృత నియంతృత్వంపై విముక్తి పోరాట గీతాలు!

స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం అనే మౌలిక భావనలు ప్రపంచ మానవుణ్ణి ఆధునిక సమాజం వైపు నడిపించాయి. సమాజంలో నెలకొన్న నిరంకుశత్వాన్ని నిలదీసి విశాల ప్రపంచాన్ని చూపిన భావాలవి. అనాగరిక మానవ సమాజం నివసించిన చోటు నుండి నాగరిక మానవుడు నివసించే చోటుకి దారి చూపిన భావాలవి. నియంతృత్వాన్ని పటాపంచలు చేసి ప్రజాస్వామ్యాన్ని బహిర్గత పరిచిన ఆధునిక భావాలవి.

కొన్ని సార్లు నియంతృత్వం తన స్వభావాన్ని మార్చుకుంటుంది. వ్యక్తిగతంగా కనిపించిన నియంతృత్వం మరికొన్ని సార్లు వ్యవస్థీకృతంగా పరిణమిస్తుంది. వ్యవస్థీకృత నియంతృత్వం చట్టాలు, శాసనాలు, న్యాయవ్యవస్థలను శాసిస్తుంది. అయినప్పటికీ అది మానవత్వం ముందు తలొంచక తప్పని పరిస్థితి ఒకటి వస్తుంది.

వ్యవస్థీకృత నియంతృత్వం రకరకాలుగా చొచ్చుకొస్తుంటుంది. మొదట కనీసావసరాల కోసం అర్రులు చాచి, అవి అందిన తర్వాత మరలా ఆ అవకాశాల్ని మరొకరికి అందకుండా చేయడమనేది దీని స్వభావం. అది మతం, కులం, ప్రాంతం, జెండర్ మొదలైన స్వరూపాల్లో కనిపిస్తుంటుంది. భారతదేశంలో మతం వల్ల కులం సృష్టింపబడటం, దాని వల్ల అది అవిభాజ్యమైన స్థితిలో వ్యవస్థీకృత నియంతృత్వమై రాజ్యమేలుతుంటుంది. ఆధునిక సమాజంలో కూడా ఈ 'నియంతృత్వం' కొనసాగుతుంది. కాకపోతే ఒకనాడు 'రాచరికం' నియంతృత్వం పేరుతో కనిపించకుండా ఈ 'వ్యవస్థీకృత నియంతృత్వం' మరొక రూపంలో తన ఆధిపత్యాన్నీ, నిరంకుశత్వాన్ని చెలాయిస్తుంటుంది.

భారతదేశంలో హిందూమతం మిగతా మతాలపై వ్యవస్థీకృత నియంతృత్వాన్ని పాటిస్తుంటే, మిగతా మతాలు కూడా అంతర్గతంగా మరికొన్ని పాయలుగా చీలిపోయి మరో వ్యవస్థీకృత నియంతృత్వానికి బాటలు వేస్తుంటే. హిందూమతం చాతుర్వర్ణ్యాన్ని సృష్టించి, వర్ణం నుండి కులాన్ని, కులం నుండి వృత్తుల్ని వేరు వేరుగా చేస్తూ రకరకాలుగా మానవుల మధ్య అంతరాల్ని పెంచింది. అప్పుడది అంతర్గత వ్యవస్థీకృత నియంతృత్వానికి అవకాశమిచ్చింది. 'మనమంతా ఒక్కటే' అంటూనే మన మధ్య కనిపించని గోడల్ని కట్టుకునేలా చేసింది. (చూడు: 1.ఫుట్ నోట్స్)

నేడు సమాజంలో నిమ్నత్వానికి గురైన, గురౌతున్న కులాలు కులాధిపత్యం నుండి బయటపడ్డానికి ప్రయత్నిస్తున్నాయి. అణచివేతకు, అవమానాలకు గురైన ఈ కులాలు ఆధిపత్యాన్నుండి బయటపడాలనుకుంటున్నాయి. దీనిలో భాగమే తమ ప్రత్యేక అస్తిత్వాన్ని తాము కోరుకోవడం. ప్రత్యేకంగా అస్తిత్వ ఉద్యమాలు రావడం. తమ జీవన విధానంలో ఇతరుల జోక్యాన్ని సహించకపోవడమనేదొక అస్తిత్వ ఉద్యమాల్లో కనిపించే ఒక ప్రధాన లక్ష్యం. అంతేకాకుండా భారతీయులుగా తమకున్న హక్కుల్ని తాము పొందాలను కోవడం కూడా మరో ఆకాంక్ష. ఇలా ఒక గోడ నుండి బయటకొచ్చిన పీడిత కులాల్ని దళితులుగా పిలుచు కుందామనుకున్నారు. వీళ్ళందరికీ ఒక రక్షణ గోడను నిర్మించుకుందామనుకున్నారు. అదే రాజ్యాంగంలోని ప్రత్యేక షెడ్యూల్. అందుకే వీళ్ళని 'షెడ్యూల్డు కులాలు' అని పిలిచారు.

కొన్ని కులాలు, కొన్ని తెగలు ఒక ప్రత్యేక షెడ్యూల్ లోకి వచ్చేటప్పటికి ఉన్న ప్రమాణాలు నాటి ఆధిపత్య కులాల నుండి తీసుకున్నారు. నాటి ఆ వ్యవస్థీకృత నియంతృత్వాన్ని సహించలేక చేసిన ప్రజాస్వామిక పోరాటాల ఫలితంగా ఏర్పడ్డ 'షెడ్యూల్' అది. అవే ఆత్మగౌరవ పోరాటాలు. ఇప్పుడు మరలా అటువంటి వ్యవస్థీకృత నియంతృత్వాన్ని ఎప్పుడో ఏర్పాటు చేసుకున్న గోడ లాంటి షెడ్యూల్ లో కనిపిస్తున్న వ్యవస్థీకృత నియంతృత్వాన్ని వద్దంటున్నారు. తమకి వేరే గోడ కావాలంటున్నారు. అది హిందూమతం నుండి ఒక ప్రత్యేక 'షెడ్యూల్'గా ఏర్పడిన గోడ లాంటి దాన్నే మరొకటేదో కట్టు కోవాలనుకుంటున్నారు. ఆక్రమణలను అడ్డుకోవాలంటే తమకీ రక్షణ గోడలు తప్పవు. వాటిని వ్యవస్థీకృతంగానే నిర్మించుకోవాలి. అదే ఇప్పుడు భారత దేశవ్యాప్తంగా 'షెడ్యూల్డు కులాలు' కోరుకుంటున్న తమ తమ మనుగడను గుర్తించగలిగే అస్తిత్వ పోరాటాలు. అవే దళిత రిజర్వేషన్స్ లో ఉప వర్గీకరణకు (Sub-Categorization) జరిగే ఆత్మగౌరవ పోరాటాలు.

అంతర్గత వ్యవస్థీకృత నియంతృత్వం పై జరిగే అస్తిత్వ పోరాటాలు. కాలానుగుణ మార్పుల్ని అనుసరించి చేయమంటున్న మానవీయ పోరాటాలు. ఇవి భారతదేశవ్యాప్తంగా

జరుగుతున్నాయి. దీని ఫలితంగానే 1965లో భారత ప్రభుత్వం B.N.Lokur అధ్యక్షతన ఒక కమిటీని ఏర్పాటు చేసింది. దీనిలో A.D.Pande గారు మెంబరుగాను, N.Sundaram గారు మెంబర్ సెక్రటరీగాను ఉన్నారు. దేశవ్యాప్తంగా రిజర్వేషన్లు అందుకుంటున్న షెడ్యూల్డు కులాలు, తెగల జాబితాల్లో గల వారి జీవన గమనాన్ని ఈ కమిటీ పరిశీలించింది. తమ నివేదికలోని రెండవ అధ్యాయం 12వ నియమావళిలో వివిధ జాబితాల స్థితిగతుల్ని వివరించారు. 1931, 1935, 1950లలో గుర్తించిన షెడ్యూల్డు కులాలు, తెగల జాబితాను అధ్యయనం చేశారు. 1931 జాబితాలో ఆదిమ గిరిజన తెగలుగా పేర్కొన్నవారిని 1935 జాబితా నాటికి వెనుకబడిన గిరిజన జాతులుగా వ్యవహరించడాన్ని గుర్తించాలన్నారు. (చూడు: 2, 3 పుట్ నోట్స్ )సవరించిన 1950, 1956ల నాటి జాబితాల్లోనూ అదే విధానాన్ని పాటించారని గుర్తు చేశారు.

కొన్ని కులాలు, తెగలు అభివృద్ధి చెందాయనడానికి తాము తీసుకున్న ప్రమాణాలను వివరిస్తూ '*We have revising the list, adopted the test of extreme social, educational and economic backwardness of castes, arising out of the traditional custom of untouchability"* అని పేర్కొన్నారు. దీనితో పాటు సాంప్రదాయకంగా అదే వృత్తిలో జీవిస్తున్నవారికీ, అవకాశాలను అందిపుచ్చుకుని ఆధునిక జీవన వైవిధ్యాన్ని, వికాసాన్ని అందుకుంటున్న సామాజిక కులాలకు మధ్య గల సాంఘిక అంతస్థులను కూడా గుర్తిస్తూ '*In fact, the line of demarcation between the high castes and low castes, which was fairly clear in the past, has tended to become blurred'* అని అన్నారు.

లోకూర్ కమిటీ నిర్దేశించిన అంశాల నుండి మనం ముఖ్యంగా గుర్తించా ల్సిందొకటి కనిపిస్తుంది. ఒక అంతస్థు నుండి మరొక అంతస్థులోకి వచ్చిన వాళ్ళు ఒక సామాజిక వ్యవస్థగా ఏర్పడ్డానికి అవకాశాలున్నాయి. ఉన్నత, నిమ్న కులాలనే అంతరువులు మరలా ఒకే కులంగా గుర్తించిన జాబితాలో కూడా కనిపించాయి. లోకూర్ కమిటీ గుర్తించినట్లే మాదిగ హక్కుల దండోరా ఉద్యమకారులు కూడా ఇలాంటి వ్యత్యాసాల్నే సరిదిద్దమంటున్నారు. అవకాశాల్ని అందరికీ అందుకునే వ్యవస్థని కల్పించమని ప్రాధేయపడుతున్నారు. వీరి అవమానాల్నీ, వీరి ఆకల్నీ, వీరి ఆశల్నీ గుర్తించకుండా 'మనమంతా ఒకటే' అని చెప్తుంటే దీన్ని ఎలా అర్థం చేసుకోవాలని కవులు కూడా కవిత్వమై ప్రశ్నిస్తున్నారు. *మాదిగ చైతన్యం (1997), దండోరా దరువు (2005), కైతునకల దండెం (2008)* మొదలైనవన్నీ ఎస్సీ వర్గీకరణను సమర్థిస్తూ వివిధ సంస్థల ద్వారా వచ్చిన కవితా సంకలనాలు. ఈ భావజాలాన్ని

మరింత ముందుకు తీసుకొచ్చే ప్రయత్నంలో వెలువడుతున్నదే ఈ'కువ్వ' (ఎస్సీ వర్గీకరణ సంఘీభావకవిత్వం 2016) కవితా సంకలనం.

★★★

తెలుగు సాహిత్యంలో తొలిసారిగా జాషువ మాల–మాదిగల మధ్య పెరిగిపోతున్న దూరాన్ని కూడా గుర్తించి సరిదిద్దుకోమన్నాడు. హిందూమతం వల్ల క్రైస్తవంలోకి వచ్చినా వీళ్ళు...

*''మాలయేసు క్రీస్తు మాదిగలకు గాడు*
*మాదిగేసు క్రీస్తు మాకు గాడు"*

అనే రీతిలోనే ప్రవర్తిస్తున్నారని (ఖండకావ్యం, 3) జాషువా ఆవేదన చెందాడు. అంతేకాదు 'గబ్బిలం' కావ్యంలో అస్పృశ్యత స్వభావాన్నిలా వర్ణించాడు కవి.

*'కలదమ్మా ప్రణమంటరానితమ మాకర్ణింపు మీ యిండియా*
*పొలమందుంగల మాల మాదిగలకున్ భూతేశుడే కాదు కృ*
*ష్ణులు, కృష్ణున్ నిరసించు దైవములు క్రీస్తుల్ మస్తుగా బుట్టినన్*
*కలుపన్నేరరు రెందుజాతులను వక్కాణింప సిగ్గయ్యెడిన్" –*

*(గుర్రం జాషువ – గబ్బిలం)*

మాల, మాదిగలకు చెందాల్సిన ఎవరి వాటాలు వాళ్ళకు చెందాలనే ఆర్థికాంశాలతో ఆయన మాట్లాడకపోయినా మాల–మాదిగలు కలిసిమెలిసి ఉండలేకపోతున్నారని మాత్రం స్పష్టంగానే చెప్పాడు. అయితే, అస్పృశ్యతే మాల–మాదిగలను కలసి ఉండకుండా చేసిందని జాషువా ఆవేదనలోని ఆంతర్యం. శాస్త్రీయంగా పరిశీలిస్తే అలా మాల, మాదిగలు కలిసి మెలిసి ఉండలేకపోవడానికి గల కారణాల్లో అత్యంత ముఖ్యమైంది లోకూర్ కమిటీ గుర్తించిన అంశాలే కనబడుతున్నాయి. వంశపారంపర్యంగా, సాంప్రదాయికంగా వెంటాడుతున్న వృత్తులు. ఆ వృత్తుల వల్ల సమాజంలో తగిన గౌరవం లభించకపోవడం. చనిపోయిన పశువుల్ని, జంతువుల్ని తీసి, ఆ ప్రాంతాల్ని శుభ్రం చేసే చర్మకారులు భారత దేశవ్యాప్తంగా ఉన్నారు. వాళ్ళే చమార్, మాదిగ మొదలైన పేర్లతో వ్యవహరించబడుతున్నారు. నిజానికి వీళ్ళు సామాజికంగా అత్యంత అస్పృశ్యతకు, నిరాదరణకు గురవుతున్నారని వారి వృత్తుల పట్ల కనీస పరిజ్ఞానం ఉన్నవాళ్లెవరైనా అంగీకరిస్తారు. కానీ, వివిధ రాష్ట్రాల్లో వివిధ పేర్లతో ఉన్నవాళ్లు అంటరానితనాన్ని గుర్తిస్తూ పంపిన జాబితాలు లోపభూయిష్టంగా తయారయ్యాయి. అవే తర్వాత రాజ్యాంగ రచనా సమయంలో కూడా పాలకులతో సన్నిహిత

సంబంధాలున్న సామాజిక వర్గాలు పంపిన జాబితాలకు ప్రేరణలయ్యాయి. వీటిలో అత్యంత అస్పృశ్యులతో కలిపి సమాజంలో కొంచెం నిర్లక్ష్యానికి గురైన సామాజిక వర్గాల్ని కూడా 'అంటరానివాళ్ళ జాబితా'లో చేర్చేసారు. (చూడు: 3 పుట్ నోట్స్) దీనివల్ల లోకూర్ కమిటీలు వంటివి పునఃసమీక్షకు పూనుకోవాల్సి వచ్చింది.

భారతరాజ్యాంగంలో ఒక సౌలభ్యం ఉంది. రాజ్యాంగాన్ని సవరించుకొని గానీ, అత్యవసరమైతే భారత రాష్ట్రపతి ఆమోదంతో గాని కొన్ని చేర్పులు, మార్పులు చేయవచ్చు. అందుకే ఆర్టికల్ 341 ప్రకారం కొన్ని జాబితాల నుండి కొత్త కులాల్ని గుర్తించి చేర్చడం, తొలగించడం చేసే అధికారాన్ని కట్టబెట్టారు. అధికారంలో ఉన్న ప్రభుత్వానికి బలమైన మెజారిటీ ఉన్నప్పుడు తాత్కాలికంగా దీన్ని చేసి, తర్వాత రాజ్యాంగ సవరణ ద్వారా రాజ్యాంగంలో ఆ కులాల్ని చేర్చుకోవచ్చు.

ఇక్కడ కూడా 'వ్యవస్థీకృత నియంతృత్వం' శక్తిమంతంగా పనిచేసి చేర్పులు, మార్పులు, సవరణలు చేయకుండా అడ్డుకోగలుగుతుంది. షెడ్యూల్డు కులాల వర్గీకరణకు సమైక్య ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో మూడు సార్లు (1997, 2004. 2008) అసెంబ్లీ ఏకగ్రీవంగా తీర్మానం చేసి ఆమోదించారు. ఈ తీర్మానాలు శాస్త్రీయమైన పద్ధతిలో జరిగిన సర్వేల పరిశీలనానంతరం, అసెంబ్లీలో చర్చోపచర్చలానంతరం జరిగాయి. దీనితో పాటు సమైక్య ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఆంధ్రప్రదేశ్, తెలంగాణ రాష్ట్రాలుగా విభజన జరిగిన తర్వాత తెలంగాణ రాష్ట్రం మరలా ఎస్సీ వర్గీకరణకు ఆమోదం తెలుపుతూ 2015లో అసెంబ్లీ తీర్మానాన్ని ఏకగ్రీవంగా ఆమోదించింది. ప్రజల మనోభీష్టం ప్రకారం చట్టాల రూపకల్పన జరిగే అసెంబ్లీలు పంపిన తీర్మానాలను కేంద్రప్రభుత్వం పరిశీలించి, పార్లమెంటులో రాజ్యాంగబద్ధతను కల్పించాల్సిన అవసరం ఉంది. కానీ అది ఎస్సీ వర్గీకరణ విషయంలో జరగడం లేదు. దీనికి కారణాలనేకం ఉన్నా, అత్యధిక మాల, మాల ఉపకుల వ్యవస్థీకృత నియంతృత్వమే ఒక ప్రధాన కారణమనీ గుర్తించాలి.

ఈ వ్యవస్థీకృత నియంతృత్వం నుండి విముక్తి కోసం చెల్లాచెదురుగా ఉన్న పీడిత కులాలు ప్రజాస్వామికబద్ధంగా ఉద్యమాలు చేస్తున్నాయి. ఆ ఉద్యమాలకు ఊతమిచ్చేలా కళాకారులు ప్రదర్శనలు చేస్తున్నారు. ఈ సమస్యను సవివరంగా సాహిత్యకారులు వివిధ ప్రక్రియల్లో వర్ణిస్తున్నారు. పాటగా, కవితగా, కథగా, నవలగా, నాటకంగా ఎస్సీ వర్గీకరణ సమస్యను సృజన సాహిత్యం ద్వారా ముందుకు తీసుకొస్తున్నారు. వీటిని కూలంకషంగా పరిశీలించిన మేధావులు సాహిత్య విమర్శను రాస్తున్నారు. సమస్యను చిత్రించడంతో పాటు సమస్య సున్నితత్వాన్ని సృజనీకరించడంలో గల సాహితీకారుల భిన్న దృక్పథాలను

పరిశోధకులు పునరన్వేషణ చేస్తున్నారు. అన్నింటిలోను కనిపించేదొకటే– అది వ్యవస్థీకృత నియంతృత్వం. అదిప్పుడు మాల, మాల ఉపకులాల రూపంలో మాదిగ, మాదిగ ఉపకులాలపై ఆధిపత్యాన్ని చెలాయిస్తుంది.

★★★

దళితులకు అమలవుతున్న రిజర్వేషన్స్ దళితుల్లోని అన్ని ఉపకులాలకు వారి వారి జనాభా ప్రకారం సమాన పంపిణీ సూత్రం ప్రాతిపదికగా జరగాలని 1994 జూలై 7న ప్రారంభమైన మాదిగ రిజర్వేషన్ పోరాట సమితి లక్షలాది మందితో ఉద్యమాలు చేసింది. దీనికంటే ముందుకూడా ఉపకులాలకు సమానావకాశాలకోసం ఉద్యమాలు జరిగాయి. అరుంధతీయ సమాఖ్య, షెడ్యూల్డు క్యాస్ట్ ఫెడరేషన్స్, షెడ్యూల్డు కులాల సంక్షేమ సంఘాలు మొదలైన పేర్లతో ఆ ఉద్యమాలు జరిగాయి. కానీ, రాష్ట్రవ్యాప్తంగా ఉన్న అన్ని దళిత ఉపకులాల గురించీ శాస్త్రీయమైన పద్ధతుల్లో ఉద్యమాలు చేయడానికి ప్రయత్నించింది మాత్రం 'మాదిగ రిజర్వేషన్ పోరాట సమితి' అనే చెప్పుకోవాలి. తర్వాత దీన్నే 'మాదిగ హక్కుల దండోరా' గా నామకరణం చేసి పోరాడారు. కేవలం రెండేళ్ళలోనే అంటే 1996 నాటికే రాష్ట్రవ్యాప్తంగా అన్యాయానికి గురవుతున్న ఉపకులాల్లో చైతన్యం వచ్చింది. తమ హక్కులు తమకి కావాలని పోరాడేలా ప్రేరణనిచ్చింది దండోరా ఉద్యమం. మాదిగలకు ఆత్మగౌరవాన్ని కట్టబెట్టింది. అందువల్లనే నాటి ప్రభుత్వం జస్టిస్ రామచంద్రరాజు కమీషన్ని వేసింది. ఈ నివేదికలో మాదిగ, మాదిగ అనుబంధ కులాలు అన్యాయానికి గురవుతున్నాయని అందువల్ల ఎస్సీ వర్గీకరణ చేయడమే న్యాయమని పేర్కొంది.(చూడు. 4 ఫుట్ నోట్స్)

జస్టిస్ రామచంద్రరాజు కమీషన్ నివేదికలో 'మాదిగ, ఉపకులాలకు అధిక ప్రయోజనం చేకూరేలా వర్గీకరణను ప్రతిపాదించారనే విమర్శ వచ్చింది. అందువల్ల కోస్తా ప్రాంతాల్లోని ఆదియాంధ్రులు నష్టానికి గురవుతున్నారని గ్రహించి 'మాలలు'గా సర్టిఫికేట్స్ మార్పించుకోవడం అత్యంత వేగవంతంగా జరిగిపోయింది. నిజానికి ఆదియాంధ్రులు అనేది ఒక ప్రత్యేకమైన తాత్త్విక దృష్టితో వచ్చిన పదం. తమిళనాడులోని ఆది ద్రావిడ ఉద్యమం ప్రేరణతో ఆంధ్రప్రదేశ్ లో ఆదియాంధ్రులుగా మాల, మాదిగ అనే భేదం లేకుండా మార్చుకున్నారు. ఈ చారిత్రక సన్నివేశాన్ని రామచంద్రరాజు కమీషన్ విస్మరించింది. అప్పటికి కుల వృత్తుల్లేక వ్యవసాయ పనులు చేసుకోవడం మొదలు పెట్టారు. దీనితో పాటు మిలటరీలో సైనికులుగా మరికొంతమంది వెళ్ళిపోయారు. దీనివల్ల సాంప్రదాయికంగా మాల ఉప కుటుంబానికి చెందిన కొన్ని కుటుంబాల వాళ్ళు చచ్చిన పశువుల్ని, జంతువుల్ని తీసుకెళ్ళడం,

పరిసరాల్ని పరిశుభ్రం చేయడం అనే కులవృత్తుల నుండి విముక్తి పొందారు. కులం మారకపోయినా, సామాజిక హోదాలో మార్పు కనిపించసాగింది. మరోవైపు కొంతమంది ఆలోచనాపరులైన మాల, మాదిగలు క్రిష్టియన్స్ గానో, ముస్లిములుగానో మారిపోయారు. అందువల్ల విద్యావంతులు కాగలిగారు. సహజంగా వీళ్ళకీ సామాజిక హోదాలో మార్పు కనిపిస్తుంది. ఆలోచన కూడా వికసిస్తుంది. ఆత్మగౌరవంతో పాటు, తిరుగుబాటు తత్త్వం అలవడుతుంది. అలా అలవడిన మాల, మాదిగ ఉపకులాల వారే ఆదియాంధ్రులుగా కోస్తాప్రాంతంలో ఎక్కువగా కనిపిస్తారు. రామచంద్రరాజు కమీషన్ ప్రతిపాదనలు వీరికి తీవ్ర నష్టాన్ని కలిగించేలా అనిపించింది. అందువల్ల ఈ ప్రాంతంలోని ఆదియాంధ్రులుగా ఉన్న మాదిగలు, మాలలు కలిసి ఎస్సీ వర్గీకరణను తీవ్రంగా వ్యతిరేకించడంతో వ్యవస్థీకృత నియంతృత్వాన్ని ముందుకి తీసుకురాగలిగారు. 2000వ సంవత్సరంలో ప్రభుత్వం తీసుకొచ్చిన ఆర్డినెన్స్ ని 2004 సెప్టెంబరు 4న సుప్రీంకోర్టు తీర్పు ద్వారా కొట్టించేయగలిగింది కూడా ఈ వ్యవస్థీకృత నియంతృత్వమే

భారతదేశంలో రిజర్వేషన్స్ రావడానికి గల కారణాలను, వాటిని పొందుతున్న వర్గాలు, వాటిని పొందడమే కాకుండా మిగతావాళ్ళని పొందకుండా అడ్డుకుంటున్న ఈ పరిణామాలన్నింటినీ చారిత్రకంగా పరిశీలించాల్సిన అవసరం ఉంది. ఆర్టికల్ 341 ప్రకారం రాష్ట్రపతి చేత షెడ్యూల్డు కులాల జాబితాను మార్పులు, చేర్పులు చేయించినట్లయితే దానికి చట్టబద్దత వచ్చి ఉండేది. ఈ పనిని రాష్ట్రప్రభుత్వం చేయలేదు. అది ఉద్దేశపూర్వకంగా చేయలేదో మరో కారణమో ఆ విషయాలు బహిర్గతం కాలేదు. కానీ, అప్పటికి పార్లమెంటులో రాజ్యాంగ సవరణ చేయడానికి అత్యధిక మెజారిటీ గల ప్రభుత్వం లేదు. అధికారంలో ఉన్న అప్పటి కేంద్రప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వానికి సంపూర్ణ సహకారం అందించే స్థితిలో కూడా లేదు. అందువల్ల అక్కడ మాలలు, మాల ఉపకుల వ్యవస్థీకృత నియంతృత్వం వల్ల మాదిగ, మాదిగ ఉపకులాలకు జరగాల్సిన న్యాయం జరగలేదు.

లోకూర్ కమీషన్ వివిధ రాష్ట్రాల్లో అభివృద్ధి చెందిన ఉపకులాలను, షెడ్యూల్డు కులాలను ఒకేసారి కాకుండా అంచెలు అంచెలుగా తొలగించాలని సూచించింది. ఒకేసారి తొలగిస్తే వచ్చే అనర్థాలను ఊహించగలిగింది. కానీ, జస్టీస్ రామచంద్రరాజు కమీషన్ మాదిగ, మాదిగ ఉపకులాలకు అత్యధిక ప్రయోజనాన్ని చేకూర్చేటట్లు (అలా చేయాల్సిన అవసరం ఉన్నప్పటికీ) అవకాశాలను ప్రతిపాదించే సరికి మాల, మాల ఉపకులాలు తమ అవకాశాల్ని ఒక్కసారిగా కోల్పోవడాన్ని జీర్ణించుకోలేకపోయాయి. ఈ పరిణామాలన్నీ జాగ్రత్తగా గమనిస్తున్న తొలితరం మాల, మాదిగ మేధావి వర్గం లోకూర్ కమీషన్

ప్రతిపాదనలు తమలాంటివారికి ప్రమాదాన్ని తెచ్చిపెడతాయని తమ పిల్లలకు రిజర్వేషన్ అవకాశాలు లేకుండా అంతర్గతంగా క్రిమీలేయర్ ప్రతిపాదించే అవకాశం వస్తుందని భావించి తటస్థంగా నిలిచిపోవడం ప్రారంభించాయి. అలా ఉండిపోవడంలో అభివృద్ధి చెందిన మాల, మాదిగ వర్గాలన్నీ వ్యవస్థీకృత నియంతృత్వంలో భాగస్వామ్యాన్ని ప్రత్యక్షంగా కాకపోయినా పరోక్షంగా అందించినట్లే అయ్యింది.

ఒకవైపు మాదిగ హక్కుల దండోరాను, మరోవైపు ఎస్సీ వర్గీకరణను వ్యతిరేకిస్తున్న మాలమహానాడులో కూడా అంతర్గత ఆధిపత్యాలు బయటకొచ్చాయి. వీటి మధ్య రాజకీయ పార్టీలు పోటీ సంఘాల్ని పుట్టించాయి. ఇలా అంతర్గత కుమ్ములాటలకు దళితేతర అగ్రవర్ణ ఆధిపత్య వర్గాలు ఒకరికి తెలియకుండా మరొకర్ని తమ తమ పార్టీలకు ఉపయోగపడేలా ప్రోత్సహించాయి. అభివృద్ధి చెందిన దళిత సామాజిక వర్గాలు కూడా మాయమాటలతో అన్యాయానికి గురవుతున్న మాల, మాదిగ వర్గాలకు అన్యాయం చేస్తున్నాయి. వీటిని కొన్ని యూనివర్సిటీల్లోని విద్యార్థి సంఘాలు  గుర్తించి దళితుల్ని సమైక్య పరచాల్సిన చర్యల గురించి ఆలోచిస్తున్నాయి. (చూడు: 5 పుట్ నోట్స్) నిజమైన, బలమైన దళితసమైక్యత కోసం కూడా మాల, మాల ఉపకులాల్లోని కొంతమంది సాహితీవేత్తలు కూడా ఎస్సీ వర్గీకరణను సమర్థిస్తున్నారు. అలాగే దళితేతర సాహితీవేత్తలు కూడా ఎస్సీ వర్గీకరణలోని హేతుబద్ధతను ఆహ్వానిస్తున్నారు. ఇంటి సమస్యను పరిష్కరించుకోమని సూచిస్తున్నారు. వీళ్ళంతా ఇంటి సమస్య , బయటి సమస్యగా పరిణమించినప్పుడు తమ జోక్యాన్నెవరొకరు కోరుకుంటారనీ, దాన్ని సానుభూతి హృదయంతో అర్థం చేసుకొని దానిలో జోక్యం చేసుకోక తప్పదనీ హెచ్చరిస్తున్నారు. ఇలా మూడు వర్గాల నుండీ వచ్చిన కవితలను సేకరించి "కువ్వ" పేరుతో ఈ కవితా సంకలనాన్ని తీసుకొస్తున్నారు.

★

"కువ్వ" ఎస్సీ వర్గీకరణ సంఘీభావ కవితా సంకలనాన్ని తీసుకొస్తున్న డప్పోళ్ళ రమేశ్ అధ్యాపకుడు, ఉద్యమకారుడు, కవి, రచయిత, విమర్శకుడు, పత్రికా సంపాదకుడు. తెలంగాణ రాష్ట్ర విభజనలో బహుజనుల గొంతుని బలంగా వినిపించిన ఉద్యమకారుడు. అస్తిత్వోద్యమాల స్వరూప స్వభావాల్ని ఎప్పటికప్పుడు స్పష్టంగా గుర్తించగలిగినవాడు. అస్తిత్వ ఉద్యమాలు వక్ర ధోరణిలో పయనిస్తుంటే వాటికి సవ్యదిశను నిర్దేశించగల దార్శనికతను ప్రదర్శిస్తూ, క్షేత్రస్థాయిలో ఒక కార్యకర్తగా పనిచేయడానికి కూడా ప్రయత్నిస్తుంటాడు. అలా జనసమీకరణతో పాటు కవితలను కూడా సేకరించాడు. కవుల మధ్య గల హిపోక్రసీని స్వయంగా పరిశీలించినవాడు. సామాజిక న్యాయాన్ని ఆశిస్తున్న వర్గాల అస్తిత్వాన్ని

గుర్తించడానికి కవులను స్పందించమన్నాడు. ఒకనెల, మూడు నెలలు, ఆరు నెలలు, సంవత్సరం...ఇలా రోజుల తరబడి ఒక కవితకోసం కవుల చుట్టూ తిరిగాడు. కవితా సంకలనం తీసుకొని రావడం వల్ల అతడేదో వ్యక్తిగత ప్రయోజనాన్ని ఆశిస్తున్నాడనుకున్న వాళ్ళున్నారు. మాట్లాడలేని వాళ్ళ గొంతవుతున్నాడని, నడవలేని వాళ్ళ కాళ్ళవుతున్నాడనీ సంతోషించి స్పందించిన వాళ్ళూ ఉండడంతో ఇప్పటికైనా ఈ కవితా సంకలనాన్ని బయటకు తీసుకురాగలుగుతున్నాడు. దీనికి పెట్టిన సమయం, దీనికోసం వెచ్చించిన ఇతరాల్ని లెక్కించుకుంటే తన సొంత కవిత్వానికి సంబంధించి రెండు మూడు పుస్తకాల్ని తీసుకురాగలిగి ఉండేవాడు. తన వ్యక్తిగత ప్రయోజనం కంటే ఒక సామాజిక న్యాయం కోసం వ్యవస్థీకృతంగా ఇలాంటివాళ్ళ గొంతుకులన్నీ ఒకచోటే నినదించేలా చేయాలనుకున్నాడు. దీనిలో భాగమే "కువ్వ" కవితా సంకలనం.

'కువ్వ' కవితా సంకలనంలో ప్రధానంగా మూడు దృక్పథాలతో ఉన్న కవితలు కనిపిస్తున్నాయి. అవి: 1. ఎస్సీ వర్గీకరణకు స్వీయానుభవ వ్యక్తీకరణ దృక్పథం, 2. ఎస్సీ వర్గీకరణ సహానుభూతి సమర్థన దృక్పథం, 3. సమాన పంపిణీ-రాజ్యాధికార నిర్దేశ సమన్వయ దృక్పథం. ఎస్సీ వర్గీకరణ జరగడం వల్లనే తమ హక్కులు రాజ్యాంగబద్ధంగా తాము అందుకోగలుగుతామని, అది తక్షణం జరగాలనేది 'ఎస్సీ వర్గీకరణకు స్వీయానుభవ వ్యక్తీకరణ దృక్పథం'తో రాసిన కవితల్లో కనిపిస్తుంది. తాము మాదిగ, మాదిగ ఉపకులాలకు చెందక పోయినప్పటికీ, ఎస్సీ వర్గీకరణకు మద్ధతు తెలుపుతూ రాసిన కవితల్లో 'ఎస్సీవర్గీకరణ సహానుభూతి సమర్థన దృక్పథం' వ్యక్తమవుతోంది. రాజ్యాంగబద్ధంగా దళితులు సాధించుకున్న హక్కుల్లో ఒకటి రిజర్వేషన్స్. అవి సమాన పంపిణీ సూత్రంతో అమలు జరగాలి. ఒకవేళ అమలు జరగకపోతే పోరాడ్డం కూడా ప్రజాస్వామ్యంలో ప్రతివాళ్లకీ ఉన్న మరో హక్కు. అయితే, కేవలం దీనితోనే ఆగిపోకుండా తమ శాశ్వత శత్రువుల్ని గుర్తించాలి. అది మనువాదం రూపంలో మళ్ళీ వ్యవస్థీకృత నియంతృత్వంగా అసంఘటిత సామాజిక వర్గాలపై ఆధిపత్యాన్ని చెలాయిస్తుంది. అందువల్ల తాత్కాలిక ఉపశమనంగా రిజర్వేషన్స్ కోసమే ప్రయత్నించకుండా, తమలో తామే శత్రువులుగా, శాశ్వత శత్రువులుగా మారకుండా పీడనకు గురౌతున్నవాళ్ళు, ఆత్మగౌరవం కోసం నిరీక్షిస్తున్న వాళ్ళూ ఏకమై బహుజనుల రాజ్యాధికారానికి ప్రయత్నించాలని ప్రబోధించే కవితల్లో 'సమాన పంపిణీ-రాజ్యాధికార నిర్దేశన సమన్వయ దృక్పథం' కనిపిస్తోంది. ఈ 'కువ్వ' కవితాసంకలనంలో గల కొన్ని కవితలను పరామర్శించే ప్రయత్నం చేస్తాను.

*"ఏమడిగాం మేము ఎబిసిడిలే కదా*
*ఎవరి మానాన వాళ్లం బతుకుదామనే కదా"*
*(వర్గీకరణ వ్యథ: డా॥ఎండ్లూరి సుధాకర్)*

అని తమ వాదనలో గల న్యాయాన్ని మరోసారి వినిపిస్తున్నారు కవులు. నిజమైన మానవత్వమనేది సమాన పంపిణీసూత్రాన్ని అమలు చేసుకోవడంలోనే ఉందంటూ...

*'నేను మానవతావాదినే*
*నా జాతి మనుగడకై తపిస్తున్నాను*
*నేను స్వార్థ పరుడను కాదు"*
*(ఎస్సీ వర్గీకరణ– అనివార్యం: కుక్కుముడి బాల ప్రసాదు)*

అని మాదిగహక్కుల పోరాటం వ్యక్తిగతమైన ఒకరిద్దరి ప్రయోజనాలను ఆశించింది కాదంటున్నారీకవులు. శాసన వ్యవస్థను, న్యాయ వ్యవస్థను కూడా ఈ కొద్దిమంది మేధావులు రహస్యంగా 'వ్యవస్థీకృత నియంతృత్వం'తో శాసించాలనే ప్రయత్నంతో కాలానుగుణంగా మారాల్సిన అవసరాన్ని చెప్పే రాజ్యాంగసవరణల్ని విస్మరించడాన్ని నిరసిస్తూ వ్యంగ్యధోరణితో కవిత్వమయ్యారు కవులు. అందుకనే...

*"రాజ్యాంగ విరుద్ధమట*
*రాజ్యాంగ సవరణ చేయరాదట*
*అంతా వారిష్టమట*
*అన్నదమ్ముల్లా కలిసుండాలట*
*అంబేద్కర్ అందరివాడట*
*రిజర్వేషన్ ఆస్తి ఫలాలు*
*అందరికీ చెందాలన్నాడట'*

అని హక్కుల్ని తమకు అనుకూలంగా మార్చుకోవాలనుకునే అంబేద్కర్ మాటల్నే వక్రీకరించే స్వభావాన్నీ, ఆచరణనీ ఈ కవులు గుర్తించమంటున్నారు. నిజంగా అంబేద్కర్ వారసులైతే, రిజర్వేషన్లు అందాల్సిన వారందరికీ సమానంగా అందడానికి ఎన్నిసార్లైనా రాజ్యాంగ సవరణచేయాల్సిందేనని కుండబద్దలు కొట్టినట్లు ప్రకటిస్తున్నారీ కవులు.

విద్యకు దూరం చేయబడిన మాదిగలు మోసపోవడంలో చిత్రమేముంది. అందుకే ఒకసారేమో ఒకషెడ్యూల్ గా ఏర్పడినప్పుడు, మరోసారేమో దాన్ని గుర్తించి లోకూర్ కమిటీగా గళమెత్తినప్పుడు, ఇంకోసారేమో రామచంద్రరాజు కమీషన్ గా చూపినప్పుడు.... అన్ని

సార్లూ మోసపోవడమే. అసెంబ్లీలు మూడుసార్లు తీర్మానాలు చేసినా, మరింత శాస్త్రీయంగా ఉషామెహ్రాకమీషన్ రూపంలో చెప్పాలనుకున్నా మోసపోతూనే ఉన్నారు. అయినా పోరాడ్డానికి ఓపికతగ్గదు. కొట్టిన బంతికే కదా మరింత వేగంగా తిరిగి రాగలిగే శక్తి.

*“సంఘర్షణ సహజం కదా*
*ఘర్షణ మాత్రమే వద్దు*
*లోకూర్ కమిటీ లోకం ముంగిట*
*ముగ్గువోసింది గదా*
*యింకా లాచ్చేరు వాదమెందుకు”*

*(గ్రహాలన్నీ విడపడ్డవేగదా: దప్పోల్ల రమేశ్)*

ఇక్కడ ‘ఘర్షణ సహజం’ అనడం ద్వారా వాస్తవాలు తెలిసినప్పుడు, మనిషి అజ్ఞానం నుండి జ్ఞానమార్గం వైపు పయనించి తెలివి తెచ్చుకున్నపుడు ప్రశ్నించే ఘర్షణ మొదలవుతుంది. నేడు మాదిగలు కావచ్చు భవిష్యత్తులో మరో ఉపకులం కావచ్చు. మళ్ళీ వాళ్ళకు అన్యాయం జరుగుతుందన్నప్పుడు మళ్ళీ వాళ్లలోనూ ఘర్షణ తప్పదని, అదే నేడిప్పుడు ప్రారంభమైందనీ, దీన్ని లోకూర్ కమిటీ వాస్తమని తెలిపిందంటున్నారు కవులు. ఇక్కడే మరో గొప్ప ప్రయోగం ఉంది. ‘లాచ్చేరు’ అనేది law అనే ఆంగ్ల పదాన్ని, చిన్న చిన్న తగాదాలొస్తే పరిష్కరించడానికిగానీ, పెద్దరికాన్ని నిలబెట్టుకోవడానికి దాన్నొక కోర్టులా వ్యవహరించుకునే ‘కచేరు’ లోని ‘చేరు’ పదాన్ని తీసుకొని ‘లాచ్చేరు’గా ప్రయోగించాడు కవి.

ఎస్సీ వర్గీకరణ సమస్య పరిష్కారానికి న్యాయస్థానాలకు వెళ్ళడాన్నీ, పెద్దమనుషుల ద్వారా వర్గీకరణకు ఒక ఒప్పందం జరగాలనే వాదనల్ని తీవ్రంగా నిరసించేందుకీ పదాన్ని ప్రయోగించాడు కవి. ‘కచేరు’ అనే పదం ‘సంగీతకచేరు’లో కూడా ఉంది. సంగీతకచేరీలకు ఆకలి కడుపుల్తో ఉన్నవాళ్లు వెళ్ళి కూర్చొని ఆకలి తీర్చుకోలేరు. ముందు వాళ్ల పొట్టలో కాస్తంత అన్నం పడాలి. తర్వాతనే ఆ ‘కచేరి’లో సంగీతాన్ని ఆస్వాదించడానికి ఇష్టపడతారు. పొట్టలు నిండిన మహానుభావుల్లా ‘పెద్దమనుషులు’ కూనిరాగాల తీర్పులివ్వాలనుకుంటే ఆకలికేకల మనుషులు వాటిని అంగీకరించలేరు. అలాగే తరతరాలుగా తమ హక్కుల్ని హరిస్తున్నవాళ్ళను చూస్తూ భరిస్తూ తాను తినాల్సినదాన్ని తినేస్తున్నవారి గురించి ‘కచేరి’లోకి వెళితే, ఆ కచేరిలె పెద్దలుగా కూర్చొనేదెవరు? ఆ పెద్దలిచ్చే తీర్పులెలా వస్తాయి? ఇవన్నీ ఆకలితో నకనకలాడుతున్న ఎస్సీ వర్గీకరణ కోరుకునే వాళ్ళకు సహిస్తాయా? అందుకనే దాన్ని ‘లాచ్చేరు’లని తీసిపడేస్తున్నాడు కవి. ఇలాంటి ప్రయోగాలెన్నో ఈకవితా సంకలనంలో

కనిపిస్తున్నాయి. అందుకే వర్గీకరణ పోరాటానికి 'పునరంకితం' అవ్వక తప్పట్లేదంటున్నారు కవులు.

*" మనకు పోరాటాలు కొత్తకాదు*
*అంటరానితనపు గాయాలు*
*బాధామయతీపి సలపరాలు కొత్తకాదు'*

*(పునరంకితం: గరికపాటి మణీందర్)*

అంటున్నారు కవులు.

ఈ పోరాటంలో అలిసిపోయేది లేదనే ఆత్మవిశ్వాసాన్నీ వ్యక్తం చేస్తున్నారు. "లాటీలు తూటాలు లెక్కజెయ్య" మంటున్నారు. ఈ మోసం ఈ నాటిది కాదనీ, జాంబవంతుని కాలం నుండీ జరుగుతునే ఉందని గుర్తుచేసుకుంటూ...

*"ఈనాటిదా ఈ కథ?*
*కామధేనువుని కోసుకుతిన్నప్పటి నుంచి*
*కయ్యం కాలు దువ్వుతూనే వుంది"*

*(వర్గీకరణ వ్యథ: డా.ఎండ్లూరి సుధాకర్)*

పురాణాల నాటి నుండీ జరుగుతున్న అన్యాయాల్ని గుర్తుచేసుకుంటున్నారీ కవులు. అంటే తరతరాలుగా ఈ ఆధిపత్య ధోరణి కొనసాగుతునే ఉందంటున్నారీ కవులు. అటువంటి భావననే మరో చోట కూడ మరో కవి ఇలా చెప్తున్నాడు.

*"కలిసి తిన్న అనుభవం*
*ఒక వెక్కిరింతైంది...!*

*(అన్నంగిన్నెలో అగ్నిపర్వతం: గుడిపల్లి నిరంజన్)*

ఎస్సీ వర్గీకరణ ఉద్యమాన్ని మాదిగ హక్కుల ఉద్యమంగా మాత్రమే గుర్తిస్తే సరిపోదనీ అది ఒక సమాజంలో వస్తున్న అస్తిత్వ ఉద్యమాల బీజరూపంగా గుర్తించాలంటున్నారు కవులు. ఇదొక Existentialism లో విస్తృతమైన సైద్ధాంతిక చట్రంలో చూడాలంటున్నారు. ఈ ఉద్యమానికి ఒక తాత్విక భూమిక ఉందంటూ...

*''రంగులెన్ని పులుముకున్నా*
*ఆలోచిస్తే... వర్గీకరణలో*
*ఉనికి సమస్య తలుక్కున మెరుస్తుంది*
*వర్గీకరణను నిరాకరిస్తే ఉనికే కనుమరుగవుతుంది"*

*(పుచ్చి బుర్రలవుతున్న బుద్ధి: గోగుశ్యామల)*

అని చెప్తూనే దీన్నొక సిద్ధాంతంగా, సామాజిక న్యాయం కోసం జరుగుతున్న అస్తిత్వ ఉద్యమంగా అర్థం చేసుకోవాల్సిన అవసరం ఉందంటున్నారు కవులు. అందుకే దీన్నిలా వర్ణిస్తూ...

*"ఇది మహిళల ఉనికి*
*అణగారిన దళిత కులాల ఉనికి*
*బిసి కులాల ఉనికి*
*పిల్లల ఉనికి*
*వికలాంగుల ఉనికి...'*

*(పుచ్చి బుర్రలవుతున్న బుద్ధి: గోగుశ్యామల)*

అనేక సామాజిక న్యాయాలతో కలిసి నడుస్తున్న ఉద్యమంగా గమనించలేని సామాజిక అవగాహనా రాహిత్యాన్ని కూడా ఎత్తిచూపుతున్నారు. సామాజిక ఉద్యమాల పుట్టుక, వికాసాలన్నీ మాదిగ హక్కుల కోసం జరిగే వర్గీకరణ ఉద్యమంలో కనిపిస్తున్నాయని దీన్ని సిద్ధాంతీకరించాల్సిన అవసరాన్ని మేధావులు కూడా గుర్తించాలని అంటున్నారు కవులు.

ఎస్సీ 61 ఉపకులాల్లో గల చిన్న చిన్న విభేదాలు సమసిపోకపోతే అస్తిత్వ ఉద్యమాల మాటెలాగున్నా 'నిమ్నకులాలు'గానే గుర్తింపుతో బతుకుతున్న వాళ్ళ జీవితాలు మరింత దిగజారిపోయే ప్రమాదం పొంచి ఉందంటున్నారు కవులు. ఎస్సీ వర్గీకరణను వ్యతిరేకిస్తూ సమైక్యతపేరుతో వంచన చేసుకోవద్దంటున్నారు. దళితులకు అనేకాంశాలతో సాన్నిహిత్య సంబంధాలున్నా ఈ ఉపకులాల వారికి ప్రత్యేక అస్తిత్వాలున్నాయని గుర్తించాలని, అందువల్లనే కలిసి ఉన్నట్లున్నా కలిసి బతకలేకపోతున్నారనే సత్యాన్ని గుర్తించాలంటూ...

*"గీ పంచాదిని వొడువని కత చెయ్యకుండ్రిరా*
*గీ రాముని కాష్టం సల్లారనియ్యండ్రిరా*
*గియ్యాల సక్కెత సెదుదేందిరా...*
*గిప్పుడు లెక్కవేసిన మన యాభై తొమ్మిదిమి*
*అల్లుకొని ఘల్లుమన్న పల్లెలేదరా*
*అంతరాల బొందల్ని కూడుపుకున్న జాడలున్నయా*
*మన కంచాలను, మంచాలను కలిపి*
*ముడేసుకున్న పొత్తుల యిత్తు*
*సల్లుకున్న సంగతున్నయా"*

*(గోరుకొయ్యనై కావలుంటానురా...: జూపాక సుభద్ర)*

అని ప్రశ్నిస్తున్నారు కవులు. ఈ ఉపకులాల మధ్య పెళ్ళిళ్ళు, పేరంటాలు, కలిసి మెలిసి భుజించడం వంటివి జరగడం లేదనే వాస్తవాన్ని విస్మరించి, వంచనతో సమైక్యంగా జీవిస్తున్నామనే మాటలు మాట్లాడ్డం సరైంది కాదంటున్నారు కవులు. గ్రామీణ ప్రాంతాల్లోకి వెళ్లితే ఈ ఉపకులాల మధ్య కంచం, మంచం పొత్తులు లేవనే వాస్తవం తెలుస్తుంది. ఒకటి రెండు చోట్ల కులాంతర వివాహాలు జరిగినంత మాత్రాన, కలిసి భోజనం చేస్తున్నంత మాత్రాన కూడా అన్ని కులాల వాళ్ళకూ కంచం, మంచం పొత్తులు ఉన్నాయని మనం అంగీకరించలేం. అలాగే దళిత ఉపకులాల మధ్యకూడా జరుగుతున్నాయనేది సామాజిక, సాంస్కృతిక వాస్తవం. దీన్ని బలంగా అభివ్యక్తీకరించారీ కవులు. ఈ కవితలో తెలుగు సాహిత్యంలో గల జాతీయం 'రావణకాష్టం' అనేదాన్ని తిరగేసి 'రామునికాష్టం' అనడంలోను, వేయిపడగల పని పట్టాలని ప్రబోధించడంలోను దళిత జాగృతి కనిపిస్తుంది. ఎవరి వాటాల్ని వాళ్ళు పంచుకుంటూనే, మిత్రవైరుధ్యాల్ని శత్రువైరుధ్యాలుగా మార్చుకోవద్దనే సూచన కూడా వ్యక్తమైంది. ఈ స్పృహ ఇంచుమించు అన్ని కవితల్లోను ఉంది. తమ శాశ్వత శత్రువులెవరో, శాశ్వత మిత్రులెవరో, తాత్కాలిక మిత్రవైరుధ్యమెవరితో ఉండాలో, తమకి మిత్రవైరుధ్యం కేవలం రిజర్వేషన్ భాగాలకేననీ, కలిసిమెలిసి జీవించడానికో, కలిసిమెలిసి రాజ్యాధికారాన్ని సాధించడంలో వెనుకంజవేయడానికో కాదనే స్పష్టత కూడా ఈ కవులకుంది. ఇదే ఈ కవితా సంకలనంలో మిగతా కవితాసంకలనాలలోకంటే కనిపించే ఒక ప్రత్యేకత, ఒక విశిష్టత.

మాదిగలకు ప్రత్యేక అస్తిత్వం ఉందనీ, కళలున్నాయనీ ప్రత్యక్షంగా నిదర్శనాలున్నాయి. వాటిని తమ సంస్కృతులుగా చెప్పుకుని బతికేస్తున్నవాళ్ళు మాదిగల హక్కులే కాదు, మాదిగల సాంస్కృతిక వారసత్వాన్ని కూడా లాగేసుకోవాలని చూస్తున్న వైనాన్ని కూడా గుర్తించలేని స్థితిలోలేమని మాదిగకవులు స్పష్టంగానే ప్రకటిస్తున్నారు. అందుకే మాదిగల్ని, మాదిగ సంస్కృతిని ఎగతాళి చేసేవార్ని ఎండగడుతున్నారీ కవులు.

*"ఎవరూ ఎద్దేవా చెయ్యనక్కర్లేదు*
*మాదిగ సంస్కృతి అంటూ*
*భావజాలంమీద బ్రతికే*
*దిక్కుమాలిన పరాన్నభుక్కును కాను*
*ఎక్కడ నుండో దిగబడ్డ ప్రవాసిని కాను*
*నేను, అసలు సిసలైన జంబూ నివాసిని"*

*(మాదిగపాట: కొండెపోగు బి.డేవిడ్ లివింగ్ స్టన్)*

అని మాదిగల సాంస్కృతి వారసత్వాన్ని కూడా దోపిడీ చేసేవాళ్ళని హెచ్చరిస్తున్న కవిత్వం దీన్నిండా ఉంది. అందుకనే

*" నాచెమట తడవని నేల*
*ఇక్కడ పిసరంతైనాలేదు"*

అని గుండె ధైర్యంతో చెప్పగలుగుతున్నారు. తమకి చరిత్ర ఉందనీ, కళలన్నీ తమకు వారసత్వంగా సంక్రమించిన ఆస్తులనీ నిజమైన ఆత్మగౌరవాన్ని ప్రకటిస్తున్నారీ కవులు.

మాదిగ సాహిత్యం నుండే దళితసాహిత్యం పుట్టుకొచ్చిందనే వాదన చేయడానికి ఇలాంటి సాంస్కృతిక వారసత్వమంతా మాదిగలకే సొంతం కావడం ఒక ప్రధాన కారణం. డప్పు, చెప్పు వంటి కళాసాంస్క ృతిక వారసత్వంగానీ, భారతదేశంలో అత్యంత అస్పృశ్యతకు కారణమైన చచ్చిన శవాల్ని తీసి సమాజానికి శుద్ధిని నేర్పిన జాతి మాదిగ జాతి. ఆ జాతికే నిజమైన అంటరానితనం కూడా చెందాలి. హక్కులూ చెందాలి. వీళ్ళని చూసి చలించిపోయే కదా అందరూ మానవత్వం గురించి మాట్లాడింది. అంటరానితనం నిర్మూలన కావాలని వాదించింది. వీళ్ళ గురించే కదా కవిత్వమైనా, కథలైనా, నవలలైనా, నాటకమైనా, సినిమాలైనా వచ్చాయి. అంటరానితనమంటే గుప్పున వాసన వచ్చేది మాదిగపల్లేకదా. మరి మాదిగల గురించి రాయకపోతే ఇంకెవ్వరి గురించి రాస్తారు. వీళ్ళని చూపించే కదా రాజ్యాంగంలో రిజర్వేషన్లు పొందింది. వీళ్ళ పక్కని చేరేకదా రిజర్వేషన్లని బొక్కేది. చివరికి వీళ్ళ వారసత్వాన్ని కూడా దోచేయాలనుకుంటే ఎలా?

'అంటరానివసంతం'లో మాదిగలెక్కడున్నారని ప్రశ్నించినందుకు ప్రమోషన్లు ఆపేస్తారు. అంటరానివసంతంలో మా మాదిగపల్లె ఎక్కడుందని రాసినందుకు దాడులు చేస్తారు? కానీ, ప్రపంచసాహిత్యంలో అంటరానివాళ్ళుగా మాదిగలు కాని మాలలు గురించి రాసిన సాహిత్యం మాదిగల వారసత్వదోపిడీ గల సాహిత్యం తమదిగా చెప్పుకోవడం మాదిగల సాంస్క ృతిక వారసత్వాన్ని కూడా దోచుకోవాలనుకోవడం కాదా? వీటిని బలంగానే తిప్పికొడుతున్నారీ కవులు. ఈ కవితా సంకలనంలో ఎస్సీ వర్గీకరణను సమర్థిస్తున్న మాల కవులున్నారు. మాల, మాదిగలతో పాటు ఇతరులున్నారు. వీళ్ళంతా కోరుకునేదొకటే. సమాన పంపిణీ. సమానంగా ఎవరికి రావలసిన వాటిని వాళ్లు పొందడమే న్యాయమని ప్రబోధిస్తున్నారు.

ఈ విధంగా చూసినప్పుడు తెలుగు సాహిత్య చరిత్రలో దీనికొక విశిష్టమైన స్థానం

ఉందనడంలో సందేహం లేదు. ఈ కవిత్వం మానవత్వాన్ని తట్టిలేపుతుంది. ఎస్సీ వర్గీకరణ ఉద్యమంలోని మానవీయ కోణాల్ని సమాజానికి చూపిస్తుంది. ఎస్సీ వర్గీకరణ ఉద్యమం తెచ్చిన ఆత్మగౌరవాన్ని ప్రతిబింబిస్తుంది. న్యాయం కోసం మాదిగ, మాదిగ ఉపకులాల కవులు తపిస్తున్నారనే బలమైన అభివ్యక్తుల్ని మీముందకి తీసుకొస్తుంది. ఈ కవితల్ని చదివిన వాళ్లంతా మాదిగ దండోరా ఉద్యమంలోని సామంజస్యాన్ని సమర్థించడానికి ముందుకొస్తారనే ఆశ కలుగుతోంది. అందుకు ఇలాంటి మంచి కవితలను రాసిన కవులను, ఈ కవితలను ఇలా పుస్తకరూపంలోకి తీసుకొస్తున్న సంపాదకుడు దప్పోల్ల రమేశ్‌ను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

*(కువ్వ, ఎస్సీ వర్గీకరణ సంఘీభావ కవిత్వం,*
*సంపాదకుడు : దప్పోల్ల రమేశ్,*
*తెలంగాణ బహుజనం ప్రచురణ, హైదరాబాదు, 2016)*

★★★

## ఫుట్ నోట్స్:

1. వేదకాలం తొలి నాళ్ళలో వర్ణం అనేది ఆనాటి సామాజిక అవసరాల రీత్యా ఏర్పడింది. అప్పటిది Indus Civilization. అదే Indian Culture గా రూపాంతరం చెంది హిందూ జీవన విధానం ఏర్పడింది. ప్రకృతిని 'శక్తులు'గా ఆరాధించడం, విగ్రహారాధన, నియమ నిష్టలు తయారయ్యాయి. వివిధ స్మృతుల ద్వారా పాలకులు వాటిని అమలు చేసేవారు. అప్పుడది హిందూమతంగా మారిపోయింది. విదేశాల నుండి వివిధ 'మతాలు' భారతదేశంలో ప్రవేశించిన తర్వాత మేధావులు సంస్కరణ వాదులుగా, ప్రవక్తలుగా బయలుదేరారు. దాన్ని భక్తి ఉద్యమంలో భాగంగా పరిగణిస్తున్నాం. దీన్నే జాతీయోద్యమం కాలం నాటికి 'జాతీయ పునరుజ్జీవనం'గా సంస్కరణ వాదులు వేగంగా సమాజంలోకి తీసుకొచ్చే ప్రయత్నం చేశారు. అందుకే నేటికీ హిందూమతం- హిందూ జీవన విధానం వేర్వేరనే వాదం ఒకటి బయలుదేరింది. ఆలోచనలో హిందూ జీవన విధానం ఆచరణలో హిందూమతంగా మారిపోతోంది. అందువల్ల ఈ రెండింటినీ దళితులు విశ్వసించలేకపోతున్నారు. అయినప్పటికీ దళితులంతా హిందూ జీవన విధానాన్ని వ్యతిరేకిస్తున్నాంనలేం. అందువల్లనే తొలితరం తెలుగు కవుల్లో కుసుమ ధర్మన్న,

బోయి భీమన్న, జ్ఞానానందకవి మొదలైన వాళ్ళు హిందూ జీవనవిధానాన్ని పూర్తిగా వ్యతిరేకించారని చెప్పలేం. నిజానికి హిందూ జీవన విధానంలో బ్రహ్మ, సరస్వతి, నాలుగు వర్ణాలు మహాపురుషుడి నుండి పుట్టుకొచ్చారని చెప్పడం, అగ్నిదేవుడు, వరుణుడు, వాయుదేవుడు మొదలైనవన్నీ ప్రతీకాత్మక భావనలు. సామాన్య మానవుడికి అర్థం కావడం కోసం చెప్పిన ప్రతీకాత్మక భావనలు.

2., 3. The Report of the Advisory Committee on the Revision of the Lists of Scheduled Castes and Scheduled Tribes, Government of India, Department of Social Security, 1965, Pp;7

3. దళితేతర కులాల్లో నేటికీ మాల–మాదిగల మధ్య గల భేదాలు స్పష్టంగా తెలియవు. అందువల్లనే చచ్చిన పశువుల్ని, జంతువుల్ని తీసి ఆ ప్రాంతాల్ని శుభ్రం చేసేవాళ్ళనీ, ఊరిలో దండోరా వేసేవాళ్ళనీ, పొలం పనిచేసే మాల వారినీ ఒకలా 'మాల' వాళ్ళని పిలుస్తుంటారు. బ్రాహ్మణులు, రెడ్లలో కూడా ఇలాంటి ఉపవిభాగాలే ఉన్నాయి. ఇవి మిగతా కులాల వారికి చాలామందికి తెలియవు. అలాగే తెలుగు సాహిత్యంలో కూడా 'మాలవాళ్లు' అని ప్రస్తావించిన, వర్ణించిన వర్ణనలన్నీ అత్యధిక శాతం మాదిగలకు, మాదిగల జీవితాలకు సంబంధించినవై ఉండడాన్ని గమనించాలి. తెలుగు నిఘంటువులు కూడా వీటికి సాక్షీభూతంగా నిలుస్తున్నాయి.

4.I. There is disproportionate distribution of reservation benefits in favour of the 'Mala' group and 'Adi-Andhra' group of scheduled caste communities compared to their respective populations.

II. Both the 'Madiga' group and 'Relli' group of communities are not adequately represented either in public appointments or in educational institutions compared to their respective populations categorising these S.C. communities into four groups 'A', 'B', ............................ (Social Welfare (J1) Department, G.O.Ms .No. 68 dated 6-6-1997

5. హైదరాబాదు సెంట్రల్ యూనివర్సిటీలో మాలల, మాల ఉపకులాల ఆధిపత్యంలో కొనసాగే అంబేద్కర్ స్టూడెంట్స్ అసోసియేషన్ ఎస్సీ వర్గీకరణకు మద్ధతు తెలుపుతూ ధనరాజు అధ్యక్షుడుగా ఉన్నప్పుడు ఒక తీర్మానాన్ని చేసి క్యాంపస్ లో పోస్టర్స్ అతికించారు. తర్వాత ఏ కారణం చేతనో ఆ పోస్టర్స్ ని మర్నాడు తొలగించారు. ఆ విషయాన్ని ది.04 సెప్టెంబరు 2015 వ తేదీన అంబేద్కర్ స్టూడెంట్స్ అసోసియేషన్ విద్యార్థులు ఏర్పాటు చేసిన 'దళితసాహిత్యం: సవాళ్ళు' అనే అంశంపై

జరిగిన సదస్సు సందర్భంగా ఒక వక్తగా పాల్గొన్న నేను నా ప్రసంగంలో ప్రస్తావించాను. నేను ఈ విషయాన్ని మాట్లాడుతున్నప్పుడు ఈ తీర్మానాన్ని మందకృష్ణ మాదిగకు , మాదిగ దండోరా సభ్యులకు అందించామని, నేటికీ దానికి కట్టుబడే ఉన్నారనీ ఆ సభలో పాల్గొన్న డా॥శ్రీపతి రాముడు ప్రకటించారు. దీన్ని సెంట్రల్ యూనివర్సిటీ అంబేద్కర్ స్టూడెంట్స్ అసోసియేషన్ విద్యార్థులు కూడా నేటికీ ఎస్సీ వర్గీకరణను సమర్ధిస్తున్నామని, దానికి కట్టుబడే ఉన్నామని మరోసారి ప్రకటించారు. ఈ సమావేశంలో ఇన్స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ (సైబర్ క్రైమ్) గవర్నమెంటు ఆఫ్ ఆంధ్రప్రదేశ్ కి చెందిన శ్రీ పి.వి.సునీల్ కుమార్, ఐ.పి.ఎస్., యోగివేమన విశ్వవిద్యాలయంలో అసిస్టెంటు ప్రొఫెసరు డా॥ఎం.ఎం.వినోదినిగార్లు పాల్గొన్నారు. ఏది ఏమైనా క్యాంపస్‌లో బహిరంగంగా నేటి వరకు అంబేద్కర్ స్టూడెంట్స్ అసోసియేషన్ వారు ఎస్సీ వర్గీకరణను వ్యతిరేకించిన దాఖలాలు లేవు. ఇది నిజంగా ఒక శుభ పరిణామమే! అలాగే మిగిలిన విశ్వవిద్యాలయాల్లో కూడా ఎస్సీ వర్గీకరణకు మాల విద్యార్థి నాయకులు కూడా మద్ధతు ప్రకటించడంలో నిజమైన దళిత సమైక్యత వెల్లువిరిసే అవకాశాలు మెండుగా ఉన్నాయి.

★★★

# తెలుగు జాతి వారసత్వ సంపద

*'దేశ భాషలందు తెలుగు లెస్స', 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్'* అని ప్రశంసలను అందుకున్న తెలుగు భాష నేడు చర్చనీయాంశమైంది. దీనికి కారణాలనేకం ఉన్నా, ప్రపంచీకరణ ప్రభావంతో స్థానికతకు, స్థానిక భాషలకు అస్తిత్వం ప్రశ్నార్థకం కావడం ఒక ప్రధానకారణం. ప్రపంచీకరణలో ఇదొక బలహీనతగా కనిపిస్తూనే మరొక బలమైన అవకాశాన్ని కూడా కలిగిస్తోంది. శాస్త్ర, సాంకేతిక రంగాల్లో వచ్చిన విప్లవాత్మక మార్పుల వల్ల తమ భావాల్ని శక్తివంతంగా ప్రపంచానికి అందించగలుగుతారో ఆ సమాజం ప్రపంచాన్ని ప్రభావితం చేస్తుంది. అది స్థానికభాషల్లో కూడా జరిగినా ప్రపంచవ్యాప్తికి ఆటంకంగా మారదు సరికదా, దాన్ని అన్ని భాషల్లోకి అనువాదం చేసుకోవడమో, అవసరమైతే ఆ భాషను నేర్చుకోవడమో జరుగుతుంది. ఇది ప్రపంచీకరణ స్థానికతకు, స్థానిక భాషలకు అందించే బలమైన అవకాశం కూడా!

నేడు తెలుగు భాష అనేక బలహీనతల నుండి బలమైన శక్తిగా మారవలసిన అవసరం ఉంది. ఉమ్మడి మద్రాసు రాష్ట్రం నుండి విభజన జరిగిన తర్వాత నుండీ నేటి తెలంగాణ రాష్ట్రం ఏర్పడే వరకూ తెలుగు భాష అనేక ఆటుపోట్లకు గురికావలసి వచ్చింది. తెలంగాణ రాష్ట్రంలో కూడా తెలుగు భాషే వ్యవహారంలో ఉన్నా, తమదే నిజమైన తెలుగనీ, ఆంధ్రప్రదేశ్‌లో సంస్కృత ప్రభావిత ఆంధ్రభాష తమపై ఆధిపత్యాన్ని చెలాయిస్తుందనే వాదనలు కూడా అక్కడక్కడా వినిపిస్తున్నాయి. మరోవైపు చెన్నైలో తమిళం, కర్ణాటకలో కన్నడం, మహారాష్ట్రలో మరాఠీ భాషలే అధికార భాషలైనప్పటికీ, నేటికీ ఈ రాష్ట్రాల్లో తెలుగు భాషావ్యవహారం కొనసాగుతోంది. దీనితో పాటు ప్రపంచీకరణ వల్ల ప్రవాసాంధ్ర సాహిత్యం రూపంలో కూడా తెలుగు భాష ప్రపంచవ్యాప్తంగా వాడుకలోకీ వస్తోంది. ఈ పరిస్థితులన్నింటినీ గమనించిన కవి, పరిశోధకుడు డా॥వూటుకూరి ప్రసాద్ తెలుగు భాష

అందిపుచ్చుకోవలసిన అవకాశాల్ని స్ఫూరింపజేస్తూనే, జాతి వారసత్వ సంపదగా తెలుగు భాషను కాపాడుకోవాలనే లక్ష్యంతో *'తెలుగు పరిమళం'* వచన దీర్ఘకావ్యాన్ని రాశారు. తెలుగు భాష ప్రపంచానికి అందించిన సాంస్కృతిక వారసత్వాన్ని ఈ కావ్యం నిండా వర్ణించారు. తెలుగు భాష పుట్టుక, దాని వ్యాప్తి గురించి వర్ణిస్తూ ఒక నదిలా ప్రారంభమైందంటాడు కవి. నదీ ప్రవాహంలో అనేక మలుపులు తప్పవంటూ ఆంధ్రజాతి కూడా అలాగే ఒడిదుడుకులకు గురైందంటూ ...

*"లోయ పాయల్లో మాయా లోయల్లో*
*ధైర్యంగా అడుగులేసి*
*ఊట బాటల్లో నీటి తెట్లలో*
*ఈదుకుంటూ వచ్చి*
*చుట్టూతా తిరుగుకుంటూ"*

వచ్చిందని వర్ణించడంలో ఆంధ్రజాతి, తెలుగు భాష పడిలేస్తున్న స్థితిని కవి మనముందుంచాడు. భారతీయ సాహిత్యంలో తొలికావ్యంగా భావించే రామాయణంలోను, తర్వాత వచ్చిన పురాణాల్లోను ఆంధ్రుల ప్రస్తావనలు కనిపిస్తున్నాయి. ఆంధ్రుల ప్రాచీనత ఆంధ్రులు మాట్లాడిన భాషను కూడా తెలుగపుతుందని గమనించమంటాడు కవి. తొలి దశలో ఆంధ్ర జాతి మాట్లాడుకునే భాష ఆంధ్రభాషగా వ్యవహరించబడినా, తర్వాత కాలంలో దక్షిణ దేశ భాషగా మారి తెలుగుగా ప్రసిద్ధమైన స్థితిని వర్ణిస్తూ ఆంధ్ర భాషగా పిలువబడిందని గుర్తుచేస్తున్నాడు. దీన్ని బట్టి ఆంధ్రభాష అని పిలిచినా, తెలుగు భాష అని పిలిచినా తప్పేమీ లేదని సమర్థిస్తున్నాడు కవి. ఆంధ్రప్రదేశ్ వారు మాట్లాడేది 'ఆంధ్రం'గానో, తెలంగాణ వారు మాట్లాడేది 'తెలుగు' అనో పిలివాల్సిన పనిలేదని పరోక్షంగా వివరిస్తున్నాడు కవి. శాతవాహనులు మొదలుకొని చాళుక్యుల పాలనా కాలం వరకు తెలుగు భాష తొలిదశలో జనవ్యవహారంలో ఉన్నా, రాజమహేంద్రవరంలో లిఖిత భాషగా మారడంతో ఔన్నత్యాన్ని సంతరించుకుందంటూ ఇలా వర్ణించాడు.

*"వేంగి రాజ్యం పెదవేగి నుండి వేగంగా మార్చి*
*రాజమహేంద్ర వరాన్ని రాజధానిగా చేసి*
*చాళుక్యభూపాలుడు రాజరాజు ఏలుబడిలో*
*సారస్వత కళా పరిమళాలు విరజిమ్ముతున్న తరుణంలో*
*ఒకనాటి ప్రభాత అరుణిమలో నన్నయను*

*'తెనుగున రచియింపు' మనే అభ్యర్థన*
*ఎదలో పరవశమై ప్రవహించి*
*'శ్రీవాణీగిరిజా...' అంటూ*

*ఆదికవితగా అక్షరాకృతి దాల్చిందని* కవి వర్ణించడంలో తెలుగు భాష ఉన్నతి స్థితి ప్రారంభాన్ని సరిగ్గా గుర్తించినట్లయ్యింది.

నన్నయ తర్వాత తెలుగు భాష రహదారిలో పయనించడానికి ఎలాంటి ఆటంకాలు ఎదురుకాలేదు. భాషాభివృద్ధికి కవులు తీసుకునే భావాలే ప్రధాన సాధనాలు. నన్నెచోడుడు తెలుగు భాషకు చేసిన కృషిని ఈ కవి అంచనా వేస్తూ ...

*"కవిరాజశిఖామణి నన్నెచోడుడు*
*సారస్వత గగనంలో నిండు చంద్రుడు*
*చిత్ర విచిత్ర ప్రయోగాలతో*
*భాషను పరిపుష్టిగా చేసి*
*భావనకు అక్షరాలను పొదిగి*
*కవితాసీమలో ప్రవేశపెట్టి*
*'జాను తెనుగు' భాషణకు బాణీలు కట్టి*
*కొత్త పుంతుతొక్కిన మార్గన్వేషి'*

అని అభివర్ణిస్తాడు. నన్నయ తర్వాత సంస్కృత ప్రభావం నుండి తెలుగు భాషను నిజమైన తెలుగుగా ముందుకి తీసుకురావాలని ప్రయత్నించిన వాళ్ళలో నన్నెచోడుడు ప్రథముడైనా, స్థానీయమైన ఇతివృత్తాల్ని స్వీకరించిన ఘనత మాత్రం పాల్కురికి సోమనాథునికే దక్కుతుంది. శైవ వ్యాప్తికి భాషను ఒక సాధనంగా వాడుకున్నా, ప్రజల దగ్గరకు తెలుగుభాష చేరువయ్యేలా చేసిన ఘనత నన్నెచోడుడు, పాల్కురికి సోమనాథుడు, పండితారాధ్యుడులకే దక్కుతుంది. వీరినే శివకవిత్రయం అనీ, వీరి కాలాన్ని శివకవియుగం అనీ అంటారు. దీన్ని కవి

*"తొలిసారి కవులు శివకవిత్రయంగా కంకణం*
*కట్టుకొని కవితా రచన చేసారు.*
*శివోహమంటూ ఆనందపు పులకింతు*
*దాసోహమంటూ జనం దరికి చేర్చార'ని*

అభివర్ణించాడు. తర్వాత తెలుగుకు మరింత స్థానికతను జోడించి తేటతెనుగు పదాలను వాడుతూ ఆంధ్రమహాభారతాన్ని పూర్తి చేసిన ఘనత దక్కించుకున్నవాడు తిక్కన. దీన్ని కవి ఇలా వర్ణించాడు.

*"అచ్చతెనుగు పదాలతో ముచ్చటగొలిపి*
*ప్రతి పాత్ర గుండెను చిలకరించాయి*
*మహాభారత రచనలో పదినైదు పర్వాలుగా*
*పరిమళాలు వెదజల్లి పులకరించాయి"*

తెలుగు భాషను సుసంపన్నం చేయడంలో భారతంతో పాటు రామాయణాల్ని కూడా రాసిన కవులున్నారని రంగనాథరామాయణం మొదలుకొని మొల్ల, విశ్వనాథ సత్యనారాయణగారి శ్రీమద్రామాయణ కల్పవృక్షం వరకు వచ్చిన రామాయణేతివృత్తి కావ్యాలన్నీ తన దీర్ఘకావ్యంలో ప్రస్తావించాడు. ఎఱ్ఱాప్రెగడతో ఆంధ్రమహాభారతం సంపూర్ణంగా తెలుగువాళ్ళకి అందించి అతడు ప్రబంధ పరమేశ్వరుడైయ్యాడని వర్ణించాడు కవి. తెలుగులో వచ్చిన కవుల జాబితాను చెప్తేనో ఒక నూరు పుటలు దాటిపోతుంది. అటువంటి విస్తృతమైన సాహిత్యం మన తెలుగు సాహిత్యం. అయినప్పటికీ, తెలుగు భాషాసాహిత్యాల్ని పరిమళించేలా రచనలు చేసిన కవులను, వారి పోషకులను వర్ణించడమే కాకుండా వారి కవితా విశేషాల్ని, వారి రచనా వైశిష్ట్యాన్ని ఈ దీర్ఘకావ్యంలో కొండని అద్దంలో చూపినట్లుగా మధురంగా వర్ణించగలిగాడు కవి. ఎంతో ప్రణాళిక, సంక్షిప్తం చేసుకోగలిగే సామర్థ్యం, భిన్న భావజాలాలున్నప్పటికీ వాళ్ళందరినీ సమానదృష్టితో విలువకట్టడం సహృదయుడికి మాత్రమే సాధ్యం. దాన్ని సుసాధ్యం చేశాడీ పరిశోధక కవి డా॥వూటుకూరి ప్రసాద్.

ఈ తెలుగు పరిమళం దీర్ఘ కావ్యం చదువుతుంటే అనేక తెలుగు సాహిత్య చరిత్రల్ని పాఠకులు ఏకకాలంలో చదువుతున్న అనుభూతికి గురవుతారు. కేవలం సమాచారాన్ని అందించడం వరకే అయితే అది కావ్యంగా పాఠకుల్ని ఆకట్టుకోలేదు. తెలుగు కవి ప్రాణం దేనిలో ఉందో దాన్ని మనకి అందిస్తూ తనదైన వర్ణన చేయడం ఈ కావ్యంలో కనిపించే విశిష్టత. ఈ కావ్యం చదివిన తర్వాత మనం తెలంగాణలో ఉన్నా, ఆంధ్రప్రదేశ్‌లో ఉన్నా, పొరుగు రాష్ట్రాల్లో గానీ, పొరుగు దేశాల్లో గానీ, ప్రపంచంలో ఎక్కడున్నా మనందరిదీ తెలుగు భాషేననీ, మనపూర్వీకులు మనకిచ్చిన అమూల్యమైన వారసత్వం మనకెంతో ఉందనే గర్వానికి గురవుతుంటాం. దాన్ని కాపాడుకోవాల్సిన అవసరాన్నీ గుర్తిస్తాం. భిన్న భావాలు, భిన్న సంఘర్షణలు ఉన్నప్పుడే ఆ సమాజం పురోగమిస్తుంది. కానీ, అవి

శత్రుపూరితంగా మారకూడదు, పురోగమనానికి మెట్లుగా ఉపయోగపడాలి. అలా తెలుగు భాషాసాహిత్యాలు భిన్న భావాలతో, సంఘర్షణలతో కొనసాగాయే తప్ప, శత్రు పూరితవైరుధ్యాన్ని ప్రదర్శించలేదని ఈ '*తెలుగు పరిమళం*' కావ్యం చదివితే మరింతగా స్పష్టమవుతుంది.

జనంలో పల్లెపదాలుగా, శాసనాల్లో చెల్లాచెదురైన తెలుగు పదాలుగా, పాటల్లో, కీర్తనల్లో, జానపదగేయాల్లో అనేక యేళ్ళపాటు మౌఖికంగా కాపాడుకున్న తెలుగు భాష, సంస్కృత మహాభారతానువాదంతో లిఖిత సంప్రదాయాన్ని సంతరించుకుంది. దానిలో హైందవమతౌన్నత్యం కొనసాగినా, తెలుగు సమాజం కనిపిస్తుంది. తెలుగువారి జీవన సమ్మేళనం ఉంది. దాన్నే తిక్కన నాటికి హరిహరాద్వైతంగా వెల్లడయ్యింది. నన్నయ–తిక్కనల మధ్య శివకవిత్రయంలో కూడా తొలి నాటి నన్నయ సాహిత్యానికి భిన్నమైన భావసంఘర్షణ కనిపించినా అది తెలుగు భాషను నిర్వీర్యం చేయడానికి ప్రయత్నించలేదు. మన తెలుగు భాషలోని మరో కోణాన్ని కూడా గుర్తించగలిగాం. అలాగే శ్రీనాథుడు పురాణానువాద సంప్రదాయాన్ని పాటించినా భారతీయాధ్యాత్మిక వారధిగానే స్వీకరించాం. తర్వాత వచ్చిన ప్రబంధ కవుల వర్ణనలన్నీ తెలుగు సాహిత్యంలో కొన్ని ప్రతిభావంతమైన మైలురాళ్ళను నిలిపినట్లే స్వీకరించాం. పదిహేడు, పద్దెనిమిదో శతాబ్దం నుండీ రాచరిక, భూస్వామ్య జీవన ప్రభావాన్ని, తర్వాత కాలంలో పాశ్చాత్య జీవనాన్ని తెలుగు భాష ఎప్పటికప్పుడు గుర్తించింది. ఆ సమాజాన్ని ప్రతిఫలించేలా చేసింది. పాశ్చాత్య ప్రభావంతో భావంతో పాటు ప్రక్రియాపరంగాను అనేకమైన నూతన ప్రక్రియలతో తెలుగు భాషాసాహిత్యాలు వికసించాయి. నవల, కథ, నాటకం, వచనకవిత్వం వంటివెన్నో ప్రక్రియలు తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేశాయి. పందొమ్మిదీ, ఇరవయ్యో శతాబ్దంలో అంతవరకూ కనిపించని క్రిష్టియానిటీని కూడా తెలుగు భాషాసాహిత్యాలు పట్టించుకున్నాయి. భావకవిత్వంలో స్వేచ్ఛ, అభ్యుదయ, విప్లవకవిత్వంలో రూప, సార చర్చలు, స్త్రీవాద, దళితోద్యమ, మైనారిటీ, ప్రాంతీయోద్యమాలు తెలుగు సమాజ సమకాలీన చైతన్యాన్ని తెలియజేశాయి. తెలుగు భాషాసాహిత్యాల్ని వికసింపజేయడానికే ఇవన్నీ తోడ్పడ్డాయి. ఈ భావాల్ని కవి ఇలా వర్ణిస్తున్నాడు.

*''జాతీయోద్యమం స్వేచ్ఛకొరకు*
*గొంతెత్తి పిలిచింది*
*దళితోద్యమం హక్కు కొరకు*
*ఆత్మగౌరవాన్ని ఆశ్రయించింది*
*ఆంధ్రోద్యమం భాషా సంపత్తిని కోరుకుంది...*

*అని సాగిన ఈ కవిత ఇంకా ఇలా కొనసాగింది.*

*తెలుగునేలపై ఏకకాంలో*
*ప్రవహించిన ఉద్యమాలు*
*సామాజిక స్వేచ్ఛ*
*వ్యక్తి స్వేచ్ఛ*
*భాషా స్వేచ్ఛ*
*ముప్పిరి గొని సాగాయి*
*ఉనికి కొరకు ఉద్యమాలు*
*ఉవ్వెత్తున అలలై ఎగిసాయి."*

నేడు ప్రపంచవ్యాప్తంగా విస్తరిస్తున్న తెలుగు భాషాభిమానులు ప్రవాసాంధ్ర సాహిత్యాన్ని సృష్టిస్తున్నారు. ప్రపంచీకరణను కూడా తెలుగు భాషకు అనుకూలంగా మార్చుకుంటున్నారు. అందువల్లనే శాస్త్ర, సాంకేతిక రంగాల్లో మార్పులు గమనించి తెలుగు ఫాంట్లు రూపకల్పనలోను, ఒక ఫాంటునుండి మరొక ఫాంటుగా కన్వర్ట్ చేసుకొని అంతర్జాలంలో కూడా చదువుకోవడం, పుస్తకాలను ప్రచురించుకోవడానికి తెలుగుభాషను కూడా ఒక శక్తివంతమైన సాధనంగా ఉపయోగిస్తున్నారు. ఇవన్నీ సమకాలీన తెలుగు భాషను, సాహిత్యాన్ని ప్రపంచవ్యాప్తంగా అనుకూలంగా మార్చుకునే పురోగామి చర్యలు. వీటిని ఈ *'తెలుగు పరిమళం'* దీర్ఘకావ్యం ద్వారా ప్రేరణ పొందడానికి వీలుంది. భాషాభివృద్ధికి చలన చిత్రాలు ఎంతగానో దోహదం చేశాయి. వీటిని చాలా మంది విస్మరిస్తుంటారు. కానీ పద్యాల్ని సామాన్యులు కూడా పాడుకునేలా చేశాయి. మంచి మంచి సంభాషణల ద్వారా భాషను ప్రజల ముందుకి శక్తివంతంగా తీర్చిదిద్దాయి. సినీగేయాల ద్వారా దేశభక్తినీ రగిలించాయి. జాతీయసమైక్యతనూ కలిగించాయి. వీటి గురించి ప్రస్తావిస్తూ కవి... *"పౌరాణిక చిత్రాల, చారిత్రక చిత్రాల*

*జానపదాల, సాంఘిక చిత్రాల్లోని భాష*
*గ్రాంధిక వ్యవహారాల్లో దోబుచులాడతాయి*
*పాత్రోచిత భాషల, ప్రాంతీయ భాషల*
*జీవన సౌందర్యానికి అద్దం పడతాయి"* అంటాడు.

ఏదేశమైనా సత్వరాభివృద్ధి చెందాలంటే తమ మాతృభాషలను ముందుగా బాగా ప్రోత్సహించుకోవాలి. భాషాభివృద్ధితో దేశాభివృద్ధి ముడిపడి ఉందని ఇప్పటికే చైనా, జపాన్

వంటి దేశాలు నిరూపిస్తున్నాయి. చరిత్రను గమనించినా మాతృభాషను విస్మరిస్తే వచ్చే తీవ్ర పరిణామాలు తెలుస్తాయి. విశాల, సమైక్య భారతదేశం 1947 లో రెండు దేశాలుగా విడిపోయినప్పుడు పశ్చిమ పాకిస్తాన్ మాతృభాషపైనే ముందుగా దృష్టిపెట్టింది. పశ్చిమ పాకిస్తాన్ లోని ప్రజలపై కూడా ఉర్దూ భాషను మాతృభాషగా రుద్దే ప్రయత్నం చేశారు. అక్కడ అత్యధికులైన పౌరులు బెంగాలీని మాట్లాడతారు. కానీ తూర్పు పాకిస్తాన్ ప్రకటన పశ్చిమ పాకిస్తాన్ ప్రజల్ని అయోమయంలో పడేసింది. ప్రజలు ఉర్దూని మాతృభాషగా తమపై రుద్దడాన్ని వ్యతిరేకిస్తూ ఉద్యమించారు. ఈ ఉద్యమం తీవ్రరూపం దాల్చి 1952 ఫిబ్రవరి 21 వతేదీన నలుగురు ఉద్యమకారులు మరణించారు. ఈ ఉద్యమమే తర్వాత 1971 డిసెంబర్ 16న బంగ్లాదేశ్ ఏర్పడ్డానికి కారణమైంది. ఇక్కడ మాతృభాష కోసం జరిగిన ఉద్యమం స్ఫూర్తి తోనే ఐక్యరాజ్య సమితి సాంస్కృతిక విషయాల సంస్థ 1999 నుండీ ప్రతి యేడాది ఫిబ్రవరి 21వ తేదీని అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవంగా ప్రకటించింది. భిన్న భాషల, సంస్కృతులను గౌరవించడం ప్రపంచానికి శ్రేయస్కరంగా ఐక్యరాజ్య సమితి సాధారణ సభ కూడా ప్రకటించింది. అందువల్ల తెలుగు వారెక్కడున్నా తెలుగు వారి మాతృభాష తెలుగే.

తెలుగు పరిమళం కావ్యం రచనలో కూడా ఈ సాంస్కృతిక స్ఫూర్తి ప్రతిఫలిస్తుంది. తెలుగు భాషలో గ్రాంథిక, వ్యావహారిక వాదాలుగా వచ్చినా అవన్నీ తెలుగు భాషాసాహిత్యాలు ప్రజలకు మరింత చేరువకావాలనే ప్రయత్నించాయని కవి ప్రతిపాదిస్తున్నాడు. ఈ *తెలుగు పరిమళం* దీర్ఘకావ్యం సరైన సమయంలో వస్తోంది. దీన్నిప్పుడు చదవడం ద్వారా మన తెలుగు సమాజాలు భిన్నభావాల సంఘర్షణకు అవకాశమిస్తూనే సాహిత్య వికాసానికెలా తోడ్పడిందో తెలుస్తుంది. తెలుగు వారి జాతి వారసత్వ సంపదను కాపాడుకోవడానికి ఈ '*తెలుగు పరిమళం*' దీర్ఘకావ్యం చైతన్యాన్నిస్తుంది. ప్రభుత్వం ఈ దీర్ఘకావ్యాన్ని పాఠశాలల్లో పాఠ్యాంశంగా స్వీకరిస్తే విద్యార్థినీ విద్యార్థులకు మాతృభాషలోని కమ్మదనంతో పాటు, తెలుగు జాతి సాంస్కృతిక వారసత్వం కూడా తెలుస్తుంది. ఇంత మంచి కావ్యాన్ని అందించిన కవి డా॥వూటుకూరి వరప్రసాద్ గార్ని అభినందిస్తున్నాను.

(డా॥వూటుకూరి ప్రసాద్, తెలుగు పరిమళం (వచన దీర్ఘకావ్యం), 2016)

★★★

# సామాజిక చైతన్యశీలికి పద్యనీరాజనం

'దళితరత్న' తాతపూడి రవీంద్రనాథ్ టాగూర్‌గారు నిత్య చైతన్య శీలి. కొత్త విషయాన్ని కూడా సులభంగా నేర్చుకునే ప్రావీణ్యం కలవాడు. డా॥బి.ఆర్.అంబేద్కర్ జీవిత చరిత్రను *'అమరజీవి అంబేద్కర్'* పేరుతో ఛందోబద్ధంగా ఒక శతకాన్ని రాశారు. ఈ శతకాన్ని తన తల్లి కీ.శే. తాతపూడి కాంతమ్మగారికి అంకితం చేసారు. తన మొదటి శతకాన్ని అంబేద్కర్ గురించి రాయడమే కాకుండా ఆ కావ్యాన్ని తన మాతృమూర్తికి అంకితం ఇవ్వడం ఔచిత్యభరితంగా ఉంది. ఈ శతకాన్ని చదువుతుంటే అంబేద్కర్ జీవితంలోని అనేక ఘట్టాలు మన కళ్ళముందు కదలాడతాయి. ఈ శతకంలో అంబేద్కర్ బాల్యం నుండే ప్రతిభావంతుడని వర్ణించిన పద్యంలో తను చిత్రించిన విధానాన్ని గమనించిన ఎవరికైనా అవగతమవుతుంది.

*"పువ్వు పుట్ట గానె పరిమళించి నటుల*
*పిన్న వయసు నుంచె ప్రతిభ చూపె*
*ఎన్ని బాధలున్న ఎదిరించి నిలువగా*
*చదువ గోరి చేరె సతరు స్కూలు"*

'పువ్వు పుట్టగానే పరిమళించినట్లు' అనే సామెతను చక్కగా వాడుకున్నాడు కవి. అలాగే అంబేద్కర్ జననాన్ని వర్ణిస్తూ అంటరానివారి ఇళ్ళల్లో ఆశలను వెలిగించడానికి పుట్టాడని అభివర్ణించాడు కవి. అక్కడితో ఆగలేదు, దళితులకు ఆత్మ గౌరవాన్ని పెంపొందించడానికి భరతజాతి కీర్తి ప్రతిష్ఠలు పెంచడానికి అంబేద్కర్ పుట్టాడనడంలోనే కవి భావుకత పాఠకులను ఆహ్లాదంలో ముంచుతుంది. ప్రపంచ వ్యాప్తంగా స్వయం సమృద్ధి కలిగిన దేశాల్లో భారతదేశం ఒకటిగా వెలుగొందుతోంది. కానీ, 'కులం' అనే కళంకం భారతదేశానికున్న కీర్తి ప్రతిష్టలను నాశనం చేస్తోంది. ఇటువంటి పరిస్థితుల్లో సర్వ మానవ సమానత్వాన్ని ప్రతిపాదించి, దళితుల హక్కులు సాధించిపెట్టి భారతదేశ కీర్తిప్రతిష్టలను

ప్రపంచ వ్యాప్తమొనరించింది. వ్యక్తివల్ల వ్యవస్థ, వ్యవస్థవల్ల వ్యక్తులు అల్లకల్లోలానికి గురైయ్యే పరిస్థితులున్నట్లే, వ్యక్తుల వల్ల వ్యవస్థ కూడా సక్రమవుతుందనడానికి నిదర్శనంగా అంబేద్కర్ పుట్టుకను కీర్తించాడు కవి. అంబేద్కర్ జ్ఞానసముపార్జనకు, ప్రపంచ విజ్ఞానం కోసం గ్రంథాలయాల్లో నిరంతరం పుస్తకాలు చదివేవాడు. ఈ ఘట్టాన్ని ఇలా వర్ణించారు.

*"తిమిర మంత మదిలొతరిమేయు దీపాలు*
*పుస్త కాలు చూపు ప్రగతి దారి*
*ప్రేమ పెంచు కొనియెపఠియించు గ్రంథాలు*
*భార్య కన్న కన్న బిడ్డ కన్న"*

దీనిలో భార్యాబిడ్డలకన్నా ఎక్కువగా పుస్తకాలనే ప్రేమించేవాడని వర్ణించడంలో అంబేద్కర్ పై కవికి గల లోతైన ద ృష్టిని గమనించవచ్చు. అంబేద్కర్ జీవితాన్ని బాగా ఆకళింపు చేసుకన్నారు కాబట్టే కవి ఈ మాటలు అనగలిగాడు. అంబేద్కర్ తన విద్యను పూర్తి చేసి స్వదేశానికి వచ్చి ఉద్యోగంలో చేరిన తరువాత కూడా ఎదుర్కొన్న అవమానాలను కళ్ళకు కట్టినట్టుగా చిత్రించాడు కవి. నిమ్నజాతి ఉద్ధరణకోసం సామాజిక ఉద్యమాలు చేయడం, వ్యవస్థీకృతంగా సమస్యల పరిష్కారానికి సంఘాలను స్థాపించడంలో తన శ్రమను (30వ పద్యం) ఇలా వర్ణించాడు.

*"సంఘ మందు నున్నసంకటా లనుతీర్చ*
*ఉద్యమాలు చేయ ఉరికి నిలచె*
*భవిత కోరి పెట్టె బహిష్కృ(త) భారతి*
*ప్రజల పాట్ల నుంచె ప్రభుత్వం ముందు"*

వర్ణ వ్యవస్థను ప్రోత్సహించే మనుధర్మ శాస్త్రాన్ని తగలబెట్టడం, నిమ్నజాతుల వారిని వెట్టిచాకిరినుండి విముక్తి కలిగించడం, అల్పసంఖ్యాకుల వారి హక్కులు కోసం పోరాడడం, దళితుల హక్కులన్నీ మానవ హక్కులేనని, కోసం రౌండ్ టేబుల్ సమావేశంలో నినదించడం మొదలైన సామాజిక సమస్యలను, వివిధ సంఘటనలను సందర్భానుసారంగా వర్ణించడంలో తన నైపుణ్యాన్ని ప్రదర్శించారు కవి.

అంబేద్కర్ జీవితాన్ని స్ఫురింపజేస్తూ భారత జాతీయోద్యమంలో గాంధీ పాత్రను మన కళ్ళముందుంచారు కవి. కార్మికులకు సమ్మె చేసే హక్కు ఉంటుందని నినదించినవాడు అంబేద్కర్.

*"సమ్మె చేయ రాదు శ్రామికులనిచెప్పి*
*చట్ట సభలు చేసెశాసనాలు*

*సమ్మె చేయు హక్కుశ్రమజీవి సొత్తంటు*
*ప్రజ యండ నిలిచిపోరు చేసె”*

కార్మిక సంక్షేమం గురించి మాట్లాడేటప్పుడు అంబేద్కర్ ని మార్క్సిస్టులు చాలామంది ప్రస్తావించరు. భారతదేశంలో శ్రామికుల హక్కులకోసం పోరాడినవాళ్ళలో అంబేద్కర్ ముందువరుసలో ఉన్నాడు. అలాగే నిమ్నజాతి వారిని సైనికులుగా తీసుకోవాలని కోరినవాడు అంబేద్కర్.

*“నిమ్నజాతి వారు నీచవృత్తులెగాని*
*సైన్య మందు కొలువుచేయ రాదు*
*రద్దు చేయ బూని మహరూల రెజిమెంటు*
*చేసి నారు నాడు చట్ట మొకటి”*

స్త్రీలకు కూడా ఆస్తిహక్కు కావాలని భారత పార్లమెంటులో చట్టాలు చేయించిన అంబేద్కర్ని స్త్రీ ఉద్యమ నాయకురాళ్ళు ప్రస్తావించరు. దాన్ని ఈ శతకంలో చక్కని పద్యంలో వర్ణించారు కవి.

*“హెచ్చు తగ్గు లేనిహక్కుల నిచ్చేను*
*ఎల్ల జాతి మనుషులొక్క టనుచు*
*స్త్రీలు పురుషులంతసరిసమా నమనుచు*
*ఆడ వారి కడిగె ఆస్తి హక్కు”*

అలాగే ఓటుహక్కు అనేది కుల మతాలకు అతీతంగా అందరికీ ఉండాలని వాదించి సాధించిన మహానుభావుడు అంబేద్కర్.“ఓటు ఒక్క టిచ్చె నెవ్వారి కైనను

*“ఓటు కొక్కటొకైనవిలువ గట్టి*
*కులము మతము చదువు కాదాయె నర్హత*
*మనిషి యన్న దొకటె మూల మాయె”*

భారతదేశంలోని నిమ్నజాతీయులుగా జీవిస్తున్న దళితులను ప్రధాన జీవనస్రవంతిలోకి అంచెలంచెలుగా రావాలంటే వారికి వివిధ రాయితీలు అవసరమని భావించి, వాటిని నిమ్న వర్ణాలవారికి ఇవ్వాల్సిందేనని పోరాడి, సాధించిన వాడు అంబేద్కర్.“విద్య నందె గాక ఉద్యోగముల యందు

*“అణచ బడిన వారు అర్హు లవగ*
*ప్రాతినిధ్య మొసగెజాతి బలము బట్టి”*

కూర్చి[వ్రాసిహక్కుకట్టబెట్టె" ప్రపంచంలోని రాజ్యాంగాలను పరిశోధించి, ముసాయిదాను సమర్పించినవాడు అంబేద్కర్.

*"రచన పూర్తి చేసిరాజ్యాంగ సమితికి*
*చర్చ జేయ నిచ్చెచిత్తు ప్రతిని*
*మూడు మార్లు కూడి మూసాయిదాపైన*
*చర్చ చేసి యొప్పు చట్ట మాయె"*

దేశంలో కుల మతాలు పోయి, శత్రు భావన అంతరించి,శాంతి సౌభాగ్యాల వెలుగు రావాలంటే నిరంతరం మార్పును ఆహ్వానించే శాంతియుత జీవనం బౌద్ధంలోనే ఉన్నదని గ్రహించి, బౌద్ధాన్ని స్వీకరించాడు అంబేద్కర్

*"మానవుణ్ణి మించిమాధవుండెవ్వాడు*
*మనిషి తనము కన్నమతము లేదు*
*పొరుగు వార లెపుడు ప్రేమపంచు కొనగ*
*బుద్ధి తెలియ జెప్పెబౌద్ధ గురువు"*

అమరజీవి అంబేద్కర్ శతకం చదువుతుంటే ఒక నిష్ణాతుడైన పద్య కవి రాసిన పద్యాలు చదువుతున్నట్లుంది. సరళమైన భాషను ప్రయోగించారే తప్ప ప్రౌఢ సమాసాలకు, ఆలంకారిక వర్ణనలకు అంతగా ప్రాధాన్యాన్ని ఇవ్వలేదు. పద్యాన్ని పాడుకోవడానికి , అనుగుణమైన పదజాలాన్ని ప్రయోగించాడు. అంబేద్కర్ జీవితాన్ని అవగాహన చేసుకుంటూనే సామాజిక సమస్యల పరిష్కారానికి కృషి చేసి ఆదర్శనీయులుగా నిలిచే వారిలో అంబేద్కర్ ఒకరని తెలియజేసారు. ఇటువంటి అంబేద్కర్ పోరాట స్ఫూర్తినీ, అమలులో నిరూపించిన ఆదర్శాన్ని అందుకోవాలని ప్రేరేపిస్తుంది ఈ శతకం. వృత్తిరీత్యా స్టీల్ ప్లాంట్లో ఒక ఉన్నత ఉద్యోగి అయినప్పటికీ, ప్రవృత్తి రీత్యా కవిత్వ సాధన చేస్తున్న కవి టాగోర్ గారు. కనుకనే సమస్య పరిష్కారానికి ఉపయోగపడే మహోన్నత వ్యక్తిని వస్తువుగా స్వీకరించి ఈ శతకాన్ని రాయడం అభినందించదగిన విషయం. చదువుకున్న ప్రతి ఒక్కరు ఆస్వాదించ గల శైలి లో పద్యాన్ని రాసిన ఠాగూర్ గారిని అభినందిస్తున్నాను. పద్యాల్లోని యతి ప్రాసలు, సమాస విరుపులను పండితకవుల రచనలను పండితులు పరీక్షకు పెడతారు. ఆ ఛందో బద్దనైపుణ్యాల జోలికి నేను పోవడం లేదు. టాగోర్ గారి ప్రయత్నాన్ని స్వాగతిస్తున్నాను. ఇంకా, బాబు జగజ్జీవన్ రామ్, పెరియార్ రామస్వామి, జ్యోతి బాపూలే, రమాబాయి అంబేద్కర్ మొదలైన ఎంతో మంది స్ఫూర్తిప్రదాతల జీవిత చరిత్రలు కూడా వీరి కలం నుండి జాలువారాలని ఆకాంక్షిస్తున్నాను.

★★★

# మానవ సంబంధాల పునర్నిర్మాణానికి స్వాగతం

దళిత సాహిత్య, సామాజిక ఉద్యమాలలో పరిచయం అక్కరలేని నాయకుడు డా॥కత్తి పద్మారావు గారు. సంస్కృతాంధ్ర సాహిత్యాలలో లోతైనా అవగాహన ఉన్న సాహితీ వేత్త పద్మా రావు గారు. డా॥ బి. ఆర్ అంబేద్కర్ సిద్ధాంతాన్ని తెలుగు నేలపై నాలుగు వైపుల వ్యాపింపజేసిన ఉద్యమకారుడు. జ్యోతి బాపూలే, పెరియార్ రామస్వామి నాయకర్ భావాలను ప్రాచుర్యంలోకి తీసుకురావడంలో పద్మారావుగారి పాత్ర అనిర్వచనీయం. అంబేద్కర్ సాధించిన హక్కులను ప్రసరించిన భావాలను సామాన్యులకు కూడా తమ రచనల ద్వారా అందుబాటులోకి తీసుకొచ్చిన పరిశోధకుడు పద్మారావు గారు.

డా॥ కత్తి పద్మారావు గారి ప్రసంగం ఒక జలపాతంలా ఉంటుంది. పరిశోధన శాస్త్రీయంగా ఉంటుంది. ఈయన కవిత్వం మట్టి పరిమళాల్ని అందిస్తున్నట్లుంది. ఈ మధ్య ఈయన కవిత్వాన్ని విస్తృతంగా రాస్తున్నారు. దీనిలో భాగంగా *"ఈ యుగం మాది"* పేరుతో ఒక కవితా సంపుటిని ప్రచురిస్తూ, నా అభిప్రాయాన్ని రాయమన్నారు. అలా నన్ను అడగడం ఆయన నన్ను గౌరవించడంగా భావిస్తున్నాను.

దళితులంతా వ్యవస్థీకృతమై, ఒకే కంఠంగా కవి రూపంలో *"ఈ యుగం మాది'* అని ఆత్మ గౌరవంతో ప్రకటిస్తున్న దానికి ప్రతీకగా ఈ కవితల్ని చెప్పుకోవచ్చు. ఆదిమ సమాజం నుండి నేటి ఆధునిక సమాజం వరకు భూమికోసం పోరాటం జరుగుతూనే ఉంది. మత్స్య న్యాయం భూమిని వశం చేసుకుంటుంది. భూమిని నమ్ముకొన్న వాడికంటే, అమ్ముకున్న వాడే జీవన సంఘర్షణతో మిగులుతున్నాడు. చాలామంది నీతికి, న్యాయానికి వక్ర భాష్యాలు చెప్తున్నారు. పునర్నిర్మాణం పేరుతో ప్రపంచీకరణను కట్టుదిట్టంగా అమలు చేస్తున్నారు. మానవ సంబంధాల కంటే వ్యాపార సంబంధాలే ప్రాధాన్యాన్ని సంతరించుకుంటున్నాయి. దీన్ని కవి

*''భూమిని తవ్వుతున్న వాడికి*
*రంగు రాళ్లు దొరుకుతున్నాయి*
*భూమిని నమ్ముకున్నవాడికి*
*అస్థికలు మిగులుతున్నాయి*
*అప్పు ఒక్కటే*
*ఇప్పుడు దేశాభివృద్ధి సూత్రం "*

అని ప్రపంచీకరణ ప్రభావ పాలనను, వాటి తీరు తెన్నులను వ్యంగ్యంగా తూర్పార పడుతున్నాడు కవి. ఈ స్థితిలో దేశ పునర్నిర్మాణంలో కూడా మానవ సంబంధాల పునర్నిర్మాణమే ముఖ్యమని ప్రబోధిస్తూ ...'*ప్రేమ, కరుణ ఒక్కటే/ మనిషిని పునర్నిర్మిస్తాయి/ అదే నిజమైన పునర్నిర్మాణం.'* అని ప్రబోధించిన కవితతో 'ఈ యుగం మాది' కవితా సంపుటి ప్రారంభమవుతుంది.

మానవ సంబంధాల పునర్నిర్మాణంలో సామాజికీకరణ (socialization) ప్రక్రియ ముఖ్యమైంది. అది కుటుంబంలో మొదలవ్వాలి, మాతృభాషతో అంకురించాలి. భాష ఒక చైతన్య వాహిని. పర భాషలో ఎంత ప్రావీణ్యం ఉన్నా ఏదేశ ప్రజలకైనా ఆ దేశ స్థానిక భాషలే శక్తివంతమైన భావవాహిక సాధనాలు. ఆ సాధనాల్ని అందుకునేది తల్లి ద్వారానే మొదలవ్వాలి. అప్పుడే ప్రజల్లో నిజమైన చైతన్యం వెల్లువిరుస్తుంది. లేకపోతే ప్రజలకు అర్థం కాని భాషల్లో చట్టాలు వచ్చి, సామాన్య ప్రజల్ని అయోమయంలో పడేస్తాయి. అందువల్ల మాతృ భాషలో మాట్లాడటం, విద్యాభ్యాసం కొన సాగించటం, చట్టాలు ఆ మాతృ భాషలోనే వెలువడటం మొదలైన పనులు జరగాలి. అలాంటప్పుడే ఆ సమాజం నిజంగా చైతన్యవంతమవుతుంది. అందుకే కవి

*'ప్రతి తల్లి భాష శాస్త్రవేత్త*
*బిడ్డకు నేర్పేటప్పుడు తల్లి భాష సజీవమవుతుంది*
*తల్లిది కొత్త భాష*
*ప్రతి ముళ్ల దారిని పూల దారి చేస్తుంది*
*ఆ సౌగంధ్య పరిమళం నన్ను నడిపిస్తుంది.'*

అని భాష గొప్పతనాన్ని చెప్తూనే మాతృభాష మనిషిని పునరుజ్జీవింప జేస్తుందంటాడు కవి. ఈ కవితను లక్ష్యార్థంలో చూసినప్పుడు ప్రేమానురాగాలు వెల్లివిరిసే మానవుణ్ణి ప్రభవింప జేసే శక్తి ఆధునిక భాషలోనే ఉందని, అది మమతానుబంధాల భాషగా అర్థం చేసుకోవాలి. అందుకనే కవి

*'సహచర్యంలోని భాష*
*మనిషిని ప్రజ్వలితం చేస్తుంది*
*సమకాలీనమైంది*
*ప్రతీది రాగ బంధమైతే ఎన్ని సముజ్వల కాంతులు*
*ఉజ్వలించాలన్న మనిషికి సచేతనంలోనే సాధ్యం.'*

అనడం ద్వారా నిరంతర మమతానుబంధాల సృజనాత్మక అభివ్యక్తులు కవిత్వ శక్తిగా జాతిని ఉత్తేజితం చేయాలంటాడు కవి. పద్మా రావు గారు చాలా కవితల్లో తాత్వికాంశాలను భావ చిత్రాలుగా అందిస్తారు. మన చుట్టూ ఉన్న ప్రకృతిని వర్ణిస్తున్నట్లే ఉంటారు కానీ, వాటి ద్వారా తాత్త్విక అర్థాన్ని మన ముందుంచుతారు.

*"కడలి సుడులు సుడులుగా*
*తిరుగుతున్నప్పుడు*
*మనం కన్నార్పకుండా చూస్తాం*
*అందులో అలజడి ఉంది*
*అనేక ప్రకృతిలో తీవ్రతలు*
*మనల్ని ప్రకంపనలకు గురిచేస్తాయి'*

ఇది సముద్రం ఒడ్డునున్న ప్రతి ఒక్కరికీ కనిపించే దృశ్యమే. కానీ, ఆ కడలి సుడి అలజడిని, ప్రకృతిని కవి తన హృదయ స్పందనతో వర్ణించటం గొప్ప భావ చిత్రం. దాని కీలకాంశాన్ని తర్వాత వర్ణిస్తాడు కవి.

*'మంచు కరుగుతున్నట్టు*
*కనిపిస్తూ వుంటుంది*
*దాని అంతరంగం ఇనుముకంటే కఠినమైనది"*

*ఇలా వర్ణించుకుంటూ*

*"మనసులో నుండి వచ్చే ఒక నవ్వు*
*చెట్టు పూసినంత పరిమళంగా ఉంటుంది*
*దాని అంతరంగం*
*ఇనుముకంటే కఠినమైంది*
*ఇనుమును పరికరం చేయడానికి*
*ఒక కొలిమి కావాల్సి వుంటుంది*
*ఎక్కువ మంది ప్రతి స్పందించాల్సినంత స్పందించరు*

*ప్రతి స్పందన యాదృచ్ఛికం*
*స్పందనహృదయ గతమైంది'*

అంటాడు కవి. కవి ప్రకృతిలోని అంశాలను అంటే కడలి, సుడులు వంటి మూర్త పదార్థాలను అమూర్తమైన వస్తువులతో కవిత్వీకరించాడు. కవి స్పందన కడలి స్పందన లాంటిది. మౌనంగా ఉన్నట్లు కనిపిస్తుంది. కానీ, అది అందరికీ కనిపించదు. ఇలా ప్రకృతిలోని అనేక అంశాలను ఇంద్రియానుభూతితో మనకి తాత్వికంగా రుచి చూపిస్తాడు కవి. చివరికి అంటాడు

*'ప్రక్తలందరు మాటల్ని సంక్షిప్తంగా పలికారు*
*కవులంతా విస్తృతంగా పలికారు*
*మాటలన్నీ మారుతూ వస్తున్నాయి*
*భావం మారడం లేదు*
*తడి, అలజడి*
*అవ్యక్తమైనవే అయినా*
*అనంత జీవన స్రవంతికి ఈ సంఘర్షణే ఆయువు'*

అనడం కవిత్వాన్ని తారాస్థాయికి తీసుకెళ్ళడమే. నిరంతర సంఘర్షణే ఈ ప్రపంచమంతా ఇంతసుందరంగా ఉండడానికి కారణం. అదొక చైతన్యం. ఆచైతన్యాన్ని అందుకోవాలనీ, ప్రతి మనిషీ నిత్యచైతన్యశీలాన్ని కలిగుండాలంటాడు. ప్రకృతినే దీనికి ఉదాహరణగా చూపిస్తాడు. ప్రకృతి ఒక్కక్షణం ఆగిపోతే ఏమవుతుందో ఆలోచించండి. అన్నీ స్తంభించిపోతాయి. వాటి పని అవి చేసుకుంటూనే పోతున్నాయి. అలా మానవుడు కూడా నిత్య ప్రవాహినిలా మారాలంటాడు కవి. ఇదంతా ప్రకృతి నుండి పండిన తాత్వికార్థం. పద్మా రావు గారి కవిత్వాన్ని అర్థం చేసుకోవాలంటే ఒక తాత్త్విక లోకంలో విహరించాలి. తాత్త్విక లోకంలో విహరిస్తూ, సమాజచైతన్యాన్ని నింపే తాత్త్వికమైన కవిత్వం అవుతాడు. అందుకనే ఈయన విడివిడిగా రాసిన కవితాఖండికలన్నీ ఒక మహా అర్థాన్ని స్ఫూరించే కావ్యాల్లా ఉంటాయి. కాకపోతే వాటిని దేని వెనుక ఏది ఉండాలో జాగ్రత్తగా అమర్చుకోగలగాలి. అప్పుడు ఇవి కవిత ఖండికలు కావని, తాత్త్విక కావ్యంలోనిభాగాలేనని అర్థమవుతుంది.

మార్పు అంటే ఏమిటని తనను తాను ప్రశ్నించుకోవాలి. అదే చేశాడీకవి 'విజేతలంతా దీర్ఘయాత్రికులే" కవితలో. బుద్ధుడు తన విద్యను జ్ఞానంగా మార్చాడు. కనకనే, కరుణ, హింసల మధ్య వ్యత్యాసాన్ని గుర్తించగలిగి, వాటన్నింటినీ జయించగలిగి, తర్కమీమాంసలకంటే ఆచరణాత్మకమైన ప్రేమ ముఖ్యమని చాటగలిగాడు. అదే విద్య.

అదే జ్ఞానం. *ఈ తొలకరిలో /విత్తుమీద కురిసిన వర్షం / ఒక ప్రభవానికి మూలమైతే/ భావోద్వేగం కూడా మార్పుకి సంకేతమే"* అని భావించాలంటాడు కవి. అయితే ఆ మార్పు తాత్కాలిక, వ్యక్తిగత ప్రయోజనాలతో కూడిందా? శాశ్వతమైన, వ్యవస్థీకృత ప్రయోజనాలను ఆశించిందా అనేదీ ముఖ్యమే. అందుకే అంటాడు కవి.

*'పిడికెడు అన్నం కోసమే అయితే*
*నాలుగు అడుగులు వేస్తేచాలు*
*పిడికెడు ప్రేమకోసమే అయితే*
*ఎక్కవలసింది హిమాలయాలే" నని ప్రకటిస్తాడు.*

*అలా చేసినవాడే ఒక బుద్ధుడు. అలా చేసినవాడే సోక్రటీసు. వీళ్ళంతా విజేతలు. విజేతలు అలిసిపోకూడదంటూ" ప్రతి సంఘర్షణ ఒక ప్రకంపనం/ ప్రతి ప్రయాణం ఒక అనుభూతే'* అని ప్రవచించడంలో గొప్ప తాత్త్విక స్ఫూర్తేఉంది.

తను నమ్మిన సిద్ధాంతాన్ని ఆచరించడం కోసం అంబేద్కర్ చూపుడు వేలు ఒక చుక్కానిలా దారి చూపిస్తుందని చెబుతూ సమాజంలో అంతరాంతరాల్లో దాగిన ఆత్మీయతను మానవులందరికి పంచటానికి ప్రేమను, కరుణను అందించాల్సిన అవసరాన్ని ప్రబోధిస్తాడు కవి. అందుకే 'ఒక దీక్ష ఒక తపన ధర్మావేశంలో చూపుడు వేలు చుక్కాని వైపే నా ప్రయాణం' అని తన లక్ష్యాన్ని కవిత్వం ద్వారా ప్రకటిస్తాడు కవి.

కవి సమాజంలో జరుగుతున్న అనేక అన్యాయాలకు స్పందించాడు. ఆ స్పందన వ్యక్తిగతంగా కాకుండా ఒక అభ్యుదయవాదిగా, ఒక ఆత్మ గౌరవనినాదంగా సామాజికీకరణలో భాగంగా కవిత్వమై స్పందించాడు. ఒక వైపు ముంచుకొస్తున్న ప్రపంచీకరణ, దాని దుష్ఫలితాలను గుర్తిస్తూనే వాటిని దీటుగా ఎదుర్కొనటానికి కావాల్సిన ఆలోచనలను అందించే ఒక యోధుడుగా మానవుడు మారాలంటాడు కవి. భిన్న వైరుధ్యాలు ఉన్న సమాజంలో జీవిస్తూ, ఆ సమాజాన్ని అర్థం చేసుకోవటానికి సమకాలీన సమాజాన్ని దర్శించాలి. అప్పుడు మాత్రమే ఆ సమాజంతో నిత్య చైతన్యవంతమైన మనిషి 'ఈ యుగం నాది' అంటాడు. అతడు చైతన్యవంతంగా లేకపోతే ఒక పలాయన వాదిగా మిగిలి పోతాడు. అలా మిగలిపోవడానికి ఇష్టం లేని వాళ్ళంతా స్పందించాలి. అలాంటి వాళ్ళే ఈ యుగం నాదంటారు. ఆ భాగాల్ని తాత్త్వికార్థంలో అందించిన డా॥ కత్తి పద్మారావు గారు అందరికి అర్థమవుతారని నేను అనుకోను. అలా చాలా వరకు అర్థం కాని వారిలో నేను ఒకణ్ణి కూడా కావచ్చు. అయితే, కత్తి పద్మారావుగారి కవిత్వాన్ని వివరిస్తూ నాకు అర్థమైనంతవరకు నా అభిప్రాయాలను చెప్పడానికి ప్రయత్నించాను.

★★★

# కేశవరెడ్డి సాహిత్యం - పునర్మూల్యాంకనం

తెలుగు కాల్పనిక సాహిత్యంలో చలం తర్వాత మళ్ళీ అంతటి సంచలనాన్ని తీసుకొచ్చిన రచయిత కేశవరెడ్డి. స్త్రీ కేంద్రంగా చలం తన సాహిత్యాన్ని సృజనీకరిస్తే, కేశవరెడ్డి సామాజికంగా పీడితులైన వారెందరినో కేంద్రంగా చేసుకున్నాడు. ఈ పీడితుల్లో స్త్రీలు కూడా ఉన్నారు. ఆ విధంగా చలం కంటే ఎక్కువ మంది పాఠకులు కేశవరెడ్డికున్నారు. చలం తెలుగు వచనసాహిత్య శైలికి సొగసులద్దితే, కేశవరెడ్డి పీడితకుల దైన్యాన్ని తాత్త్వికశైలిలో మనకళ్ళముందుంచాడు. అటువంటి కేశవరెడ్డి రచనలపై బహుజన విద్యార్థి సమాఖ్య వారు హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీలో ఒకరోజు జాతీయ సదస్సుని నిర్వహించారు. ఆ సదస్సులో సమర్పించిన పరిశోధన పత్రాలను ఇలా మీముందుకి తీసుకొస్తున్నందుకు మల్లెగోడ గంగా ప్రసాద్, వారి మిత్రబృందాన్ని అభినందిస్తున్నాను.

సూర్యప్రకాశ్‌గారు తన వ్యాసంలో కేశవరెడ్డిగారి వ్యక్తిత్వాన్నీ, సాహిత్యాన్ని చక్కగా పరిచయం చేశారు. చివరిలో పతంజలి, రాజేందర్ గార్లు కేశవరెడ్డితో జరిపిన ముఖాముఖి విశేషాలు ప్రచురించారు. కేశవరెడ్డి వ్యక్తిగత జీవిత విషయాలు మరికొన్ని వ్యాసాల్లోనూ ఉన్నప్పటికీ ముందు వీటిని చదివి, తర్వాత మిగతా వ్యాసాలు చదివితే బాగుంటుంది. నరేశ్ రావుగారు కేశవరెడ్డిగారిలోని సాహిత్య, మానవసంబంధాల్ని చెప్తూ వారి హాస్పిటల్ లో పేషెంట్స్ కంటే సాహిత్యంతో సంబంధం ఉన్నవాళ్ళే ఎక్కువగా ఉండేవారన్నారు. జతిన్ కుమార్ గారి అభిప్రాయంలో కేశవరెడ్డి రాసిన సాహిత్యం రెండు వేల పేజీలకు మించకపోయినా, సాహిత్యంలో అంతకంటే గాఢమైన ప్రభావాన్నే చూపించిందన్న మాట వాస్తవానికి చాలా దగ్గరగా ఉంది. సాధారణంగా రచయితల్లో భిన్న భావజాలాలున్నప్పటికీ ఆయన ప్రాపంచిక దృక్పథాన్ని అర్థం చేసుకోవడానికి విమర్శకులు కొన్ని విశ్లేషణలు చేస్తుంటారు. ఈ విషయంలో జతిన్ కుమార్, నందిని సిద్ధారెడ్డి మొదలైన వాళ్ళు కేశవరెడ్డి

భావజాలం గురించి చర్చించారు. దళిత సమస్యను దళితేతరులు రాయడంపై భిన్నాభిప్రాయాలున్నప్పటికీ, చేతులున్నవాళ్ళంతా రాయలేనట్లే, సమస్యలున్నవాళ్ళంతా తమ సమస్యల్ని సాహిత్యీకరించలేకపోవచ్చు. అందువల్ల రచయితలు ఎవరిగురించైనా రాయవచ్చు. కాకపోతే, ఆచరణాత్మకం కాని రాతలవల్ల ఒనగూరే ప్రయోజనం ఆ వర్గాలు, ఆ వర్ణాలవారికేమీ జరగదు. వాళ్ళు గురించి ఆలోచించడం, రాయాలనుకోవడమే ఒక బాధ్యత అనుకుంటే చర్చమరోలా ఉంటుంది. అలా కాకుండా మారుతున్న భావజాలాలకు అనుగుణంగా తమ వైయక్తిక గుర్తింపుల కోసం రాసేవారి పట్లనే కొన్ని అభ్యంతరాలు వ్యక్తమవుతుంటాయి. అంతవరకు మాట్లాడలేని, రాయలేని వాళ్ళు మాట్లాడగలిగే, రాయగలిగే స్థాయికొచ్చినప్పుడు కూడా తామే మాట్లాడాలనో, తాము రాసిందే కళాత్మకంగా ఉంటుందనో తమ ఆధిక్యాన్ని ప్రదర్శించుకొనేవాళ్ళ పట్ల కూడా ఇలాంటి వ్యతిరేకత ఎదురవుతుంది. కేశవరెడ్డిగారు తాను రాసిన దానికి కట్టుబడి జీవించారు. ఇటువంటి వాళ్ళను అస్తిత్వవాదులంతా హృదయపూర్వకంగా ఆహ్వానిస్తూనే ఉన్నారు.

కేశవరెడ్డిగారి సాహిత్యంలోని మరో ముఖ్యాంశాన్ని కూడా సదస్సులో చర్చించారు. మార్క్సిస్టులు దళిత ఉపకులాల వారి గురించి మాట్లాడ్డం దళిత సమైక్యతను నాశనం చేసే భావాలకు భీజాలు నాటినట్లవుతుందేమోనని *స్మశానందున్నేరు* వంటి నవల రాసేనాటికి ఎదురైంది. అలాంటి వాటి విషయంలో వచ్చే భావజాల సంఘర్షణలను సిద్ధారెడ్డిగారు తన ప్రసంగంలో స్పష్టంగా వివరించారు. అంతర్గత వర్గాధిపత్యాన్ని కూడా మార్క్సిజం సహించదు కదా! అలాంటప్పుడు ఈ సమస్యను ఈ కోణం నుండి కేశవరెడ్డి ఆలోచించారేమో. మాదిగ, మాలల్లో ఉన్న సమస్యను తీసుకునే *స్మశానందున్నేరు* నవలను రాసినప్పటికీ, దాన్ని ఒకే కులంలో జరిగినట్లు మార్పుచేసినట్లు కేశవరెడ్డిగారు నాకు ఒక సందర్భంలో చెప్పారు. మానవజీవితాల్లోని చిన్ని చిన్ని సంఘర్షణలుగా కనిపించే వాటి తీవ్రతను కూడా చిత్రించగలగాలి. అలాంటప్పుడు ఆ రచయిత చర్చోపచర్చలకు గురైనప్పటికీ, సాహిత్యాభిమానులందరికీ తర్వాత ఆ రచయిత ప్రేమపాత్రుడు కాగలుగుతాడు. కేశవరెడ్డి రచనల్లో ఈ లక్షణాలున్నాయిని అనుకుంటున్నాను. అందుకే తనది కాని జీవితాల్ని తన రచనలకు కేంద్రం చేసుకున్నాడు. లేకపోతే ఒక ఔట్ సైడర్ గానే ఆలోచిస్తే ఎరుకల, యానాదులు, దళితులు,స్త్రీలు తనకు వస్తువులు కాకుండాపోయేవి.

నాటి ప్రారంభ సదస్సులో ప్రముఖకవి, విమర్శకుడు, సాహిత్యాన్ని, కళల్ని తాత్త్వికాంశాలతో లోతుగా విశ్లేషించగలిగే సహృదయులు వాడ్రేవు చినవీరభద్రుడుగారు కీలకోపన్యాసం చేశారు. కాల్పనిక సాహిత్యంలో విశేషమైన కృషిచేసిన తుమ్మల రామకృష్ణగారు ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు. ఆ సందర్భంగా వారిరువురి ప్రసంగాలను ఈ సంచికలో

ప్రచురించారు. అవి కేశవరెడ్డి సాహిత్యాన్ని అవగాహన చేసుకోవడానికి అనేక మార్గాల్ని అందించేలా ఉన్నాయి. అలాగే, నిర్ణయాలను ప్రకటించేటప్పుడు జాగురూకులై ఉండాలని కూడా గుర్తుచేసే విలువైన మాటల్ని చెప్పారు.

కేశవరెడ్డి సాహిత్యం పీడితపక్షానికి చెందిందనే అభిప్రాయం బలంగా వినిపిస్తున్న సమయంలోనే వాడ్రేవు వీరభద్రుడుగారు దాన్ని భారతీయ పౌరాణేతిహాసాల దృక్కోణం నుండి వీక్షించారు. *'ఆయన నవలలన్నింటిలోను అనుస్యూతంగా కొనసాగుతూ వస్తున్న ఒక ప్రధానపాత్ర భగవద్గీత'* అనడమే కాకుండా, సోదాహరణంగా *మునెమ్మ*ను కూడా ఈ కోణంలోనే సమన్వయించారు.సాహిత్యంలో రచయిత అలిగారిక్‌గా చెప్పే తాత్త్విక సత్యాల్ని పాఠకుడు అందుకోవడానికి ప్రయత్నించాలి. దీని ద్వారా సాహిత్య పునర్మూల్యాంకన సూత్రాన్ని బలంగా ముందుకి తీసుకొచ్చినట్లయ్యింది. *అతడు అడవిని జయించాడు* నవలికకు నేడున్న పీఠికలకంటే ముందు, తొలి ప్రచురణల్లో వచ్చిన పీఠికలు కూడా ఈ విషయాలను సూచించినా, రచయిత అన్ని రచనల్లోనూ ఈ లక్షణాన్ని సమన్వయించడం ఈ కీలకోపన్యాసంలో కనిపించే ఒక ప్రత్యేకత. పాఠకుల్లో ఎక్కువమంది నమ్మిన మునెమ్మలో ఉన్నది మాంత్రికవాస్తవికతగా చెప్పే మ్యాజిక్ రియలిజమ్ కాదనీ, దేశీయ సాహిత్య ప్రభావమేననడం కూడా కొత్త సమన్వయం.

రచయిత ఎవరి పక్షం వైపు ఉండాలి? అలా ఉండకపోతే రాయకూడదా? మొదలైన ప్రశ్నల ద్వారా ఒక సాహిత్యతాత్త్విక చర్చకు మరోసారి తెరతీసారు. దీన్ని కళ కళకోసమా? కళ ప్రజలకోసమా? అనే వాదాల్తో మాత్రం చూస్తే సరిపోతుందోలేదో ఆలోచించాలి.

అరుణకుమారిగారు కూడా కేశవరెడ్డి రచనలను దేశీయ తాత్త్విక భూమికతోనే పరిశీలించారు. తులనాత్మకపద్ధతిలో విశ్లేషిస్తూనే, ఆయన రచనలన్నింటినీ ముఖ్యమైన అంశాలను 14 విభాగాలుగా వింగడించి, ప్రొగ్రూపాలుగా చూడాల్సిన అంశాల్ని కూడా మనముందుంచారు. ప్రపంచసాహిత్యంలో కేశవరెడ్డి సాహిత్య విశిష్టతను గ్రీకు సాహిత్యం నుండి పరిశీలిస్తూనే ఆంగ్ల సాహిత్యంలో ప్రఖ్యాతిగాంచిన హెమింగ్వే *'ఓల్డ్ మాన్ అండ్ ది సీ'* వరకు వివిధ రచనలతోను, కేశవరెడ్డి రచనల్లో అంత:సూత్రంగా ఉన్న అంశాల్ని లోతైన విశ్లేషణను అందించారు. ఇప్పటికే కేశవరెడ్డి రచనలను తులనాత్మకంగా అధ్యయనం చేసేపని జరుగుతున్నా, పాశ్చాత్య ప్రభావాన్ని స్థిరీకరించే దిశగా చాలా పరిశోధనలు జరిగాయి. వాడ్రేవు వీరభద్రుడు, అరుణకుమారిగార్ల దృష్టితో కేశవరెడ్డి రచనలను అధ్యయనం చేయడం వల్ల తెలుగు సాహిత్య విశిష్టత, దేశీయదృక్పథం ప్రపంచానికి తెలుస్తుంది.

తుమ్మల రామకృష్ణగారు సృజనకారుని సంఘర్షణను, కేశవరెడ్డి గారి సాహిత్య వైశిష్ట్యాన్ని తన ప్రసంగంలో వివరించే ప్రయత్నం చేశారు. రచయిత అనుకున్నదే తడవుగా రచనరాదు. ఒకవేళ వచ్చినా ఒక్కోసారి దానిలో సాంద్రత ప్రశ్నార్థకమే అవ్వొచ్చుకూడా! రచయిత తాను చెప్పాలనుకున్నదాన్ని రచనగా వెంటనే వెలువరించాలనుకోవడం మంచిదే. కానీ, భారతీయ లాక్షణికుల్లో రాజశేఖరుడు అన్నట్లు 'ఒకవస్తువు' 'కళగా' మారే క్రమంలో అది రచయిత సమాధి స్థితిలోకి వెళ్ళగలిగితేనే, ఆ భౌతిక సత్యం కళాసౌందర్యమై పాఠకునికి శాశ్వతానుభూతినిస్తూ 'సత్యం' గోచరించేలా చేస్తుంది. కేశవరెడ్డి రచనలు అలా రూపుదిద్దుకున్న మానవీయ పతాకలుగా రెపరెపలాడగలుగుతున్నాయన్నారు. నేలవిడిచి సాముచేయని వాస్తవికవాదిగా చెప్తూనే, వందలాది సంవత్సరాలుగా సాహిత్యవస్తువుగా మారలేనివాళ్ళను సాహిత్యీకరించి, సాహిత్యంలో ఉదాత్తవస్తురామణీయకత్వాన్ని తీసుకొచ్చిన రచయితగా అంచెనా వేశారు. ఒక మానవతావాదిగా కేశవరెడ్డిని గుర్తించారు.

కేశవరెడ్డి రచనల్లోని రూపపరమైన చర్చను కూడా ప్రస్తావిస్తూ తుమ్మల రామకృష్ణగారు నవల, నవలిక, కథ, కథానిక వంటి ప్రక్రియాపరమైన లక్షణాలను సమన్వయించేటప్పుడు పరిశోధకులు, విమర్శకులు పాటించే ప్రమాణాల గురించి ఆలోచించాల్సిన అంశాలున్నాయన్నారు. తెలుగు కాల్పనిక సాహిత్యంలో ఆత్మకథ, ఆత్మకథాత్మక నవల వంటి వాటి విషయంలో కూడా మరింత స్పష్టత రావాల్సిన అవసరం ఉంది. హిందీ, మరాఠీ, తమిళ భాషల్లో ఆత్మకథాత్మక నవలలుగా చెప్పుకున్న రచనలు తెలుగులోకి వస్తున్నాయి. అలా వచ్చినదే భగవాన్ దాస్ హిందీలో రాసిన *'మైబంగీహూ'* నవల. అది *'నేను అంటరానివాణ్ణి'* పేరుతో తెలుగులో వచ్చింది. ఓం ప్రకాశ్ వాల్మీకి మరాఠీలో రాసిన *'జూఠన్'* తెలుగులోకి వచ్చింది. తమిళ రచయిత్రి బామ ఆత్మకథాత్మక నవలలుగా రాసిన *'కరక్కు', 'సంగతి'* కూడా తెలుగులో అనువాదమైయ్యాయి. పి.వి.నరసింహారావు గారి *'ది ఇన్ సైడర్',* దేవులపల్లి కృష్ణమూర్తి గారి *'లైఫ్ ఇన్ అనంతరామ'* తెలుగులో *'ఊరు వాడ బతుకు'* పేరుతో వచ్చింది.ఇవన్నీ ఆత్మకథాత్మక నవలలుగా చెప్తున్నారు. ఆళ్వారు స్వామి గారి *'ప్రజలమనిషి'* ని కూడా ఆత్మకథాత్మక నవలగా భావిస్తున్నారు. నవలకు, ఆత్మకథాత్మక నవలకు మధ్య గల లక్షణాలను సాధ్యమైనంత స్పష్టంగా రూపొందించుకోవాల్సిన అవసరం ఉంది. కేశవరెడ్డిగారి కుమార్తె ఆనాటి సదస్సులో 'మునెమ్మ' గురించి చెప్తూ తమ కుటుంబానికి చెందిన పాత్రలందులో ఉన్నాయన్నారు. కవిత్వం, కథ, నవల వంటి సృజనాత్మక సాహిత్య ప్రక్రియల్లో రచయిత జీవితంతో పాటు, తన చుట్టూ ఉన్న వాళ్ళ జీవితాలు కూడా పాత్రలుగా, సంభాషణలుగా మారుతుంటాయి. అయినా అవి వారిలో ఏ ఒక్కరికి మాత్రమే చెందినవిగా చెప్పలేం. అలా తీర్చిదిద్దగలగడమే

సాహిత్యాన్ని కళాత్మకం చేయడమవుతుంది. అలాంటప్పుడు ఆత్మకథాత్మక విషయాలుగా నిర్ధారించేటప్పుడు విమర్శకులు చాలా సంఘర్షణలకు గురవుతుంటారు. వీటిని తెలుగు సాహిత్యంలో లోతుగా చర్చించాల్సిన అవసరం ఉంది.

తెలుగులో కథ, కథానిక విషయంలో కూడా ఇలాంటి గందరగోళ నిర్ణయాలు కనిపిస్తున్నాయి. గురజాడ రెండుమూడు పుటల్లో రాసిన *'దిద్దుబాటు'*నీ, కొలకలూరి ఇనాక్ నూరు పుటలకు మించి వర్ణించిన *'ఊరబావి'* రచనను కూడా కథానికలే అనీ అంటున్నారు. అలాగే నూరు పుటలకు మించకుండా రాసిన కేశవరెడ్డి రచనలనూ నవలలనీ, వెయ్యిపుటలకు మించి రాసిన విశ్వనాథ సత్యనారాయణగారి వేయిపడగలు రచననీ నవలే అనడంలో విమర్శకులు భేదాల్ని పాటించడం లేదు. ఆంగ్ల సాహిత్యంలో నావెల్, నావలెట్ వంటి పారిభాషిక పదాలతో ఈ ప్రక్రియాపరమైన భేదాలను రచనల్లోని పదాలను బట్టి లక్షణాలను ఏర్పరిచే ప్రయత్నం కనిపిస్తుంది. తెలుగులో వల్లంపాటి వెంకటసుబ్బయ్య ఈ రకమైన కొన్ని ఆలోచనలను చర్చించే ప్రయత్నం చేశాడు. కానీ, ఈ దిశగా లోతుగా పరిశోధనలు జరగాల్సి ఉంది. ఇలాంటి సాహిత్యంలో చర్చనీయాంశాలను తుమ్మల రామకృష్ణగారు ప్రస్తావించడం బాగుంది. ఈ విషయాలపై రాబోయే పరిశోధకులు దృష్టిసారించడానికి ఇవన్నీ ప్రేరణలుగా నిలుస్తాయి.

తీసుకున్న వస్తువు, దాన్ని పాఠకునికి అందించే నైపుణ్యం, ఈ రెండింటి ద్వారా మొదట వ్యక్తమయ్యేది రచయిత వ్యక్తిత్వమే. ఈ దృష్టితో మల్లెగోడ గంగాప్రసాద్‌గారు రాసిన వ్యాసం కేశవరెడ్డి తన రచనా నైపుణ్యంతో తాను తీసుకున్న వస్తువునెలా శిల్పవైవిధ్యాన్ని ప్రదర్శించగలిగాడో వివరించాడు. పరిశోధకుడు తనకు ముందున్న వారి అభిప్రాయాలను స్వీకరించి, వాటిని తన వాదన లేదా సిద్ధాంత సమర్థనకు ఉపయోగించుకున్నా, ఆ విషయాన్ని చెప్పాలి. అలా చెప్పకపోతే అది భావచౌర్యం కిందికే వస్తుంది. తన వ్యాసంలో గంగాప్రసాద్ ఆ నిజాయితీని ప్రదర్శించాడు. సాధారణంగా కవిత్వాన్ని, కథల్ని, నవలల్ని ఉదాహరించినప్పుడు ఆ రచయితలను పేర్కొన్నట్లుగా విమర్శ, పరిశోధకుల అభిప్రాయాలను తమ సిద్ధాంత గ్రంథాల విషయంలో చాలా మంది ఈ నియమాన్ని పాటించడం లేదు. ఒకరి అభిప్రాయాన్ని లేదా వారి సిద్ధాంతాన్ని తమ పరిశోధనల్లో వాడుకున్నప్పటికీ ఆ విషయాలు చెప్పడం మేధోహక్కులను గౌరవించడమవుతుంది. దీన్ని స్ఫురించేలా గంగాప్రసాద్ తన పరిశోధనా వ్యాసాన్ని రాసేప్రయత్నం చేశాడు.

సాధారణంగా విశ్వవిద్యాలయస్థాయిలో సమర్పించే పరిశోధన పత్రాల్ని రాసేటప్పుడు కొన్ని నియమాల్ని పాటించాలి. ముఖ్యంగా పాటించాల్సిందానిలో పరిశోధన

పద్ధతుల్ని అనుసరిస్తూ పత్రాల్ని రాయడం. దీనికి ప్రస్తుతం అనేక శైలీపత్రాలు (స్టైల్ షీట్స్) ఉన్నాయి. పరిశోధన పత్రాల్ని రాయడానికి ప్రపంచవ్యాప్తంగా ఆయా శాస్త్రాలకు భిన్నమైన శైలీపత్రాలున్నప్పటికీ, హ్యుమానిటీస్‌లో ఎం.ఎల్.ఏ.,స్టైల్ షీట్ (మోడర్న లాంగ్వేజ్ అసోసియేషన్) నే అనుసరిసున్నారు. దీన్నే ఎం.ఎల్.ఏ. హేండ్ బుక్ ఫర్ రైటర్స్ ఆఫ్ రీసెర్చ్ పేపర్స్ అని పిలుస్తుంటారు. భాషాశాస్త్రపరిశోధన పత్రాలకు కూడా ఇది సౌలభ్యంగా ఉన్నప్పటికీ, వీళ్ళు ఎక్కువగా ఏ.పి.ఏ (పబ్లికేషన్ మాన్యువల్ ఆఫ్ అమెరికన్ సైకొలాజికల్ అసోసియేషన్) ని తీసుకుంటున్నారు.వీటి ప్రకారం పరిశోధన పత్రం రాయడం వల్ల ఆ పత్రానికి శాస్త్రీయత వస్తుంది. పరిశోధన పత్రంలో పునరుక్తి తప్పడంతో పాటు, భావచౌర్యం కూడా తగ్గుతుంది.

సమ్మెట నాగమల్లేశ్వరరావుగారు క్లిష్టమైన విషయాల్ని కూడా చిన్న చిన్న వాక్యాలతో ఎంతో సరళంగా వివరించాడు. కొంతమందికి విషయాన్ని చిన్న చిన్న వాక్యాల్లో గానీ, పెద్దపెద్ద వాక్యాల్లో గానీ చెప్పే అలవాటు కూడా ఉండొచ్చు.ఈ పత్రంలో కేశవరెడ్డినీ, సాహిత్యాన్నీ చాలా జాగ్రత్తగా అంచనా వేయడం, అభిప్రాయ ప్రకటనల్లో అత్యుత్సాహాన్ని ప్రదర్శించకుండా సంయమనాన్ని ప్రదర్శించడం విద్యార్థులు గుర్తించాల్సిన అంశాలు.

ఈ సంచికలో మూడు తరాలకు చెందిన వాళ్ళు ఈ పత్రాలను రాశారు. కేశవరెడ్డి సాహిత్యం గురించి మాట్లాడే పేటెంటు హక్కుల్ని పొందినంత సాధికారికంగా మాట్లాడే వాళ్ళలో ఒకరైన అంబటి సురేందర్ రాజు, ఇంచుమించు ఆ వయసులోని వాడ్రేవు వీరభద్రుడు, నందిని సిద్ధారెడ్డి, తుమ్మలరామకృష్ణ, అరుణకుమారి, జతిన్ కుమార్ తదితరులు మొదటి తరానికి చెందినవాళ్ళు. కేశవరెడ్డి సాహిత్యాన్ని శాస్త్రీయంగా ముందుకు తీసుకెళ్ళాలనుకునే మల్లెగోడ గంగాప్రసాద్ లాంటివాళ్ళు రెండవతరానికి ప్రాతినిథ్యం వహిస్తుంటే, ఇప్పుడిప్పుడే సాహిత్యాన్ని చదువుతూ, పరిశోధన చేస్తూ, పత్రసమర్పణలకు ఆసక్తి చూపుతున్న సుమలత వంటి విద్యార్థులు మూడవ తరానికి ప్రాతినిథ్యం వహిస్తున్నట్లనిపిస్తుంది. అలా మూడు తరాలకు చెందిన వాళ్ళు ఈ సదస్సులో కేశవరెడ్డి సాహిత్యాన్ని చర్చించారు. ఆ స్థాయిలోని ఆ భావ పరిణతి కూడా ఆ యా పత్రాల్లో కనిపిస్తుంది.

మొత్తం మీద ఈ సంచికలో కేశవరెడ్డిగారి సాహిత్యాన్ని సామాజిక, ఆర్థిక, చారిత్రక, మానసిక కోణాల్లో రాసిన పత్రాలున్నాయి.కొన్ని పత్రాల్లో అత్యుక్తులతో కూడిన నిర్ణయాలు కూడా దొర్లాయి. పరిశోధన పత్రాల్లో ఇలాంటి ప్రకటనలను చేసేటప్పుడు సాధికారికంగా నిరూపించగలగాలి. అలాంటి ప్రకటనలు రెండవ, మూడవ తరానికి చెందిన

విద్యార్థుల పత్రాల్లో ఎక్కువగా కనిపిస్తున్నాయి. తొలిసారిగా పత్రాన్ని రాస్తున్నవారిలో ఇలాంటి పొరపాట్లు జరగడం సహజమే. కానీ, సరిదిద్దుకునే సహృదయతను పెంపొందించుకోవాలి.

కేశవరెడ్డిగారి సాహిత్యంపై సదస్సు జరిపినప్పుడు ఆ ప్రారంభసమావేశానికి నన్ను అధ్యక్షుడిగా వ్యవహరించమన్నారు. బహుశా ఆయన సాహిత్యంపై మూడు పరిశోధనలు (ఎం.ఫిల్స్) చేయించడం వల్లనో, నాలుగైదు పరిశోధన పత్రాలను వివిధ సదస్సుల్లో సమర్పించడం వల్లనో, రెండు మూడు వ్యాసాలు పత్రికల్లో రావడం వల్లనో నన్ను నాడు అధ్యక్షుడిగా ఉండమన్నారనుకున్నాను. కానీ, ఇవేమీ కారణాలు కాదేమోననిపిస్తుంది. ఎందుకంటే మళ్ళీ ఈ సంచికకు ముందుమాట రాయమన్నారు. దీనికంతటికీ కారణం మా విద్యార్థులకు నాపట్ల ఉన్న ప్రేమాభిమానాల వల్లనే అనుకుంటున్నాను. ఏది ఏమైనా, కేశవరెడ్డి సాహిత్యాన్ని మళ్ళీ మరోసారి చదువుకొని, నా అభిప్రాయాల్ని ఇలా మీతో పంచుకునే అవకాశం కలిగింది. అందుకు ఈ సదస్సు నిర్వహించిన వారందరినీ అభినందిస్తూ, ధన్యవాదాలు కూడా తెలియజేస్తున్నాను.

సాధారణంగా విశ్వవిద్యాలయస్థాయిలో ఒక జాతీయసదస్సు నిర్వహించాలంటే చాలా వ్యయ ప్రయాసలకు గురికావాలి. వ్యవస్థీకృతంగా చేయడానికే ఎంతో కష్టపడాల్సిన పరిస్థితుల్లో ఈ సంస్థ పెద్దపెద్దవాళ్ళతో పాటు, విద్యార్థినీ విద్యార్థులను అందరినీ ఏకం చేసి ఒకరోజు జాతీయసదస్సుని నిర్వహించారు. అది కూడా చాలా ఘనంగా నిర్వహించారు. అందరికీ భోజనాల్ని కూడా ఏర్పాటుచేశారు. నాటి సదస్సులో మాట్లాడిన వారి ప్రసంగాలను చేతితో రాయడం, పుస్తకంగా ప్రచురించడం సామాన్యమైన పనికాదు. ఈ పని చేయాలంటే అంకితభావం కలిగిన వాళ్ళుండాలి. ఆర్థిక తోడ్పాటుండాలి. మొదటి నుండి చివరివరకు వీళ్ళందరి మధ్యా సమన్వయం ఉండాలి. అప్పుడు గానీ ఇలాంటి సంచిక బయటకు రాదు. అన్నీ సుసాధ్యం చేయగలగుతున్న సంస్థసభ్యుల్ని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. ఈ సంచికలోని వ్యాసాలను చదివేటప్పుడు, ఒక నిర్ణయానికి వచ్చేటప్పుడు సదస్సులో సమర్పించిన మూడుతరాల వారి స్థాయిల్ని కూడా పరిగణనలోకి తీసుకోమని పాఠకుల్ని కోరుతూ, ఈ పరిశోధన వ్యాసాల్ని మిమ్మల్ని అందర్నీ చదవమని ఆహ్వానిస్తున్నాను.

*18 మార్చి 2016.*

★★★

# తెలంగాణ సంఘర్షణ పతాక కదిరె కృష్ణ కవిత్వం

తెలంగాణా ప్రాంతం వెనుకబడిందా? తెలంగాణా ప్రజలు వెనుకబడి ఉన్నారా? తెలంగాణా ప్రజల్ని వెనక్కి నెట్టి వేశారా? అనే ప్రశ్నలు వేసుకుంటే అనేక రాజకీయ కారణాల వల్ల తెలంగాణా ప్రాంతం వెనకబడి పోయిందని ఆ చారిత్రక ఆధారాలు ఎన్నో వివరిస్తున్నాయి. నిజాం పాలన దానికొక కారణంగా చాలా మంది చెప్తున్నారు. తెలంగాణాలోని అత్యధికులు, కింది వర్గాలకు చెందిన ప్రజలు ఆర్థికంగా వెనుకబడ్డారు. వెట్టితో నలిగిపోయారు. పోరాటాలు చేసి చేసి అలసి పోయారని చెప్పలేం గానీ, మరింత రాటుదేలారు. లేకపోతే ప్రపంచంలో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం అని పిలిచే 1857 నాటి తిరుగుబాటు, తర్వాత అంత శక్తివంతమైన పోరాటం తెలంగాణాలోనే జరిగిందని విమర్శకులు వ్యాఖ్యానిస్తారా? కనుక ప్రజలు 'పోరాటం' చేయడంలో వెనుకబడి లేరు. వెనక్కి నెట్టబడుతున్నారు. పోరాటాల్ని నిజంగా' గుర్తించని వాళ్ళు పాలకులుగా చెలామణి అవుతున్నారు. అందుకనే ఒకప్పుడు వెట్టి నిర్మూలన నిరంకుశ పాలనను వ్యతిరేకించి సాయుధ పోరాటం చేసి అనేక మంది ప్రాణాల్ని త్యాగం చేసి, విశాలాంధ్ర పేరుతో మళ్ళీ మోసపోతుంటే అది మోసమని ఘోషిస్తుంటే పోరాడుతుంటే ఆ పోరాటాన్ని పరిగణలోకి తీసుకోవట్లేదు నేటి పాలక వర్గమనీ చాలామంది భావిస్తున్నారు. పాలకులు ప్రత్యేక తెలంగాణ ఇవ్వకుండా రక రకాల సాకుతో కాలాన్ని వెళ్ళదీస్తున్నారు. వీటన్నింటిని తెలంగాణా ప్రాంతం మీద అభిమానం, అవగాహన, చైతన్యం ఉన్న కవులు, రచయితలు తమ రచనల్లో రాస్తూనే ఉన్నారు. అలా వచ్చినదే కదిరె కృష్ణ కవిత్వం"బలగం"

మాతృత్వం పైన, మాతృ భూమి పైన మమకారంతో కవిత్వం రాస్తున్నాడు కదిరె కృష్ణ. మత కల్లోలాలపై ఆగ్రహం, ఆ కల్లోలాల వెనుక బలైపోయే దళితుల పట్ల ప్రేమ

అతని కవిత్వంలో ఉంది. ప్రపంచీకరణ ప్రభావంతో అన్నీ మారుతున్న 'కులం' మాత్రం మాసిపోవడం లేదనే ఆవేదన ఉంది. తెలంగాణ ప్రాంతంలో దళితులు జీవించటమే కష్టమైన పరిస్థితుల్లో, ఒక దళిత మహిళ, అందులోనూ ఒక మాదిగ మహిళ దేశ రాజకీయాల్లో కూడా పేరు ప్రఖ్యాతలు తెచ్చుకోవడం అసమాన్యమని కీర్తిస్తాడు. దళితుల్లోని అంతర్వివక్షనూ ప్రశ్నిస్తూనే మాదిగల గొప్పతనాన్ని వెల్లడిస్తాడు. స్త్రీలను గౌరవిస్తామంటూనే, ఫ్యాషన్స్ పేరుతో జరుగుతున్నవ్యాపారం, వ్యభిచారం కూపంలోకి దింపేస్తున్న ఆడపిల్లల్ని చూసి కవి చలించిపోతాడు. ప్రత్యేక తెలంగాణ పట్ల మాదిగల దృక్పథంగా తన అభిప్రాయాన్ని కూడా స్పష్టంగా వివరిస్తున్నాడు. మాదిగల్ని చైతన్య పరిచే సాహిత్యం సృష్టించిన కవుల్ని, కళాకారుల్ని ఉత్తేజ పరుస్తున్నాడు. ఇవన్నీ కదిరె కృష్ణ రాసిన 'బలగం' (2007) కవితా సంపుటిలో బలంగా కనిపించే సమకాలీన సమాజం సంఘర్షణాత్మక కవితా చిత్రాలు. ప్రపంచీకరణ ప్రభావం వల్ల గ్రామీణ సంస్కృతిలో వచ్చిన మార్పుల్ని వర్ణిస్తూ ......

*"పట్ట పగలే*
*పల్లెనెవడో దోచుకుంటున్నాడు*
*నిర్భీతిగా*
*పొట్టలో తలదూర్చి*
*నెత్తురు జుర్రేస్తున్నాడు*
*గ్లోబల్ దొంగ*
రంగు రంగుల ఛానళ్ళ కులాల దొంగ
*మళ్ళీ సమధుల్లోకే పయనం....*
*కళకళలాడిన పల్లె*
*కొనవూపిరితో కొట్టుమిట్టాడుతున్న*
*"క్రౌంచ మిధునం"......* (బలగం, 2007 : 2)

అనడంలో వలసలు పోతున్న జీవితాల్లో చెలరేగే సంఘర్షణను కవిత్వీకరిస్తున్నాడు కవి. ప్రేమానురాగాలతో కలిసి మెలిసి జీవించనివ్వని వలసల్ని, భార్యా భర్తల మధ్య అనివార్యమవుతున్న వియోగాన్ని "క్రౌంచ మిధునం" అనే భావం చేత కవిత్వీకరించాడు. వాల్మీక రామాయణం రావడానికి శోకం నుండి శ్లోకం అప్రయత్నంగా పుట్టడం కారణమని ఒక కథ ప్రచారంలో ఉంది. క్రౌంచ పక్షుల జంటను ఒక బోయ వాడు కొడితే, దానిలోని ఒక పక్షికి బాణం తగిలి, అది నేలపై పడి విలవిలలాడుతూ ప్రాణం విడుస్తుంది. తనకు దూరమైపోతున్న పక్షి చుట్టూ తిరుగుతూ మరో పక్షి విలవిలలాడిపోతుంది. అలా గ్రామం

వలసలతో భార్యాభర్తలు విడిచి ఉండలేక, విడవకపోతే బతకలేక మనోవ్యధకు గురవుతున్నారని వర్ణిస్తున్నాడు కవి.

నాగప్పగారి సుందర్రాజు మరణించిన తర్వాత చాలా మంది స్మృతి కవితల్ని రాశారు. కదిరె కృష్ణ, నాగప్పగారి సుందర్రాజు పేరుతో సంభాషణాత్మక శిల్పంతో కవిత రాశాడు. చనిపోయిన సుందర్రాజుతో మాట్లాడుతున్నట్లు రాశాడు కవి. సుందర్రాజు స్థాపించిన "మాదిగ సాహిత్య వేదిక" ఆగిపోయినా, ఆ స్ఫూర్తితో మాదిగ కళాకారుల వేదికను కొనసాగిస్తున్నట్లు చెప్తాడు కవి. ఆ స్ఫూర్తి కొనసాగుతుండడం వల్లనే నగర వీధుల్లో డప్పులతో మాదిగలు తమ సంస్కృతిని విస్తరిస్తున్నారంటాడు కవి. ఈ కవితలో మూడు అంశాలున్నాయి.

1. వర్గీకరణ విషయాన్ని కోర్టు కొట్టేయడంతో మాల వర్గానికి చెందిన వారంతా సంతోషంగా ఉన్నారు.
2. అయినా వర్గీకరణ సాధన కోసం, దానితో పాటు మాదిగ చరిత్ర, సంస్కృతులను కొనసాగించే సంస్థలు కొత్త కొత్తగా పుడుతూనే ఉన్నాయని, మాదిగ చైతన్యం కొనసాగుతుందనే హామీ కనిపిస్తుంది.
3. దళిత, మాదిగల భావజాలాన్ని నిరంతరం ప్రశ్నించుకోవటం కూడా జరుగుతుందనే విషయాన్ని, సుందర్రాజుతో అక్కడి విషయాల్ని తెలుసుకోవడంలో వర్ణించగలిగాడు. బ్రహ్మ, విష్ణు, రంభ, ఊర్వశిలనే హిందూ భావజాలంలో కనిపించే స్వర్గ నరకాలేవి లేవనీ, అవన్నీ అభూతకల్పనలనే భౌతికవాదిగా సుందర్రాజు భావజాలాన్ని వివరించగలిగాడు కదిరె కృష్ణ. ఆ కవితలోని కొంత భాగాన్ని కింద పరిశీలించవచ్చు.

"ఏం బ్రదర్! సోదరులు రెచ్చిపోతుంద్రంట!"
'మాదిగ చైతన్య వేదికను
మజ్జెల్నే ఆపింద్రంటా!
"అయితేందన్నా!
మాదిగ కవుల కళాకారుల వేదిక
బెట్నెం!
డప్పుల మోత'తో దద్దరిల్లుతోంది పట్నం" (బలగం: 2007 : 12)

ఈ కవితా ఖండికల్లో శిల్ప వైవిధ్యాన్ని ప్రదర్శించగలిగాడు.

స్వాతంత్ర్యం వచ్చి 60 ఏళ్ళు దాటుతున్నా, ప్రజాస్వామ్య దేశంలో అందరికీ హక్కులున్నా, వాటిని అందుకోలేని వాళ్ళలో దళితులే ముందున్నారు. ఈ విషయాన్ని వర్ణిస్తూ కవి...

*‘‘కలకటేరు బాబు కారుకు వేలాడుతున్న*
*మూడు రంగుల జెండా సాక్షిగా*
*ఆ బావి నీళ్ళు తోడడానికి అనర్హుడనని*
*ఊరు ఊరంతా గర్జిస్తే, పాలిపోయిన మొఖం వేసుకొని*
*మాటలొచ్చిన మూగదయ్యింది రాజ్యాంగం’ (బలగం: 2007 : 18)*

అని చెప్పడంలో ‘రాజ్యాంగం’ హక్కులిస్తున్నా, వాటినింకా ఎంతోమంది దళితులు అందుకోలేక పోతున్నారనే సత్యాన్ని చెప్పాడు. బంద్, సమ్మెలు వంటివేమి జరిగినా నష్టపోయేది దళితులేనని చెప్తూ కవి...

*“అప్పుడప్పుడు*
*నగరం చిందులేస్తుంది*
*ఎలక్షన్ల సొల్లు మత్తు మత్తుగా చిత్తు చిత్తుగా తాగి*
*నలుగురు దళితుల్ని మింగి*
*ప్రశాంతంగా*
*హాయిగా త్రేనుస్తుంది*
*దీని కడుపులో మనువు రాచపుండు” (బలగం: 2007 : 18)*

ఉందనీ, దాన్ని ఆపరేషన్ చేయడానికి దళితులంతా ‘వైద్యులై’ కదలవలసిన అవసరం ఉందంటాడు. బంద్, సమ్మెల వంటివి జరిగేటప్పుడు దళితులెంత అప్రమత్తంగా ఉండాలో హెచ్చరిస్తున్నాడు కవి.

మాదిగవాడిగా కుంగిపోకుండా, ఆ కులంలో ఉంటూనే ఆత్మగౌరవాన్ని ప్రకటిస్తున్న మంచి కవిత “నే నెవరో చెప్తుంది...

*“ఏవడ్రా నను మించిన*
*ఇంజనీరు*
*ఏదిరా నా చెప్పుల్ని మించిన*
*మిషనేరు*
*గూటం నా కుల గురువు*
*తంగేడు చెట్టు నా కల్పవృక్షం*
*కత్తికి కదనం నేర్పినోన్ని*
*నెత్తుటి ముద్దలతో*
*దేశం సరిహద్దులు గీసినోన్ని*
*మాదిగోన్ని” (బలగం: 2007 : 56)*

మాదిగల కులవృత్తి, ఆ సాధనాలు, ఆ పనితనం, ఆ నైపుణ్యం వంటివన్ని ఈ కవితలో చెప్పటంలో ఆత్మగౌరవాన్ని వ్యక్తీకరిస్తున్నాడు కవి. వాటితోనే జీవితాంతం కొనసాగిస్తానని ఎక్కడా ప్రకటించలేదు. వృత్తులన్నింటికీ గౌరవం కల్పించాలనే డిమాండ్ కనిపిస్తుంది. సమాజానికి మాదిగలు చేస్తున్న కృషిని గుర్తించమనీ, కొందరి సేవనే గొప్పగా గుర్తించడం సరికాదనీ వివరిస్తున్నాడు కవి.

అన్నీ మారుతున్నా, 'కులం' మాత్రం పోవట్లేదని చెప్తూ "దీని దినం జెయ్య!" అనే కవితను రాశాడు కవి కదిరె కృష్ణ. డొంకదారి, రేల పూత బంగారంలా మెరుస్తుంది. గ్రామాల్లో ల్యాండ్ ఫోన్స్ స్థానంలో సెల్‌ఫోన్స్, ఫోర్టబుల్ స్థానంలో ప్లాస్మా టీ.వీ.లు వస్తున్నాయి. ప్రత్యక్ష ప్రసారాలతో అన్ని సెకన్ల కాలంలో తెలిసిపోతున్నాయి. వైద్య రంగంలో కూడా ఎన్నో మార్పులు వచ్చాయి.

*"ఇరవై నాల్గు గంటల ప్రసారం*
*గుండు సూదుల్తో పెద్దాపరేషన్..."* అన్నీ జరుగుతున్నాయి.

*"మంచిదే! అన్ని మారినైగాని*
*మా ఊళ్ళె...*
*కులం మాత్రం*
*మారలె...*
*దీని దినంజెయ్య! (బలగం: 2007 : 66)*

ప్రపంచీకరణ ప్రభావంతో అన్ని మారుతున్నా కులం మాత్రం మారడంలేదనేది అనుభవ సత్యంగా చెప్తున్నాడు కవి. ప్రత్యేక తెలంగాణా రాష్ట్రం కోసం ఈ ప్రాంత ప్రజలంతా పోరాడుతున్నారని చెప్తూ నైజాము నవాబుల్ని మట్టి కరిపించిన వీరుల్ని స్మరిస్తాడు కవి. సమకాలీన నాయకుల మీసాల్ని గుర్తిస్తున్నామంటాడు. మాదిగలు కూడా తెలంగాణా పోరాటాన్ని సమర్థిస్తున్నారంటూ...

*"దప్పు గూడ మోగుతున్నది*
*కన కన*
*రావాలని తెలంగాణ"* (బలగం: 2007 : 71)

అని ప్రకటించాడు కవి. తెలంగాణా కవులు అత్యధికులు తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం కావాలనే కోరుకుంటున్నారు. ఈ ప్రాంత దళిత కవులూ అలాగే కోరుకుంటున్నా, వారికవిత్వంలో కుల నిర్మూలన కావాలనే ఆకాంక్ష బలంగా కనిపిస్తుంది. సమకాలీన సమస్యల్ని శక్తి వంతంగా కవిత్వీకరిస్తున్న కదిరె కృష్ణను అభినందించవలసిందే!

★★★

# తెలంగాణ
# దళిత అంతర్మథన కవిత్వం

గతంలో తెలంగాణా ప్రాంతం నుండి వచ్చిన దళిత కవుల్లో కూడా అంబేద్కర్ భావజాలం కంటే, మార్క్సిస్టు భావాల పట్లే ఎక్కువ మమేకత్వం కనపడేది. కానీ, ఈ మధ్య కాలంలో ఆ ధోరణి కొంచెం కొంచెంగా తగ్గుముఖం పడుతుంది. అంబేద్కరిజంపై ఆసక్తి పెరుగుతుంది. స్థానీయతను ఆకాంక్షిస్తూనే, దళితుల ఆత్మగౌరవం అంబేద్కరిజంలోనే అంతర్భూతంగా ఉందనే సంగతిని గుర్తిస్తున్నారు.

ఈ నేపథ్యంతో పరిశీలిస్తే, చాలామంది తెలంగాణా దళిత కవులు పరిణామం ఈ దిశగా కొనసాగుతుందని స్పష్టమవుతుంది. ఇటీవల పొన్నాల బాలయ్య 'ఎగిలి వారంగ' పేరుతో తన కవితలన్నీ ఒక సంపుటిగా తెచ్చాడు. 'పొద్దు పొడవాల'నేది ఆ కవితా సంపుటికి పెట్టిన పేరులోని అర్థం. దళిత సమస్యలెలా పరిష్కరించబడాలో, తెలంగాణా సమస్యనెలా పరిష్కరించుకోవాలో, వర్గీకరణ సమస్యనెలా అర్థం చేసుకోవాలో, మార్క్సిస్టు పోరాటాల్ని, ఆ పోరాటాల్లో బలైపోతున్న దళితుల జీవితాన్ని ఎలా బాగుచేసుకోవాలో, ప్రపంచీకరణ నుండి ఎలా రక్షించుకోవాలో, అన్నింటికీ మించి సంస్కృతినెలా కాపాడుకోవాలో వివరించే దిశగా ఆలోచించి ఒక కొత్త 'పొద్దు పొడవాల'నే ఆకాంక్షను కవి *'ఎగిలి వారంగ'* లో వ్యక్తం చేశాడు.

శక్తివంతమైన భావాన్ని, అంతే శక్తివంతంగా అందించగలగడమే కవిత్వం చేయడంలో కనిపించే శిల్పం. పొన్నాల బాలయ్య దాన్నింకా సాధన చేయవలసి ఉన్నా, తెలంగాణా పట్ల, ఆ ప్రాంతంలోని దళితుల పట్ల, మొత్తంగా ప్రజల ఆశల పట్ల స్పష్టమైన

భావాలున్న కవి. వృత్తిరీత్యా హిందీ పండితుడైనా, తెలుగులో కవిత్వం రాస్తున్నందుకు ముందుగా ఆయన్ని అభినందించాలి. అలాగే, ఆ తెలుగులో కలిసిపోయిన మణి ప్రవాళ భాష గురించీ ఆలోచించమనాలి.

*'ఎగిలి వారంగ'* లో చిన్నప్పుడే చనిపోయిన తండ్రి స్మృతితో కవిత్వం ప్రారంభమౌతుంది. తన బాల్యమెంత విషాదకరంగా సాగిందో 'ఎగిలివారంగ' కవిత అనేక దృశ్య చిత్రాలతో చూపిస్తుంది. కవిత అంతా విడివిడిగా పదాలున్నట్లు ఉంటుంది. ఒకదానితో మరొక దానికి సంబంధం లేనట్లుంటుంది. తన బాల్యం కూడా ఒక పద్ధతి ప్రకారం కొనసాగలేదనీ, తనలాంటి వాళ్ళ బాల్యం కూడా అలాగే ఉందని కవి శిల్ప నైపుణ్యంతో చెప్తున్నాడు. ఒక అస్తవ్యస్థత ఆ కవిత నిండా ఉన్నట్లు ఉంటుంది. ఆయన రాసుకున్న జీవిత నేపథ్యం చదివితే, ఆ కవిత బాగా అర్థమవుతుంది. బహుశా దాన్ని అలా చెప్తేనే బాగుంటుందనుకున్నాడేమో!

*"అయ్య కొట్టిన తంగెడు కట్ట*
*సోయి తప్పిన అవ్వ*
*ఆనిగపు బుర్ర నీళ్ళు."*

ఇలా సాగిపోతుందీ కవిత. తెలంగాణాకే ప్రత్యేకతను తెచ్చే పండగల్లో ఒకటి "బతుకమ్మ". దీన్ని తెలంగాణాలోని కొన్ని ప్రాంతాల్లో దళితులు ఆడడానికి లేదు. ఆ పండగల్లో భాగస్వామ్యం కాలేని అలాంటి తెలంగాణా దళిత బాల్యాన్ని వర్ణిస్తూ –

*"అందరు పండుగ మోజులవుంటే*
*నేను పశుల గాస్తుంటే*
*డప్పుల చప్పుళ్ళతో*
*బతుకమ్మను తెచ్చి ఆడుతావుంటే*
*ఆవలుండి చూసుటే తప్ప*
*పండుగ జరుపుకున్న పాపాన పోలేదు"* (పుట: 20)

అని ఆనాడు అందుకోలేని అందమైన బాల్యాన్ని, చేజారిన సంతోషాన్ని గుర్తు చేసుకుంటున్నాడు కవి.

మొదట్లో దళితుల్ని గుర్తించిందీ, చైతన్యం నింపిందీ ఖచ్చితంగా మార్క్సిస్టు సాహిత్యమే. నేటికీ దానిలో అదే మౌలిక భావన ఉంది. అయితే అది పీడిత వర్గ దృక్పథంతో చూస్తుంది తప్ప, కుల స్పృహను ప్రధానంగా గుర్తించదు. కానీ,

భారతదేశంలో కులమే ప్రధానమవుతుందని దళిత మేధావులు భావిస్తున్నారు. అదే అనేక సమస్యలకి కారణమవుతుందని దళిత మేధావుల వాదన. ఆ పునాదిని గుర్తించకుండా కులాన్ని ఉపరితల అంశంగానే వర్గవాదులు గుర్తించడం జరుగుతోంది. మొదట్లో పీడిత వర్గ చైతన్యంతోనే తెలంగాణాలోనూ దళితులు ఆ భావజాల పార్టీల్లో పనిచేశారు. తర్వాత కాలంలో అంబేద్కర్ భావజాలంపై అవగాహన కొస్తున్నారు. దాన్ని కవి వర్ణిస్తూ...

*'పగలనక రాత్రనక పశులుగాసి*
*ప్రపంచానికీ దూరంగా పస్తులుండి*
*కారడవిలో వింత పశువునై*
*అడవే నాకు అవ్వ – అయ్య*
*ఆత్మీయతతో అడవితల్లి ఆదరించిందనీ*

గుర్తు చేసుకుంటాడు. అయితే, తర్వాత కాలంలో జరిగిన మోసాన్ని కూడా గుర్తించమంటున్నాడు కవి.

*'చెమట చుక్కలతో చెలకదున్నిన*
*ఎగిలి వారంగ యాతం బోసిన*
*అలసట ఎరగక అన్ని పండించిన*
... .... .... ....
*ఊరు బయటనే అంటరానోన్ని జేసింద్రు"*

అని అక్కడ కులాన్ని ఆధారం చేసుకుంటున్నారని, అంతర్గతంగా మార్క్సిస్టుల విధానాన్ని ప్రశ్నిస్తున్నాడు. దళితులకు నాయకత్వాన్ని అందనివ్వని స్థితిని గుర్తు చేస్తున్నాడు. అక్కడా హిందూ భావజాలమే మార్క్సిస్టుల్లో అంతర్గతంగా పనిచేస్తుందంటాడు. అందుకే దళితులకు"కనులు తెరిపించే కాంతొకటి వచ్చింది అంబేద్కరే ఆ కాంతి " ( పుట: 34) అని స్పష్టంగా అంబేద్కరిజాన్ని ఎలుగెత్తి చాటుతున్నాడు కవి. భూములిప్పిస్తామంటూ పోరాటాలు చేస్తుంటే, పోలీసులు జరిపే కాల్పుల్లో దళితులే ఎందుకు బలవుతున్నారో, ఆ పోరాటానికి నాయకత్వం వహించే వాళ్ళనెందుకు ఆ తూటాలు తాకలేక పోతున్నాయో గుర్తించగలిగామని కూడా స్పష్టంగా ప్రకటిస్తున్నాడు కవి...

*'ఏగేసుడు, సగేసుడు ఎనుకనే నిల్చుండుడు*
*ముందుండి ముదిగొండలో*
*అసువులు బాసింది– అణగారిన వారే"* (పుట: 29)

అని ముదిగొండలో దళితుల్నే ఎందుకు కాల్చారో, ఆ పోరాటానికి నాయకత్వం వహించిన వారెలా తప్పించుకోగలిగారో చెప్తున్నాడు.

తాను పుట్టి పెరిగిన తెలంగాణా ప్రాంతాన్ని ఒక ప్రత్యేక రాష్ట్రంగా చేసుకుంటే తప్ప, నిజమైన పరిష్కారాలు లభించవనీ, అందుకే అందరూ కలిసికట్టుగా పోరాడమంటూ ప్రత్యేక రాష్ట్రం, 'తల్లి తెలంగాణా' కవితల్లో తెలంగాణాలో పాలకుల నిర్లక్ష్యం, స్వార్థం వల్ల నిస్సారమై పోయిన స్థితిని వర్ణించాడు. "చావు తప్పి లొట్టబోయిన సంస్కృతిని, అస్తి పంజరంలా తయారైన గ్రామాల్ని నేపథ్యంగా చెప్పి, తేనెటీగల్లా కదిలి తెలంగాణా సాధించుకోవాలంటున్నాడు...

*తెలంగాణ' కవితలో!*

> *"వలస పిట్టలు వాలకుండా*
> *వడిశెలందుకుందాం*
> *పర పాలకులు పొలిమేర పారంగ*
> *తెలంగాణ రాష్ట్రాన్ని తెచ్చుకుందాం'*

అంటున్న పొన్నాల బాలయ్య తన నేలమీద నిలబడి, తన నిజమైన గొంతుతో, ఎలాంటి అస్పష్టతా లేకుండా కవిత్వం రాస్తున్నందుకు అభినందించవలసిందే!

★★★

# ఈ పదేళ్ళ కవిత్వం "అనేక" పట్టుకున్నదేమిటి?

సరదాగానో, సీరియస్‌గానో పదేళ్ళ కవిత్వాన్ని గమనిస్తే ఎలా ఉంటుంది? లేదా పదేళ్ళ నుండి కవులు ఎలాంటి కవిత్వాన్ని రాస్తున్నారు? లేదా పదేళ్ళలో పత్రికలు, ఇంటర్నెట్ పత్రికలు ఎలాంటి కవిత్వానికి ప్రాధాన్యాన్నిస్తున్నాయి? పోనీ, పత్రికలకేమాత్రం సంబంధం లేకుండా కవులే స్వయంగా ప్రచురించుకున్న పుస్తకాల్లోనో, స్వేచ్ఛగా రాసుకోగలిగే అవకాశం ఉన్న బ్లాగుల్లోనో ఎలాంటి కవిత్వం కనిపిస్తుంది? మొదలైన ప్రశ్నలకు అందరికీ సంతృప్తికరమైన సమాధానాన్నివ్వలేకపోయినా, అలాంటి ప్రయత్నంతో వెలువడిన ఒక కవితాసంకలనాన్ని చూపించవచ్చు. దీని పేరు "అనేక" సుమారు 2000 నుండి 2009 వరకూ తెలుగులో వచ్చిన వచన కవితల్లో 182 కవితల్ని అఫ్సర్, వంశీకృష్ణ సంపాదకత్వంలో "అనేక" పేరుతో సారంగపబ్లికేషన్స్ వారు ప్రచురించారు. విలువైన విషయాల్ని ప్రస్తావిస్తూ సంపాదకీయం రాసినా, కొన్ని అంశాల్ని స్పర్శించలేకపోయారు. పైగా సేకరించిన కవితల్లోని అంశాల కంటే ఇతర అంశాల్ని ఎక్కువగా ప్రస్తావించినట్లుంది.

దండోరా నుండి గ్లోబలైజేషన్ దాకా, ముస్లిం సాంస్కృతికత నుండి "గుజరాత్ గాయం" దాకా వచ్చిన కవిత్వ సంకలనాల నుండి కవితల్ని తీసుకున్నా, ఆ యా కాలాల్లో వచ్చిన ఉద్యమాన్ని ప్రాతినిథ్యం వహించగలిగే కవితల్ని ఎంపిక చేయకపోవడం వల్ల ఈ పదేళ్ళ కాలంలో వచ్చిన ఉద్యమాలకి సరైన ప్రాతినిథ్యం ఇచ్చినట్లనిపించట్లేదు. ఆ ఉద్యమాల ప్రస్తావన చేసినా ఆ ఉద్యమాల్లో ప్రత్యక్షంగా పాల్గోని కవిత్వం రాసేవారి కవితల్ని ఎంపికచేయకుండా దీన్ని "ఒక ముద్రవేసిన తరువాత ఆ కవిని ఆ ముద్రలోంచి చూసి అతని కవిత్వ సారాన్ని, స్థానాన్ని అంచనా వేయడం అందరూ చేస్తారు. కనుక, అటువంటి పనిచేయడం లేదని" చెప్పుకుంటూ, మరో కవితని వేయడం కవి లక్ష్యాన్ని, ఆ కాలంలో ఆ ఉద్యమం పట్ల కవి ఆశించిన దాన్ని నీరు కార్చే ప్రయత్నం చేసినట్లవుతుంది.

ఉదాహరణకు ఎండ్లూరి సుధాకర్, కృపాకర్‌మాదిగ, దుగ్గినపల్లి ఎజ్రాశాస్త్రి వంటి వాళ్ళు దండోరా గురించి బలమైన కవిత్వాన్ని రాస్తే, దాన్ని విస్మరించి, వాళ్ళు ఒకానొక సందర్భంలో రాసిన కవితల్ని ప్రచురించారు. అమ్మాయిలపై పెరుగుతున్న యాసిడ్ దాడుల గురించి ఎండ్లూరి సుధాకర్ రాసిన "దు:ఖగంధకామ్లవర్షం", క ృపాకర్ సెజ్ లను వ్యతిరేకిస్తూ "ప్రత్యేక చావుమండళ్ళు" అంటూ రాసిన కవితను, ఎజ్రాశాస్త్రి "మా ఊరికో శ్మశానం కావాలి" అని ప్రపంచీకరణ ప్రభావాన్ని పట్టిచూపే కవితల్నీ ఎంపిక చేశారు. ఎండ్లూరి దళితగోవిందం, ఖైర్లాంజీ సంఘటనలపైనా, ఇంకా రకరకాలుగా దళిత, మాదిగ జీవితాన్ని పండించిన కవితలెన్నో రాశారు. అలాగే మిగాతా వాళ్ళు కూడా రాసినా,వాటిని పట్టించుకోకుండా, మాదిగ జీవితానికేమాత్రం సంబంధం లేని కవి సీతారాం రాసిన 'కుప్పం కాబ్లర్" కవిత తీసుకున్నారు.

*''ఈ చెట్టు కిందే*
*మాతాత గూటం పాడతాడు*
*దీనిలోనే మా అయ్య నడిచాడు*
*నేనూ ఇక్కడే పాతుకుపోయాను పాతికేళ్ళుగా...*

ఇలా కొనసాగిన కవితలో ...

*" ఈ మధ్యనే ఓ కవిగాడు దాపురించాడు నాకు*
*నన్ను గమనించే వాడంటే నాకు పడదు...*
*పాడెకడతానంటాను వాడి కవిత్వానికి నేను"*

వంటి కవిత్వాన్ని ఎంపికచేశారు.అలాగే ఒక ముస్లిం దేశభక్తినీ, స్త్రీవేదననీ వ్యక్తీకరించిన ముస్లిం రచయితల కవితల కంటే కొండేపూడి నిర్మల రాసిన "దేశద్రోహికన్నీటి చుక్క" ను ప్రచురించారు. దీనిలో చూడండి

*"ఆస్తితో సహా ఆడదాన్ని ఏలుకోవడానికి*
*కీర్తివంతులయిన నా అత్తింటి వారెవరో ముందుకొస్తారు*
*బహుశా మరికొన్నిసార్లు వితంతువునవడానికి నేను*
*పులకించిపోవాలి*
*నిఖా సంబరాలు వెలిసిపోకుండానే*
*ఫాతెహాలకు దర్బారు తీరిన మన జీవితాల్లో*
*దేనికి మాత్రం అర్థసందర్భాలున్నా"*యని ముస్లిం స్త్రీవేదనను

పలికించారు. వీటి కంటే మరింతబలంగా తమ సమస్యల్ని మూలాల్లోకి వెళ్ళి, భాషతో సహా షాజహానా మరికొంతమంది ఇంతకంటే బలమైన కవిత్వాన్ని రాయలేదా? దీన్ని బట్టి కేవలం కవిత్వానికిచ్చిన ప్రాధాన్యం, ఆ అస్తిత్వం కోసం కవిత్వం రాసిన వారికివ్వలేదనిపిస్తుంది. దీన్నిబట్టి అస్తిత్వ ఉద్యమాల్ని గుర్తిస్తున్నట్లా? ఆ ఉద్యమాల పరిధి విస్తరించాలని భావిస్తున్నట్లా? స్త్రీవాదంలోని దళిత స్త్రీవాదాన్ని, తెలంగాణ ఆత్మగౌరవాన్ని బలంగా అభివ్యక్తీకరించిన జూపాక సుభద్ర కవితల్ని వదిలేసి మరో కవితని ప్రచురించారు. ప్రాంతీయవాదాన్ని బలంగా వ్యక్తీకరించే కవితలు అనేకం ఉండగా వాటినీ పట్టించుకోకపోయినా, తెలంగాణ కవుల్నీ, కవిత్వాన్నీ మాత్రం అధికశాతంగానే రికార్డ్ చేయగలిగారు. అలాగే, కొద్దోగొప్పో ముస్లిం, క్రైస్తవ కవిత్వాన్ని రిప్రజెంట్ చేసే కొన్ని కవితలకు చోటు లభించినా,అందులోనూ బలమైన కవితల్ని తీసుకోలేదు.

ఎంపిక చేసిన వారికి స్వేచ్ఛఎంత ఉన్నా, అన్నింటికీ ఆర్థిక కోణమే ప్రధానమనే రీతిలో సంపాదకీయం కొనసాగించినా, కవిత్వం పేరుతో సౌందర్యానుభూతికే అధికప్రాముఖ్యాన్నిస్తూనే, ఆర్థిక సంఘర్షణలే నిర్దిష్టవాదాలు బయలుదేరడానికీ, బలం పుంజుకోవడానికీ కారణభూతమైయ్యాయని, అందువల్ల ప్రపంచీకరణ నీడలోనే పదేళ్ళ కవిత్వం నడిచిందనే సూత్రీకరణ చేసేప్రయత్నం చేశారు. నిజానికిది ప్రపంచాన్నీ, ఆంధ్రప్రదేశ్‌నీ అమెరికా ఆర్థిక నయనాలతో చూడ్డమే తప్ప, అన్ని అస్తిత్వ ఉద్యమాలకీ ఆర్థికమే కారణమనడం సరికాదు.కమ్యూనిష్టులు ప్రతిదాన్నీ ప్రపంచీకరణతో ముడిపెట్టి దాన్ని వ్యతిరేకించడం ఒక ఫ్యాషన్‌గా మార్చుకున్నట్లు, దేశీయవాస్తవికతను విస్మరించి కులాన్నీ, ప్రాంతీయతనీ దానిలోనే ఇరికించాలనుకునే ప్రగతిశీల గతస్మృతుల్నీ, అనుబంధాల్నీ వీడలేని సాహితీవేత్తలు కూడా ప్రయత్నిస్తున్నారు. దీనిలో భాగంగానే దీన్నీ భావించాలి.

ఈ దేశంలో ఏదో ఒకకులంలో పుట్టినా, పైకి కులం బాధ కనిపించనట్లుంటూనే, వాళ్ళు ఒక రాజకీయశక్తిగా ఎదగలేకపోవడానికి, ఆర్థికశక్తిలేకపోయినా, సాంఘికంగా కులం వల్ల లభించిన అవకాశాల కారణంగా వైయక్తికంగానూ, వ్యవస్థీకృతంగానూ ముందుకి వెళ్ళడానికి కూడా కేవలం ఆర్థికపరమైన అంశాలే కారణమని భావించాలా?అయితే, ఈ పదేళ్ళలో వెనుకబడినతరగతుల నుండి నాయకత్వాన్ని వహించగలవాళ్ళు ఉన్నా, పెట్టిన పార్టీల్ని మళ్ళీ అగ్రవర్ణ ఆధిపత్యంలో నడుస్తున్న పార్టీల్లోనే విలీనం చేయడం వెనుక కులం కారణమా? ఆర్థిక పరిస్థితులు కారణమా? అనేది ఆలోచించాలి.

ఈ పదేళ్ళలో అటుసామాజికంగాను,రాజకీయంగాను దళితులు, వెనుకబడిన తరగతులు ముందుకొస్తున్నట్లే కవిత్వంలోను తమదైన బలమైన ముద్రను వేయడమే కాకుండా, పదిహేనువందల యేండ్లపాటు ఆధిపత్యాన్ని వహించిన కవిత్వానికి అర్థశతాబ్దంలోనే వణుకుపుట్టించగలిగారు. "వెనుకబడిన తరగతులు"గా సాధించలేని అభివృద్ధిని "వెనుకబడిన కులాలు"గా గుర్తింపజేసుకోవడం ద్వారా సాధించవచ్చని ఉద్యమాలు మొదలైయ్యాయి. తమ నిజమైన శత్రువుని గుర్తించడంలో కొంచెం అటూ ఇటైనా ఈపదేళ్ళలో వెనుకబడిన కులాల వాళ్ళు తమ జీవితానుభవాల నుండి "వెంటాడే కలాలు" పేరుతో 2001లో ఒక కవితా సంపుటిగా బయటకొచ్చారు. దీనిలోనూ ఆర్థికాంశాలున్నా, వాటికంటే కుల చైతన్యమే ప్రధానంగా కనిపిస్తుంది. వీళ్ళని వృత్తుల వాళ్ళగానే కాకుండా కులవృత్తుల వాళ్ళుగా పరిగణించడం వల్ల వాళ్ళ నిజమైన అస్తిత్వాన్ని గుర్తించినట్లవుతుంది. కానీ, శ్రామికుల చట్రంలోనే కట్టేయడం వల్ల వెనుకబడిన కులాల వాళ్ళకి తీరని అన్యాయమే జరిగిందని ఇప్పుడిప్పుడే తెలుసుకుంటు, ఉద్యమాలతో ముందుకొస్తున్నారు.

సుమారు రెండు దశాబ్దాల పాటు తెలుగు కవిత్వాన్ని నిలదీసిన దండోరా కవిత్వాన్ని జల్లెడపట్టి ఉత్తమకవిత్వాన్ని ఒకచోటకు చేర్చిన కవితాసంకలనం "కైతునకలదండెం" (2008). ఈ దేశంలో కులం, మతం తమనెలా పీల్చిపిప్పిచేశాయో కులాన్ని ఆశ్రయించుకున్న ఆర్థిక, రాజకీయ,సాంస్కృతికాంశాల్ని రికార్డ్ చేసిన కవితా సంకలనమిది. ఇలాగే మతం తమనెలా హింసించిందో వ్యక్తిగతంగాను, సంకలనాల రూపంలోను ఈ పదేళ్ళలో ముస్లిం, క్రైస్తవ మైనారిటీకవిత్వానికి సంబంధించినవి వచ్చాయి. వీటినీ ఆర్థికపునాది మింగేసిందన్నట్లే చూపారు. కుల, మత పీడనను బలంగా చెప్పిన కవితలు దీనిలో తీసుకోలేదు. సంకలనంలో ఉన్నవాటి గురించి మాట్లాడాలంటే ఈ పదేళ్ళలో వెలువడిన "కవిత్వాన్ని" పట్టుకోగలిగినా, కవుల ఆత్మల్ని పట్టించుకోలేదు. కవుల ఆశయాల్ని, లక్ష్యాల్ని గుర్తించాల్సిన కవితల్ని విస్మరించి కవుల్ని మాత్రం గుర్తించారు. పైకి ప్రపంచీకరణ ప్రభావమనే వ్యవస్థీకృత చైతన్యంగా కనిపించినా, వాళ్ళ జీవితలోతుల్ని తాకని కవిత్వాన్ని స్వీకరించి, ఆ వ్యక్తుల్ని గుర్తించి, పరోక్షంగా వైయక్తికతకు పీఠం వేశారు.

పుస్తకంలో ఎంపిక చేసిన కవితల్ని వివిధ విభాగాలుగా చేసి, ఆ విభాగానికి ఒక్కో పేరు పెట్టడంలో నూతనత్వం కనిపిస్తున్నా, కేవలం అవి ఆ వర్గంలోకి మాత్రమే వచ్చే కవితలని స్పష్టంగా చెప్పలేనివీ అనేకం అందులో ఉన్నాయి. అక్షరం, అనుభవం,

అస్తిత్వం, అలజడి, ఆందోళన, అతడు%--%ఆమె, ఆవలితీరం, అనంతరం అని "అ,ఆ"లతో ఒక క్రియేటివిటీని ప్రదర్శించడం చాలా మందికి అది ఒక చమత్కార మనిపించినంతగా, అందులోని సీరియెస్‌నెస్ గుర్తించవచ్చు.

కవిత్వ చరిత్ర మాత్రమే తెలుగు సాహిత్య చరిత్రగా వక్రీకరించడం సరైంది కాదని మన సాహిత్య చరిత్రకారుల్ని తప్పుపట్టిన విమర్శకులకు, మళ్ళీ అలాంటి అవకాశం ఇవ్వకుండా మాత్రం జాగ్రత్త పడుతూనే ఈ సంకలనాన్ని తీసుకొచ్చారు. సుమారు తొమ్మిది వందల సంవత్సరాలుగా అవిచ్చిన ప్రవాహమైన పద్యకవిత్వాన్ని భావకవిత్వం బద్దలు కొడితే, భావకవిత్వంలోని స్వేచ్ఛప్రియత్వం పేరుతో సమాజాన్ని పట్టించుకోనికవుల్ని అభ్యుదయకవిత్వం గాడిలో పెట్టింది. రాయడం వరకే పరిమితమైపోతే కుదరదని, దాన్ని ఆచరణలోనూ చూపాలని విప్లవకవిత్వం కవుల్ని మరింత హెచ్చరిస్తే, ఆచరణలోని ఆధిపత్యాన్ని ప్రశ్నిస్తూ స్త్రీ, దళిత,బహుజన, ప్రాంతీయ, ముస్లిం, క్రైస్తవ మైనారిటీ కవిత్వ ఉద్యమాలు ముందుకొచ్చిన తర్వాత చాలామంది కలాలు మూతపడ్డాయి. దానితో అంతకు ముందు రాసిన వాటితోనే తమకి దక్కిన "కవి" గౌరవ మర్యాదల్ని కొనసాగించుకుంటూ పోతున్నవాళ్ళెంతో మంది ఉన్నారు. ఆధునికంలో ఉంటూనే, "గతకాలము మేలు, వచ్చు కాలముకంటే" అని పైకి అనకపోయినా, గతంలో రాసిన కవిత్వాన్నే నెమరువేసుకుంటూ మాత్రం బతికేస్తున్నవాళ్ళున్నారు. ఇలాంటప్పుడు నొప్పించక, తానొవ్వక "మానవతావాదం" పేరుతో సమకాలీనతను ఏమాత్రం పట్టించుకోకుండా కేలండర్ కవిత్వాన్ని రాస్తూ, ప్రభుత్వకవులుగా బతికేస్తున్న వాళ్ళూ ఉన్నారు. ఇలాంటిస్థితి పట్ల ఈ పదేళ్ళ కవిత్వాన్ని గమనిస్తున్న కవి ఇలా అంటున్నాడు.

*"బాధలేదని కాదులే!*
*కాకపోతే, ఎవరిబాధో తప్ప*
*రాయలేనితనం .....*
*సొంతమూ, పరాయీ అని కాదు కాని*
*నువ్వు నీదేహంలో సంచరించడం మానేసి*
*ఎంతకాలం అయ్యింది, చెప్పకూడదూ,కాస్త* " (అఫ్సర్)

అనడంలో నిత్యం రాయాల్సిన కవులు ఎందుకు రాయడంలేదో తెలుసుకోవాలనే తహతహ కనిపిస్తుంది. కవులు, సాహితీవేత్తలు అందరి ఓట్లు తమకి దక్కుతాయో లేదో, ఏదోలా దక్కించుకోవాలనుకొనే చాలా మంది రాజకీయవేత్తల్లా ప్రవర్తించకూడదనే ఆవేదన చాలామందికి ఉందని ఈ కవితా ఖండిక చెప్తుంది. కానీ, దీనిలో నిజంగా అలా స్పందించిన

వారి కవిత్వమేది? పదేళ్ళ కవిత్వాన్ని ఓ చోటుకి తీసుకుని రావాలనే ప్రయత్నం మంచిదే కాని, పదేళ్ళనే కాలంలో జరిగిన సంఘటనల్ని సరైన రీతిలో గుర్తిస్తే మరింత బాగుండేది.

★★★

÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷

***(ఈ వ్యాసం చదివిన ప్రముఖ కవి బొల్లోజు బాబా  నా బ్లాగులో రాసిన కామెంట్:)***

÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷÷

*సర్జికల్ ప్రెసిషన్‌తో ఉందీ వ్యాసం.*

*కొద్దిరోజులక్రితమే అనేక నా చేతికొచ్చింది. ఇంట్రో నిజాయితీగానే అనిపించింది. ఈ లోపు మీ వ్యాసం. కొన్ని కొత్త ఆలోచనల్ని కలిగించింది. అన్యధా భావించరనే ఇలా పంచుకొంటున్నాను సార్. కొంతమంది కవులు తమ బ్రాండ్ ఇమేజ్ లకు భిన్నంగా వ్రాసిన కవితలు వారికి మరింత విస్తృత గుర్తింపునిస్తాయనుకొంటాను. భిన్న వాదాల ప్రతినిధుల స్థాయికి ఎదిగినా, సుధాకర్ అంటే గూరా? కవిగా, శిఖామణి అంటే దిశమొల కవిత వ్రాసిన కవిగా, మెహజబిన్ అంటే వీధిబాలల కవయిత్రిగా, నిర్మల అంటే రూం ఖాళీచేసినపుడు వలికే విషాదాన్ని పట్టుకొన్న కవయిత్రిగా, శ్రీనివాస్ అంటే కవిత్వం కావాలి అని పలవరించిన వ్యక్తిగా, కొప్పర్తి అంటే తెరచియుండు వేళలు రాసిన కవిగా మాత్రమే మనసులో ముద్రింపబడిపోయారు. ఈ విషయంలో నేను “ఒంటరిని” కాకపోవచ్చు.*

*మీ వ్యాసం లోతుగా, ఆలోచింపచేసేదిగా, భాద్యతకలిగిన ఒక అకడమీషియన్ చేసిన ఒక పరామర్శగా ఉంది.*

*thank you for thought provoking thoughts sir*

***భవదీయుడు***

***బొల్లోజు బాబా***

★★★

# పైడి తెరేష్‌బాబు పాతికేళ్ళ దళితకవిత్వం

తెలుగు దళిత సాహిత్యంతో విడదీయరాని అనుబంధాన్ని పెనవేసుకొన్న కవి, కథకుడు పైడి తెరేష్ బాబు. జీవనభృతి కోసం తొలిదశలో రకరకాల ప్రక్రియల్లో, వివిధ వస్తువుల్ని తీసుకొని సాహిత్యాన్ని రాసినప్పటికీ తెలుగుసాహిత్యంలో దళిత సాహిత్యం ఒక ఉద్యమరూపంలోకి రావడానికి కృషిచేసిన రచయితల్లో పైడి తెరేష్ బాబుని ఒకరిగా విమర్శకులు గుర్తించక తప్పదు. ఈయన సాహిత్య పరిణామాన్ని నాలుగు దశలుగా వర్గీకరించుకునే అవకాశం అందుకుంటున్నాను.

పైడి తెరేష్ బాబు తొలిదశలో క్రైస్తవ సంస్థలతో కలిసి పనిచేయడం వల్ల జీవన భృతికోసం సాహిత్యాన్ని 'పైడి శ్రీ' గా రాసిన దశగా దాన్ని వ్యాఖ్యానించవచ్చు. ఆ తర్వాత ఆకాశవాణిలో ఉద్యోగిగా మారినప్పటికీ 'విధి'లో భాగంగా 'విధి', 'సంఘర్షణ' వంటి సీరియల్స్ కొన్ని రాసినప్పటికీ అవి ఆయన 'సాహిత్య దృక్పథాన్ని' పట్టిచ్చే అంశాలుగా భావించనవసరం లేదేమో. అయినా వాటినీ పరిశీలించాల్సి ఉంటుంది. కానీ, సాధారణంగా ప్రతి కవీ తన దృక్పథాన్ని కవిత్వం, కథ, విమర్శ వంటి ప్రక్రియల్లో ప్రముఖంగా వ్యక్తీకరించే ప్రయత్నం చేస్తాడు. అందువల్ల కవి లేదా రచయిత దృక్పథాన్ని వాటిని అన్నింటి ద్వారా గుర్తించే ప్రయత్నం చేయవచ్చు. అలాగే అన్నింటికంటే ముఖ్యంగా ఆ కవి జీవన వాస్తవికతను పట్టుకోవడం వల్ల దృక్పథం బహిర్గతమవుతుంది.

పైడి తెరేష్ బాబు 'అల్పపీడనం' (1996) కవితా సంపుటిలో తొలిసారిగా ఆయన సాహిత్య సమగ్ర స్వరూపం కనిపిస్తుంది. అంతకుముందు 'నిశాని' (1995) కవుల్లో ఆయన కూడా ఒకరు. 'నిశాని' పేరుతో రాసిన కవిత కూడా ఆయనదే. అది సాహిత్యంలో తెచ్చిన సంచలనం సామాన్యమైంది కాదు. చలపతి, విజయవర్ధనరావులకు ఉరిశిక్ష ప్రకటించినప్పుడు

*"దోసిలి చాపిన పేదరికాన్ని*
*దోషిని చేసిన నేల ఇది*

*మెతుకుబాకుతో చీలని ఆకలి*
*చావై ముసిరిన వైనమిది:*
*ఉరికంబం ధ్వజస్తంభం*
*రాజ్యమేలుతుంటే*
*అన్నలూ తమ్ముళ్లూ*
*అడవినేలుతున్నరా"*
*(ఒకేకూత-రెండు పొద్దులు, ఈనాటి ఏకలవ్య, డిసెంబరు, 1996)*

అని తెరేష్ బాబు న్యాయాన్ని ప్రశ్నిస్తూ కవిత్వం రాశాడు.

అభివృద్ధిచెందిన దేశాలు, చెందని దేశాలు, రెండింటికీ మధ్య నున్న దేశాలను మొదటి, రెండు, మూడో ప్రపంచాలని అంటున్నా 'నాలుగో ప్రపంచం' అనేదొకటి స్వేచ్ఛకు ప్రతీకగా మారిన ఒక భావన. ప్రాచీన, ఆధునిక సమాజాల్లో వస్తున్న రాజ్యవ్యవస్థకు సంబంధించిన నూతన ఆలోచనావిధానం. నేడు ప్రపంచవ్యాప్తంగా ఒకే సంస్కృతి, ఒకేదేశం, ఒకేజాతి వంటివన్నీ ప్రశ్నార్థకమౌతున్నాయి. కొన్ని ఆధిపత్య సంస్కృతులు పెత్తనాన్ని చెలాయించేదశకు ప్రపంచీకరణ చాలా వరకు దోహదం చేస్తోంది. భారతదేశంలో దళితుల జీవితం ఈ నాలుగో ప్రపంచానికి చెందినదే అవుతుంది. గుర్తింపుపొందని, అస్తిత్వం కోసం జరుగుతున్న పోరాటాలన్నీ దీనికిందికే వస్తాయి. దీన్ని ఫోకస్ చేస్తూ పైడి తెరేష్ బాబు ప్రచురించిన కవితాసంపుటి 'నాలుగో ప్రపంచం'(2010).

*''ఇన్నాళ్ళూ మూడో ప్రపంచం గంపకింద కప్పెట్టిన*
*నాలుగో ప్రపంచమిది*
*ఇదొక గాయాల జల్లెడ*
*కుళ్లి కుళ్లి కునారిల్లడం దీనినైజం*
*కావచ్చు; దీనికీ నిర్దిష్ట సామాజిక భూగోళం వుంది"*

అని దీని స్వరూపాన్ని పరిచయం చేశాడు. దీని స్వభావాన్ని వివరిస్తూ ఇలా వర్ణించాడు కవి.

*"ఒకే గాట కట్టేసి వుంచిన ప్రవాహ సమూహం*
*పాయలుగా చీలడం ఇప్పటికి నేర్పుతుంది*
*విడిపోవడం తప్పు అనే నీతి వాక్యాన్ని*
*బోర్డుమీంచి చెరిపేస్తూ వుంది*
*ఉలికిపాటెందుకు*
*విడిపోవడం అంటే విముక్తమై విస్తృతం కావడం*

*విడి విడి విడి విడి పోవడమంటే*
*ఎవరి భవిష్యత్తుకు వాళ్లు జవాబుదారీ కావడం*
*ఎంతగా విడిపోయినా ఉమ్మడి పాదు చెక్కుచెదరదు*
*గంపగుత్త ఉనికి కింద*
*గాలిని పోగేసినంత మటుకు చాలు*
*నిద్రను నిట్టనిలువునా నరుకుతున్న సైనికులకు ఆహ్వానం*
*కొత్తనీటి ఆనవాళ్లను పసిగట్టడమే*

*అసలైన ప్రవాహ స్పృహ"* (నాలుగో ప్రపంచం, 5 అక్టోబరు 1997, ఆంధ్రజ్యోతి) పైడి తెరేష్ బాబు ప్రాంతీయదృక్పథాన్ని పట్టిచ్చే అంశంగా నిలబెట్టిన కవితగా చెప్పొచ్చు. దీని తర్వాతనే తెలంగాణ ప్రత్యేకరాష్ట్రాన్ని సమర్థిస్తూ సీమాంధ్రకవుల తెలంగానంగా వెలువడిన 'కావడికుండలు" కవితా సంపుటిని తీసుకొస్తూ అదేపేరుతోరాసిన కవితలో "నాలుగు శతాబ్దుల బానిసత్వం సాక్షిగా /నాలుగు దశాబ్దుల వలసతత్వం సాక్షిగా" సాగుతున్న కుట్రదారుడి వ్యూహరచనను, తాత్వికభేదాన్ని అవగాహన చేసుకోవాలని ప్రబోధిస్తూనే...

*" కుట్రదారుడి భుజాల మీంచి*
*ఉన్నపళంగా దూకడమే ఇప్పుడు ఉద్యమం*
*కలిపివుంచే కావడిబద్దను బలోపేతం చేద్దాం*
*కుండల్లా విడిపోదాం*
*కావడిలా కలిసుందాం" ( కావడికుండలు, 11సెప్టెంబరు 2010)*

అని కవిత్వమై పలికాడు. ప్రత్యేక తెలంగాణ రాష్ట్రానికి మద్దతు ప్రకటించాడు. అలాంటి పైడి తెరేష్ బాబు తొలిదశలో వర్గీకరణ పట్ల వ్యతిరేక దృక్పథాన్ని ప్రకటించాడు. దళితులకు సమానావకాశాలు రావాలని ఆకాంక్షిస్తూ కవిత్వం రాసిన వాళ్ళను కూడా తీవ్రంగా నిరసిస్తూ ఒకప్పుడు ఇలా కవిత్వం రాశాడు.

" ఓ నా ఘనత వహించిన నల్లహంసా
నీ నాలుక మీద ఒక ఉచ్చబిందువును కళాత్మకంగా
నిలబెడుతున్నాను

దాన్ని చప్పరించి అది మాలదో మాదిగదో తేల్చగలవా" (అల్పపీడనం, 1996 పుట: 37) ఇలా తీవ్రస్థాయిలో ఎస్సీవర్గీకరణను వ్యతిరేకిస్తూ కవిత్వం రాసిన ఈ కవే ' నాలుగో ప్రపంచం" కవితాసంపుటిలో 'అనివార్య సందర్భం' పేరుతో ...

*''కూడు ఉడికినప్పుడల్లా యాభైతొమ్మిదిసార్లు చీల్చబడుతుంది*

*ఇది రాజ్యాంగ నిర్ణయం" (పుట: 87-88) అని వర్గీకరణ సమంజసమేనని ఒప్పుకుంటూ కవిత రాశాడు.*

*"వడివడిగా ఒక పిడుగుల జడిగా*
*దూసుకొస్తుంది దండోరా*
*మాదిగన్న పూరించిన గొంతుక*
*విజయపతాకం ఎత్తకమానదు"* (నాలుగో[ప్రపంచం, పుట: 32)

అని మాదిగలు చేసే దళితవర్గీకరణ ఉద్యమాన్ని మనస్ఫూర్తిగా సమర్థించి ఆహ్వానించాడు. 1995లో మద్దూరి నగేష్ బాబు, కాజా, వరదయ్యలతోపాటు తెరేష్ బాబు. కవిత్వంలో, సాహిత్యంలో ప్రయోగాలు చేస్తూ తెరేష్ బాబు 'నేను – నా వింతల మారి ప్రపంచమూ' పేరుతో దృశ్యీకరణను విజువల్ లాంగ్ పోయెమ్‌ను విడుదల చేశాడు.

గజల్స్ రాయడమే కాకుండా, చక్కగా పాడతాడు. గజల్స్‌లో దళిత పలుకుబడిని అందించిన ప్రయోగ వాదిగా కనిపిస్తాడు. 1996లో 'హిందూ మహాసముద్రం' దీర్ఘకవితను తన సొంతగొంతుతో ఆడియో క్యాసెట్‌గా ప్రచురించాడు. దాన్నే మరలా 2010లో 'హిందూ మహాసముద్రం' పేరుతో పుస్తకరూపంలో ప్రచురించాడు.

పైడి తెరేష్ బాబు దళిత భాషకు ఒక డిక్షన్ ఉండదంటాడు. భాషను సంస్కృతీకరించి వాడినప్పుడు కనిపించని బూతు, జీవితంలో అంతర్భాగమై ప్రవహిస్తున్న పలుకుబడిగా మారినప్పుడు అది బూతెలా అవుతుందనేది అతని వాదన. సందర్భోచితంగా ప్రయోగించనప్పుడు కొన్ని శబ్దాలు బూతులుగానే అర్థమవుతాయి. ఆవేశానికీ, ఆక్రోశానికీ తేడా తెలియకపోతే కూడా 'బూతు' అనేమాటకు పెడర్థాలు తప్పవు. దళితసాహిత్యంలో కొన్నిమాటల్ని అర్థం చేసుకోవడంలో దళిత జీవనవాస్తవికత అవగాహన కావాలి. అప్పుడు అది బూతు అవుతుందో కాదో తెలుస్తుంది. దీన్ని కవిత్వం ద్వారా వివరించే ప్రయత్నం తెరేష్ బాబులో కనిపిస్తుంది.

సహజమై సమకాలీనమైన భాషను తన కవిత్వంలో అందించేటప్పుడు అది సంస్కృతమా, ఆంగ్లమా అనేది కవి పెద్దగా పట్టించుకోడు. అందువల్ల అటువంటి భాష శక్తివంతంగా ప్రజల్లోకి వెళుతుంది. పైడి తెరేష్ బాబు కవిత్వంలో కూడా కనిపించే సంస్కృత పదభూయిష్టమైన శైలి అలా సహజమై ఉరికిపడిందేమోననిపిస్తుంది. దీనికి తోడు ఆయనకు సంస్కృతాంధ్రసాహిత్యాన్ని బాగా చదివే అలవాటు ఉండటం కూడా అలాంటి శైలికి కారణమై ఉంటుందనుకుంటున్నాను.

★★★

# ఇది "స్వేచ్ఛకోసం" కవుల చేసే యుద్ధ నగారా !

సాహిత్యంలో శ్రీశ్రీ అనేక సంచలనాలకు కేంద్ర బిందువుగా కన్పించడం వల్లనే నేటికీ చర్చనీయాంశమవుతున్నాడు. తాను ప్రయోగించిన భాష అంత సరళమైంది కాకపోయినా, సామాన్యుడికి కూడా ఆ భ్రమని కల్పిస్తుంది. సామాన్య పాఠకులు సైతం చాలా మంది తమకేదో అర్థమైపోయిందనే భావనకొస్తుంటారు. శ్రీశ్రీ ప్రయోగించిన పదాల వెనుక నిగూఢమైన భావాలున్నాయి. అవి ప్రతీకలు కావచ్చు; దేశదేశాలకు చెందిన వ్యక్తుల, పోరాట వీరుల, సంఘర్షణ సందర్భాలు కావచ్చు; కానీ ఆలంకారికంగా ఒక ప్రత్యామ్నాయ అనియతికి కూడా శ్రీశ్రీ మార్గం వేశాడు. ఇలాంటివెన్నో శ్రీశ్రీ రచనల్లో లోతుగా చూసేవాళ్ళకు కనిపిస్తాయి. కానీ, విచిత్రమేమిటంటే, సామాన్య పాఠకుడు కూడా ఆ శైలిలో, ఆ వస్తు ప్రతిపాదనలో మమేకమైపోతుంటాడు. శ్రీశ్రీ ఆశించిన ప్రయోజనాన్ని పాఠకులు, ప్రేక్షకులు అందుకోగలుగుతారు. అందుకే శ్రీశ్రీ కవిత్వాన్ని చదివిన వాళ్ళపై ఆ ప్రభావం ఏదొక రూపంలో వెంటాడుతుంది. తమ కులం, మతం, ప్రాంతం, లింగం వంటివన్నీ విస్మరించి శ్రీశ్రీ కవిత్వాన్ని ఆస్వాదించడంతో పాటు అవసరమైతే తామూ ఒక కవిత రాయాలనే ఆసక్తిని ప్రదర్శిస్తుంటారు కూడా! అలా అందరూ సాహిత్యాన్ని ఆస్వాదిస్తూ, సృజనకారులుగా తయారవ్వాలనేదే శ్రీశ్రీ ప్రధాన ఆకాంక్ష! అలాంటి ఆకాంక్షను అందరిలో కలిగించాలనే ప్రయత్నానికి శ్రీకారం చుట్టారన్నట్లుగా ఐనాల సైదులు, శ్రీనివాసు గద్దపాటి తమ సంపాదకత్వంలో "స్వేచ్ఛకోసం" పేరుతో ఖమ్మం కవులు రాసిన కవితల్ని శ్రీశ్రీ స్మారక సంకలనంగా తీసుకొచ్చారు. దీనిలో సుమారు 72 కవితలు ఉన్నాయి.

**సవాలుగా మారిన కులం:**

శ్రీశ్రీ శత జయంతి సందర్భంగానే రాసినా, కేవలం స్మృతి కవితల్నే తీసుకోలేదు. సమకాలీన సమస్యల్ని వర్ణించిన కవితలు ఇందులో ఉన్నాయి. భారతీయ సమాజంలో ఇష్టమున్నా లేకపోయినా ప్రతివ్యక్తినీ అనివార్యంగా ఏదో ఒక కులానికి చెందిన వ్యక్తిగానే ముద్రవేస్తుంటారు. ఇక్కడ కులానికున్న ప్రభావం అలాంటిది. ప్రేమను కూడా కలుషితంగా చూపించే కుట్రలో భాగమైన విషాదకర సంఘటన కంచెకచర్ల కోటేశుది. అది దక్షిణ భారతదేశంలోని ఆంధ్రప్రదేశ్ లో ఒక దళితుణ్ణి సజీవ దహనం చేసిన సంఘటన. మళ్ళీ అలాంటి విషాధం ఉత్తర భారతదేశంలోని ఉత్తరప్రదేశ్‌లో ఖైర్లాంజీలో జరిగింది. ఒక దళిత కుటుంబాన్ని ఊచకోత కోసేసిన సంఘటన అది. అంటే కుల వివక్ష భారతదేశవ్యాప్తంగా చాపకింద నీరులా రకరకాల రూపాల్లో విస్తరిల్లింది. దీన్ని గద్దపాటి

*కంచికచర్ల టు ఖైర్లాంజి ' కవితలో '*

*'కాల, స్థల, ప్రదేశాల్లో మార్పే కానీ...*
*కానీ...*
*అదే జీవితం*
*అదే వర్ణ దురహంకార మంటల్లో*
*మాడి మసైపోయిన జీవితం" (పుట: 8)*

అని ఆవేదన చెందటం కనిపిస్తుంది. "భూత, భవిష్యత్వర్తమానాల్లో కూడా/ అదే జీవితం" కొనసాగుతుందనే కవి ఆందోళన కుల నిర్మూలనకున్న మార్గాల్ని వేగతరం చేయమని సవాలు విసురుతుంది.

**కుల, మత ముసుగుల సంకెళ్ళు:**

అది ఏ కులమైనా కులం వల్ల వివక్ష కొనసాగుతూ, మానసిక, భౌతిక వ్యధలకు గురవుతున్నవాళ్ళెంతో మంది ఉన్నారు. ఒకప్పటి ఆధిపత్య లేదా ప్రాబల్యకుల స్వభావం నేడు మరికొన్ని కులాల్లో కనిపిస్తుంది. దానికి రకరకాల కారణాలున్నాయి. మన దేశంలో 1935 నాటికే డా.అంబేద్కర్ గుర్తించిన కులాల్ని చూసినా, ఆ కులాలన్నీ ప్రాంతాలవారీగా గౌరవమర్యాదల్లో తేడాలు ఉంటాయి.

మతం మారడం వల్ల కూడా ఇలాంటి ప్రయోజనాలు అప్పుడప్పుడూ కొన్ని కులాలకు కలుగుతున్నాయి. వీటి వల్ల రాజ్యాంగంలో కొన్ని ప్రత్యేక రాయితీలిచ్చి, ఆ కుల

ప్రజల్ని కూడా ప్రధాన జీవన స్రవంతిలోకి తీసుకొని రావాలనే సదాశయంతో పెట్టిన నియమ నిబంధనలు అమలులోకి వచ్చేసరికి వాటిని సరళీకరించాల్సింది పోయి, కఠినంగా, క్లిష్టంగా మార్చేస్తున్నారు. దీని వల్ల లక్ష్యం నెరవేరకపోగా అసలుకే ఎసరు వస్తుంది. ఈ స్థితిని కవిత్వీకరిస్తూ గరికిపాటి మణీందర్ "ధృవీకరణ పత్రం' పొందడానికి కొన్ని కులాల వాళ్ళు పడుతున్న కష్టాల్ని వర్ణిస్తూ...

*నన్ను నేనుగా రుజువు పరుచుకోవడానికి*
*ఎవరో అనామకుల*
*ధృవీకరణ సంతకం ప్రామాణికమైనందుకు*
*సిగ్గుతో చితికిపోతున్నాను" ( పుట:10)*

అని అనేక మంది పడుతున్న ఇబ్బందులను, కోల్పోతున్న ఆత్మగౌరవాన్ని వివరిస్తున్నాడు.

ఇవన్నీ భరించలేని వాళ్ళు...

*"జార్జ్ ని జంగమయ్యగాను*
*మరియమ్మను మంగమ్మ గాను*
*మార్చలేక చదువుకు*
*దూ... రం... గా...'*

వెళ్ళిపోతున్న వైనాన్ని పేర్కొంటున్నాడు. ఈ సమస్య ప్రధానంగా దళితులే ఎదుర్కొంటున్నారు.

హిందువులుగా ఉంటే దళితులకు అంటరానితనం లేదా కులం వల్ల వచ్చే రకరకాల ఆత్మగౌరవ సమస్యలు ఉత్పన్నమవుతుంటాయని, అందువల్ల వారికి కొన్ని ప్రత్యేక రాయితీల్ని ఇస్తున్నారు. క్రైస్తవులు, ముస్లిములుగా మత మార్పిడి జరిగితే ఆ మత భావనల్ని బట్టి అందులో కులం పట్టింపులు ఉండకూడదు. అంటే హిందూ మతంలో దళితులు ఎదుర్కొంటున్న సమస్య ఆ మతాల్లోకి మారిపోవడం వల్ల పరిష్కరింపబడాలి. కానీ, ఆచరణలో అలా జరగడం లేదు. అక్కడ కూడా కులాన్ని బట్టి, వారి ఆర్థిక స్థితిగతుల్ని అనుసరించి గౌరవమర్యాదలు లభిస్తున్నాయి. అలాంటప్పుడు మతమార్పిడి జరగాల్సిన అవసరమేముందనే ప్రశ్న ఉత్పన్నమవుతుంది.

మతం మారిపోవడం వల్లనే కుల సమస్యలన్నీ తీరిపోతాయని అనుకొనే పరిస్థితులు నేడు అంతగా లేవు. కానీ, నిర్భంధ కుల వృత్తులు అక్కడ లేవు. తమ తెలివి తేటల్ని బట్టి "ఆ సమాజం'లో గౌరవంగా బతుకుతున్నవాళ్ళున్నారు. ఆ పరిస్థితి హిందూ మతంలో దానితో పోల్చదగినంతగా లేదు. పైగా నేడిలా మళ్ళీ అన్ని మతాలూ కులాన్నే ఆశ్రయిస్తాయని ఊహించని రెండు, మూడు ముందటి తరాలు అప్పటి పరిస్థితులకు అనుగుణంగా హిందూ మతం నుండి బయటకి వెళ్ళిపోయారు. ఇప్పుడు విద్యావంతులవుతున్న దళితులు వాస్తవ పరిస్థితులు గమనిస్తున్న వాళ్ళు మతం మారిపోవడానికి ముందంజ వేయడానికి అప్పుడున్నంత వేగంగా ముందంజ వేయట్లేదు. మరో వైపు ముందుతరాల వాళ్ళు పెట్టిన పేర్లను బట్టి వీళ్ళ ఇష్టాయిష్టాలతో సంబంధం లేకుండా వీళ్ళకి కూడా ఆ మత ముద్రలే వేస్తున్నారు. వీటిని వ్యతిరేకిస్తున్న తరానికి ప్రాతినిధ్యం వహించే కవితగా దీన్ని చెప్పుకోవచ్చు.

ఇలా కుల, మత కోణాల్లో వస్తున్న సమస్యల్ని వర్ణిస్తూ శీలం భీష్మారెడ్డి నేటి ఐటి యుగంలో కూడా ఆధునికులమనుకుంటూనే మనసు మాత్రం మూఢత్వంతో పయనించడాన్ని నిరసిస్తూ "జల అస్పృశ్యత' కవితను రాశాడు.

ఒకప్పుడు కొన్ని కులాలకే పరిమితమయిన, తప్పనిసరి పరిస్థితిలో తినవలసి వచ్చిన ఆహారం కూడా అందకుండా పోవడానికి గల కారణాల్ని అన్వేషిస్తూ జి. మాణిక్యరావు "మా గూడెంలో మల్లెపువ్వు'లా గొడ్డుమాంసాన్ని వర్ణిస్తాడు. దళితేతరులు ఈ ఆహారం పట్ల వ్యవహరించే ద్వైదీభావాన్ని నిరసిస్తాడు.

*"రోగం వచ్చిందనో డాక్టరు తినమన్నాడనో*
*సలవ సేతందనో దొంగసాకులు సూపి*
*సాటుమాటుగా తెచ్చుకొని తెగమెక్కడం లేదా*
*పెమాన సాచ్చిగా*
*గుండెమీద చెయ్యేసుకొని సెప్పండి సూద్దాం" "(పుట: 27)*

అని సవాలు విసురుతున్నాడు కవి. అలా తిన్నందుక్కాదు కవి నిరసన.

*"పేరుకేమో మేము బొక్కేది మీరు*
*అంటున్నానని కాదు గానీ*
*గొడ్లను కోయడానికి*
*గూడేల్లో చావిడుల్లున్నట్లు*
*ఊళ్ళో కూడా ధైర్యంగా చావిళ్ళు కట్టుకోండి*

*మేం రొమ్ము తప్పెట్లు వాయిత్తా*
*సంతోషంగా మద్దతిత్తాం"* " (పుట: 27)

అనడంలో మాదిగలు ఆత్మగౌరవాభివ్యక్తి ఉంది. ఒకప్పుడు గొడ్డుమాంసం అంటేనే మాదిగలు వెంటనే స్ఫురించేవారు. నేడు అవి పరాయివాళ్ళు పెద్దవ్యాపారంగా మార్చుకున్నారు. గ్రామాల్లో అక్కడక్కడా చిన్న చిన్న దుఖాణాలు పెట్టుకున్నా, మాదిగల కంటే మాదిగేతరులే డాక్టరు చెప్పాడనో, రకరకాల కారణాలు చెప్పు ఆ మాంసాన్ని రహస్యంగా రప్పించుకొని తింటూనే, బహిరంగంగా మాత్రం మాదిగల్ని నిందించడంలో దళితేతరుల ద్వైదీభావ స్వభావమే కాకుండా, వాస్తవంగా జీవించలేని స్థితిని వెల్లడిస్తుంది. మరోవైపు స్వేఛగా, స్వఛరేగా, అమాయకంగా బతుకువెళ్ళదీసే కులాన్ని నిందిస్తు బతికేవాళ్ళ అసలు రంగునీ బయటపెడుతుందీ కవిత. వేకువ బాబు అంటరాని దేవుళ్ళు" గురించి...

*"దేవుళ్ళండీ దేవుళ్ళు*
*మాఊళ్ళో దేవుళ్ళూ...*
*ఏ ఊళ్ళోనైనా దేవుళ్ళే...!"* (పుట: 110)

అంటూ గ్రామంగా పెత్తందారీ కులాల వాళ్ళు తప్పనిసరిగా మొక్కించుకొనే వ్యవస్థను వ్యంగ్యంగా మనకళ్ళముందుంచుతున్నాడు. ఇలా కుల దృక్పథంతో రాసిన కొన్ని కవితలు ఉన్నాయి.

సామ్రాజ్యవాదాన్ని వ్యతిరేకించే, వస్తు సంస్కృతిని నిరసించే కొన్ని కవితలతో పాటు, భావజాలాన్ని నమ్మినట్లు నటిస్తూ, తమ కుటుంబాన్ని మాత్రం ఆ భావజాల దరిదాపుల్లోకి రాకుండా జాగ్రత్తపడే వాళ్ళనీ ఈ సంకలనంలో కవులు తూర్పారబట్టారు. తాము చెప్పేదానిపట్ల చిత్తశుద్ధిలేని డొల్లతనాన్ని ఎండగట్టవలసిందేనన్నారు.

**శ్రమైకజీవన సౌందర్యం:**

కుటుంబసంబంధాలే నిజమైన మానవీయ సంబంధాల్ని పటిష్టపరిచే ప్రాథమిక సామాజిక నియంత్రణ సాధనాలుగా భావించిన కవితలు కూడా ఉన్నాయి. ఐనాల సైదులు "అమ్మనవ్వాలనుంది" గొప్ప అనుభూతినిచ్చే వాస్తవ వ్యక్తీకరణ. ప్రపంచంలో మాతృత్వాన్ని ఎన్ని రకాలుగా వర్ణించినా ఇంకా మరేదో మిగిలే ఉంటుంది. ప్రతి వ్యక్తీ తన సుఖ సంతోషాలలో పాలు పంచుకోలేక జీవితమంతా త్యాగాలతోనే నిండిపోయిన తల్లుల్ని నిరంతరం స్మరించుకోవడం జరుగుతుంటుంది. అది ఆ వ్యక్తిలో ప్రవహించే మానవీయతకు నిలువెత్తు నిదర్శనం. కొన్ని వర్గాల ప్రజలకు అక్షరం కొన్ని తరాల వరకూ గగన కుసుమమే

అయ్యింది. తాను గానీ, తన ముందు వాళ్ళుగానీ పొందలేని అక్షరభాగ్యాన్ని తన కొడుకులో చూసుకుంటున్న తల్లి ఫీలింగ్స్ ని వర్ణిస్తూ

*'ముత్యాలూ...*
*నీ కొడుకు అన్నింటా ఫస్టేనన్న*
*పంతులు గారి పలుకులిని*
*కడుపార నీళ్ళు తాగిన పంటకాలవయ్యేది"* ( పుట: 136)

అన్నాడు. ఈ కన్నీళ్ళు ఆనందభాష్పాలు. వీటిని పంటకాల్వతో ఉపమించడం ఔచిత్యమైన పోలిక! ఒకరికొకరు కలిసిమెలిసి పనిచేసిన ఆత్మీయ శ్రమ సంబంధాల్ని కవితాత్మకంగా...

*"పొద్దంతా*
*కలుపుకొచ్చిన పొలంల*
*కొడవలై*
*మాపుటాళ్ళకు*
*కమ్మోరి కొట్టంల*
*రోకటి పోటయ్యేది*
*బీడుల్ని సాగుచేసిన నాయన*
*బొక్కెనయితే*
*దానికి తాడైంది"*

అని గుర్తుచేసుకుంటాడు. తల్లిదండ్రుల శ్రమని మర్చిపోని కొడుకు చేయాల్సిన కర్తవ్యం తాను విజయవంతంగా నిర్వర్తిస్తూ అందరి చేతా ప్రశంసించబడుతున్నా, ఇంకా ఏదో అసంతృప్తి వెంటాడుతున్న కవి అమ్మకి "అమ్మ నవ్వాలనుంది" అంటాడు.

ఈ కవితా సంకలనంలో మరో కొన్ని విశేషాల్ని ముచ్చటించుకోవాలి. 'జీహాదీ' పేరుతో జరుగుతున్న దాడుల్ని ఒక కరడుకట్టిన హిందువు వాదించినట్లున్న కవిత ఒకటి దీనిలో కనిపిస్తుంది. సమైక్యవాదాన్ని ఆకాంక్షించే దిశగా కూడా కవితలున్నాయి. అయితే అది సమానత్వాన్ని కోరుకొనే సమైక్యత. వర్ణ, వర్గ, లింగ, ప్రాంత వివక్షలు లేని సమైక్యతగా ఉండాలనే ఆశయంతో కూడినది కావడం విశేషం. శ్రీశ్రీ స్మృతి కవితలు కూడా కొన్ని ఉన్నాయి.

**శ్రీశ్రీ స్మృతి కవితల నివాళి:**

శ్రీశ్రీని ఈ యువకవులు రకరకాల కోణాల్లో దర్శించుకున్నారు. శ్రీశ్రీతో పయనించాలని ప్రతిన పూనినవాళ్ళున్నారు.

*"ఓ మహాకవి శ్రీశ్రీ*
*అక్షరం చూస్తే మీ కవిత్వం గుర్తొస్తుంది*
*మీ కవిత్వంలో దాగిన జనం బతుకు గుర్తుకొస్తుంది*
*జనానికి రణం ఎలా నేర్పాలో మాకు తెలుస్తుంది"* (పుట: 57)

అని బొగ్గారపు రాజా అభివర్ణించాడు. మరో కవి యుగంధర్‌శ్రీ శ్రీ సాహిత్యంలో తీసుకొచ్చిన నియతిరాహిత్యాన్ని స్మరిస్తూ...

*"ఛందస్సుల చరబట్టి*
*అలంకారాల నొదిలి పెట్టి*
*కఠిన పదాలపై కోతపెట్టి'న*

యుగకర్తగా నూతన శకానికి నాందిపలికాడన్నాడు.

నియతి అతిక్రమణ కొన్నిసార్లు మంచికి దారితీస్తుంది. మరికొన్ని సార్లు అవ్యవస్థతకు కారణమవుతుంది. శ్రీశ్రీ ఛందో బందోబస్తుల్ని తెలిసి అతిక్రమించాడు. ఆ నియతి అతిక్రమణ వల్ల కవితాశైలిలో, వస్తు స్వీకరణలో నూతన మార్గాలేర్పడ్డాయి. ఈ విషయాన్ని చెప్తూ ఒక కవితలో చేసిన వ్యాకరణ నియతిరాహిత్యం అసహజంగా ఉంది. అది నిజంగా నియతిరాహిత్యమేనా ? అనే సందేహం కూడా కలుగుతుంది. వ్యాకరణ మర్యాదలు తెలిసి, దాన్ని సహజంగా అతిక్రమించడం వ్యాకరణ నియతిరాహిత్యం అవుతుంది. తెలియకుండా చేసేది ప్రయోగం అని అసలే అనిపించుకోదు. అది అజ్ఞానం అవుతుంది. కొత్తగా కవిత్వం గానీ, మరే ప్రక్రియలో గానీ రాసేటప్పుడు వీటిని గుర్తెరిగి రాస్తే మంచిది. సహజత్వంలోని సౌందర్యాన్ని ఆస్వాదించడంలోనే నిజమైన నిష్కల్మషత్వం మానవీయతను పరిమళింపజేస్తుంది. అది విద్యాసాగర్ కవితలో కనిపించి నిసర్గ సౌందర్యాన్ని మన కళ్ళముందుంచుతూ మంచి శిల్పబిగువుతో సాహిత్యంలో నిలిచిపోతుంది.

*" ఈ జాతి మీదా, నీతి మీదా చేసిన సమతా మానవతా సంతకం శ్రీశ్రీ'* గా సి. హెచ్. ఆంజనేయులు, " *తెలుగుతల్లి అమ్ముల పొదిలో అక్షర కణాన్ని రాల్చే అరుణాస్త్రం*గా

బి.ఇందిర, శ్రీశ్రీ మనోబలం తెలుగు సాహిత్యానికే హలం వంటిదని కాలవ సుధాకర్ నివాళులర్పించారు. ఈ పుస్తకంలో శ్రీశ్రీ స్మృతిని ఒక మినీకవితలో ఎం.ప్రభాకర్ ప్రతిభావంతంగా వర్ణించాడు.

*'సూర్యుడి నుదుట*
*ఎర్రని బొట్టు పెట్టాలనుకోవడం*
*సముద్రపు గొంతులో*
*గుక్కెడు నీళ్ళునింపాలనుకోవడం*
*ఆకాశంలో అనంత నక్షత్రాలను*
*లెక్కించాలనుకోవడం*
*మహా కవి శ్రీశ్రీ కవిత్వాన్ని*
*విశ్లేషించాలనుకోవడం*
*ఒక్కటే మిత్రమా!"* (పుట:44)

అని శ్రీశ్రీని అంచెనా వేయడం అసాధ్యమంటున్నాడు. మరో గొప్ప ప్రభావగీతంగా కీర్తించదగిన లక్షణాలు ఉన్న కవిత వెంకట్రామయ్య రాశాడు. ప్రతి ప్రగతి శీల పోరాటంలోనూ తమనాయకుడిని ఈ కవితలో చూసుకొనే విశ్వజనీన భావనతో బహుశా అతను మరణించకపోవచ్చు" అంటూ పోరాటయోధుణ్ణి, విప్లవవీరుణ్ణి కీర్తించాడు కవి. నిజాయితీతో పోరాడి నేలకొరిగిన వాడు ఎప్పటికీ చిరస్మరణీయుడే అవుతాడు.

*"బహుశా అతను మరణించకపోవచ్చు*
*రేపో మాపో వేల మెగా వాట్ల శక్తితో*
*విద్యుక పడొచ్చు/ప్రజా ఊరేగింపు అగ్రభాగాన*
*బ్యానర్ గా మారి*
*సింహ గర్జన చెయ్యొచ్చు*
*బిగించిన పిడికిళ్ళలో*
*మరింతశక్తిని అందించవచ్చు*
*ఉద్యమానికి ఊపిరిగా మారి*
*విజయకేతనం ఎగరవేయవచ్చు"* (పుట: 49)

ఇంకా చాలామంది శ్రీశ్రీని స్మరించుకొంటూ కవితలు రాశారు. తెలుగు తనానికి నూతన వెలుగులు అద్దినవాడిగా లింగాల వెంకన్న, నిన్ను మరువలేమంటూ గంధసిరి

మల్లయ్య, శ్రామికుని స్వేదాన్నే వేదంగా భావించిన కవిగా యశ్ పాల్, నవసమాజ నిర్మాణం కోసం నాందిపలికిన కవిగా సస్య, కొండంత ధైర్యాన్నిచ్చిన కవిగా నీరుకొండ, "శ్రీశ్రీని సూర్యుడితో పోలుస్తూ, పోరాటం ఒక నిరంతర ప్రవంతిగా చొల్లేటి సునీత, శ్రీశ్రీ అనే రెండక్షరాలు ఆరని విప్లవజ్వాలలుగా అన్వేషి కొమరారం, కదం తొక్కే గుర్రంపై జోన్ ఆఫ్ ఆర్క్ శ్రీశ్రీ కవితగా సిద్ధాంతపు ప్రభాకరాచార్యులు వంటి చాలామంది కవులు శ్రీశ్రీకి నివాళులు అర్పించిన కవితలు దీనిలో ఉన్నాయి. శ్రీశ్రీ శతజయంతి సందర్భంగా ఖమ్మం ప్రజా రచయితల సమాఖ్య అర్పించిన ఘనమైన నివాళిగా దీన్ని భావించవచ్చు. ఇది ఖమ్మం జిల్లా నుండి వచ్చిన కవితా సంకలనం. కనుక, సహజంగానే అక్కడ ఉన్న గిరిజనుల గురించి కూడా కొన్ని కవితలు ఉంటే బాగుండేది. సీతారాం, జ్వలిత, పి.విద్యాసాగర్ వంటి సీనియర్ కవులు ఈ సంకలనంలో కనిపించి, యువతకు ప్రోత్సాహం ఇచ్చినట్లయ్యింది.

దీనిలో చాలా మంది కవులు మొదటి సారిగా కలం పట్టిన వాళ్ళున్నారనిపిస్తుంది. తమ భావాల్ని స్వేచ్ఛగా రాసుకొనే స్వేచ్ఛను ఇవ్వడమే కాకుండా, వాటిని యథాతథంగా ప్రచురించే విశాల దృక్పథం ప్రదర్శించిన సంపాదకులు అభినందనీయులు! ఇటువంటివి అన్ని జిల్లాల నుండీ రావాల్సిన అవసరం ఉంది.

*("స్వేచ్ఛకోసం" సంపాదకులు: ఐనాల సైదులు,*
*శ్రీనివాసు గద్దపాటి)*

★★★

# తెలుగునాటకాలు - జాతీయోద్యమం

తెలుగు నాటకాలలో కనిపిస్తున్న జాతీయోద్యమ ప్రభావాన్ని వివరిస్తూ డా॥ రావి రవి ప్రకాశ్ రాసిన పరిశోధనాత్మక గ్రంథం *"తెలుగు నాటకాలు - జాతీయోద్యమం"* తాను 2005వ సంవత్సరంలో ఉస్మానియా యూనివర్సిటీ నుండి డాక్టరేట్ పట్టా పొందిన సిద్ధాంత వ్యాసాన్ని ఇటీవల పుస్తకంగా ప్రచురించారు.

భారత స్వాతంత్ర్యోద్యమ కాలంలో జరిగిన అనేక సంఘటనల్ని నాటక రచయితలు వివిధ నాటకాలుగా మలిచి ప్రజల్ని చైతన్య పరిచిన విధానాన్ని రచయిత దీనిలో చక్కగా నిరూపించారు. ప్రజలు తాము నివశిస్తున్న నేల మీద అభిమానాన్ని ప్రకటించడం, స్వజాతి జనుల మీద ప్రేమను పెంపొందించుకోవటం జాతీయతలో కనిపించే కొన్ని ముఖ్యాంశాలు. తరతరాలుగా కొనసాగుతున్న స్థానిక సత్సంప్రదాయాల పై ప్రగాఢమైన అభిమానం నిర్దిష్ట పాలనా వ్యవస్థకి అనుగుణంగా మనుగడ సాధించే మానసిక స్థితిని కలిగి ఉండటం జాతీయత అనవచ్చు.

సర్వసాధారణంగా ప్రజలు తమ అస్తిత్వాలకు తీవ్రంగా భంగం కలుగుతుందని భావించినప్పుడల్లా ఈ జాతీయతా భావాలు ఉద్యమ రూపంలో కనిపిస్తుంటాయి. భిన్న జాతులు, మతాలు, సంస్కృతులు ఉన్నప్పటికీ భారతదేశంలోని ప్రజలంతా తరతరాలుగా కలిసిమెలిసి జీవించేవారని చరిత్ర చెబుతుంది. బ్రిటీష్ వాళ్ళు వ్యాపారం కోసం వచ్చి, క్రమేపీ పాలనాధికారాన్ని చేజిక్కించుకోవడంతో వాళ్ళకు వ్యతిరేకంగా భారతీయుల్లో జాతీయతా స్ఫూర్తి అంకురించింది.

అది ఆంగ్ల విద్యాప్రభావంతో మరింతగా విస్తరిల్లింది. అనేక సాహితీ ప్రక్రియల్లో సాహిత్యం సృజనీకరించబడి ప్రజల్లో జాతీయతా భావాలు వేగంగా వ్యాపించాయి. ఈ

పరిస్థితి అన్ని భాషల్లోనూ కనిపిస్తుంది. అలాగే తెలుగులోనూ జాతీయోద్యమ ప్రభావంతో భిన్న ప్రక్రియల్లో సాహిత్యం వెలువడింది. కవిత్వం, నవల, వ్యాసం, నాటకం వంటి సాహిత్య ప్రక్రియలు జాతీయోద్యమాన్ని వేగంగా ప్రసరించడంలో నిర్మాణాత్మకమైన పాత్రను నిర్వహించాయి.

జాతీయోద్యమ ముఖ్య లక్ష్యం పరదేశీయుల్ని పారద్రోలడమే ప్రధాన ధ్యేయమైనప్పటికీ, నాటకాల్లో నాడు జాతీయోద్యమం సామాజిక రంగంలో కనిపించే అనేక సమస్యల్ని పరిష్కరించే దిశగా పయనించిన కోణాన్ని కూడా రచయిత ఈ గ్రంథంలో వివరంగా పేర్కొన్నారు. వందేమాతరం, విదేశీవస్తు బహిష్కరణ, సత్యాగ్రహం, క్విట్ ఇండియా ఉద్యమం మొదలైన చారిత్రక ఘట్టాలను తెలుగు నాటకాల్లో ప్రతిఫలించిన తీరు ఈ గ్రంథంలో కనిపిస్తుంది.

కేవలం 1947 ఆగష్టు 15 వరకు మాత్రమే కాకుండా, 1948 సెప్టెంబరు 17న హైదరాబాదు రాష్ట్రం భారతదేశంలో విలీనం అయ్యేవరకూ చరిత్రను పరిగణనలోకి తీసుకొన్నప్పుడు మాత్రమే, ఆంధ్రప్రాంతానికి సంపూర్ణస్వాతంత్ర్యం సిద్ధించినట్లవుతుందంటారు రచయిత. అందుకనే ఈ గ్రంథంలోని అయిదో అధ్యాయంలో తెలుగు నాటకాలపై చూపిన తెలంగాణా సాయుధ పోరాట ప్రభావాన్ని వివరించారు. ఈ ప్రభావాన్ని తెలిపే నాటకాల్ని వివరించిన తీరు బాగుంది.

వేదాంతకవి 1948 లో రాసిన *"ఛలో హైదరాబాద్",* వాసిరెడ్డి భాస్కరరావు, సుంకర సత్యనారాయణలు కలిసి రాసిన *"మాభూమి "* నాటకాలపై సుదీర్ఘమైన విశ్లేషణ చేశారు. ఈ రెండు నాటకాలు చదివితే తెలంగాణాలో జరిగిన సాయుధ పోరాటం చాలా వరకూ అవగాహనకొస్తుంది. నిజాం నిరంకుశ పాలనలో అమీనులు, దేశ్‌ముఖ్‌లు సాగించిన దురంతాలపై నాటి సామాన్య ప్రజలు సహితం పోరాడిన సంఘటనలన్ని జాతీయోద్యమంలో భాగంగానే చూడాలనేది ఈ గ్రంథంలో కనిపించే ఒక ప్రతిపాదన. తెలంగాణా సాయుధ పోరాటంలో స్త్రీల పాత్రను కూడా చిత్రించిన నాటకాలను వివరించారు. స్త్రీ చైతన్యాన్ని కూడా ఆయా నాటకాల్లో ప్రతిఫలించిన తీరుని వివరించారు.

సాధారణంగా పరిశోధనలో ఒక్క కొత్త అంశాన్నైనా బహిర్గత పరచాలి. అది అన్ని వేళలా సాధ్యం కానప్పుడు, ముఖ్యంగా సాహిత్య పరిశోధనలో కొత్త సమన్వయాన్నైనా అందించాలి. ఈ పరిశోధన గ్రంథంలో ఈ రెండంశాలూ కనిపిస్తున్నాయి. ఆరు ప్రధాన అధ్యాయాలుగా ఫలితాంశాలు చివరి అధ్యాయంగానూ గ్రంథాన్ని విభజించారు. తాను

పరిశీలించిన అన్ని నాటకాల్లో కనిపించే ప్రధానాంశాలను రచయిత ఇలా వర్గీకరించారు. అవి: సంఘ సంస్కరణ, దేశభక్తి, సమగ్ర జాతీయతా భావం, మద్యపాన నిషేధం, విదేశీ వస్తు, శాసనోల్లంఘన, ఖద్దరు వస్త్రాలను ధరించడం, గాంధీజీ సూక్తులు పాటించడం, సత్యాగ్రహం, శాంతి సౌహార్ద్రభావం, అస్పృశ్యతా నివారణ వంటి వన్నీ జాతీయోద్యమంలో అంతర్భాంగా కొనసాగిన సంస్కరణలని రచయిత వింగడించి విశ్లేషించారు.

మొదటి అధ్యాయంలో కొండ అద్దమందు చూపినట్లుగా జాతీయోద్యమంలోని ముఖ్యఘట్టాల చారిత్రక క్రమపరిణామాన్ని వివరించారు. రెండవ అధ్యాయంలో జాతీయోద్యమ నాటక నేపథ్యాన్ని వివరిస్తూ పూర్వపరిశోధనల్ని పేర్కొంటూనే తనదైన ప్రతిపాదనలను పాఠకుల ముందుంచారు. దేశభక్తి పూరితాలైన తెలుగు నాటకాలను పౌరాణిక, చారిత్రక, సాంఘిక నాటకాలుగా విభజిస్తూనే, స్వాతంత్ర్య సమరాన్ని ప్రత్యక్షంగా వ్యాఖ్యానించిన రాజకీయనాటకాలనే విభజన కూడా చేస్తే బాగుంటుందన్నారు. (పుట: 36)పౌరాణిక నాటకాల్లో ఆయా పాత్రల ద్వారా జాతీయ భావాలను ప్రబోధించారని సోదాహరణంగా నిరూపించారు. దౌల్తాబాదు గోపాలకృష్ణారావు1932 లో రాసిన ? సంపూర్ణ భారతం అనే నాటకంలో అర్జునుడు శివుడిని మెప్పించి పాశుపతాస్త్రం కోరతాడు. ఆ అస్త్రమే కోరడంలో గల ఆంతర్యాన్ని తెలపమన్నశివుడితో అర్జునుడు నిరంకుశ ప్రభువులను దండించి భారతీయుల దాస్యాన్ని రూపుమాపటానికని చెప్తాడు.

తిరుపతి వేంకట కవులు రచించిన ప్రఖ్యాత నాటకం పాండవోద్యోగము (1938) లో ధర్మరాజు వంటి గుణ సంపన్నుడిగా గాంధీజీని కవులు వర్ణించారని ఈ పరిశోధకుడు చేసిన సమన్వయం బాగుంది. 'అలుగుటయే యెరుంగని మహామహితాత్ముడజాత శత్రువే అలిగిన నాడు' అనే పద్యంలో ధర్మరాజు పాత్ర చిత్రణలో గాంధీజీ జాతీయోద్యమ స్వభావం ఉందని పరిశోధకుడు వ్యాఖ్యానిస్తున్నారు. (పుట:47) ఊటకూరు సత్యనారాయణ గారి అభిమన్యు (1938) నాటకంలో భర్తపై ఉండే ప్రేమ కొద్దీ ఉత్తర అభిమన్యుణ్ణి యుద్ధరంగానికి పోవద్దన్నా, తానూ సారథియై వస్తానని పలకడం, భర్త వద్దన్నా, స్త్రీలు కూడా యుద్ధంలో పాలుపంచుకోవాలని వాదించడంలో నాటి స్వాతంత్ర్య సమరంలో స్త్రీలను చైతన్యపరచడమేనంటారు రచయిత.

చారిత్రక నాటకాల్లో మహమ్మదీయుల పాలనలో హిందూధర్మానికి జరిగిన హానిని ప్రస్తావిస్తూ వ్రాసిన నాటకాలు అధికంగా ఉన్నాయి. పౌరాణిక పురుషులకంటే చారిత్రక పురుషులు స్వాతంత్ర్యయోధులలో, ప్రజలలో మరింత ఉత్సాహాన్ని నింపారని, ఆ నాటకాలను

సోదాహరణంగా వివరించారు.

ముత్తరాజు సుబ్బారావు *"చంద్రగుప్త'* (1932), శేషబాబు *అశోకరాజ్యము'* (1945), ప్రభులింగాచార్యుల పల్నాటి వీరచరిత్రము' (1928), ఉన్నవ లక్ష్మీనారాయణ *''నాయకురాలు'* (1926), నందూరి బంగారయ్య *''ఆంధ్రతేజము'* (1938), వేదం వేంకటరాయశాస్త్రి *"ప్రతాపరుద్రీయము'* (1897), పోతుకూచి సుబ్బయ్య *''ఆంధ్రవాణీ సామ్రాజ్యము'* (1944), కోలాచలం శ్రీనివాసరావు *''సుల్తాన్ చాంద్ బీ'* (1900) కాళ్ళకూరి సాంబశివరావు *''రంగరాయ కదన సమవాకారం'* (1899), శ్రీపాద కృష్ణమూర్తి *"బొబ్బిలి యుద్ధం'* (1908), కొప్పరపు సుబ్బారావు *'రోషనార'* (1921), పడాల రామారావు *'అల్లూరి సీతారామరాజు'* (1950) మొదలైన నాటకాల్లో దేశవ్యాప్తంగానూ, ఆంధ్రదేశంలోనూ ప్రజారంజకంగా పాలన అందించిన పాలకుల స్ఫూర్తినీ, వారి పోరాట పటిమనీ, వారు మహమ్మదీయులు, విదేశీయులతో పోరాడిన చారిత్రక సంఘటనలను వర్ణించారన్నారు. ఇవన్నీ జాతీయోద్యమ ప్రభావంతో రాసిన నాటకాలేనని నిరూపించారు.

సాంఘిక, రాజకీయ నాటకాల్లో గాంధీజీ చేసిన ఉద్యమప్రభావం అత్యధికంగా కనిపిస్తుందన్నారు. గాంధీజీ ఒకవైపు స్వాతంత్ర్యం కోసం పోరాటాన్ని కొనసాగిస్తూనే, దేశం సమైక్యంగా ఉండాలంటే అంతర్గతంగా జరగాల్సిన వాటిని గుర్తించారన్నారు. దీనిలో భాగమే ఆయన కొనసాగించిన హరిజనోద్యమం అనీ దీనికి నాటక కర్తలు ఎంతో ప్రభావితులైయ్యారని ఆ నాటకాలను సోదాహరణంగా నిరూపించారు.

సుమారు 280 పేజీలున్న ఈ పుస్తకంలో జాతీయోద్యమంలో పాల్గొన్న కొంతమంది నాయకుల, కొంతమంది నాటక కర్తల ఛాయా చిత్రాల్ని కూడా ప్రచురించారు. వీటితో పాటు ఈ గ్రంథంలో పేర్కొన్న అందరికీ అందుబాటులో లేని కొన్ని నాటకాల ముఖచిత్రాల్నైనా ప్రచురించి ఉంటే మరింత బాగుండేది. అవి సాహిత్య పరిశోధనలో భవిష్యత్తు తరాలకు ఉపయోగపడేవి. అలాగే, జాతీయోద్యమ కాలం నాటి సంఘటనలు పౌరాణిక, చారిత్రక, సాంఘిక నాటకాలుగా వర్ణించేటప్పుడు, వాటిని ప్రదర్శించేటప్పుడు వ్యక్తమైన నాటక శిల్పగతాంశాలను వివరిస్తే మరింత బాగుండేది. ప్రదర్శింనానుకూలత ఏ నాటకాల్లో బాగుంది? ఏ నాటకానికి సరిగ్గా సరిపోలేదో కూడా చెప్తే బాగుండేది. నాటకంలో గల పద్యాలను, పాటలను, సంభాషణలను వివరించినా అవన్నీ ఇతివృత్తం ఆధారంగానే చెప్పినట్లయ్యింది. జాతీయోద్యమ సంఘటనలు కవిత్వం, కథ, పాట, నవల,

నాటక ప్రక్రియల్లో వచ్చినప్పుడు ప్రక్రియా గతం కనీసం స్థాలీపులాక న్యాయంగానైనా ఏ ప్రక్రియలో సమర్థవంతంగా చెప్పగలిగే వీలుందో సోదాహరణంగా నిరూపిస్తే ఇంకా బాగుండేది.

మొత్తం మీద తెలుగు నాటక వికాసాన్ని అర్థం చేసుకోవడానికి ఈ గ్రంథం ఒక ముఖ్య ఆకరంగా ఉపయోగపడుతుంది. అనేక నాటకాలను సేకరించి, జాతీయోద్యమ ప్రభావాన్ని వివరించిన పరిశోధకుడు అభినందనీయుడు. ప్రతి విద్యాలయంలోనూ ఉండదగిన పుస్తకం. మరోసారి మన భారతీయ జాతీయోద్యమ స్ఫూర్తి రగిలించుకొని, నేటి సామాజిక సమస్యలపై ఎలా స్పందించాలో అవగాహన చేసుకోవడానికీ పుస్తకం దోహదపడుతుంది.

(పుస్తకం.నెట్, ఆకాశవాణి, హైదరాబాదు కేంద్రంలో ప్రసారం)

★★★

# ఉద్యమం + సాహిత్యం = ఉ.సా

గత రెండు దశాబ్దాలుగా **ఉ.సా** ప్రసంగాల్ని, రచనల్ని గమనిస్తున్నాను. ఎస్సీ వర్గీకరణ డిమాండు న్యాయబద్ధమైనదని, దానికి ఆయన మద్దతు పలికిన తర్వాత వారి రచనల పట్ల నాకు ఆసక్తి కలిగింది. దళితసాహిత్యంపై జరిగిన వాదోపవాదాల నేపథ్యంలో కులదృక్పథాన్ని సమర్థిస్తూ ఆయన రాసిన వ్యాసాలు వారి పట్ల నాకు గౌరవాన్ని పెంచాయి. ఆయన ప్రసంగాలు, వ్యాసాలు అస్తిత్వ ఉద్యమాల్ని మరింత ముందుకి తీసుకెళ్ళడానికి ప్రోత్సాహాన్ని కలిగించాయనిపిస్తుంది. ఆయన ఎక్కడైనా మాట్లాడేటప్పుడు, వేదికపై తన కులాన్ని చెప్పుకోవడం నాకు బాగా నచ్చుతుంది. దేశీయ వాస్తవికతతో బి.సి.లు కూడా కుల అస్తిత్వంతో ముందుకిరావాలనే విషయంలో విశేషమైన కృషి చేస్తున్నారు."వెనుకబడిన తరగతులు"గా కాకుండా, "వెనుకబడిన కులాలు"గా ముందుకు వచ్చి, ఈ నిచ్చెన మెట్ల వ్యవస్థలో ఉన్న కింది కులాలతో కలిసి ఉద్యమాలు కొనసాగించాల్సిన అవసరాన్ని సైద్ధాంతికంగా విశ్లేషిస్తుంటారు.

నేనెప్పుడూ ఆయన్ని కుర్తా, పైజమాలోనే చూశాను. రెండు మూడు సార్లు మా సెంట్రల్ యూనివర్సిటిలో ప్రసంగించడానికి వచ్చారు. వారి ప్రసంగం చక్కటి ప్రణాళికతో ఉంటుంది. ఆ సంఘటనలు, తేదీలు వివరించడంలోను, ప్రసంగాన్ని విభజించుకొని విశ్లేషించడంలోను గొప్ప పరిశోధకుడిలా కనిపిస్తారు. ఉద్యమంలో అనుభవాల్ని జోడించి, మధ్య మధ్యలో పాటలు పాడుతూ, సందర్భానుసారంగా సామెతలతో ఆకట్టుకొంటూ అందరినీ ఆలోచింపజేస్తారు. ఆయన ప్రసంగం ఏదో ఒక కొత్త ఆలోచనను రేకెత్తిస్తూ, మేధోగతంగా ఉంటుంది. ఉద్యమాల్లో పాల్గొంటూనే, వాటినెలా ముందుకు నడిపించాలో ఉపాధ్యాయుడిలా బోధిస్తూనే, ఆ భావాల్ని అక్షరరూపంలో రాస్తూనే, ఆ భావాల్ని పాటలు

కదుతూ, పాడుతూ బహుముఖంగా కనిపిస్తుంటారు. అందుకనే ఉద్యమం+సాహిత్యం కలిపితే వచ్చే,**ఉ.సా** అనే కలం పేరుతో వీరిని అభివర్ణించవచ్చేమో!

వివక్ష ఎక్కడున్నా, ఏరూపంలో ఉన్నా, దాన్ని నిర్భయంగా వ్యతిరేకించడమే కాకుండా, వ్యక్తుల కంటే, వ్యవస్థ ప్రయోజనాలను ఆకాంక్షించే స్వభావమే వీరిలో గమనించాను. మార్క్సిస్టు ఉద్యమంలో కుల అస్తిత్వం గురించి వీరు ప్రకటించిన భావాల్లో ఇది స్పష్టమవుతుంది. దళితసాహిత్యాన్ని "వాదం" అన్నవాళ్ళని వ్యతిరేకించి, "ఉద్యమం"గానే నిరూపించడానికి అంబేద్కర్,పూలే భావజాలాన్ని సమన్వయించి చూపిస్తూ, "దళిత సాహిత్యోద్యమం" అనే పదాన్నే అత్యధికంగా ప్రయోగించారు. మరో సందర్భంలో వీరి సాహిత్యంపై విశ్లేషణాత్మక వ్యాసం రాయాలనుకుంటున్నాను.

మాదిగ దండోరా, తుడుందెబ్బ, మైనారిటీ, ప్రాంతీయ వివక్ష వ్యతిరేకోద్యమాల్లో క్రియాశీలంగా వ్యవహరించి, బహుజనవాదంతో రాజ్యాధికార దిశగా పీడిత కులాలు, వర్గాలను చైతన్యవంతం చేస్తున్న ఉ.సా కి అరవైయ్యేళ్ళు నిండుతున్న సందర్భంగా నా హృదయపూర్వక శుభాకాంక్షలను తెలుపుతున్నాను. వీరి సాహిత్యం అంతా వివిధ సంపుటాలుగా ముద్రించి, విశ్వవిద్యాలయస్థాయిల్లో చర్చోపచర్చలు జరగాలని, వాటిని ప్రజలు, పరిశోధక, అధ్యాపక వర్గాలు ఉపయోగించుకోవాలని ఆకాంక్షిస్తున్నాను.

*(16 ఫిబ్రవరి 2011)*

(ఉ.సా. అభినందన సంచిక కోసం )

★★★

# సంచార తెగల
# దయనీయ జీవన దృశ్య మాలిక

తెలుగుకథ ప్రారంభమై నూరేళ్ళవుతున్న సందర్భంలో 2009లో వచ్చిన పుస్తకాలలో నాకు నచ్చిన కథా సంకలనం "*ఇప్పపూలు*" (గిరిజన సంచార తెగల కథలు). తెలుగులో వచ్చిన అనేక కథలను పరిశీలించి వారికున్న వనరుల పరిమితుల దృష్ట్యా సుమారు 29 కథలను ఆకర్షణీయమైన ఫాంటుతో ఒక సంకలనంగా తీసుకొచ్చారు. ఆచార్య జయధీర్ తిరుమల రావు, జీవన్‌ల సంపాదకత్వంలో వచ్చిన ఈ పుస్తకంలో ప్రతి పదాన్ని ఎంతో జాగ్రత్తగా ప్రయోగిస్తూ రాసిన విలువైన ముందుమాట కూడా ఉంది. ఈ పుస్తకాన్ని "గిరిజన హక్కులు మానవ హక్కులేనని ఎలుగెత్తి చాటిన" బాలగోపాల్ గార్కి అంకితమివ్వడం నాకింకా బాగా నచ్చింది.

*చిక్కనవుతున్నపాట, నీలిమేఘాలు, నల్లపొద్దు, మాదిగ చైతన్యం* లాంటి పుస్తకాల స్థాయిలో మళ్ళీ తెలుగు సాహిత్య చరిత్రలో ఒక గొప్పస్థానాన్ని పొందగలిగిన పుస్తకమవుతుంది. గిరిజన కథలను కూడా దళిత, స్త్రీవాద కథలలాగే గిరిజనేతరులే ముందుగా ప్రారంభించారు. ఆ తర్వాత కాలంలో, ఇంకా స్పష్టంగా చెప్పుకోవాలంటే ఇటీవల కాలంలోనే గిరిజనులు కూడా కథల్ని రాస్తున్నారు. తమ జీవితాల్ని తామే రాసుకోవాలని నష్టపోతున్న దళిత సాహిత్య అస్తిత్వవాతావరణంలో ఇలాంటి సంపుటి వెలువడడం కొత్త ఆలోచనలకు మరో పిలుపునిచ్చే ఆశను కూడా కలిగిస్తుంది.

చాలా మంది పరిశోధకులు, విమర్శకులు ఇంతవరకూ చింతాదీక్షితులు (1891–1956) రాసిన చెంచురాణి కథనే తొలి గిరిజన కథగా భావించేవారు. కానీ, గూడూరు

రాజేంద్రరావు (1904–1945) రాసిన చెంచు కథ మొట్టమొదటి గిరిజన కథగా నిలుస్తుందనే ప్రతిపాదన ఈ పుస్తకంలో కనిపిస్తుంది. గిరిజన దంపతుల పెండ్లికి చీరకొనుక్కోవడానికి ఆరు రూపాయల అప్పు ఇచ్చి, ఆ చెంచిని అనుభవించాలని నిరంతరం ప్రయత్నించి, చివరికెలాగోలా బలాత్కరించి, ఆమెను చంపేసిన కాబూలీవాలా వికృతస్వభావంతో పాటు, ఆ దంపతులను పనిచేయించుకోవడమే తప్ప వాళ్ళని మనుషులుగా పరిగణించని సమాజ స్వభావాన్ని శిల్పబిగువుతో వర్ణించిన కథ చెంచు. ఆ గిరిజన దంపతుల మధ్య గల స్వచ్ఛమైన, విడదీయలేని అనురాగం, కళ్ళుపోతున్న తన భర్తను కాపాడుకుంటూనే, కాబూలీవాలా వికృతచేష్టల్ని చెప్పుకోలేక, తప్పించుకోలేక ఆ చెంచి పడిన సంఘర్షణను చిత్రించడంలో రచయిత ప్రతిభ అనన్యసామాన్యం.

చెంచురాణి కథ గిరిజనుల్లో గల ఆచారాలకు బలైపోయిన ఒక ప్రేమమూర్తి జీవితం చుట్టూతిరుగుతుంది. కర్నూలు పరిసరాల్లోని గిరిజన తెగల్లో చెంచుల్ని ఊచకోతకోసిన చారిత్రక సంఘటనల్ని చిత్రిస్తూ రచయిత్ర సామాజిక వాస్తవికతతో గిరిజనుల పక్షం వహించాడు. గిరిజనేతర రచయిత్ర అయినప్పటికీ ఆ సంస్క ృతిని, సంప్రదాయాన్నీ, అన్నింటికీ మించి ఆ జీవితాన్ని గొప్పగా ఆవిష్కరించాడు. చెంచురాణి ప్రేమకథను సామాజిక సమస్యతో ముడిపెట్టి నడిపించడంలో గొప్పనైపుణ్యాన్ని సాధించాడు. అడవిని నమ్ముకున్న గిరిజన చెంచులు, తమ ఆహారం "*నాగరికుల*" పరమైపోతూ, తాము ఆకలితో నకనకలాడాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. అడవిలోని పంటనంతా పట్టుకుపోతుంటే, దాన్ని దక్కించుకోవడానికి గిరిజనుల్లో అందమైన ఒక యువతి చెంచిత పరిష్కారాన్ని సూచించిన వాళ్ళని పెళ్ళిచేసుకుంటానంటుంది. అప్పటికే ఆమెను ఒకతను ప్రేమిస్తున్నా, మరొకడు పరిష్కారం సూచించడంతో, ఆ పరిష్కారం వల్ల మళ్ళీ తమ జాతి ప్రజలకు ఆహారం దొరికి సుఖసంతోషాలతో ఉండటం వల్లఅతన్ని వివాహం చేసుకుంటుంది. కానీ, తన మొదటి ప్రేమికుడి అభ్యర్థన మేరకు రహస్యంగా కలిసి మెలిసి ఉండటం, దాన్ని ప్రజలు గమనించి, పెద్దలు శిక్ష వేసి పదిహేను రూపాయలు చెల్లించమంటారు. కానీ, వాటిని చెల్లించలేకపోతాడు. జాలితో ఆ డబ్బుని ఒక తెల్లదొర చెల్లిస్తాడు. దానితో మళ్ళీ ఆమె దొరకే చెందాలని పెద్దలు నిర్ణయించడం, ఆ దొరకి ఆ ఉద్దేశం లేకపోయినా, కొన్నాళ్ళు కలిసి ఉన్నతర్వాత, ఆమె గర్భవతి కావడం, ఆ దొర బదిలీపై వేరే ప్రాంతానికి వెళ్ళిపోవడం, అతనితో పాటు మాత్రం ఆమెను తీసుకెళ్ళడానికి అతను అంగీకరించకపోవడం, అయినా ఏ నాటికైనా తన భర్త వచ్చి తీసుకెళతాడని అలాగే ఉండిపోతుంది. మళ్ళీ ఇంతకు ముందు ప్రేమించిన, పెళ్ళిచేసుకున్న వాళ్ళిద్దరూ వచ్చి రమ్మన్నా రాకుండా అక్కడే జీవితాన్ని చాలిస్తుంది. ఇది

ఈ కథ. చెంచి కథ వ్యవహారంలోనూ, చెంచురాణి సరళ వ్యవహారికంలోనూ సాగినా, రెండూ శిల్పం దృష్ట్యా చూసినా గొప్ప కథలే. ఇలాంటి కథలతో పాటు కరుణకుమార 512; భూషణం ***పులుసు,*** ఫణికుమార్ ***దండారి***; సాహు ***రక్తపింజెర;*** బి.ఎస్.రాములు ***అడవిలో వెన్నెల***; పి.చంద్ ***అనామతు ఖాతా***, అట్టాడ అప్పలనాయుడు ***అరణ్యపర్వం*** ; అల్లం రాజయ్య ***మలుపు***; గోపి భాగ్యలక్ష్మి ***జంగుబాయి***; ఎ.విద్యాసాగర్ ***కొండకు కట్టెలు మొయ్యమంటారా సారూ?***; వాడ్రేవు వీరలక్ష్మీ దేవి ***కొండాఫలం*** ; సువర్ణముఖి ***గోరపిట్ట***; గంటేడు గౌరునాయుడు ***ఆర్తి***; శ్రీరామ్ కవచం సాగర్ ***కలలోని వ్యక్తి***; పెద్దింటి అశోక్ కుమార్ ***గోస;*** బోయి జంగయ్య ***ఇప్పపూలు***; జాతశ్రీ ***వ్యక్తిగతం***; జీవన్ ***పోటెత్తిన జనసంద్రం***; కొండవీటి సత్యవతి ***గూడు***; డా.వి.ఆర్. రాసాని ***పయనం***; డా.దిలావర్ ***అరణ్యరోదన***, శిరంశెట్టి కాంతారావు ***బిగిసిన ఆ పిడికిళ్ళు***; భూక్యా తిరుపతి ***కాక్లా*** ; భూక్యా నర్సింగ్ ***మీటు భూక్యా***; మల్లిపురం జగదీష్ ***దారి***; పి.విద్యాసాగర్ ***దాడి***; పద్దం అనసూయ ***మూగవోయిన శబ్దం*** వంటి చర్చకు అవకాశం ఉన్న కథలు ఇందులో ఎంపిక చేశారు.

కొండఫలం కథ గిరిజనుల దోపిడీని చిత్రిస్తుంది. కులాంతర వివాహాల పేరుతో గిరిజనుల భూముల్ని ఇతరులెలా అనుభవిస్తున్నారో, ఆ దోపిడీ నుండి కాపాడవలసిన చట్టాలు, న్యాయ వ్యవస్థ వాళ్ళతో ఎలా ఆటలాడుకుంటుందో కళ్ళకు కట్టినట్లు వివరిస్తుంది. ఇలా తెలివైన వాళ్ళు తెలివి తక్కువ వాళ్ళను దోపిడీ చేయడం తగ్గాలంటే అందరికీ విద్యావకాశాలు లభించినప్పుడే అది సాధ్యమవుతుందని రచయిత్రి భావన కావచ్చు. బినామీ పేర్లతో, దొంగ కుల ధృవీకరణ పత్రాలతో గిరిజనులను మోసగించడం ఈ కథలో కనిపిస్తుంది. యూనివర్సిటీల్లో జరిగే రీసెర్చ్ ప్రాజెక్టుల పట్ల కూడా చురక కనిపిస్తుంది.

ఇప్పపూలు కథలో గిరిజనుల పై జరిగే ఎక్సైజ్ దాడులు, దాడుల ముసుగులో ఆడవాళ్ళపై జరిగే అత్యాచారాలు, జంతువులు ఎత్తుకుపోయాయని మోసగిస్తూ పిల్లల్ని అమ్ముకునే వాళ్ళ కుత్సితాలు వర్ణించారు. మనుషుల కంటే ఆడవి, జంతువులే నిష్కల్మషంగా కాపాడుతున్న వైనం ఈ కథలో కనిపిస్తుంది. ఆడవిలో పడి ఉన్న ఇప్పపూలను ఏరుకొని తమ శ్రమను మరిచిపోవడానికి నైజామ్ ప్రభుత్వం కూడా అనుమతించినా, సారా నిషేధం పేరుతో గిరిజనులకు ఆసుకొని, జీవనోపాధిని పొందేవాళ్ళని ఎలా హింసిస్తున్నారో చెప్పారు. ఆ ఇప్పపూలతో గిరిజనులు సారా కాయడం నిషేధమవుతుంది. కానీ, అవే పూలను సేకరించి ఫ్యాక్టరీల్లో వైన్ తయారు చేసి ప్రభుత్వం అమ్మితే తప్పుకాని ఒక విచిత్ర పరిస్థితిని ఎండగట్టిందీ కథ.

ఈ చిన్న వ్యాసంలో కథలన్నింటినీ వివరించటం శక్తికి మించిన పని. కానీ, ఈ కథల్లో సుమారు ఎనిమిది శతాబ్దాలుగా గిరిజన తెగలు అనుభవిస్తున్న అనేక కష్ట నష్టాలను, వారి అన్యోన్యతను, త్యాగాల్ని, ఆచార, సంప్రదాయాల్ని, నిరక్షరాస్యతను, భూమికోసం, భుక్తి కోసం జరుగుతున్న పోరాటాన్ని, వారిపై జరుగుతున్న రకరకాల దోపిడీలను చాలా వరకూ చూడవచ్చు. పాము కాట్లకు గురైనా సరైన వైద్యం దొరక్క ప్రాణాలెలా కోల్పోతున్నారో అరవైయ్యేళ్ళ స్వాతంత్ర్య భారతావనిలో ప్రతి పౌరుడూ ఆలోచించాల్సిన విషయాలు. తమకి రక్షణనిచ్చే వాళ్ళెవరో తెలియక, ఉన్న చట్టాలు, న్యాయస్థానాలు తమకి తోడ్పడలేనప్పుడు తప్పనిసరి పరిస్థితుల్లో సాయుధులుగా ఎలా మారిపోతున్నారో గుర్తించమని చెప్పే కథలిందులో ఉన్నాయి.

తెలుగు వాళ్ళు జీవిస్తున్న ప్రాంతాల్లో సుమారు 33 గిరిజన తెగల వాళ్ళు జీవిస్తున్నారని పరిశోధకులు పేర్కొంటున్నా, అన్ని తెగల వారి జీవితాల్ని ఆవిష్కరించే కథలు మాత్రం ఇంకా రావట్లేదు. కొన్ని తెగల వారి జీవితాల్ని మాత్రమే వర్ణిస్తున్నారనీ, మిగతా తెగలను పట్టించుకోవాల్సిన అవసరం ఎంతో ఉందనే విషయం మన కళ్ళముందుంచుతుందీ పుస్తకం.

*(సూర్య పత్రిక 18-1-2010)*

*"ఇప్పపూలు" (గిరిజన సంచార తెగల కథలు), కథా సంకలనం, సంపాదకత్వం: ఆచార్య జయధీర్ తిరుమల రావు, జీవన్, 2009)*

★★★

# సమాజ వికాసాన్ని తెలిపే పరిశోధన

ప్రసిద్ధ అమెరికా నవలా రచయిత Francis Marion Crawford (1854–1909) నవల గురించి మాట్లాడుతూ "Novel is a pocket theater containing all the necessary elements of a drama" అని అన్నాడు. సమర్థుడైన రచయిత లేదా రచయిత్రి పాఠకుని మనసులో వివిధ పాత్రలన్నీ కళ్ళముందు కనిపించేలా వర్ణన చేయగల ప్రక్రియగా అర్థం చేసుకోవడానికి ఈ వ్యాఖ్య ఉపయోగపడుతుంది. నవల గురించి చర్చించుకునేటప్పుడు George Meredith (1828–1909) చెప్పిన మరొక అభిప్రాయం కూడా చాలా ప్రాచుర్యంలో ఉన్నదాన్ని ఒకసారి గుర్తుచేసుకోవాలి. అది Novel is a summery of actuall life అనేమాట. ఈ రెండు అభిప్రాయాల్ని చూసినప్పుడు వాస్తవంగా జరిగిన జీవిత సారాంశాల్ని పాఠకుల కళ్ళకు వచనరూపంలో వర్ణనాత్మకంగా అందించగలిగే ప్రక్రియ నవలని తెలుస్తుంది.

అన్ని నవలలూ వాస్తవాల్నే ప్రతిఫలిస్తాయా అని ప్రశ్నించుకుంటే, కొన్ని పరిమితుల్ని విధించుకోకతప్పదు. సామాజిక వాస్తవికత కళారూపంగా మారినప్పుడు 'సత్యాన్ని' అనుభవంలోకి తీసుకొచ్చే ప్రయత్నం చేస్తుంది. ఆ ప్రయత్నంలో అనేక కాల్పనికాంశాలు చోటుచేసుకుంటాయి. భౌతిక సాక్ష్యాధారాలతో కళల్లోని వాస్తవాన్ని గుర్తించడానికి కుదరదు. దానికి హృదయానుభవం కావాలి. రకరకాల ప్రాగ్రూపాల్ని అర్థం చేసుకోవాలి. అందుకే కవిత్వం, కథ, నవల, నాటకం, చిత్రకళ, శిల్పం వంటివన్నీ అర్థం కావాలంటే కళానుభవం కావాలి. అది లోపించినప్పుడు కవి వర్ణించిన వర్ణనలు, చిత్రించిన పాత్రలు, వారి సంభాషణల్లోని ఆంతర్యం అంతసులభంగా అర్థం కాదు. అర్థం చేసుకోగలిగేవాళ్ళు వాటినుండి జీవితసత్యాల్ని ఆవిష్కరించగలుగుతారు. సమకాలీన సమాజాన్ని

చూడగలుగుతారు. ఆ రచన వెలువడ్డంలోగల కార్యకారణాల్ని విశ్లేషించగలుగుతారు. ప్రతిరచనకూ ఒక ప్రాసంగికత ఉంటుంది. ఆ ప్రాసంగికతను కేవలం వ్యక్తిగత జీవితంగానే చూడకుండా, ఒక సామాజిక జీవన పరిణామాన్ని గుర్తించేదిగా కూడా విశ్లేషించగలిగినప్పుడు, ఆ రచన వెలువడిన ప్రయోజనం నెరవేరుతుంది. ఈ ప్రయత్నంలో భాగంగానే సెంట్రల్ యూనివర్సిటీ తెలుగుశాఖలో ప్రముఖ పరిశోధకురాలు, తాత్త్వికురాలు ఆచార్య జి.అరుణకుమారిగారి పర్యవేక్షణలో మా మిత్రుడు డా॥జి.ప్రకాశరావు ఒక చక్కని పరిశోధనను చేశాడు. 1980 నుండి 2005వరకు తెలుగులో వచ్చిన నవలల్ని తన పరిశోధనాంశంగా స్వీకరించాడు. "*సమకాలీన తెలుగు నవలా సాహిత్యంలో విభిన్న వాదాలు-పరిశీలన*' పేరుతో తన పరిశోధనను కొనసాగించాడు. ఈ గ్రంథాన్ని సమర్పించినందుకు గాను ప్రకాశరావుగార్కి యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాద్ (సెంట్రల్ యూనివర్సిటీ) వారు 2013లో డాక్టరేటు పట్టాను ప్రదానం చేశారు. అంతటితో తన పని పూర్తయిపోయిందనుకోకుండా పరిశోధకుడు ఆ గ్రంథాన్ని లోకానికి కూడా పరిచయం చేస్తున్నాడు. ముందుగా ఈ గ్రంథాన్ని ప్రచురిస్తునందుకు పరిశోధకుణ్ణి అభినందిస్తున్నాను.

పరిశోధకుడికి సిద్ధాంత జ్ఞానం చాలా అవసరం. వివిధ సిద్ధాంతాల పట్ల అవగాహన ఉన్నప్పుడు తాను చదివిన సాహిత్యాన్ని ఒక సైద్ధాంతిక చట్రంలో చేర్చగలుగుతాడు. సాధారణంగా సాహిత్యాన్ని పరిశోధన చేసేటప్పుడు వస్తువు, శిల్పం వాటి విశిష్టతలను విశ్లేషించటం జరుగుతుంటుంది. పరిశోధకుడు ప్రతిభావంతుడైతే, ఆ కాలంలో ఆ సాహిత్యం ఆ రూపంలో వెలువడ్డానికి గల కారణాలను అన్వేషించగలుగుతాడు. సాహిత్యాన్ని అధ్యయనం చేసేవారు ప్రధానంగా రెండు రకాల ధోరణులతో విశ్లేషిస్తుంటారు. ఒకటి విషయ పరమైన అధ్యయనం. రెండవది శిల్ప పరమైన అధ్యయనం. మొదటి దాన్ని సాహిత్యం సామాజిక ప్రయోజనాన్ని ఆశించాలని భావించే వర్గానికి చెందిన దానిగా చెప్తారు. రెండవ దాన్ని సాహిత్య ఆస్వాదనను గుర్తించేదిగా వివరిస్తారు. దీన్నే సాహిత్యం సాహిత్యం కొరకే అనే వాదనతో ముడి పెడుతుంటారు. సాహిత్య అధ్యయనంలో రెండూ అవసరమే. ఈ పరిశోధన మొదటి వర్గానికి చెందింది. సుమారు పాతికేళ్ల కాలంలో వచ్చిన తెలుగు నవలా సాహిత్యాన్ని విశ్లేషించి, ఆ సాహిత్యంలో కనిపించే వివిధ వాదాలు, సిద్ధాంతాలను అవగాహన చేసుకుని సమకాలీన సాహిత్యంలో వాటి ప్రాధాన్యతను సాధ్యమైనంత సమగ్రంగా సమన్వయించాడు పరిశోధకుడు.

మొదటి అధ్యాయంలో సంప్రదాయానికి ఆధునికతకు సమకాలీనతలకు మధ్యగల భేద సాదృశ్యాలను గుర్తించే ప్రయత్నం చేశాడు. ఒక కాలంలో వచ్చిన సాహిత్యమంతా

ఆ కాలానికి సమకాలీన సాహిత్యం అవుతుంది. ఆధునికతలో ఒక కాలంలో కనిపించే వైవిధ్యం ప్రత్యేక లక్షణంగా కనిపిస్తుంది. పరంపరంగా కొనసాగేది సంప్రదాయం. సమకాలీనత, ఆధునికత, సాంప్రదాయికత అనే ఈ మూడు పారిభాషిక పదాలు సాహిత్యంలో విస్తృతమైన చర్చకు గురయ్యాయి. వీటిని పరిశోధకుడు పట్టిక రూపంలో సాధ్యమైనంత స్పష్టంగా చెప్పే ప్రయత్నం చేశాడు. అలాగే, ప్రక్రియా వైవిధ్యాన్ని కూడా చాలా స్పష్టంగా వివరించాడు. మొదటి అధ్యాయం పరిశోధకుడి సైద్ధాంతిక అవగాహన తెలియజేస్తుంది. తాను చదివిన పుస్తకాల నుండి పరిశోధకుడు ఏమీ స్వీకరించాలో చాలా మందికి తెలియదు. కానీ, పరిశోధకుడు డా॥ప్రకాశరావు దాన్ని గుర్తించాడు. సైద్ధాంతిక మూలాలను పట్టుకోగలిగాడు. అందుకనే ఈ అధ్యాయం తన సిద్ధాంత గ్రంథానికి చక్కని నేపథ్యాన్ని అందించింది. తన పరిశోధనను ఏడు అధ్యాయాలుగా చేసుకొని సమకాలీన నవలా సాహిత్యంలో కనిపిస్తున్న విభిన్న వాదాలను ఆయా వర్గాలుగా వర్గీకరించాడు. తన పరిశోధనలో సుమారు నూరు నవలలను పరిశీలించాడు. వివిధ వాదాల ఆవిర్భావాల గురించి వ్యాఖ్యానిస్తూ ఇలా అన్నాడు. *"స్త్రీవాదం పాశ్చాత్య దేశాల సైద్ధాంతిక ప్రభావంతో వచ్చినా అది రావటానికి తగిన సామాజిక నేపథ్యం ఉంది. స్త్రీవాద సిద్ధాంతం దానికి ఆధారమైంది. దళిత వాదం పూర్తిగా దేశీయమైంది. అంబేద్కరిజం పునాదిగా అది వచ్చింది. ముస్లింవాదానికి హిందుత్వ శక్తుల వ్యతిరేకత, లౌకిక ప్రజాస్వామిక వాదం నేపథ్యంగా ఉంది. ప్రాంతీయ వాదం వెనుకబడిన ప్రాంతాల సామాజిక, రాజకీయ, ఆర్థిక నేపథ్యం నుంచి వచ్చింది. ప్రపంచీకరణ వ్యతిరేక వాదం సామ్రాజ్యవాద వ్యతిరేకతలోంచి వచ్చింది".* (పుట: 16) దీన్ని బట్టి పరిశోధకుని అవగాహన స్పష్టమవుతుంది. తాను చెప్పాలనుకున్న సిద్ధాంతమంతా ఈ వ్యాఖ్యల్లోనే కనిపిస్తున్నట్లుగా ఉంది.

పరిశోధకుడు పాటించిన పరిశోధన పద్ధతి కూడా శాస్త్రీయంగా ఉంది. నవలల్లోని ఇతివృత్తాన్ని సంక్షిప్తంగా వివరిస్తూనే ఆ నవలల పట్టికల్ని వేరువేరుగా ఇచ్చాడు. ఆ నవలలో ప్రతిపాదించిన అంశాన్ని గుర్తించే ప్రయత్నం చేశాడు. అలా ముఖ్యమైన స్త్రీ, దళిత, ప్రాంతీయ వాదాలకు పట్టికలు వేయడం ఒక విశిష్టతగా చెప్పుకోవచ్చు. సునిశితమైన పరిశీలన ఉంటే కానీ, అది సాధ్యం కాదు. ఇలాంటప్పుడే పరిశోధకుడు జాగ్రత్త వహించకపోతే దొరికిపోయే ప్రమాదం కూడా ఉంది. అందువల్ల ఇలాంటి పట్టికల ద్వారా మౌలికాంశాల్ని గుర్తించే ప్రయత్నం చేయడం ఒకసాహసంగా కూడా భావించవచ్చు. ఈ పరిశోధన గ్రంథాన్ని చదివినవారెవరైనా తెలుగు సాహిత్యంలో ప్రతిఫలించిన స్త్రీ, దళిత, మైనారిటీ, ప్రాంతీయ వాదాలతో పాటు ప్రపంచీకరణ వ్యతిరేక వాదాన్ని వాటి లక్ష్య లక్షణాలని అవగాహన

చేసుకోవచ్చు. పెద్దపెద్ద సిద్ధాంతగ్రంథాల్ని చదివితేగాని అవగాహన కాని అంశాల్ని కూడా బుల్లెట్ పాయింట్స్‌లా చేతికి అందించినట్లయ్యింది. మైనారిటీ వాదం గురించి ముందుగా సుదీర్ఘంగానే చర్చించి, బి.సి.వాదాన్ని, క్రైస్తవమత వాద ఛాయలను గమనించినా, వాటిని ఒకవాదంగాగుర్తించలేనట్లు సున్నితంగా వాటిని ప్రస్తావించి వదిలేసాడు. ముస్లిం మైనారిటీల్లో కనిపించే వివిధాంశాల్ని బట్టి ఒక వాదంగా గుర్తించాడు. ముస్లిం మత వాదానికి సంబంధించినదిగానే చెప్పడం బాగుంది.

ఈసిద్ధాంత గ్రంథంలో పరిశోధకుడు ప్రయోగించిన భాష సూటిగా, స్పష్టంగా ఉంది. తెలుగు సాహిత్య అవగాహనతో పాటు, భారతీయ సమాజ సంక్లిష్టతలను పరిశోధకుడు అవగాహన చేసుకున్న తీరు, వివిధ నవలలను సమన్వయించడంలో బాగా స్పష్టమయ్యింది. ఈ పాతికేళ్లలో వచ్చిన సామాజిక ఉద్యమాలు దాని కారణాలను, ఆ ప్రభావాలను ఈ పరిశోధన ద్వారా చక్కగా గుర్తించాడు. స్త్రీ, దళిత ఉద్యమ సాహిత్యాలవల్ల జండర్ వివక్ష, భాషా ప్రయోగాల పట్ల వహించాల్సిన జాగ్రత్తలు తెలుస్తాయి. రంగనాయకమ్మ *'జానకీ విముక్తి'* (1991), ఓల్గా *'స్వేచ్ఛ'* (1987), అరుణ *'ఎల్లి'* (1991), జి. కళ్యాణ్ రావు *'అంటరాని వసంతం'* 2000),చిలుకూరి దేవపుత్ర *'పంచమం'* (1998), బోయ జంగయ్య *'జగడం'* (2003), స్పార్టకస్ (మోహనరావు) *'ఖాకీ బతుకులు'* (1982), వేముల ఎల్లయ్య *'కక్క'* (2000) వంటి నవలలు స్త్రీ, దళిత వాద ప్రాతినిధ్య నవలలుగా చెప్పుకోవచ్చు. వీటిని విస్మరించకుండా తన సిద్ధాంతగ్రంథంలో పరిశోధకుడు వీటిని విశ్లేషించాడు. ముస్లిం మైనారిటీ వాదం వల్ల జాతి, జాతీయతలు మరోసారి తీవ్రంగా చర్చలోకి వచ్చాయి. అలాగే, తెలుగులో ప్రవేశించిన అరబ్బీ, ఉర్దూ, పారశీక పదాల సమ్మిళిత భాష కూడా చర్చలోకి వచ్చింది. ఇక్కడ కూడా అంతకు ముందు వాడే భాషాపరమైన పారిభాషిక పదజాలం పట్ల జాగ్రత్త వహించాలనే హెచ్చరిక కనిపిస్తుంది. న్యూనతా భావం, పరాయీకరణ, అభద్రతాభావం అనే భావనలు సాహిత్యంలో చర్చనీయాంశమయ్యాయి. సలీం *'వెండిమేఘం'* (2003) నవల ముస్లిం మైనారిటీవాదంగా పేర్కొన్నా, రచయిత ముస్లిం జీవిత సంఘర్షణలను, ముఖ్యంగా స్త్రీసమస్యల్ని చర్చకు పెట్టాడు. దీన్ని పూర్తిగా మైనారిటీవాద నవలగా భావించలేం. ముస్లిం మైనారిటీ వాదానికి తోడ్పడింది ఎక్కువగా కథ, కవిత్వం, విమర్శ. ఈ ప్రక్రియల్లో వచ్చినంతగా ముస్లిం మైనారిటీ సాహిత్యం నవలా సాహిత్యం రాలేదనే చెప్పాలి. అయినా, సమకాలీన వాదాల్లో దీన్ని పరిశోధకుడు చేర్చాడు. నవలా సాహిత్యం విస్తృతంగా రాలేదని చెప్తే మరింత బాగుండేది.అందుకనే ఈ వాదాన్ని సాహిత్యాంశాల విశ్లేషణలకంటే రాజకీయ, ఆర్థికాంశాలను ఎక్కువగా వివరించారు. ప్రాంతీయ సాహిత్య వాదాన్ని జాగ్రత్తగా గమనిస్తే,

తెలంగాణాలో భౌగోళిక ప్రాంతీయచైతన్యం కనిపిస్తుంది. రాయలసీమ, కళింగాంధ్ర ప్రాంతాలలో కూడా ప్రాంతీయ చైతన్యాన్ని చూపడం ఈ పరిశోధనలో ఒక విశిష్టత. అయితే దాన్ని పరిశోధకుడు మరింత స్పష్టంగా వివరించి ఉంటే బాగుండేది. ప్రాంతీయ చైతన్యాన్ని గుర్తించే అంశాలను సైద్ధాంతికంగా వివరించినా, సమన్వయించడంలో మరింత వింగడింపుచేసి, కళింగాంధ్ర,కోస్తాంధ్ర,రాయలసీమల్లో కనిపించే సాంస్క ృతిక, ఆర్థిక ప్రాంతీయ చైతన్య స్పృహకు సంబంధించిన అంశాల్ని వివరిస్తే మరింత బాగుండేది.

ప్రపంచీకరణ ప్రభావమంతా సాహిత్యంలో వ్యతిరేక వాదంలో భాగంగానే వస్తుందనేది సునిశితమైన పరిశీలన. ప్రపంచీకరణకు సంబంధించిన సైద్ధాంతిక చర్చ బాగా చేశాడు. ఒక దేశ ఆర్థిక వ్యవస్థను ప్రపంచ ఆర్థిక వ్యవస్థతో అనుసంధానం చేయడమే ప్రపంచీకరణ అనేది వ్యాప్తిలో ఉన్న భావన. కానీ, కేవలం అదే ప్రపంచీకరణ కాదు. ఆర్థిక వ్యవస్థను అగ్రరాజ్యాల విధాన నిర్ణయాలతో అన్నిదేశాలపై ఆధిపత్యాన్ని చెలాయించేలా చేయడం, దానికి అనుగుణంగా శాస్త్రసాంకేతిక రంగాలను, ముఖ్యంగా విద్యావిధానాన్ని, ఇంటర్నెట్‌ని, సాహిత్యాన్ని, కళల్ని ఉత్పత్తి చేయటం అంతా ప్రపంచీకరణలో భాగమే. దీన్ని గుర్తించినప్పుడే వలసలకు,పారిశ్రామికీకరణకు, ప్రపంచీకరణకు మధ్య గల వ్యత్యాసం తెలుస్తుంది. ఈదృష్టితోనే పరిశోధ కుడు తెలుగు నవలా సాహిత్యంలో కనిపించే ప్రపంచీకరణ వ్యతిరేక వాదాన్ని చక్కగా సమన్వయం చేశాడు. చంద్రలత *"రేగడివిత్తులు"* (1997), అంపశయ్య నవీన్ *'బాంధవ్యాలు'* (2001) మొదలైన వాటిని ప్రపంచీకరణవ్యతిరేక వాద సాహిత్యంలో భాగంగా సమన్వయించాడు. కమ్యూనిస్టు ప్రభావసాహిత్యమంతా ప్రపంచీకరణను వ్యతిరేకిస్తూ వచ్చినదే. కాబట్టి ఈదిశగా పరిశీలిస్తే మరిన్ని నవలల్ని పరిశీలనకు తీసుకోవచ్చు.

సమకాలీన తెలుగు నవల్లో స్త్రీవాద, దళిత ఉద్యమ నవలలు వచ్చినంత విస్తృతంగా మిగతావాదాల్లో రాలేదని ఈ పరిశోధన తెలుపుతుంది. అయితే, వందలాదిగా వచ్చిన తెలుగు నవలలన్నింటినీ పరిశీలిస్తే, కాల్పనిక సాహిత్యంలో మరికొన్ని విభాగాలుగా కనిపిస్తాయి. కానీ, ఈ పరిశోధకుడు సామాజిక వాదాలనే ప్రధానంగా చేసుకున్నాడు. ఈపరిమితులు దృష్ట్యా సాహిత్యం ద్వారా సామాజిక వికాసాన్ని గుర్తించడానికి ఉపయోగపడే ఉత్తమ పరిశోధన గ్రంథంగా దీన్ని అభివర్ణించారు. ఒకకాలంలో వెలువడ్డ నవలల్ని పరిశీలిస్తే ఆ కాలం నాటి సమాజం కళ్ళకు కట్టినట్లు కనిపిస్తుందనే అభిప్రాయం తెలుగు నవలాసాహిత్యానికీ వర్తిస్తుందని ఈ పరిశోధన రూఢి చేస్తుంది. తెలుగు నవలా రచయితలు కూడా భారతీయ సమాజంతో పాటు, ప్రపంచాన్ని గమనిస్తూ, ఆ పరిస్థితులకు అనుగుణంగానే

సమాజాన్ని అవగాహన చేసుకుంటున్నారని ఈ పరిశోధన తెలుపుతుంది. ఒకప్పుడు కులీనవంశాలకే అత్యధిక ప్రాధాన్యమున్న సాహిత్యంలో మధ్యతరగతి, కిందితరగతులవారు కూడా భాగస్వాములయ్యారని తెలుస్తుంది. ఆత్మగౌరవం, స్త్రీ-పురుష సమానత్వభావన, వివక్ష స్వరూపం,దోపిడీ స్వభావాన్ని సాహిత్యం ద్వారా ప్రజల్ని ఆలోచింపజేయడానికి నవలా ప్రక్రియ దోహదపడిందని, సాహిత్యాన్ని మూల్యాంకనచేసే విలువల్లో కొత్త ఆలోచనల్ని ప్రసరింపజేసిందనీ ఈ పరిశోధన తెలుపుతుంది.

ఈ సిద్ధాంత గ్రంథాన్ని చదివితే వస్తుపరంగా ఒక పాతికేళ్ల భారతీయ సమాజమంతా మనకళ్లముందు కనిపిస్తుంది. సాహిత్యాన్ని ఆధారంగా చేసుకుని సామాజిక, చారిత్రక విశ్లేషణ చేసే వారికి ఈ పరిశోధన గ్రంథం ఒక మెథడాలజీని అందిస్తుంది. అందుకే ఇది పరిశోధకులంతా చదవాల్సిన గ్రంథంగా భావిస్తూ, పరిశోధకుణ్ణి మరోసారి అభినందిస్తున్నాను.

(డా॥జి.ప్రకాశరావు, 'సమకాలీన తెలుగు నవలా సాహిత్యంలో విభిన్నవాదాలు-పరిశీలన' సిద్ధాంత గ్రంథం)

★★★

## రచయిత

# డా॥ దార్ల వెంకటేశ్వరరావు

## పరిచయం

*"అక్షరం ఒకవైపు*
*అన్నం మరోవైపు పెడితే*
*నేను అక్షరాన్నే హత్తుకుంటాను ఆబగా"*

అనే దార్ల వెంకటేశ్వరరావు శ్రీమతి పెదనాగమ్మ, లంకయ్య దంపతులకు తూర్పుగోదావరి జిల్లా, చెయ్యేరు అగ్రహారంలో జన్మించారు. తాను పుట్టిన కోనసీమలోనే ప్రాథమిక విద్యను అభ్యసించి, శ్రీబానోజీరామర్స్ కళాశాల అమలాపురం (1995)లో ఇంటర్మీడియట్ నుండి బి.ఏ., (స్పెషల్ తెలుగు) వరకు చదువుకున్నారు.

యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాదు (సెంట్రల్ యూనివర్సిటి)లో ఎం.ఏ.,తెలుగు (1997);ఎం.ఫిల్., (1997); పిహెచ్.డి., (2003) చేశారు. యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాదు "జ్ఞానానందకవి ఆమ్రపాలి – పరిశీలన" పేరుతో చేసిన పరిశోధనకు ఎం.ఫిల్.; "పరిశోధకుడుగా ఆరుద్ర' పేరుతో చేసిన పరిశోధనకు పిహెచ్.డి., పట్టాలను అందుకున్నారు. నిజాం కళాశాల (ఉస్మానియా విశ్వవిద్యాలయం వారి అనుబంధ కళాశాల)లో సంస్కృతంలో డిప్లొమా (1997), తెలుగు లింగ్విస్టిక్స్ అండ్ లాంగ్వేజ్ టీచింగ్‌లో పి.జి.డిప్లొమాని పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం(2000)లో చేశారు. వీటితో పాటు డా॥బి.ఆర్.అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం (2005)లో ఎం.ఏ., (సోషియాలజీ) చేశారు.

దార్ల వెంకటేశ్వరరావు ఆమ్రపాలి కావ్య సౌందర్యం పై చేసిన పరిశోధన గురించి ప్రముఖ పరిశోధకుడు ఆచార్య వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి ముందుమాట రాస్తూ విద్వజ్జనుల ఆమోదం పొందేటట్లు చేసిన చక్కని పరిశోధనగా ప్రశంసించారు.

**మెరిట్ విద్యార్థిగా సాధించినవి:**

ఆంధ్ర విశ్వవిద్యాలయం పరిధిలో బి.ఏ., స్పెషల్ తెలుగు ఫస్ట్‌ర్యాంకు సాధించిన వారికిచ్చే కళాప్రపూర్ణ జయంతిరామయ్య పంతులు స్మారక బహుమతిని, కందుకూరి వీరేశలింగం, శ్రీమతి రాజ్యలక్ష్మి స్మారక బహుమతుల్ని వెంకటేశ్వరరావు అందుకున్నారు. వీటితో పాటు శ్రీ కోనసీమ భానోజీరామర్స్ కళాశాల వారు డిగ్రీ మూడేళ్ళలో కాలేజీ

ఫస్ట్ వచ్చిన వారికిచ్చే నండూరి వెంకటరామయ్య, కుటుంబలక్ష్మి స్మారకబహుమతుల్ని సాధించారు. ఎం.ఏ.,విద్యార్థిగా మెరిట్ స్కాలర్ షిప్పునీ, పరిశోధనకు యు.జి.సి.,రీసెర్చ్ ఫెలోషిప్‌నీ పొందారు. పరిశోధన సమయంలో తాను అనుభవించిన మానసిక క్షోభను, తనలాంటి వారనుభవిస్తున వేదనను కళ్ళకు కట్టినట్లు వర్ణిసూ తన కవితాసంపుటి 'నెమలికన్నులు'లో 'ఎక్సరేరిపోర్టు' పేరుతో రాసుకున్న కవితలో ఇలా అంటాడు.

*"నగరవీథుల్లో నేను*
*నాకు నేనే మోసం*
*శోధనో...పరిశోధనో...*
*వినయం బానిసత్వమైతే*
*జీవితం మోయలేనంత బరువు!"*

**చదువుతుండగానే ఉద్యోగాలు:**

పరిశోధన చేస్తుండగానే పోటీ పరీక్షల ద్వారా ప్రభుత్వ జూనియర్, డిగ్రీ కళాశాలల్లో ఏకకాలంలో (2001) తెలుగు అధ్యాపకుడుగా ఎంపికయ్యారు. శ్రీఅనంత పద్మనాభ కళాశాల, వికారాబాదు డిగ్రీ కళాశాలలో మూడేళ్ళపాటు పనిచేశారు. ఈకాలంలోనే విద్యార్థినీ విద్యార్థుల్లో సృజనాత్మక నైపుణ్యాన్ని పెంపొందించేందుకు వీలుగా కళాశాల వార్షికసంచిక తెలుగు సంపాదకుడుగా వ్యవహరిస్తూ, కొన్ని వ్యాసాలను రాశారు. తర్వాత 2004 లో హైదరాబాదు సెంట్రల్ యూనివర్సిటీలో అసిస్టెంటు ప్రొఫెసరుగా చేరారు. అప్పటికింకా తనకు పాఠాలు చెప్పిన అధ్యాపకులు కొంతమంది డిపార్టుమెంటులో పనిచేస్తున్నారు. అటువంటి తెలుగుశాఖ గురించి ఒక కవితలో ఇలా వర్ణించారు.

*"కలలా ఉంది*
*కళగా ఉంది*
*కల నిజమైనట్లుంది*
*డిసెంబరు నెల్లో కప్పేసిన మంచుని జయించిన*
*కొత్తసంవత్సరపు కొత్తపొద్దులా ఉంది.*
*ఎంతమారిపోయిందిప్పుడు*
*నాడు మూలకి విసిరేసిన*
*బూజుపట్టిన భావాలతో నిండినగదిలా*
*ఆధునికతను అవలికిసిరేసినట్లుండేది*
ఎంతమారిపోయిందిప్పుడు!"

అలా నూతన జవసత్వాలతో శోభిల్లుతున్న తెలుగుశాఖలో ప్రస్తుతం అసోసియేటు ప్రొఫెసరుగా పనిచేస్తున్నారు.

**సాహిత్యాభిలాష-పరిశోధనాసక్తి:**

విద్యార్థి దశ నుండే వివిధ పత్రికల్లో కవితలు, వ్యాసాలు రాసే అలవాటున్న వెంకటేశ్వరరావు, హైదరాబాదు సెంట్రల్ యూనివర్సిటీలో చేరిన తర్వాత ఆకాశవాణి, హైదరాబాదు కేంద్రం, యువవాణి విభాగంలో కొంతకాలం పాటు క్యాజువల్ (క్యాంపియర్) ఎనౌన్సర్‌గా పనిచేశారు. ఆనాటి నుండి నేటి వరకు ఆకాశవాణిలో అనేక కవితలు, సాహితీ ప్రసంగాలు చేస్తున్నారు. పరిశోధన విద్యార్థిగా ఉన్నప్పుడే సివిల్ సర్వీసెస్ అభ్యర్థులకు తెలుగు సాహిత్యంలో శిక్షణనిస్తూ, దూరదర్శన్‌లో కూడా ప్రసంగాలిచ్చారు.

వెంకటేశ్వరరావు వివిధ విశ్వవిద్యాలయాల్లో జరిగిన జాతీయ సదస్సుల్లో సుమారు 79 పరిశోధన పత్రాలను సమర్పించారు. పొట్టిశ్రీరాములు తెలుగువిశ్వవిద్యాలయం వారి *"వాఙ్మయి"*, తెలుగు అకాడమీ వారి *"తెలుగు వైజ్ఞానిక మాసపత్రిక"*, ద్రావిడ విశ్వవిద్యాలయం వారి *'ద్రావిడి'* మొదలైన పరిశోధన పత్రికలు, ప్రత్యేక సంచికలు, దినపత్రికల్లో సుమారు 59 పరిశోధన, విమర్శ పత్రాలు ప్రచురితమైయ్యాయి. పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారు ప్రచురించిన 'తెలుగు సాహిత్య విమర్శ దర్శనం' విజ్ఞాన సర్వస్వంలో వీరి విమర్శ వ్యాసాన్ని తీసుకున్నారు. తెలుగు సాహిత్య విమర్శలో తనకంటూ ఒక స్థానాన్ని సంపాదించుకున్నారు.

**కవిత్వం, విమర్శ, పరిశోధన పుస్తకాలు:**

*మాదిగచైతన్యం* (1997) *సాహితీ మూర్తుల ప్రశస్తి* (1998), *జ్ఞానానందకవి ఆమ్రపాలి పరిశీలన* (1999), *దళితతాత్త్వికుడు* (2004), *సృజనాత్మక రచనలు చేయడం ఎలా?* (2005), *సాహితీ సులోచనం* (2006), *ఒక మాదిగస్మృతి - నాగప్పగారి సుందర్రాజు* (2007) *దళితసాహిత్యం: మాదిగదృక్పథం* (2008) *వీచిక* (2009), *పునర్మూల్యాంకనం* (2010), *సాహితీ మూర్తులు-స్ఫూర్తులు* (2015), *నెమలికన్నులు* (2016), *సాహితీ సౌగంధి* (2016) మొదలైన కవిత్వం, విమర్శ, పరిశోధనలకు సంబంధించిన పుస్తకాలను ప్రచురించారు. మరో రెండు గ్రంథాలు ప్రచురణలో ఉన్నాయి. ఈయన కవిత్వం త్వరలో ఆంగ్ల, భాషలో వెలువడనుంది.

డా॥వెంకటేశ్వరరావు పర్యవేక్షణలో ఇప్పటి వరకు పద్దెనిమిది ఎం.ఫిల్., పరిశోధనలు, ఎనిమిది పిహెచ్.డి పరిశోధనలు పూర్తయ్యాయి. ప్రస్తుతం ఈయన పర్యవేక్షణలో ఆరుగురు పిహెచ్.డి., పరిశోధనలు చేస్తున్నారు."తెలుగు సాహిత్యంలో మాదిగల సామాజిక, సాంస్కృతిక అధ్యయనం" అనే అంశంపై యు.జి.సి వారి మేజర్

రీసెర్చ్ ప్రాజెక్టు పూర్తిచేశారు. ప్రస్తుతం "గుర్రం జాషువ పదప్రయోగకోశ నిర్మాణం" ప్రాజెక్టు చేస్తున్నారు.

**పురస్కారాలు:**

చిన్ననాటి నుండే సాహిత్యాభిలాష గల వెంకటేశ్వరరావు వ్యాసరచన పోటీలో భారతీయ సాహిత్య పరిషత్ రాజమండ్రిలో జరిగిన రాష్ట్ర మహాసభల్లో రాష్ట్ర స్థాయి ప్రథమ బహుమతి(1996)ని అందుకున్నారు. ఈయన చేస్తున్న సాహిత్య కృషికి గుర్తింపుగా భారతీయ దళిత సాహిత్య అకాడమీ, న్యూఢిల్లీ వారు 2007లో డా॥బి॥ఆర్॥ అంబేద్కర్ పురస్కారంతో సత్కరించారు. 2012లో పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారు తెలుగు సాహిత్య విమర్శ విభాగంలో కీర్తి పురస్కారంతో సత్కరించారు. 2016లో బహుజన సాహిత్య వేదిక వారు రాష్ట్రస్థాయిలో మల్లవరపు జాన్ కవి స్మారక పరిశోధక పురస్కారంతో సత్కరించారు.

**పత్రికారచన-సంపాదకత్వం:**

బహుజన కెరటాలు, విద్య మాసపత్రికలకు సంపాదక వర్గసభ్యులుగా, మాదిగ సమాచారలేఖ మాసపత్రిక గౌరవసంపాదకులుగా, సొసైటీ అండ్ ఎడ్యుకేషన్ ట్రస్టు సలహాదారుగా వ్యవహరించారు. జ్యోత్స్నా కళాపీఠం, తెలుగు సాహిత్య వేదిక, మాదిగ సాహిత్య వేదిక వంటి సాహిత్య సాంస్కృతిక సంస్థల్లో కార్యవర్గసభ్యుడుగా కూడా పనిచేశారు.

**నూతన పాఠ్య ప్రణాళికల రూపకల్పన:**

ఆచార్య పరిమి రామనరసింహంగారి సూచనలతో యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాదులో ఎం.ఏ., తెలుగు విద్యార్థులకు దళితసాహిత్యాన్ని ఒక ఐచ్ఛిక పాఠ్యాంశంగా పాఠ్య ప్రణాళికను రూపొందించి 2005 నుండీ 2015 వరకు బోధించారు. ఎం.ఏ. విద్యార్థులకు"ప్రవాసాంధ్ర సాహిత్యం-పరిచయం" అనే కోర్సుని రూపొందించి, 2016 నుండీ దాన్ని బోధిస్తున్నారు. వీటితో పాటు తెలుగు సాహిత్య విమర్శ, సౌందర్యశాస్త్రం, తులనాత్మక కళాతత్త్వశాస్త్రం కోర్సులను చెప్తున్నారు. యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాదు వారు దూరవిద్య ద్వారా బోధించే జర్నలిజం అండ్ మాస్ కమ్యూనికేషన్స్ కోర్సు పి.జి.డిప్లొమా విద్యార్థుల కోసం రెండు పాఠ్యాంశాలను రాశారు. ప్రస్తుతం యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాదు, తెలుగుశాఖలో అసోసియేటు ప్రొఫెసరుగా పనిచేస్తూ, ఎం.ఏ,.కోర్సు (ఇంటిగ్రేటెడ్ మాస్టర్స్ డిగ్రీ) తెలుగు విభాగం కోర్డినేటర్‌గా సేవలందిస్తున్నారు.

**ప్రముఖుల ప్రశంసలు:**

*దళితతాత్త్వికుడు, నెమలికన్నులు* కవితాసంపుటులకు రాసిన ముందుమాటలు, సమీక్షల్లో దార్ల కవిత్వం, వ్యక్తిత్వం, దృక్పథం స్పష్టమవుతుంది. భారతదేశంలోని ప్రముఖ

విశ్వవిద్యాలయాలకు చెందిన ఆచార్యులు, సాహితీవేత్తలు రాసిన అభిప్రాయాలను ఈ కవితాసంపుటుల్లో చూడొచ్చు. అయితే, సాహిత్యవిమర్శకుడిగా దార్ల గురించి ఈయన రాసిన పుస్తకాలకు ప్రముఖులు రాసిన ముఖ్యాంశాలను కొన్నింటిని చూద్దాం.

ఆచార్య పరిమి రామనరసింహంగారు *వీచిక సాహిత్య విమర్శవ్యాస సంపుటి (2009)*పుస్తకాన్ని అంకితం తీసుకుంటూ దార్ల వెంకటేశ్వరరావు నిత్య అధ్యయనశీలి, నిశిత పరిశోధనా వ్యవసాయిగా అభివర్ణించారు.

*వీచిక* లోని సాహిత్య వ్యాసాలు గురించి ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారు వ్యాఖ్యానిస్తూ ప్రతివ్యాసమూ పాఠకుల అవగాహన పరిధులను విస్తరించేదిగాను, ఏదొక కొత్తదనాన్ని ఆలోచనాత్మకంగా అందేవిగాను ఉంటాయన్నారు.

ప్రముఖ పరిశోధకురాలు, అధ్యాపకురాలు ఆచార్య కుసుమారెడ్డిగారు *వీచిక* వ్యాసాలలోని ఒక్కొక్క వ్యాసం ఒక్కొక్క దృక్పథాన్ని వివరిస్తూ సాహితీ విలువలను ఆవిష్కరిస్తున్నాయన్నారు. ప్రాంతీయతలో విశ్వజనీనతను చూడగల విశాల దృక్పథం దార్లలో కనిపించే మరో ప్రత్యేక గుణంగా ఆమె విశ్లేషించారు.

ప్రతివిషయాన్ని పాక్షికదృష్టితో కాకుండా సమవీక్షణంతో దార్ల దర్శిస్తారని వీచికలోని వ్యాసాలను చదివితే అర్థమవుతుందని ప్రముఖ సాహితీవిమర్శకుడు ఆచార్య బన్న అయిలయ్య అన్నారు. దీనిలోని '*ప్రతివ్యాసం ఒక ప్రామాణిక పత్రంగా భాసిస్తుంది. పరిశీలనా పటుత్వం, సూటిదనం, అధ్యయనశీలం, వ్యాఖ్యానించే చతురత దార్లలో ఉందని 'వీచిక'లోని ప్రతివ్యాసం సాక్ష్యమిస్తుంది*' అని ఆయన వ్యాఖ్యానించారు.

ప్రముఖ విమర్శకుడు డా॥ద్వానాశాస్త్రి వీచిక గురించి ఇలా రాసారు. *"దార్ల విమర్శలో సంయమనం వుంది. విశ్లేషణ వుంది. తార్కికత కూడా వుంది. అందుకే ఇతని విమర్శను 'సహృదయవిమర్శ'అంటున్నాను. సాహిత్యాన్ని సాహిత్యంగానే చూసే సహృదయం కూడా వుంది. ఈ 'వీచిక'ద్వారా మున్ముందు మనకి మరొక మంచి విమర్శకుడు రాబోతున్నాడని తెలుసుకుంటాం."*

*పునర్మూల్యాంకనం (2010)* విమర్శ వ్యాససంపుటి గురించి ప్రముఖ సాహితీవేత్త ఆచార్య జి.అరుణకుమారి వివరిస్తూ *"నాదృష్టిలోదార్లనిత్య పరి శోధకుడు. చిన్న వయసులోనే కవి, విమర్శకులుగా గుర్తింపు తెచ్చుకున్నారు. విమర్శకు కొన్ని సూత్రాలున్నాయి. వాటిని ఆకళింపు చేసుకోవటానికి కావాల్సిన మార్గాలు వీరి రచనల్లో కనిపిస్తాయి. వస్తువుని స్వీకరించి పలు విమర్శలను దృష్టిలో ఉంచుకొని తాను చెప్పదలిచిన విషయాన్ని పాఠకుడిలా*

*ప్రశ్నిస్తూ రచయితగా సమాధానాలతో పరిష్కరిస్తూ విషయ చర్చ కొనసాగుతుంది. ఇది దార్లవారి రచనా పద్ధతి. మిరియాలు ఎంతఘాటుగా ఉంటాయో కొన్ని సందర్భాలలో వీరి వ్యాసాలు కూడా అంతే ఘాటుగానే ఉంటాయి."* అన్నారు. బహుజన సాహిత్య దృక్పథం (2012) సాహిత్య విమర్శ వ్యాససంపుటి గురించి ప్రముఖ విమర్శకుడు ఆచార్య రాచపాళెం చంద్రశేఖరరెడ్డి ఇలా అన్నారు. *"ఒక విశ్వవిద్యాలయ ఆచార్యుడు ఎంత తాజాగా, ఎంత సజీవంగా ఉండాలో దార్ల అంత తాజాగా, అంత సజీవంగా ఉన్నారు. దార్ల సమాజ పరిణామాలను, సాహిత్య పరిణామాలను జాగ్రత్తగా అధ్యయనం చేస్తున్నారు. సాహిత్య విమర్శ పరిణామాన్ని కూడా ఆయన తీవ్రంగానే చదువుతున్నారు. ఈ ముప్పేట అధ్యయనమే ఆయన సజీవంగా ఉండడానికి కారణం. వర్తమానమంతా ఒక ముద్దకాకపోయినా, వర్తమాన భావధారలలో దేనిని స్వీకరించినా మేలే. దార్ల దళిత బహుజన దృక్పథంగా సమాజాన్నీ, సాహిత్యాన్నీ అధ్యయనం చేస్తున్నారు. అందుకే దార్ల విమర్శలో స్పష్టత కనిపిస్తుంది"*

*"సాహితీమూర్తులు-స్ఫూర్తులు"* (2015) గ్రంథం గురించి ప్రముఖ సాహితీవేత్త ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారు 'దార్ల విద్యార్థులకు పాఠం చెప్తున్నట్లు సరళమైన భాషలో ఈ వ్యాసాల్ని రాసాడనీ, అది విద్యార్థిమిత్ర విమర్శకుడి లక్షణంగా అభివర్ణించారు. *"అత్యాధునికమైన సాహిత్య విమర్శ సూత్రాలూ, సిద్ధాంతాలూ గమనించి ఆ దృష్టికోణంతో ఈ వ్యాసాలు రచించినట్లు చెప్పగలను. అస్తిత్వవాద భావజాలాన్ని బలమైన కంఠస్వరంగా విన్పిస్తున్నవారిలో దార్ల కూడా ఒకరు."*

దార్ల వెంకటేశ్వరరావు తన రచనలను ఎప్పటికప్పుడు ఇంటర్నెట్ (www.vrdarla.blogspot.in)లో అందుబాటులో ఉంచుతున్నారు. విద్యార్థులకు బోధించే కోర్సు వివరాలు, మెటీరియల్ కూడా ఇంటర్నెట్‌లో డౌన్‌లోడ్ చేసుకొనే వీలు కల్పిస్తుంటారు. ఇంచుమించు తన రచనలన్నీ యాండ్రాయిడ్ మొబైల్ అప్లికేషన్స్‌గా అందుబాటులోకి తీసుకొచ్చారు. darla అని సెర్చ్ చేస్తే వాటిని కనుగొనవచ్చు.

**-ప్రచురణ కర్తలు**

★★★

సాహితీ సౌగంధి

డా॥ దార్ల వెంకటేశ్వరరావు



దార్ల వెంకటేశ్వరరావు

సాధారణంగా మనం ఎవరికైనా ముందుమాట గానీ, అభిప్రాయం గానీ రాయాలంటే చాలా ఆలోచిస్తాం. ఆ కవి, ఆ రచయిత మనకు తెలిసిన వాళ్ళయితేనే వాళ్ళ గురించి మన అభిప్రాయాన్ని వ్యక్తీకరిస్తుంటాం. అది ఒకరకంగా ఆ వ్యక్తి గురించి పాఠకులకు మనం ఇచ్చే యోగ్యతాపత్రంలాంటిది. ఆ రచన గురించి మనం వ్యక్తీకరించే అంశాలు కూడా విశ్లేషణతోనో, మూల్యాంకనగానో కాకుండా దాని మూలతత్త్వాన్ని సూచించేదిగా ఉంటుంది. మరికొన్నిసార్లు ప్రశంసగానూ, అభినందనపూర్వకంగానూ ఉండొచ్చు. ఆ రచనను ఎలా అవగాహన చేసుకోవాలో సూచించేదిశగా కూడా ఉండొచ్చు. సాధారణంగా ఆ రచన ఆత్మను పట్టుకోవడానికి మార్గంవేసే ముందుమాటలు, అభిప్రాయాలు కూడా ఉండొచ్చు. కవుల, పరిశోధకుల వ్యక్తిత్వాలు కూడా ముందుమాటల్ని బట్టి గుర్తించే అవకాశం కలుగుతుంది.

నాకు తెలిసిన కవులు, కథకుల రచనలను చదివినప్పుడో, వాళ్ళు నాలుగు మాటలు రాయమన్నప్పుడో చాలా ఇష్టంగా రాసిన అభిప్రాయాలివి. కేవలం ప్రశంసలుగానో, రాయాలని మొక్కుబడిగానో రాసినవికావివి. దీనిలో నా దగ్గర పరిశోధన చేసిన విద్యార్థుల పరిశోధనలున్నాయి. మరికొంతమంది తమ పరిశోధనలను నాతో చర్చించి ప్రచురించుకున్న పరిశోధనలున్నాయి. తమ కవిత్వాన్ని చదివి, వినిపించినప్పడు జరిగిన చర్చల్లో కొన్ని అంశాలు నచ్చి తమ పుస్తకానికి అభిప్రాయాన్ని రాయించుకున్న వాళ్ళున్నారు. అన్నింటికంటే మించి భావజాలాన్ని ఇష్టపడి రాయించుకున్న ముందుమాటలున్నాయి. వీటితో పాటు నాకిష్టమైన ఒక పుస్తకాన్ని చదివినప్పడు దాన్ని సమీక్షగా రాసిన రెండు, మూడు వ్యాసాల్ని కూడా దీనిలో చేర్చాను.

**- డా॥దార్ల వెంకటేశ్వరరావు**




ISBN 978-81-908963-3-7
9 788190 896337 >

Cover Designed By : Sri Laxmi Graphics @ 9298252527